శ్రీమతే రామానుజాయ నమః



# నివేదన

**శఠారివైరిమునేః పరం న దైవం విదితం యేన తదేకదైవతేన ।**
**మధురం కవి మాశ్రిత స్తమీడ్యం వరయోగీ విదధాతు భావుకం నః ॥**

(నమ్మాళ్వార్లను మాత్రమే పరదైవంగా కొలిచిన మధురకవి ఆళ్వార్లు, ఆ నమ్మాళ్వార్ల కంటే వేఱొక దైవాన్ని తెలిసినవారు కారు. అటువంటి మధురకవి ఆళ్వార్లను ఆశ్రయించిన శ్రీవరవరమునులు మనకు మంగళాన్ని కలుగజేయాలి).
(ప్రతివాది భయంకరమ్ అణ్ణన్-శ్రీవరవరముని శతకమ్-61)

ద్రావిడవేదాలుగా సంభావింపబడే ఆళ్వార్ల దివ్యప్రబంధాలను వింగడించి, నాల్గు ఆయిరాలు (వేలు)గా సంకలనం చేసిన ద్రావిడవేదవ్యాస భగవానులు - శ్రీమన్నాథమునులు. ఈ నాల్గు ఆయిరాలు ముదలాయిరమ్, పెరియతిరుమొழி, ఇయఱ్పా, తిరువాయ్మొழி - అనే పేర్లతో వ్యవహరింపబడుతున్నాయి. పొయ్కై ఆళ్వార్ల నుండి తిరుమంగై మన్నన్‌వరకు గల పన్నెండుమంది ఆళ్వార్లు అనుగ్రహించిన 24 ప్రబంధాలు నాల్గు ఆయిరాలుగా విభాగింపబడి, సంకలనం చేయబడ్డాయి. శ్రీరంగామృతకవిచే ప్రణీతమైన ఇరామానుశనూఱ్ఱన్దాది భగవద్రామానుజుల కాలంలో శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం ఇయఱ్పా - అనబడే మూడవ ఆయిరం చివరలో చేర్చబడి, నాలాయిర ప్రబంధానుసంధానంలో చివరగా అనుసంధింప బడుతున్నది. ముదలాయిరమ్, పెరియతిరుమొழி, తిరువాయ్మొழி- అనే మూడు ఆయిరాలు గానం చేయబడే ప్రబంధాలైనందున, అవి **"ఇశైప్పా"** అని, మిగిలిన వేయి పాశురాలు పఠనప్రధానాలైనందున, అది **"ఇయఱ్పా"** అని వ్యవహ రింపబడుతున్నాయి.

నాల్గు ఆయిరాలుగా ప్రబంధాలు సంకలనం చేయబడిన క్రమాన్ని గమనించినపుడు, ఈ ప్రబంధాలు అవి అవతరించిన కాలాన్ని అనుసరించి కూర్చబడలేదని స్పష్టపడుతుంది. కాలాన్నిబట్టి మొదటి ఆళ్వార్లుగా పరిగణింపబడే సరోయోగి అనుగ్రహించిన ముదల్ తిరువన్దాది ప్రబంధం మూడవ ఆయిరంలోను, ఏడవ



ఆళ్వార్లు అయిన పెరియాళ్వార్లు అనుగ్రహించిన తిరుప్పల్లాణ్డు ప్రబంధం ముదలాయిరమ్ ఆరంభంలోను కూర్చబడడం దీనికొక ఉదాహరణం. ఇక, ప్రబంధాల కూర్పులో శ్రీనాథమునులు ఏ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని ఉంటారు? అనే జిజ్ఞాస సహజంగా ఇక్కడ కల్గుతుంది.

దీనికి తగిన సమాధానాన్ని శ్రీవరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో స్పష్టం చేశారు. నాలాయిరప్రబంధంలో తిరుప్పల్లాణ్డు ప్రబంధం మొట్టమొదటి ప్రబంధంగా కూర్చబడడంలో గల సామంజస్యాన్ని **"కోదిలవామ్ ఆళ్వార్‌కళ్ కూఱు కలైక్కెల్లామ్ ఆది తిరుప్పల్లాణ్డు ఆనదువుమ్, వేదత్తుక్కు ఓమెన్నుమదుపోల్ ఉళ్ళదుక్కెల్లామ్ శురుక్కాయ్ తాన్ మఙ్గలమ్ ఆదలాల్"** (అసారమైన అంశం ఏది లేని రీతిలో ఆళ్వార్లు అనుగ్రహించిన శాస్త్రాలనదగిన దివ్యప్రబంధాలకు అన్నిటికి తిరుప్పల్లాణ్డు దివ్యప్రబంధం ఎందుకు ఆది అయినది? అంటే, వేదాలకు ఆరంభం ప్రణవం అయినట్లే, ఆ ప్రణవంలో అన్ని అర్థాలు ఇమిడి ఉన్నట్లే, ప్రణవం మంగళాత్మకమైనట్లే, ద్రావిడవేదాలైన ఆళ్వార్ల ప్రబంధాల తాత్పర్యమైన అర్థ పంచకాన్ని ప్రతిపాదిస్తున్నందున, మంగళాత్మకమైనందున తిరుప్పల్లాణ్డు ప్రబంధం ద్రావిడవేదారంభంలో కూర్చబడింది) అని 19వ పాశురంలో పలికారు. ఈ పాశురంలో చెప్పబడిన సంగ్రహత్వ - మంగళత్వాలనే రెండు హేతువులలో, మొదటిది అర్థస్వరూపాన్నిబట్టి, రెండవది - శబ్దస్వరూపాన్నిబట్టి హేతువులని గమనించాలి.

ప్రణవాత్మకమైన తిరుప్పల్లాణ్డు ప్రబంధంతో ఆరంభమైన ద్రావిడవేదంలో, ప్రణవంలోగల అకారంచేత ప్రతిపాదింపబడే అర్థాన్ని - పెరియాళ్వార్ తిరుమొழி, ఉకారార్థాన్ని - నాచ్చియార్ తిరుమొழி, మకారార్థాన్ని - పెరుమాళ్ తిరుమొழி ప్రతిపాదించగా, వీటి వివరణమే తిరుచ్చందవిరుత్త ప్రబంధంనుండి అమలనాది పిరాన్ ప్రబంధంవరకు గల భాగంలో చేయబడింది. దీని వివరణం విస్తృత భయంవల్ల ఇక్కడ ప్రస్తావింపబడలేదు.

ఈ రీతిలో ముదలాయిరమ్‌లోని తిరుప్పల్లాణ్డునుండి అమలనాది పిరాన్ వరకు గల బ్రంధాలు ప్రణవార్థాన్ని విశదీకరించాయి. ఇక మిగిలిన, చివరి ప్రబంధమైన కణ్ణినుణ్ శిఱుత్తామ్బు నమశ్శబ్దార్థాన్ని ప్రతిపాదిస్తున్నది. ఈ అంశాన్ని కూడా శ్రీవరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలోని **"వాయ్త్త తిరుమన్దిరత్తిన్

**మత్తిమమామ్ పదమ్బోల్ శీర్‌త్త మదురకవి శెయ్ కలైయై, ఆర్‌త్త పుకళ్ ఆరియర్‌కళ్ తాఙ్గళ్ అరుళిచ్చెయల్ నడువే శేర్‌విత్తార్ తాఱ్పరియమ్ తేర్‌న్దు"** (శబ్దపూర్తిని, అర్థపూర్తిని కల అష్టాక్షరిలోని మధ్యమపదమైన నమశ్శబ్దంవలెనే మధురకవులు అనుగ్రహించినదైన, శాస్త్రరూపమైన కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధం శబ్దపూర్తిని, అర్థపూర్తిని కల్గినది, ఆ ప్రబంధ హృదయాన్ని గమనించినవారు, అందువల్లనే గొప్ప కీర్తిని కలవారైన పూర్వాచార్యులు, దానిని దివ్యప్రబంధాల నడుమ చేర్చారు.) అనే 26వ పాశురంలో స్పష్టం చేశారు. దీనినిబట్టి కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధం, నమశ్శబ్దంవలె శబ్దపూర్తిని, అర్థపూర్తిని కల్గి ఉన్నందున, ఆ నమఃశబ్దార్థాన్ని, తాత్పర్యార్థాన్ని విశదీకరిస్తున్నందున నమశ్శబ్దార్థ స్థానీయమని, తదర్థ ప్రతిపాదకమని తెలుస్తున్నది. ఈ ప్రబంధం పెరియవాచ్చాన్ వ్యాఖ్యానానికి గల అరుంబదమ్ ఆరంభంలో **"తిరుమంత్రార్థప్రకాశకఙ్గళాన దివ్యప్రబంధఙ్గళై వ్యాఖ్యానమ్ శెయ్‌దరుళుకిఱ పరమకారుణికరాన పెరియవాచ్చాన్ పిళ్ళై తమ్ముడైయ పరమకృపైయాలే "వేదత్తుక్కు ఓమ్ ఎన్నుమదుపోలుళ్ళదుక్కెల్లామ్ శురుక్కాన తిరుప్పల్లాణ్డుక్కుమ్", "శీర్‌త్త మదురకవి శెయ్‌కలై"క్కుమ్, తృతీయార్థప్రతిపాదకఙ్గళాన మఱ్ఱుముళ్ళ దివ్యప్రబంధఙ్గళుక్కుమ్"** అని తెలుపబడడం గమనించవచ్చు. ఇటువంటి వివరణమే పెరియతిరుమొళి - పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానికి గల అరుంబదప్రవేశంలో కూడా చూడవచ్చు.

శ్రీపరాశర భట్టర్ అష్టశ్లోకిలోని రెండవ శ్లోకంలో **"మంత్రబ్రహ్మణి మధ్యమేన నమసా పుంసః స్వరూపం గతిః గమ్యం శిక్షితమ్"** అని అంటూ అష్టాక్షరిలోని మధ్యమ పదమైన నమశ్శబ్దంద్వారా జీవుని స్వరూప - ఉపాయ - పురుషార్థాల స్వరూపం శిక్షింపబడినదని అన్నారు. అంటే - తదేకశేషత్వ - తదేకోపాయత్వ - తదేకభోగ్యత్వాలు నిశ్చయింపబడ్డాయి. ఈ జీవుడు భగవానునకు మాత్రమే శేషం, తనకు గాని, ఇతరులకు గాని శేషం కాదు - అని, భగవానుడు మాత్రమే ఉపాయంతాను గాని, ఇతరులు గాని ఉపాయం కాదు - అని, భగవానునకు మాత్రమే భోగ్య భూతుడు, తనకుగాని, ఇతరులకు గాని భోగ్యం కాదు - అనేది ఇక్కడ పిండితార్థం.

అయితే, తదీయులపట్ల కూడా ఈ నిష్కర్ష వర్తిస్తుందా? భగవానునిపట్ల మాత్రమేనా? అనే ప్రశ్న ఇక్కడ ఉత్పన్నమవుతుంది. దీనిని పరిహరిస్తూ శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడిలో **"ఉఱ్ఱదుమ్ ఉన్ అడియార్‌క్కడిమై - ఎన్గిఱపడియే**



**ఇదిలే భాగవతశేషత్వ మనుసంధేయమ్"** అనే సూత్రాన్ని అనుగ్రహించగా, శ్రీవరవర మునులు **"ఇప్పదత్తిల్ తదీయశేషత్వమ్ ఆర్థమాక అనుసంధేయమాకైయాలే, అత్తై అరుళిచ్చెయ్ కిఱార్... భగవచ్ఛేషత్వమ్ ఉళ్ళపడి ప్రకాశిక్కిఱ ఇన్నమస్సిలే, తత్కాష్ఠైయాన భాగవతశేషత్వమ్ అనుసంధిక్కవేణుమ్ - ఎన్గై"** (ఈ నమఃపదంలో తదీయశేషత్వాన్ని అర్థవశంవల్ల అనుసంధించాలి. కనుక, దానిని పల్కుతున్నారు. భగవచ్ఛేషత్వం యథాతథంగా ప్రకాశించే ఈ నమస్సులో ఆ శేషత్వానికి చరమావధి అయిన భాగవత శేషత్వాన్ని అనుసంధించాలని భావం) అని వివరించారు.

అష్టశ్లోకీవ్యాఖ్యాత అప్పన్ శ్రీనివాసాచార్యస్వామి వారు తమ వ్యాఖ్యానంలో ఈ విషయాన్నిగూర్చి చేసిన విస్తృతమైన వివరణ ఇక్కడ సందర్భోచితమనే ఉద్దేశ్యంతో ప్రస్తావింపబడుతున్నది.

ఈ భగవత్పారతంత్ర్యం - భగవద్భక్తులకు సొత్తుగా ఉన్నప్పుడే కదా పూర్ణంగా సిద్ధిస్తుంది. అందువల్ల **"అడియార్‌క్కు ఎన్నై ఆట్పడుత్త విమలన్"** (దాసులకు నన్ను దాసునిగా చేసిన విమలుడు) అని, **"ఉన్ అడియార్‌క్కు ఎన్నై ఆట్పడుత్తాయ్"** (నీ దాసులకు నన్ను దాసునిగా చేశావు) అని, **"యా ప్రీతిః బహుమానం చ మయ్యయోధ్యా నివాసినామ్, మత్ప్రియార్థం విశేషేణ భరతే సన్నివేశ్యతామ్"** (అయోధ్యాపురవాసులకు నా విషయంలో ఏ ప్రీతి, ఎటువంటి గౌరవం ఉన్నదో, నా సంతోషం కోసంగా వాటిని భరతుని విషయంలో వారు కల్గి ఉండాలి) అని పలికే రీతిలో శేషి అయిన భగవానునిచే ప్రేరింపబడినది, శేషభూతులైన జీవుల పారతంత్ర్యానికి పూర్తిని కల్గించేది అయిన తదీయ (భాగవత) శేషత్వాన్ని, నమఃపదంలో అత్యంత పారతంత్ర్యం చెప్పబడినందున, అర్థవశాత్తు అందులో అనుసంధించుకోవాలి.

భగవచ్ఛేషత్వపూర్తి అనేది భాగవతశేషత్వంవల్లనే సిద్ధిస్తే, పూర్వం తెల్పిన భగవదనన్యార్హశేషత్వంతో అది విరోధించదా? భగవానునికంటే వేఱయిన భాగవతులకుకూడా శేషమైనపుడు తదేకశేషత్వసిద్ధి ఏవిధంగా కల్గుతుంది? అని సందేహిస్తే, ఈ భాగవతశేషత్వం అనేది (పూర్వం తెల్పిన రీతిలో) భగవానుని ఆజ్ఞవల్ల ఏర్పడినది కనుక, భగవచ్ఛేషత్వకార్యమై సంభవిస్తున్నది. అందువల్ల, లోకంలో ఒకానొక పతివ్రత తన భర్తయొక్క ఆజ్ఞను అనుసరించి, భర్త బంధువులకు శుశ్రూషణం చేస్తే, ఆ సేవ భర్తకు ప్రియకరమై, ఆమె పాతివ్రత్యాన్ని అభివృద్ధి చేసేటట్లే, తదీయశేషత్వం

అనన్యార్హశేషత్వాన్ని అభివృద్ధిచేస్తుందే తప్ప, భగవదనన్యార్హశేషత్వానికి విరుద్ధం కాదు.

అయినా, **"ఉత్తమః పురుష స్త్వన్యః"** (ఉత్తమ పురుషుడు వేఱొకడు) ఉన్నాడు అనే న్యాయం ద్వారా **"మననుణర్వళవిలన్"** (మనస్సుతో గ్రహించడానికి వీలుకానివాడు) అని, **"ఇల్లదుమ్ ఉళ్ళదుమ్ అల్లతు అవనురు"** (చిదచిత్తులకంటే విలక్షణమైనది భగవానుని రూపం) అనే రీతిలో భగవానుడు చేతనులకంటే, అచేతనులకంటే విలక్షణుడు కనుక, భగవద్భక్తులు తదీయులు (భగవానునకు చెందినవారు) అయినా, వారు భగవానునికంటే భిన్నులే కదా! అపుడు తదేకశేషత్వం విధంగా సిద్ధిస్తుంది? అని అంటే, తదీయులు- **"జంగమశ్రీవిమానాని శరీరాణి మనీషిణామ్, యతో నారాయణః సాక్షాద్ధృదయేషు ప్రతిష్ఠితః"** (మహాత్ముల శరీరాలు భగవానుని జంగమవిమానాలు. ఎందువల్ల? అంటే, నారాయణుడు సాక్షాత్తుగా వారి హృదయాలలో సుప్రతిష్ఠితుడై వేంచేసి ఉంటాడు) అనే రీతిలో భగవానునకు దివ్యమంగళ విగ్రహంవలె శరీరభూతులు కనుక, భర్త శరీరంపట్ల ప్రేమ కల్గి ఉండే స్త్రీకి పాతివ్రత్యభంగం రాదు కనుక, భగవదనన్యార్హశేషత్వానికి భంగం రాదు.

అనన్యార్హశేషత్వం భగ్నం కాకుండా ఉండానికి తదీయులు భగవానునకు శరీరమై ఉండడం కారణం అయితే, ఈ శరీరత్వం భగవద్భక్తులకు మాత్రమే కాక, **"యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరమ్"** (ఎవనికి చేతనాచేతనాలు శరీరమో) అనే రీతిలో చేతనాలు, అచేతనాలు - అనే తేడాలేకుండా సర్వం భగవానునకు శరీరమే కనుక, లోకంలో ఉండే అందఱికి శేషమై ఉండవలసి వస్తుంది కదా'' అని అంటే, **"జగత్సర్వం శరీరం తే"** అనేవిధంగా భగవానునితో జీవునకు గల శరీరాత్మ సంబంధాన్ని బట్టి సాధారణ సంబంధం ఉన్నా, ''మనం భగవానునకు శరీరభూతులమైనందున భగవానునకు శేషభూతులము. భగవానుడు శరీరి కనుక సర్వశేషి'' అనే జ్ఞానం లేకుండా, అంహకార మమకారాలతో దూషితులై, నిరుపాధిక బంధువైన భగవానుడు కూడా **"క్షిపామి, న క్షమామి"** అనే రీతిలో, చల్లని సముద్రం సలసల కాగినట్లుగా, మనస్సులో అతడు తపించేటట్లు చేసే నైచ్యాన్ని కల్గినవారు కనుక, వారికి శేషమై ఉండే స్థితి ఏర్పడదు.

ఈ విధమైన దోషాలు ఏమీ లేకుండా, **"అనన్యాః చింతయంతః"** అనే రీతిలో తదీయులు అపృథక్ సిద్ధవిశేషణజ్ఞానాన్ని కలవారై, భగవానుని కంటే అన్యులు



కాని వారైనందున, **"జ్ఞానీ తు ఆత్మైవ"** (జ్ఞాని అయితే నాకు ఆత్మయే) అని, **"పత్తరావియై"** (భక్తులకు ఆత్మ) సర్వశరీరిభూతుడైన భగవానుడు తదీయశేషత్వ పర్యంతమైన తచ్ఛేషత్వ జ్ఞానాన్ని కలవారిని తనకు ఆత్మస్థానీయులని చెప్పినందున, భగవదనుగ్రహానికి పాత్రులైన శ్రీవైష్ణవులకు శేషమై ఉండే స్థితి - శరీరత్వసామాన్యం ఉన్నా, అపృథక్ సిద్ధసంబంధజ్ఞానం ద్వారా భగవానుని కంటే అన్యమై ఉండే స్థితి భగవద్భక్తులకు లేనందువల్ల, వ్యభిచారదోషం రాదు. (భగవానునికంటే అన్యులకు శేషమై ఉండడమనే వ్యభిచార దోష ప్రసక్తి రాదు). అందువల్ల అది ప్రయోజనమైనది. (ఇక్కడ విషయ విభాగం ఏమంటే - భగవదనుగ్రహానికి పాత్రమైన భక్తుని శరీరం ఉద్దేశ్యం, నిగ్రహానికి పాత్రమైన శరీరం త్యాజ్యమని గ్రహించాలి).

ఈ తదీయశేషత్వం **"ఇచ్ఛయైవ పరేశస్య తాదధీన్యఫలాత్మనః, భగవద్భక్తశేషత్వం స్వేచ్ఛయాఽపి క్వచిత్ భవేత్, ఇతి స్తోక్తినయాదేవ స్వభక్తవిషయే విభుః ఆత్మాత్మీయస్య సర్వస్య సంకల్పయతి శేషతామ్, అన్యోన్యశేషభావోఽపి స్వస్వాతంత్రసంభవః, తత్తదాకారభేదేన యుక్త ఇత్యుపపాదితః"** (తన సంకల్పవశంచేత తన ఆత్మను, రూపాదులను భక్తుల వశం చేసికొన్నవాడు, సర్వేశ్వరుడైన భగవానునకు కూడా భాగవత శేషత్వమనేది ఆ భగవానుని సంకల్పంవల్లనే కల్గుతుందనే భగవానుని సూక్తి ప్రకారంగా, ప్రభువైన సర్వేశ్వరుడు తన ఆత్మను - ఆత్మీయాలను అన్నిటిని తన భక్తుల విషయంలో శేషమై ఉండాలని సంకల్పిస్తాడు కనుక, భగవానునకు భక్తుడు శేషమై ఉండడం, ఆ భక్తులు భగవానునకు, భగవద్భక్తులకు శేషమై ఉండడమనే ఈ అన్యోన్యశేషభావంకూడా భగవానుని నిరంకుశ స్వాతంత్ర్యంవల్ల సంభవిస్తున్నది ఇవి రెండు ఆయా ఆకార భేదాల వల్ల యుక్తాలే - తగినవే అని తెలుపబడింది.) అనే రీతిలో - చేతనులందఱు తనకు శేషం కావాలని భగవానుడు సంకల్పించినట్లుగానే, భగవానునియొక్క, భగవద్భక్తులయొక్క భాగవతశేషత్వం కూడా భగవానుని నిరంకుశ స్వాతంత్ర్య పూర్వకమైన సంకల్పంవల్లనే సిద్ధిస్తుంది కనుక, ఈ రెండు దశలలోను భగవానుని శేషిత్వస్వరూపానికి కాని, చేతనుల శేషత్వ స్వరూపానికి కాని ఏ లోటు లేదు. ఈ విధంగా శేషి అయిన భగవానుని ప్రీతికి విషయభూతులైన భక్తుల విషయంలోని శేషత్వం, ఆ భగవానుని ప్రేరణ (సంకల్పం) వల్ల కల్గినది కనుక, ఇది, భగవానునకు ఇష్టవినియోగార్హమై ఉండడమనే అనన్యార్హశేషత్వంయొక్క కార్యమే తప్ప, దానికి విరుద్ధం కాబోదు. భగవానుడు, తనకు

మిక్కిలి ప్రియంగా ఉండే జ్ఞానులకు శేషంగా తన భక్తులను చేసి, వారు జ్ఞానులకు ఇష్టవినియోగార్హులై ఉండడం చూచి సంతోషిస్తాడు కనుక, ఏ దశలో అయినా భగవత్ప్రీతి మాత్రమే పరమపురుషార్థమని తలచేవారికి ఆ భగవత్ప్రీతి ఉపాధి (కాబోదు). అది స్వరూపాంతర్గతం, స్వయంప్రయోజనం మాత్రమే. అందువల్ల తదీయశేషత్వమనేది సోపాధికం కానందున చేతనునకు నిత్యం, స్వరూపానురూపం కూడా.

లేక, ఈ తదీయశేషత్వం, భగవచ్ఛేషత్వంవలె స్వతః సిద్ధించేది కాకుండా, భగవత్ప్రేరితమై సిద్ధిస్తున్నది కనుక, ఔపాధికమని కూడా చెప్పవచ్చు. ప్రతిసంబంధి విషయాల బుద్ధ్యధీనంగా ఒకే కాలంలో ఒకే ఆశ్రయంలో కలిగే ఈ శేషశేషి భావాలు ఆశ్రయభేదాన్నిబట్టి కల్గుతున్నందున అన్యోన్యాశ్రయదోషం లేదు. అందువల్ల తదీయ శేషత్వం తగినది - అనికూడా శ్రీనివాసాచార్యులవారు వివరించారు.

ఈ వివరాలన్నీ పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన **"పరన్దర హస్యమ్"** అనే గ్రంథంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారి **"పరన్దపడి"**లో తెలుపబడ్డాయి. ఇష్ట వినియోగార్హంగా భగవద్భక్తులు ఉండడం అంటే, భగవానుని ఇష్టానికి ఉపయోగ పడడమే కనుక, భగవానునకు ఇష్టులైన జ్ఞానులకు వినియోగార్హులైనపుడే ఇష్ట వినియోగార్హత్వం సిద్ధిస్తుంది. కనుక, భాగవత శేషత్వం చేతన స్వరూపాంతర్గత మనికూడా అందులో తెలుపబడింది.

పతిపత్నీ న్యాయం (రాజమహిషీ న్యాయం) ద్వారా కూడా ఈ తదీయశేషత్వం ఉపపన్నమవుతున్నది. శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు ముముక్షుప్పడి 44వ సూత్రంలో **"ఒరువన్ అడిమైక్కొళ్ళుమ్పోదు, గృహిణిక్కెన్ఱు అన్ఱే అవణైయోలై ఎழுదువతు. ఆకిలుమ్, పణి శెయ్‌వదు గృహిణిక్కితే"** అని పలికారు. దీనినిబట్టి లోకంలో ఒక యజమాని సేవకులుగా కొంతమందిని కొని క్రయప్రతాన్ని వ్రాయించుకొన్నపుడు, తనకు వారు సేవచేయాలనే వ్రాయించుకొంటాడు. కాని, ఆ సేవకులు ఆ ఇంటి యజమాని పత్నికే కదా ముఖ్యంగానే సేవ చేస్తారు. అదేరీతిలో, జ్ఞానులు భగవానునకు రాజమహిషిస్థానీయులైనందున, భగవానునకు శేషమై ఉండే చేతనులకు, ఆ భగవానునకు ప్రియపత్నీ స్థానీయులైన జ్ఞానులపట్ల కూడా శేషత్వం స్వరూపతః సిద్ధిస్తున్నదని అది స్వరూప విరుద్ధం కాదని గమనించాలి.



నమశ్శబ్దం **"ఇతుతాన్ - స్వరూపత్తైయుమ్, ఉపాయత్తైయుమ్, ఫలత్తైయుమ్ కాట్టుమ్"** అనే రీతిలో చేతనుని స్వరూపాన్ని, ఉపాయాన్ని, ఫలాన్ని తెల్పుతున్నందున, **"ఇదిలే భాగవతశేషత్వమనుసంధేయమ్"** తెల్పిన రీతిలో అర్థబలంవల్ల చేతనుని భాగవతశేషత్వ పారతంత్ర్యాలను, తదనుగుణమైన తదీయోపాయత్వాన్ని, తదీయ భోగ్యత్వాన్ని తెల్పుతున్నది. అందువల్ల ఈ నమశ్శబ్దం పూర్ణంగా చరమపర్వ నిష్ఠార్థ ప్రతిపాదకం. నమశ్శబ్దం ఏవిధంగా ఈ మూడిటిని తెల్పుతున్నదనే విషయాన్ని కూడా శ్రీపిళ్ళైలోకా చార్యులవారు **"తొలైవిల్లిమఙ్గలమ్ తొழுమ్ - ఎన్నైయాలే స్వరూపమ్ శొల్లిற்று"** ఇత్యాది 88వ సూత్రంలో తెలియజేయగా, దానిని వరవర మునులు తమ వ్యాఖ్యలో వివరించారు. దీని వివరం అక్కడ సేవించవచ్చు.

ఈ చరమపర్వాత్మకమైన శేషిత్వ - శరణత్వ - ప్రాప్యత్వాలు వేద-తదుప బృంహణ సూక్తిసమ్మతాలు. **"ప్రభవో భగవద్భక్తాః"** (భగవద్భక్తులు మాకు ప్రభువులు) అని శేషిత్వం చెప్పబడింది. **"పునాతి భగవద్భక్త శ్చండాలోఽపి యదృచ్ఛయా"** (చండాలుడైనా, అతడు భగవద్భక్తుడైతే, యాదృచ్ఛికంగాకూడా తాకినా అతడు పవిత్రం చేస్తాడు) అని, **"యం యం స్పృశతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా, స్థావరాణ్యపి ముచ్యంతే కిం పునర్బాంధవా జనాః"** (పరమభాగవతుడు స్పృశించిన, కటాక్షించిన స్థావరాలు సైతం మోక్షాన్ని పొందుతున్నాయి. ఇక, బంధుజనులు మోక్షాన్ని పొందడంలో ఏమి లోటు?) అని, **"పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవ సంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్"** (పశువుగాని, మానవుడు గాని, పక్షిగాని ఎవరైనా, విష్ణుభక్తుని ఆశ్రయిస్తే, ఆ భాగవత సంబంధంవల్లనే వారు విష్ణువుయొక్క ఉన్నత స్థానాన్ని పొందుతారు) ఇత్యాదులవల్ల మోక్షహేతుత్వం చెప్పబడడంచేత శరణ్యత్వం చెప్పబడింది. **"యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః"** (ఏ పరమపరమ పదంలో సాధ్యులనబడే నిత్యసూరులున్నారో) అని, **"యత్రర్షయః ప్రథమ జాయే పురాణాః"** అని, **"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే"** (ఎల్లప్పుడు ప్రకాశించేవారు, భగవానుని స్తుతించేవారైన నిత్యసూరులు జాగరూకులై ఎక్కడ ప్రకాశిస్తున్నారో) అని ముక్తునకు పరమపదంవలె నిత్యసూరులు కూడా ప్రాప్యులని చెప్పబడడంచేత, **"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, సదా పరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః"** (ఎల్లప్పుడు భగవద్గుణానుభవంతో కూడినవాడు, ఆ అనుభవం వల్ల జాలువారే చల్లని ఆనందబాష్పాలను కలవాడు, గగుర్పాటును పొందినవాడైన

భక్తుడు సదా దర్శించదగినవాడు) అని, "**సుదూరమపి గంతవ్యం యత్ర భాగవతాః స్థితాః, ప్రయత్నేనాపి ద్రష్టవ్యాః తత్ర సన్నిహితో హరిః**" (భాగవతులు ఉండే చోటు చాలా దూరం అయినా, అక్కడకు వెళ్ళాలి. వారిని ప్రయత్నపూర్వకంగా అయినా దర్శించాలి. ఎందుకంటే - వారిలో భగవానుడైన హరి సదా సన్నిహితుడై ఉంటాడు) అని ప్రాప్యత్వం చెప్పబడింది.

ఈ అర్థం ద్రావిడవేద - తదంగాలలోకూడా స్పష్టంగా ఉపదేశింపబడింది. ప్రథమాచార్యులైన నమ్మాళ్వార్లు తిరువాయ్మొళిలో "**పయిలుమ్**" అనే దశకంలో **నమ్మై యాళుమ్ పరమర్**" అని, "**ఎమ్మై ఆళుడైయార్**" అని, "**ఎమక్కుమ్ పెరుమక్కళ్**" అని అంటూ తదీయులు శేషిభూతులని, "**వరుమైయుమ్ ఇమ్మైయుమ్ నమ్మై అళిక్కుమ్ పిరాక్కళ్**" అని, "**శన్మశన్మాన్దరమ్ కాప్పర్**" అని, "**నాళ్ ఉయ్యక్కొళ్కిన్ఱ నమ్బర్**" అని అంటూ శరణ్యులని, "**ఎమ్ తొళు కులమ్ తాఙ్గళ్**" అని, "**తమ్మడియార్ ఎమ్మడికళే**" అని, "**తమ్మడియార్ ఎమ్మడియోఙ్గళ్**" అని అంటూ ప్రాప్యులని పలికారు.

ద్రావిడ వేదాంగప్రబంధాలను అనుగ్రహించిన తిరుమంగై మన్నన్ అష్టాక్షరిలోని పదత్రయానికి తాత్పర్యార్థం జీవుని తదీయశేషత్వమేననే విషయాన్ని "**నిన్ తిరువెట్టెళుత్తుమ్ కఱ్ఱు నాన్ ఉఱ్ఱతు ఉన్ అడియార్క్కడిమై**" అని అన్నారు. పెరియతిరుమొళిలోని "**నణ్ణాద**" అనే దశకంలో "**ఎణ్ణాదే యిరుప్పారై ఎప్పొళుదు మెణ్ణోమే**" అని అంటూ అన్యశేషత్వనివృత్తిని, "**అవర్ ఎమ్మై ఆళ్వారే**", "**ఎమ్నాయకరే**", "**ఎఙ్గళ్కులదెయ్వమే**" అని తదీయశేషిత్వాన్ని, "**వణఙ్గు మనత్తారవరై వణఙ్గు ఎన్దన్ మడ నెఞ్జే**" అని తదీయశరణ్యత్వాన్ని, "**అవరై త్తొళువాయ్ ఎన్ తూయ్ నెఞ్జే**" అని, "**అవరై వలమ్ కొళ్ ఎన్ మడ నెఞ్జే**" ఇత్యాదిగా ప్రాప్యత్వాన్ని పలికారు.

పరమాచార్యులైన భగవద్యామునులు "**తవ దాస్యసుఖైకసంగినాం భవనేష్వస్త్వపి కీటజన్మ మే, ఇతరావసథేషు మాస్మ భూః అపి మే జన్మ చతుర్ముఖాత్మనా**" అని అంటూ అన్యశేషత్వ నివృత్తి పూర్వకంగా తదీయశేషత్వాన్ని ప్రార్థించి, "**మహాత్మభిర్మా మవలోక్యతాం నయ**" అని అంటూ పరగతస్వీకారాత్మకమైన శరణ్యత్వాన్ని ప్రార్థించారు. ఈ శరణ్యత్వం "**అత్ర పరత్ర చాపి**" అని పరమపదంలో కూడా అనువర్తిస్తుందని కూడా అన్నారు. ఆచార్యసార్వభౌములైన భగవద్రామానుజులు ఈ అర్థాలను అన్నిటిని ఇమిడ్చి "**యత్పదాంభోరుహధ్యానవిధ్వస్తాశేషకల్మషః, వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్**" అని అనుగ్రహించారు. శిష్యాచార్య లక్షణసీమాభూమి అయిన కూరేశులుకూడా శ్రీవైకుంఠస్తవంలో "**కైంకర్యనిత్యనిరతైః భవదేకభోగైః నిత్యైః అనుక్షణ నవీనరసార్ద్రభావైః, నిత్యాభివాంఛిత పరస్పరనీచభావైః మద్దేవతైః పరిజనైః స్తవ సంగసీయ**" అని అంటూ, ఆళవందార్ "**అత్ర పరత్ర చాపి**" అనేసూక్తి ద్వారా తెల్పిన, మోక్షదశలోకూడా తదీయశేషత్వం ఉన్నదనే విషయాన్ని అనుసంధించారు.



ఈ రీతిలో నమశ్శబ్దప్రతిపాదితాలైన తదీయశేషిత్వ - శరణ్యత్వ - ప్రాప్యత్వాలను మధురకవులు "**ప్రథమాచార్యం పరాంకుశమ్**" అనేరీతిలో ప్రథమాచార్యులు, ప్రపన్న జనకూటస్థులు, విశేషించి తమకు ఆచార్యులైన నమ్మాళ్వార్ల విషయంలో కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధంలో అనుసంధించారు. "**నమ్బిక్కు ఆళ్ ఉరియనాయ్**" అని ఆళ్వార్ల శేషిత్వాన్ని, "**మేవినేన్ అవన్ పొన్నడి మెయ్మ్మైయే**" అని శరణ్యత్వాన్ని, "**తెన్కురుకూర్ నమ్బి ఎన్దక్కాల్ అణ్ణిక్కుమ్, అముదూఱుమ్**" అని ప్రాప్యత్వాన్ని అనుసంధించారు. పరమపర్యాత్మకమైన ఈ కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధ ప్రభావం ఎంత గొప్పది అంటే - ఎవరైనా తమ ఆచార్యులపట్ల గల పరత్వభావనను అనుసంధిస్తూ ప్రబంధం రచిస్తే అదికూడా కణ్ణినుణ్శిఱుత్తామ్బు - అనే పేరుతో వ్యవహరింపపడే అవధిలోని ఉత్కృష్ట వైభవాన్ని ఇది కల్గినది. దీనికి ఉదాహరణగా శ్రీవరవరమునుల శిష్యులైన కోయిల్ కన్దాడై అణ్ణన్ తమ ఆచార్యులైన శ్రీవరవర మునుల విషయంగా రచించిన ప్రబంధం కణ్ణినుణ్ శిఱుత్తామ్బు అనే పేరుతో వ్యవహరింపబడడం గమనించవచ్చు. అందువల్ల కణ్ణినుణ్ శిఱుత్తామ్బు - అనే నామం చరమ పర్వనిష్ఠాప్రబంధానికి పర్యాయ వాచకమైనది. ఇటువంటి రీతినే అమలనాదిపిరాన్ ప్రబంధవిషయంలో కూడా గమనించవచ్చు. ఇపుడు మధురకవుల వైభవం సంగ్రహంగా విన్నపింపబడుతున్నది.

**మధురకవి ఆళ్వార్ల వైభవం**

**మేషే చిత్రాసముద్భూతం పాండ్యదేశే గణాంశజమ్ ।**
**శ్రీపరాంకుశసద్భక్తం మధురం కవిమాశ్రయే ॥**

చైత్రమాసంలో - మేషమాసంలో చిత్రానక్షత్రంలో, పాండ్యదేశంలో, కుముదడనే నిత్యసూరి గణాధిపుని అంశతో అవతరించినవారు, శ్రీపరాంకుశలనే నమ్మాళ్వార్ల విషయంలో గొప్ప భక్తిని కలవారైన మధురకవులను ఆశ్రయిస్తున్నాను.

**పాండ్యక్షమాయాం ప్రథితావతారం చైత్రస్థచిత్రోదుజ మూర్ధ్వచూడమ్ ।**
**ఖగాంశభాజం మధురం కవీంద్రం శఠారిభక్తం శరణం ప్రపద్యే ॥**

పాండ్యదేశంలోని తిరుక్కోవలూర్‌లో ప్రసిద్ధి చెందిన అవతారాన్ని కలవారు– (అవతరించినట్లు ప్రసిద్ధిని పొందినవారు), చైత్రమాసంలోని చిత్రానక్షత్రంలో జన్మించినవారు, ఊర్ధ్వశిఖలను కలవారు, గరుడుని అంశతో అవతరించినవారు, నమ్మాళ్వార్ల భక్తులైన మధురకవులను శరణు పొందుతున్నాను.

**హస్తస్థతాళద్వితయం ప్రపద్యే శఠారివాగ్వ్యాస ముదారకీర్తిమ్ ।**
**మాధుర్యసంశ్లిష్టకవిత్వయుక్తం మహత్త్వసంభావిత బుద్ధితత్త్వమ్ ॥**

రెండు చేతులలో రెండు తాళాలను కలవారు, సంస్కృతవేదానికి వ్యాసుల వలె, నమ్మాళ్వార్ల ద్రావిడ వేదాన్ని విభాగించినవారు, గొప్ప కీర్తిని కలవారు, మాధుర్యగుణంతో కూడిన కవిత్వాన్ని రచించడంలో సమర్థులు, మహత్తు అయిన (**"మహాన్"** అనే తత్త్వరూపమైన, లేక గొప్పదైన) స్వభావంతో కూడిన బుద్ధి అనే తత్త్వాన్ని కలవారు అయిన మధురకవి ఆళ్వార్లను శరణు పొందుతున్నాను.

**యాతే సంవత్సరౌఘే హసదఘుజదజనే ద్వాపరస్యేశ్వరాఖ్యే**
**చైత్రే మాసే ద్విసప్తోత్తరదివసవరే శుభ్రపక్షే చ రుచ్యే ।**
**చిత్రాఖ్యే భార్గవీయే గుణవతి చ దినే ప్రాదురాసీచ్ఛఠారే:**
**అంతేవాసీ ద్విజేంద్రో మధురకవి రసౌ మాదృగుజ్జీవనాయ ॥**

ద్వాపరయుగంలో **"హసదగజదజన"** అనే అక్షరాలచేత నిర్దేశింపబడే 8,83,87,8 సంవత్సరాలు గడచిన తరువాత, ఈశ్వరనామసంవత్సరంలో చిత్తిర (మేష) మాసంలో పదునాల్గు దినాలు గడచిన తరువాత, పదిహేనవనాడు అందమైన శుక్లపక్షంలో చిత్రానక్షత్రంలో, శుక్రవారంనాడు, నమ్మాళ్వార్ల శిష్యులై, వైదికోత్తములైన ఈ మధురకవి ఆళ్వార్లు మనవంటివారి ఉజ్జీవనంకోసం అవతరించారు.

**గణేశ: కుముదో నామ్నా కవిర్మధురసంజ్ఞక: ।**
**చైత్రమాసే శుభే చిత్రాతారకాయా మజాయత ॥**

**(దివ్యసూరిచరితమ్-4-53)**



(కుముదుడనే పేరును కల నిత్యసూరి అయిన గణాధిపుడు చిత్తిరమాసంలో గొప్పదైన చిత్రానక్షత్రంలో మధురకవి ఆళ్వార్లుగా అవతరించారు.

పైన పేర్కొన్న తనియన్‌లలోను, వైభవశ్లోకాలలోను, పూర్వాచార్యులు అనుసంధించిన రీతిలో ద్వాపరయుగంలో 883879వ సంవత్సరమైన ఈశ్వరవర్షంలో చైత్ర (మేష) మాసంలోని పదిహేనవనాడు శుక్లపక్షంలో చిత్రానక్షత్రంలో శుక్రవారంనాడు తిరుక్కురుకూర్ అనే ఆళ్వార్ తిరునగరికి సమీపంలో ఉండే తిరుక్కోవలూర్ అనే దివ్యదేశంలో జైమిని సామవేదాన్ని అధ్యయనం చేసే పూర్వశిఖా శ్రీవైష్ణవ బ్రాహ్మణకులంలో అవతరించారు, మధురకవి ఆళ్వార్లు, సూర్యోదయానికి ముందు తూర్పుదిక్కులో కన్పించే అరుణోదయంవలె, వకుళభూషణ భాస్కరులు ఉదయించడానికి ముందే, గరుడుని అంశగా, కుముదుడనే నిత్యసూరి గణాధిపుని అంశగా అవతరించారు. వడివళ్గియనమ్బిదాసర్ అనే మహనీయులు రచించిన ఆళ్వార్‌కళ్ వైభవం అనే ద్రావిడ కావ్యంలో **"ఆదలాల్ మున్నేనీర్ ఏకుమెన అరుళ్ నాదన్ వేదనా వళ్గువాదార్ ఇరువర్ కళామ్ విద్రై కొణ్డార్, శీతవాన్ శితైక్కరుడన్ శిత్తిరైయిల్ శిత్తిరైయిల్ ఓదుతిరుక్కోళూర్ మదురకవియాయ్ ఉదిత్తాన్"** అని అంటూ మధురకవులు గరుడని అంశతో అవతరించినట్లు తెలిపారు.

యుక్తవయస్సులో జాతకర్మ, నామకరణం, అన్నప్రాశనం, చౌలం, ఉపనయనం మొదలైన సంస్కారాలు చేయబడి, వేదశాస్త్రాలను అభ్యసించారు, మధురమైన కవిత్వాన్ని పాడగల్గినవారు కనుక, **"మధురకవి"** అనే కీర్తిని పొందారు. జ్ఞానభక్తివైరాగ్యాలలో గల అతిశయంచేత, ముక్తిని ఇచ్చే నగరంగా ప్రసిద్ధిచెందిన అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి, అవంతి, ద్వారక – అనే ఏడు నగరాలను, ఇంకా మిగిలిన దివ్యదేశాలను సేవించాలని తలచి తీర్థయాత్రకై బయలుదేరారు. ఉత్తరభారతక్షేత్రాలను దర్శించి తిరిగి వస్తూ ఉండగా, అయోధ్యా నగరాన్ని చేరి, అక్కడ అర్చారూపంలో నెలకొని ఉండే శ్రీరాముని, సీతాదేవిని సేవించి, కొంతకాలం అక్కడే ఉన్నారు. అపుడు ఒకనాడు తిరుక్కోవలూర్‌లోని స్వామిని నమస్కరించదలచి, ఆస్వామి వేంచేసి ఉండే దిక్కువైపుకు తిరిగి చూడగా గొప్ప తేజస్సు వారి కంటికి గోచరించింది. తరువాత, రెండు మూడు దినాలు గడచిన తరువాత కూడా ఆదిక్కులో అదే రీతిలో తేజస్సును దర్శించిన ఆళ్వార్లు "ఇది ప్రాకృతమైన తేజస్సు కాదు. అప్రాకృతమైన, దివ్యతేజస్సు సందేహం లేదు. ఇది ఏమో తెలిసికోవాలి" అని

తలచి, పగటికాలంలో నిద్రించి, రాత్రివేళ ఆ తేజస్సును లక్ష్యంగా చేసికొని చాలా వేగంగా దక్షిణదిక్కు వైపు ప్రయాణాన్నిచేశారు. క్రమంగా శ్రీరంగానికి వచ్చి చూడగా, అక్కడకు దక్షిణదిక్కులో ఆ తేజస్సు మధురకవులకు కన్పించింది. క్రమంగా మధురకవులు తిరుక్కోవలూర్‌కు చేరగా అక్కడ ఆ తేజస్సు అంతర్ధానమైనది. అపుడు మధురకవులు "ఆ తేజస్సు ఈ ఊరి లోనే ఉండి ఉండాలి" అని నిర్ణయించి, ఆ ఊరిలో వెదకగానే, ఒక చింతచెట్టుకింద పద్మాసనాన్ని వేసికొని కూర్చున్నవారు, పరతత్త్వాన్ని తెలిపే వ్యాఖ్యానముద్రను చేతిలో చూపిస్తున్నారు, మహాతేజస్వి. పరమాచార్యులు అయిన నమ్మాళ్వార్లను దర్శించి "ఆ తేజోమూర్తి వీరే" అని నిశ్చయించుకొన్నారు.

వీరికి చెవులు వినిపిస్తున్నాయా? తెలివి ఉన్నదా? అని పరీక్షించడం కోసంగా ఒక గండశిలను ఎత్తి వారి ముందు పడవేశారు, మధురకవులు. ఆ ధ్వనిని విని నమ్మాళ్వార్లు తటాలున కన్నులు తెఱచి చూచారు. అపుడు మధురకవులు "వీరు నోరు తెఱచి పల్కుతారా?" అని గమనించగోరి, **"శెత్తదన్ వయిత్తిలే శిఱియదు పిఱన్దాల్ ఎత్తై త్తిన్ఱు ఎజ్గే కిడక్కుమ్?"** (జ్ఞానశూన్యమైన శరీరంతో అణుపరిమాణుడైన ఆత్మకు సంబంధం కల్గితే, ఆ ఆత్మ దేనిని అనుభవిస్తూ, దేనిని ఆశ్రయించుకొని ఉంటాడు?) అని ప్రశ్నించారు. దానిని విన్న నమ్మాళ్వార్లు **"అత్తై త్తిన్ఱు అజ్గే కిడక్కుమ్"** (ఆ ఆత్మ ఆ శరీరాన్ని, అంటే– దానివల్ల కలిగే సుఖ దుఃఖాలనే– అనుభవిస్తూ, ఆ శరీరాన్నే ఆశ్రయించుకొని ఉంటుంది) అని బదులిచ్చారు. దీనిని విన్న మధురకవులు "వీరు అన్నీ తెలిసిన మహాజ్ఞాని. వీరిని ఆశ్రయించి ఉజ్జీవిస్తాను" అని తలచి, ఆళ్వార్ల శ్రీచరణాలలో పడి, సేవించి, వారినే సర్వస్వంగా భావించి, వారికి సకల సపర్యలు చేయసాగారు. భగవానుని నిర్హేతుక కృపవల్ల భ్రమవిప్రలంభాది దోషశూన్యమైన తత్త్వజ్ఞానాన్ని పొందిన నమ్మాళ్వార్లు ఆ భగవానునితో తమకు కల్గిన మానససాక్షాత్కారం ద్వారా ఏర్పడిన సంశ్లేష– విశ్లేషాలనే అనుభవాల వ్యక్తీకరణ రూపంగా ఋగ్వేదసారమైన తిరువిరుత్తమనే ప్రబంధాన్ని, యజుర్వేద సారమైన తిరువాశిరియప్రబంధాన్ని, అధర్వణవేద సారమైన పెరియతిరువన్దాదిని, సామవేదసారమైన తిరువాయ్‌మొళి ప్రబంధాన్ని అనుగ్రహించి, వాటి అర్థాన్ని మధురకవి ఆళ్వార్లకు ఉపదేశించి, పరమపదాన్ని చేరారు.



మధురకవులు ఈ దివ్యప్రబంధాలను తాళపత్రాలలో లిఖించి, గ్రంథస్థం చేశారు. ఆళ్వార్ల విషయంగా తాము అనుగ్రహించిన **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"** అనే దివ్యప్రబంధాన్ని, ఆళ్వార్ల దివ్యప్రబంధాలను చేతితో తాళాలను వాయిస్తూ, రాగతాళాలకు అనుగుణంగా గానంచేస్తూ, వాటి అర్థాన్ని లోకానికి ఉపదేశించారు. నమ్మాళ్వార్ల వియోగాన్ని సహించలేక వారు అవతరించిన తిరుక్కురుకూర్‌లో ఆళ్వార్ల అర్చావిగ్రహాన్ని ప్రతిష్ఠించి, ఆ మూర్తికి నిత్య–పక్ష–మాస–ఆయన–సంవత్సరోత్సవాలను అన్నిటిని వైభవంగా నిర్వహిస్తూ, **"కారిమాఱర్ వన్దార్, శఠకోపర్ వన్దార్, పరాఙ్కుశర్ వన్దార్, తిరుక్కురుకూర్‌నమ్బి వన్దార్, తిరువాయ్‌మొళిప్పెరుమాన్ వన్దార్, నాట్కమళ్‌మకిళ్‌మాలై మార్బినార్ వన్దార్, వేదమ్ తమిళ్ శెయ్‌ద పెరుమాళ్ వన్దార్"** అని పలు ఆళ్వార్ల బిరుదులను ఘోషించి, దేశం అంతటా వారి దివ్యప్రబంధాలను ప్రచారం చేశారు. దానిని చూచిన ఆకాలంలోని సంఘ కవులు, "మాతో వాదించి, జయించి, సంఘఫలకాన్ని అధిరోహిస్తే తప్ప ఈ బిరుదులను ఘోషించడానికి మేము అంగీకరించము" అని అడ్డుకొన్నారు. మధురకవులు. "ఇది న్యాయమే. కానీ, మా ఆళ్వార్లు మీ సంఘఫలకాన్ని అధిరోహించలేరు. కనుక, వారి తిరువాయ్‌మొళి ప్రబంధంలోని **"కణ్ణన్ కళలిణై"** అనే భాగాన్ని వ్రాసిన ఈ పత్రాన్ని సంఘఫలకంపై పెట్టండి. ఫలకందానికి అంగీకరిస్తే, వారిని ఒప్పుకొన్నట్లవుతుంది" అని అంటూ ఆ పత్రాన్ని వారికి ఇచ్చారు. ఆ రీతిలోనే మూడువందలమంది సంఘకవులు అధిరోహించి ఉండే సంఘఫలకంపై ఆ పత్రాన్ని పెట్టగానే, ఆ ఫలకం ఆ మూడువందలమంది కవులను ప్రక్కనే ఉన్న **"పొఱ్ఱామరై ప్పొయ్‌కై"** లోకి తోసివేసి, **"కణ్ణన్ కళలిణై"** అనే ఆళ్వార్ల తిరువాయ్‌మొళి దశకం వ్రాయబడిన పత్రాన్ని మాత్రం ధరించి నిలచింది. చెఱువు నీటిలో పడిపోయిన సంఘకవులు మునిగిపోయి, తడబడుతూ లేచి, మెల్లగా తీరాన్ని చేరి, "భగవానుని నిర్హేతుక కృపవల్ల నిష్కృష్టమైన జ్ఞానాన్ని పొందిన నమ్మాళ్వార్లు పాడిన పాశురాలే తిరువాయ్‌మొళి మొదలైన దివ్యప్రబంధాలు" – అని గ్రహించి గర్వాన్ని విడచిపెట్టి, ఆళ్వార్లపట్ల అపచార పడినందులకు చాలా అనుతాపం పొందారు. దానికి ప్రాయశ్చిత్తంగా ఒక్కొక్కరు ఒక్కొక్క స్తుతిని పాశురరూపంలో పాడారు. ఆ పాశురంలో మొదటి పాదాలను కలుపగా– **"శేమమ్ కురుకైయో శెయ్య తిరుప్పాఱ్కడలో? నామమ్ పరాఙ్కుశమో

**నారణమో? తామమ్ తుళవో వకుళమో? తోళిరణ్డో నాలుళవో? పెరుమానుక్కు"** (భగవానుని వాసం కురుకాపురియా లేక పాలసముద్రమా, పేరు పరాంకుశ లనియా? లేక నారాయణుడనియా? ధరించే పూమాలిక తులసీమాలయా? లేక, వకుళ మాలయా, చేతులు నాలుగా? లేక, రెండా?) అనే పాశురంగా అవి రూపొందాయి. దీనిమూలంగా శ్రీమన్నారాయణుడే నమ్మాఴ్వార్లుగా అవతరించారు. అని గ్రహించిన సంఘకవులు ఆఴ్వార్లపట్ల విశేషమైన గౌరవాన్ని, భక్తిని కలవారై. **"ఈయాడువదో కరుడత్కెదిరే యిరవిక్కెదిరే మిన్మిని యాడువదో నాయాడువదో వుఱమిప్పులిమున్ నరి కేసరిమున్ నడైయాడువదో పేయాడువదో అఴకూర్వశిమున్ పెరుమాన్ వకుళాబరణన్నరుళ్ కూర్న్దు ఓవాదురై యాయిర మామమైయిన్ ఒరు శొల్పొరుమో ఉలకిఱ్కువియే"** అనే పాశురంలోని ఒక పదానికి కూడా చాలదు" అని అనుసంధించి, తామే స్వయంగా ఆఴ్వార్ల బిరుదులను ఘోషిస్తూ, వారికి పలు రీతులలోను గౌరవాలను చేశారు. ఈ రీతిలో మధురకవి ఆఴ్వార్లు నమ్మాఴ్వార్లకు కైంకర్యాన్ని చేస్తూ వారి సూక్తులనే ప్రచారం చేస్తూ ఈ భూలోకంలో కొంతకాలం వేంచేసి ఉండి **"నమ్బువార్ పది వైకున్దమ్ కాణ్మిన్"** (కణ్ణినుణ్-1) అని తాము పల్కిన రీతిలోనే పరమపదాన్ని పొంది, అక్కడకూడా నమ్మాఴ్వార్లు తప్ప వేఱు దైవాన్ని తెలియనివారై, వారికి కైంకర్యాలను చేయడంకోసం పరమపదాన్ని చేశారు.

**"ఉణ్ణపోతొరు వార్త్తైయుమ్ ఉణ్ణాదపోదొరు వార్త్తైయుమ్ శొల్లువార్ పత్తుప్పేర్ ఉణ్డితే. అవర్కళ్ పాశురమ్ కొణ్డన్ను ఇవ్వర్థమ్ అఱుదియిడువదు", "అవర్కళై చ్చిరిత్తిరువర్ ఒరువర్ ఉణ్డితే. అవర్ పాశురమ్ కొణ్డు ఇవ్వర్థమ్ అఱుదియిడక్కడవోమ్"** (శ్రీవచనభూషణమ్-నాల్గవ ప్రకరణం - 408,409) అనే శ్రీవచనభూషణ చూర్ణికలోను, దాని వ్యాఖ్యానంలోను ఈ ఆఴ్వార్ల మహిమ విస్తృతంగా తెలుపబడింది. ఆ విశేషాలు ఇక్కడ అనుసంధించదగినవి.

**మధురకవుల వాఴి త్తిరునామం**

**చిత్తిరైయిల్ శిత్తిరైనాళ్ శిఱక్క వన్దోన్ వాఴియే**
**తిరుక్కోళూర్ అవతరిత్త శెల్వనార్ వాఴియే**
**ఉత్తర గఙ్గాతీరత్తుయర్ తవత్తోన్ వాఴియే**
**ఒళి కతిరోన్ తెఱ్కుదిక్కు ఉకన్దు వన్దాన్ వాఴియే**



**పత్తి యొడు పదినొన్ఱుమ్ పాడినాన్ వాఴియే**
**పరాఙ్కుశనే పరనెన్ఱు పఱ్ఱినాన్ వాఴియే**
**మత్తిమమామ్ పదప్పొరుళై వాఴ్ విత్తాన్ వాఴియే**
**మదురకవి తిరువడికళ్ వాఴి వాఴి వాఴియే**

(చిత్రా (చైత్ర) మాసంలోని చిత్తా నక్షత్రంలో గొప్పగా అవతరించిన వారికి మంగళం, తిరుక్కోళూర్ అనే దివ్యదేశంలో అవతరించిన వారికి మంగళం. ఉత్తర గంగా తీరంలో గొప్ప తపస్సును చేసిన వారికి మంగళం. ప్రకాశించే జ్యోతిస్సును చూచి దక్షిణ దిక్కుకు వచ్చిన వారికి మంగళం. భక్తితో పదకొండు పాశురాలను కల కణ్ణినుణ్ శిఱుత్తామ్బును పాడినవారికి మంగళం. నమ్మాఴ్వార్లే పరదైవమని ఆశ్రయించినవారికి మంగళం. అష్టాక్షరిలోని మధ్యమ పదమైన నమ:శబ్దం యొక్క అర్థాన్ని వివరించిన వారికి మంగళం – మధురకవుల శ్రీచరణాలకు మంగళం)

**దివ్యప్రబంధవ్యాఖ్యాన వైవిధ్యం :** ఆఴ్వార్ల దివ్యప్రబంధాలకు మణిప్రవాళ శైలిలో వ్యాఖ్యానాల అవతరణం తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ ఆఱాయిరప్పడి వ్యాఖ్యతో ఆరంభమైనదని చెప్పాలి. నమ్బిళ్ళై తిరువాయ్మొఴి ఈడు వ్యాఖ్యానంలో తిరువాయ్ మొఴికి తమిళ పండితులచే రచింపబడ్డ ద్రావిడ వ్యాఖ్యానాలను కొన్నిటినిగూర్చి అక్కడక్కడ ప్రస్తావించినా (3-9-9, 4-5-6, 4-8-2 పాశుర వ్యాఖ్యలలో) అవి ఆఱాయిరప్పడికి ముందే రచింపబడినవా? లేక, తదనంతరం రచింపబడినవా? అనే విషయం స్పష్టంగా తెలియడం లేదు. పిళ్ళాన్ నుండి శ్రీవరవరమునుల శిష్యులు అప్పిళ్ళార్ వరకు గల పూర్వాచార్యులు పలువురు దివ్యసూరుల దివ్యప్రబంధాలపై తమ వ్యాఖ్యలను రసఘనంగా అనుగ్రహించారు. పిళ్ళాన్ ఆఱాయిరప్పడితో అంకురించిన పూర్వాచార్య వ్యాఖ్యాన వాఙ్మయ కల్పవృక్షం క్రమంగా శాఖోపశాఖలుగా విస్తరించి అమృత ఫలాలను నిరంతరం అనుగ్రహిస్తున్నది. ఈ పూర్వాచార్యుల వ్యాఖ్యానాలు కేవలం దివ్యప్రబంధాలకే పరిమితం కాకుండా వారు వ్యాఖ్యంలో ప్రమాణీకరించిన శ్రీరామాయణభారత శ్రీవిష్ణుపురాణాది గ్రంథాలలోని శ్లోకాలకు, పూర్వాచార్య స్తోత్రాలలోని శ్లోకాలకుకూడా విస్తరించింది. పూర్వాచార్యులందఱిలో పెరియ వాచ్చాన్ పిళ్ళై ఒక్కరు మాత్రమే నాలాయిరదివ్యప్రబంధాలను అన్నిటినీ పూర్ణంగా వ్యాఖ్యానించారు. మిగిలిన వారిలో కొందఱు మాత్రమే కొన్నిప్రబంధాలకు

మాత్రమే వ్యాఖ్యానా లను వెలయించారు. వీటి వివరం క్లుప్తంగా ఇక్కడ తెలుపబడు తున్నది.

1) **తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్** - తిరువాయ్‌మొ*ళ్ళి* ప్రబంధంపై ఆఱాయిరప్పడి వ్యాఖ్య

2) **నంజీయర్** - తిరువాయ్‌మొ*ళ్ళి* ప్రబంధంపై ఒన్బది నాయిరప్పడి వాఖ్య, తిరుప్పళ్ళి ఎ*ళ్ళు*చ్చి, కణ్ణినుణ్ శిఱుత్తాంబు, ప్రబంధాలపై వ్యాఖ్యలు

3) **నమ్బిళ్ళై** - తిరువాయ్‌మొ*ళ్ళి*పై ఈడు ముప్పత్తారా యిరప్పడి వ్యాఖ్య, తిరువిరుత్తమ్, కణ్ణినుణ్‌శిఱుత్తాంబు ప్రబంధాలపై వ్యాఖ్యలు.

4) **పెరియవాచ్చాన్‌పిళ్ళై** - ఆ*ళ్వా*ర్ల దివ్యప్రబంధాలు అన్నిటిపై వ్యాఖ్యలు. వీరి తిరువాయ్‌మొ*ళ్ళి* వ్యాఖ్యకు **"ఇరుపత్తునాలాయిరప్పడి"** అనిపేరు.

5) **అ*ళ్ళ*కియ మణవాళచ్చీయర్** - తిరువాయ్‌మొ*ళ్ళి*పై పన్నీరాయిరప్పడి వ్యాఖ్య, తిరువిరుత్తంపై స్వాపదేశవ్యాఖ్య.

6) **శ్రీపరకాలదాసర్** - తిరునెడున్దాణ్డకమ్ లోని **"మైవణ్ణమ్"** అనే పాశురానికి మాత్రం వ్యాఖ్య.

7) **అ*ళ్ళ*కియ మణవాళప్పెరుమాళ్ - నాయనార్** తిరుప్పావై, అమలనాదిపిరాన్, కణ్ణినుణ్ శిఱుత్తాంబు, పెరియతిరుమడల్ ప్రబంధాలపై వ్యాఖ్యలు

8) **శ్రీవేదాంతదేశికులు** - అమలనాదిపిరాన్ పై మునివాహన భోగవ్యాఖ్య, తిరువిరుత్తమ్‌లోని మొదటి పాశురంపై వ్యాఖ్య



9) **తిరువాయ్‌మొ*ళ్ళి*ప్పిళ్ళై** - పెరియా*ళ్వా*ర్ తిరుమొ*ళ్ళి*పై స్వాపదేశవ్యాఖ్య(దీనికర్తృత్వ విషయంలో అభిప్రాయ భేదమున్నది).

10) **శ్రీమణవాళమహామునులు** - నాల్గు శతకాలవరకు లోపించిన పెరియా*ళ్వా*ర్ తిరుమొ*ళ్ళి*పై పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానానికి పూరణం, ఇరామానుశ నూ*ర్ర*న్దాది ఉరై.

11) **తిరునారాయణపురత్తు ఆయ్** - తిరుప్పావై ప్రబంధంపై ఈరాయిరప్పడి, నాలాయిరప్పడి వ్యాఖ్యలు.

12) **అప్పిళ్ళార్** - నాల్గు తిరువన్దాదులపై ఉరై (టీక)

వడకలై సంప్రదాయానికి చెందిన శ్రీరంగరామానుజ ముని, పెరియపరకాల జీయర్‌స్వామివారు మొదలైన వారు అనుగ్రహించిన వ్యాఖ్యానాలు కూడా ఉన్నాయి. నాలాయిర దివ్యప్రబంధాలకు పూర్వాచార్యులు అనుగ్రహించిన తనియన్ శ్లోకాలకు, పాశురాలకు, **"శ్రీశైలేశ"** ఇత్యాది పొదుత్తనియన్‌లకు, ఇయల్ శా*ర్ర్రు* పాశురాలకు, శ్రీవరవరమునుల తిరువాయ్‌మొ*ళ్ళి* నూ*ర్ర*న్దాది, ఉపదేశరత్తినమాలై, ఆర్తి ప్రబంధమ్ ప్రబంధాలపై వ్యాఖ్యానాలను శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్ అనుగ్రహించారు. ముదలా*ళ్వా*ర్లు, తిరుమ*ళ్ళి*శైప్పిరాన్ అనుగ్రహించిన నాల్గు తిరువన్దాదులపై నమ్బిళ్ళై అనుగ్రహించిన **"నమ్బిళ్ళైపడి"** అనే వ్యాఖ్యానాన్ని గీతాచార్యన్ తమిళ పత్రికాధిపతి ప్రొ॥ ఎం.ఎ. వేంకటకృష్ణన్‌స్వామి (డిపార్ట్‌మెంట్ ఆఫ్ వైష్ణవిజమ్, యూనివర్సిటీ ఆఫ్ మద్రాస్, చెన్నై) పరిష్కరించి ముద్రించారు. **"మైవణ్ణమ్"** అనే తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని 21వ పాశురానికి భట్టర్ కృతంగా చెప్పబడే మణిప్రవాళ వ్యాఖ్యానం ఒకటి పూర్వం ముద్రింపబడింది. కాని, అందులో భట్టర్‌వార్త, నంజీయర్ వార్తలు, దేశికుల న్యాసవింశతిలోని **"ప్రాయః ప్రపదనే"** ఇత్యాదిశ్లోకం ఉదాహరింపబడి నందున, అది భట్టర్ కృతం కాదని, పెరియవాచ్చాన్‌పిళ్ళైకు, నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై శిష్యులైన ''పరకాలదాసర్''చే రచింపబడినదని కీర్తిమూర్తి ఉ.వే.శ్రీమాన్ ఎస్. శ్రీనివాస అయ్యంగార్ స్వామివారు శ్రీసుదర్శన పత్రిక స్థాపకులు **"షోడశాధ్యాయి"**

అనే గ్రంథంలో తెలిపారు. ఈ వ్యాఖ్యానాలేకాక, తిరువాయ్‌మొ*ழி* ఈడు ముప్పత్తాఱా యిరప్పడికి గల రెండు అరుంబదాలలో అక్కడక్కడ ప్రమాణాలుగా గ్రహించిన దివ్యప్రబంధపాశురాలు వివరంపబడడం కూడా గమనార్హం. ఈ విశేషాలన్నీ ఒక ఎత్తు అయితే, తిరువాశిరియమ్ ప్రబంధం పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానానికి అనుబంధంగా ముంద్రింపబడిన అరుంబదంవల్ల వ్యక్తమయే విశేషం ఇంకొక ఎత్తు. ఈ అరుంబదం పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాన్ని ఉద్దేశించి రచింపబడినది కాదనే విషయాన్ని అందులోని ప్రతీక గ్రహణాలు నిరూపిస్తున్నాయి. అందువల్ల ఇంకొక వ్యాఖ్యానం ఆ ప్రబంధంపై రచింపబడి ఉండాలని, అది ఈనాడు లుప్తంకాగా, అరుంబదం మాత్రమే లభిస్తున్నదని స్ఫుటపడుతున్నది. ఈవిధంగా ఇంకా ఎన్ని వ్యాఖ్యానాలు లుప్తమయ్యాయో కాలానికే తెలియాలి. తిరుప్పావై ప్రబంధంపై నంజీయర్, అ*ழ*కియ మణవాళచ్చీయర్ కూడా వ్యాఖ్యలను అనుగ్రహించారని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామి శ్రీవైష్ణవసర్వస్వమనే గ్రంథంలో తెలిపారు. వానమామలై మఠ స్థాపకులైన జీయర్ స్వామివారు, శుద్ధసత్త్వం దొడ్డయాచార్యస్వామిగారు తిరుప్పావై ప్రబంధానికి స్వాపదేశవ్యాఖ్యానాలను అందించారు. తిరువాయ్‌మొ*ழி* ప్రబంధం లోని మొదటి రెండు దశకాల ప్రమేయానికి, శారీరకమీమాంసా భాష్యానికి మధ్యగల అద్వైక్యాన్ని నిరూపిస్తూ శారీరక ద్రవిడోపదిషద్దైక కంఠ్యమ్ అనే ప్రౌఢ వివరణాన్ని కాంచీ వాస్తవ్యులైన అ*ழ*కియ మణవాళచ్చీయర్ రచించారు. కణ్ణినుణ్ శిఱుత్తమ్బు ప్రబంధానికి తమ్బిరాన్‌పడి వ్యాఖ్య ఉన్నది. ఇది అవతారిక, మొదటి పాశురంవరకే కన్పిస్తున్నది. దీని రచనాకాలంగూర్చి కూడా స్పష్టంగా తెలియడం లేదు. నాయనార్ 10వ పాశుర వ్యాఖ్యలో **"తమ్బిరాన్‌మాలైప్పోలే ఆ*ழ்*వారుక్కు త్తిరువాయ్‌మొ*ழி* పాడువనవాయ్‌త్తు"** అని తమ్బిరాన్‌మార్ ప్రసక్తి కన్పిస్తుంది. **"తమ్బిరాన్"** అంటే శ్రీరంగాలయంలో అధ్యయనోత్సవాదులలో విన్నపాలను చేసే అరైయర్లు. అందువల్ల ఈ వ్యాఖ్య కూడా ప్రాచీనమని భావించవచ్చు.

పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాలను ఆధారంగా చేసికొని పెద్దల కాలక్షేప పరంపర కొనసాగుతున్నది. (తిరువాయ్‌మొ*ழி* ప్రబంధానికి మాత్రం నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్య శిష్యాచార్య కాలక్షేప క్రమంలో ఉన్నది.) పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాలు అవతరించినందువల్లనే మనకీనాడు దివ్యసూరుల దివ్యప్రబంధాలలోని అర్థ విశేషాలు అవగతమవుతున్నాయి - అని ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో శ్రీమణవాళ మహామునులు అంటారు.



శైలీగతమైన క్రమవికాసాన్ని కూడా పూర్వాచార్య వ్యాఖ్యానాలలో గమనించవచ్చు. తిరువాయ్‌మొ*ழி*కి మొదటి వ్యాఖ్యానమైన ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం సంస్కృతపద బహుళంగా, క్లుప్తంగా, అన్యూనానతిరిక్తంగా, సూత్రప్రాయంగా ఉంటుంది. తరువాత వచ్చిన నంజీయర్ వ్యాఖ్యానంలో కొన్నిపదాల వివరణలు, కొన్ని ఐతిహ్యాలు కన్పిస్తాయి. ఇది ద్రావిడ పద బహుళం. ఆఱాయిరప్పడి కంటే మఱింత వివరణాత్మకంగా నంజీయర్ వ్యాఖ్యానం కన్పిస్తుంది. ఇక, నమ్పిళ్ళై ఈడు అయితే, సర్వాంగ సుందరంమై, సహృదయ మనోహరమై, అనుభవించేవారికి షడ్రసోపేతమైన విందుగా ఆనందింపజేస్తుంది. నాయనార్ వ్యాఖ్యానాలు మఱింత విశదంగా, పద-పదాంగ సార్థక్య నిరూపణాత్మకంగా, అనితర సాధ్యంగా ఉంటాయి. స్వాపదేశార్థ వివరణ ప్రక్రియ నాథమునుల కాలంనుండి కొనసాగుతున్నదని పూర్వాచార్య వ్యాఖ్యానాలు నిరూపిస్తున్నాయి. అ*ழ*కియమణవాళచ్చీయర్ పన్నిరాయిరప్పడిలో పాశురక్రమంలో కాకుండా, అన్వయక్రమంలో అర్థం తెలుపబడింది. విశదవాక్ శిఖామణి శ్రీవరవరమునుల పెరియా*ழ்*వార్ తిరుమొ*ழி*వ్యాఖ్య వ్యాఖ్యాన ప్రక్రియ యొక్క వైశ్వరూప్యాన్ని సంతరించుకొన్నది. ఈ విధంగా వ్యాఖ్యానాలలో క్రమంగా వికాసాన్ని, పరిణతిని గమనించవచ్చు. అయితే, పూర్వవ్యాఖ్యానాలకంటే అనంతర వ్యాఖ్యానాలు గొప్పవి - అని భావించరాదు. వీటిమధ్య సంగ్రహ - వివరణ రూపమైన అవినాభావ సంబంధాన్ని గమనించడం యుక్తం.

చిరకాలంగా తాళపత్రాలలో నిక్షిప్తాలై, నిధివలె రక్షింపబడిన పూర్వాచార్య వ్యా*ழ்*్యానాలు అన్నీ ముద్రణ సౌకర్యాలు ఏర్పడిన తరువాత ధార్మికుల సహాయంతో, పండితుల నిర్విరామ కృషితో ముద్రింపబడ్డాయి. వీటి ముద్రణ జరిగి ఇప్పటికి నూఱు సంవత్సరాలు గడచినందున, ఆప్రతులీనాడు దొరకడం లేదు. దొరికినా, ఉపయోగపడే దశలో లేవు. అందువల్ల మళ్ళీ ఇపుడు వాటిని పునర్ముద్రణను చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. కంప్యూటర్ విజ్ఞానం ఎంత అభివృద్ధి చెందినా, గ్రంథప్రచురణావశ్యకత ఈనాటికికూడా కాదనలేనిది, అత్యంతం ఉపయోగకర మైనది, సామాన్య పాఠకునకు అందుబాటులో ఉండేది. కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధంపై నంజీయర్, నమ్పిళ్ళై, పెరియవాచ్చాన్ పిళ్ళై, అ*ழ*కియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ - అనే నల్గురు పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య, నమ్పిళ్ళై వ్యాఖ్యలు రెండు ఇంచుమించు సమానంగా

కన్పిస్తాయి. నంజీయర్, నాయనార్ వ్యాఖ్యానాలలో కొన్ని విశేషాలు కన్పిస్తున్నాయి. పెరియ వాచ్చాన్ పిళ్ళై, నాయనార్ వ్యాఖ్యానాలకు పెద్దలు చేసిన అరుంబదవివరణ లున్నాయి.

ప్రస్తుతం, కణ్ణినుణ్ శిఱుత్తాம్బు ప్రబంధానికి పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానం అరుంబదంసహితంగా ముద్రింపబడుతున్నది. పెరియ వాచ్చాన్ పిళ్ళై వాన్యఖ్యానానికి చేయబడిన ఆంధ్రవివరణంతో పాటు నంజీయర్, నాయనార్ వ్యాఖ్యలలోని విశేషాలు కూడా చేర్చబడ్డాయి. నమ్బిళ్ళై, నాయనార్ వ్యాఖ్యలు గ్రంథముద్రణలోని ఆర్థికసౌకర్యంలో గల పరిమితినిబట్టి ముద్రింప బడడం లేదు. భగవద్భాగవతాచార్యానుగ్రహంవల్ల ఆ వ్యాఖ్యానాలు కూడా త్వరలో పునర్ముద్రింప బడే అవకాశం కలగాలని కోరుకొంటున్నాను.

ఇటీవల విజయనగరంలోని త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం నూతన భవన నిర్మాణం అచటి గోష్ఠివారి సహాయసహకారాలతో, **శ్రీమాన్ కృష్ణాజీ** (దాసరి సుబ్బారావు) ప్రభృతుల నిరంతరకృషితో సర్వాంగ సుందరంగా చేయబడింది. ఈ ఏడు జరిగే **కీర్తిమూర్తులు, ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి** తిరు నక్షత్రోత్సవస్మారక కార్యక్రమాలు **శ్రీశ్రీశ్రీ చిన్న శ్రీమన్నారాయణ జీయర్ స్వామివారి** సాన్నిధ్యంలో, ఆహూతులైన పలువురు ప్రసిద్ధపండితుల సమక్షంలో నిర్వహింప బడడం విశేషం. ఆచార్యవైభవ ప్రఖ్యాపకమైన ఈ కార్యక్రమానికి జ్ఞాపికగా ఆచార్యవైభవ ప్రఖ్యాపకమైన కణ్ణినుణ్ శిఱుత్తాம్బు ప్రబంధం వ్యాఖ్యానంతో పాటు ముద్రింప బడడం అత్యంతం సముచితం. ఈ గ్రంథ ముద్రణకు కావలసిన ద్రవ్యాన్ని సమర్పించి, తమ ఆచార్యభక్తిని చాటుకొన్న **శ్రీమతి దుర్గ, శ్రీమాన్ వజ్రపు జగన్నాథం** పుణ్యదంపతులు అభినందనీయులు. వీరి కైంకర్యం ప్రశస్యతరం. వీరి కుటుంబానికి శ్రీనివాసుని కృపవల్ల సమస్తశ్రేయస్సులు కలగాలని, వీరి భగవద్భాగవతాచార్య కైంకర్యం ఇనుమడించాలని అనేక మంగళాశాసనాలను హృదయపూర్వకంగా చేస్తున్నాను. పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానికి శ్రీసుదర్శన పత్రికాధిపతి, కీర్తిమూర్తి **ఉ.వే. శ్రీమాన్ ఎన్.కృష్ణస్వామి అయ్యంగార్** ప్రచురించిన ద్రావిడ వివరణం భావదీపికలో కృతజ్ఞతా పూర్వకంగా అనుసరింప బడింది. ఈ ప్రయత్నంలో నన్ను ప్రోత్సహించి, మార్గదర్శనంచేసిన పితృపాదులు **న్యాయవేదాంత**



**విద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి సన్నిధిలో** కార్తజ్ఞ్య పురస్సరంగా ప్రణమిల్లు తున్నాను. ఈ వాచిక కైంకర్యాన్ని చేసికొనే అవకాశాన్ని నాకు కల్గించిన సహృదయ విదుషీమణి **శ్రీమతి కె.వి. జానకమ్మగారి**కి హార్దికంగా ధన్యవాదాలను సమర్పించు కొంటున్నాను. భావదీపికను సమీక్షించి మంగళాశాసనాలను అందించిన సహృదయ మూర్ధన్యులు, **ఉ.వే. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామి వారి సన్నిధిలో** మాతుల పాదులు, **ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారి సన్నిధిలో** కృతజ్ఞతానుసంధానపూర్వకంగా నమస్కరిస్తున్నాను. భావదీపికలోని లోటు పాట్లను సహృదయ పాఠకులు మన్నిస్తారని భావిస్తూ. స్వస్తి.

**తేఱియ మా ఞానముడన్ తిరుక్కోళూరిల్**
**శిత్తి రైయిల్ శిత్తిరైనాళ్** వన్దు తోన్రి
**ఆఱియ నల్లన్బుడనే కురుకూర్ నమ్బిక్కు**
**అనవరత మన్తరఙ్గమడిమై** శెయ్దు
**మాఱనైయల్లాలెన్ఱు మఱన్దుమ్ "తేవుమ్**
**మఱ్ఱఱియేన్"** ఎను మదురకవియే! నీ మున్
**కూఱియ "కణ్ణినుణ్ శిఱుత్తాम్బు" అదనిల్ పాట్టుక్కు**
**ఉలవు పదిలొన్రు మెనక్కుదవు నీయే**
**(శ్రీదేశికులు - ప్రబంధసారం)**

( తిరుక్కోళూర్ - అనే దివ్యదేశంలో చైత్రమాసంలోని చిత్రానక్షత్రంలో స్వచ్ఛమైన, గొప్ప జ్ఞానంతో ఈలోకానికి వచ్చి అవతరించి, గొప్ప భక్తితో, తిరుక్కురుకూర్‌కు స్వామియైన నమ్మాళ్వార్లకు నిరంతరం అంతరంగకైంకర్యాన్ని చేసి, ఆ నమ్మాళ్వార్లను తప్ప ఎపుడు మరచిపోయికూడా వేఱొక దైవాన్ని నేను తెలియను- అని మధురకవీ! మీరు పూర్వం అనుగ్రహించిన, ''కణ్ణినుణ్'' అని ఆరంభమవుతున్న ప్రబంధంలో ప్రకాశించే 11 పాశురాలను మీరే నాకు అనుగ్రహించాలి.)

ఇట్లు, విన్నవించు
తిరుపతి, భాగవత విధేయుడు
13-6-2014 **ఈ.ఏ. శింగరాచార్యులు**

## కణ్ణినుణ్ శిఱుత్తాम్బు దివ్యప్రబంధవైలక్షణ్యం
### (కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి దివ్యార్థ దీపికా ద్రావిడ వ్యాఖ్యానం ఆధారంగా)

కణ్ణినుణ్ శిఱుత్తామ్బు దివ్యప్రబంధం నాలాయిర దివ్యప్రబంధంలోని **"ముదలాయిరమ్"** అనే మొదటి వేయిలో చివరి ప్రబంధంగా శ్రీమన్నాథమునులచే కూర్పబడింది. తిరువాయ్మొழி అను సంధానం ఆరంభంలో, సమాపనంలో ఈ ప్రబంధాన్ని తప్పక అనుసంధించడం శిష్ట సంప్రదాయం. ఇది, తిరువాయ్మొழிకి శేషమైన ప్రబంధం కనుక, తిరువాయ్మొழிవలె దీనిని కూడా తిరువీథులలో సేవింపరాదని పూర్వాచార్యనియమం.

**"పొయ్కైయార్ పూదత్తార్ పేయార్ పుకழ் మழிశై ఐయనరుళ్ మాఱన్ శేరలర్ కోన్ తుయ్య పట్టనాదన్ అన్బర్ తాళ్తూళి నఱ్పాణన్ నన్‌కలియన్"** అనే ఆழ்వార్లు పదిమందిచే అనుగ్రహింపబడిన నాలాయిర దివ్యప్రబంధం చాలా భాగం లుప్తమై పోయిన కాలంలో, శ్రీమన్నాథమునులనే శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకాచార్యులొకరు ఆழ்వార్ తిరునగరికి వేంచేసి, **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"** - అనే ఈ దివ్యప్రబంధాన్ని దేవగానంతో పన్నెండు వేలసార్లు పాడగా, అపుడు నమ్మాழ்వార్లు వారిపట్ల ప్రపన్నులై, ఆ నాథమునులకు నాలాయిర దివ్యప్రబంధాన్ని ఉపదేశించారు - అని సత్సంప్రదాయాభిజ్ఞులైన పెద్దలు పల్కడంవల్ల ఈ ప్రబంధానికి గల నిస్సమాభ్యధిక వైభవం సువ్యక్తం.

**"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"** అనే ఈ ప్రబంధం ఆరంభం అవుతున్నందున దీనికి అదే తిరునామమైనది. తిరుప్పల్లాణ్డు, అమలనాదిపిరాన్ ప్రబంధాల తిరునామాలు కూడా ఇటువంటివే.

ఆழ்వార్ల వైభవాన్ని కీర్తించే ఈ ప్రబంధం, భగవద్వైభవప్రతిపాదకాలైన ఆழ்వార్ల దివ్యప్రబంధాల మధ్య చేర్చి అనుసంధించడం, దీనినికూడా చేర్చి నాలాయిరమని లెక్కించడం తగునా? అని కొందఱు శంకించవచ్చు. **"వాయ్‌త్త తిరుమన్దిరత్తిన్ మత్తిమమామ్ పదమ్పోల్ శీర్‌త్త మదురకవి శెయ్‌కలైయై, ఆర్‌త్త పుకழ் ఆరియర్‌కళ్ తాజ్గళ్ అరుళిచ్చెయల్ నడువే శేర్‌విత్తార్ తాఱ్పరియమ్ తేర్‌న్దు"** అని శ్రీవరవరమునులు పల్కిన ఉపదేశరత్తినమాలై పాశురాన్ని, **"ఇతుతానుమ్-పయిలుమ్ శుడరొళి"**, **"నెడుమాఱ్కడిమై" తొడక్కమానవఱ్ఱిన్ అర్థత్తై ప్రతిపాదిక్కైయాలే ఇదిన్ అర్థగౌరవత్తై విచారిత్తు, నన్ఱాయిరుప్పదొరు హారత్తై చ్చమైత్తు, అదు ఒళి పెరుమ్బడి, శ్లాఘ్యమాయిరుప్పదొరు నాయక క్కల్లై నిఱమ్ పెఱుమ్బడి అవఱ్ఱిన్ నడువే, ఇత్తై చ్చేర్‌త్తార్‌కళ్. శేర్‌త్త శీర్‌క్కైయిన్ చాతుర్యత్తాలేయిఱే ముత్తుమాలై తొడక్కుమాన ఆభరణాదికళ్ నిఱమ్ పెఱువదు. అదుపోలేయాయ్‌త్తు, ఇదు."** (ఈ ప్రబంధం-తిరువాయ్ మొழிలోని **"పయిలుమ్ శుడరొళి"**, **"నెడుమాఱ్కడిమై"** మొదలైన దశకాలలో తెలుపబడిన చరమపర్వనిష్ఠావైభవాన్ని ప్రతిపాదిస్తున్నందున, దీని అర్థగౌరవాన్ని గమనించి, చక్కగా ఉండే ఒక హారాన్ని నిర్మించి, అది ప్రకాశాన్ని పొందేటట్లుగా శ్లాఘ్యమైన ఒక నాయక రత్నాన్ని ఆహారం నడుమ పొదిగే రీతిలో, దివ్య ప్రబంధాలు ప్రకాశాన్ని పొందే విధంగా, వాటిమధ్యలో దీనిని చేర్చారు. కూర్చే కూర్పులోని చాతుర్యాన్నిబట్టి కదా ముత్యాల మాల మొదలైన ఆభరణాలు శోభను పొందుతాయి. అదేరీతిలోనే ఇది కూడా) అని ఆ పాశుర వ్యాఖ్యానంలో శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ పల్కడం గమనించాలి.

అన్దాది ప్రక్రియలో పాడబడిన ఈ ప్రబంధం - శాబ్దికమైన, ఆర్థికమైన అందాది ప్రక్రియలు రెండిటిలో - శాబ్దికమైన అన్దాది ప్రకారంలోకి చేరుతుంది. అన్దాది అంటే- ముందు పాశురంలో చివర గల అక్షరం, లేక, అచ్చు, లేక, పదం, లేక, పదాంశం- అనే వీటిలో ఏదయినా తరువాత వచ్చేపాశురం ఆరంభంలో ఉండేటట్లు కూర్చబడిన ప్రబంధం. చివరి పాశురం చివరి భాగం మొదటి పాశురంలో ఆరంభంగా ఉంటే, అది **"మండల అన్దాది"** కాగలదు. ఇది, 96 విధాలైన ద్రావిడప్రబంధరీతులలో ఒకటి. **"పదిఱ్ఱన్దాది, నూఱ్ఱన్దాది"** ఇత్యాది ప్రక్రియలలో ఇది పదిఱ్ఱన్దాది ప్రబంధ ప్రక్రియలోకి చేరుతుంది. అన్దాది ప్రబంధం **"వెణ్బా"** ఛందస్సులోగాని, **"కట్టళైక్కలిత్తుఱై"** అనే ఛందస్సులో గాని రచింపబడాలని నియమం. ఇది కలివిరుత్తమనే ఛందస్సులో రచింపబడింది.

కంబమహాకవి, తాము నమ్మాழ்వార్ విషయంగా శడకోపర్ అన్దాది అనే ప్రబంధాన్ని రచించడంలో ఈ కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు మార్గదర్శనం చేసినట్లుగా స్వయంగా పల్కిన ఈ క్రింది పాశురాన్ని, దాని భావాన్ని ఇక్కడ అనుసంధించడం యుక్తం.

**"మన్టే పుకழ் తిరువழுన్దూర్ వళ్ళల్ మాఱనై మున్**
**శొన్టే మదురకవి ప్పెరుమాన్ తెన్‌తమిழ் తొడైయిల్**
**ఒన్టే పదికముఱైత్తనన్ పొన్నడి యుఱ్ఱు నిన్టాన్**
**ఎన్టే పదిక పదిక మదాక ఇశైత్తననే"**

అందఱిచే పొగడబడే **"తిరువழுన్దూర్"** అనే దేశంలో అవతరించిన కంబమహా కవి, పూర్వకాలంలో మధురకవులు నమ్మాழ்వార్లను ఆశ్రయించి, అందమైన ద్రావిడపాశురాల మాలకను రచించి, కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు అనే దశకాన్ని పాడి, ఆ నమ్మాழ்వార్ల శ్రీచరణాలను ఆశ్రయించి ఉజ్జీవించారు - అనే ఈ విషయాన్ని తలచుకొని, ఆ కణ్ణినుణ్ శిఱుత్తామ్బులోని ఒక్కొక్క పాశురాన్ని ఒక్కొక్క దశకంగా పదిరెట్లు చేసి, శఠకోపర్ అన్దాది అనే ప్రబంధాన్ని పాడారు.

కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధం లోని అర్థసంగ్రహాన్ని తెల్పుతూ శ్రీదేశికులు అధికార సంగ్రహంలో ఈ క్రింది పాశురాన్ని అనుగ్రహించారు.

**ఇన్బత్తిల్ ఇఱైఞ్జుదలిల్ ఇశైయుమ్ పేఱ్ఱిల్**
**ఇకழாద పల్లుఱవిల్ ఇరాకమాఱ్ఱిల్**
**తన్ పఱ్ఱిల్ వినై విలక్కిల్ తకవోక్కత్తిల్**
**తత్తువత్తై ఉణర్త్తుదనిల్ తన్మైయాక్కిల్**
**అన్బర్‌క్కే అవతరిక్కుమ్ ఆయన్ నిఱ్క**
**అరుమఱైయన్ తమిழ் శెయ్‌దాన్ తాళే కొణ్డు**
**తున్బఱ్ఱ మదురకవి తోన్టక్కాట్టుమ్**
**తొల్‌వழியే నల్ వழிకళ్ తునివార్‌కట్కే**

1. **(ఇన్బత్తిల్)** - **"అణ్ణిక్కుమ్ అముదూఱుమ్"** అని మొదటి పాశురంలో చెప్పబడి, **"ఇన్బమ్ ఎయ్‌దినేన్"** అని రెండవ పాశురంలో అనువదింపబడిన ఆనంద రూపమైన అనుభవంలో - అని అర్థం.
2. **(ఇఱైఞ్జుదలిల్)** - **"మేవినేన్ అవన్ పొన్నడి"** అని చెప్పబడిన చరణ సమాశ్రయణంలో - అని అర్థం.



3. **(ఇశైయుమ్‌పేఱ్ఱిల్)**- అభ్యుపగమమైన (అంగీకరించిన) పురుషార్థంలో అని అర్థం. **"తిరితన్దాకిలుమ్"** అనే మూడవ పాశురంలో - "భగవద్విషయాన్ని ఆழ்వార్లు అభిమానించిన విషయమనే కారణంచేత దానిని అంగీకరించానే తప్ప, ఆழ்వార్లు తప్ప భగవద్విషయం అనేది నాకు స్వతః అంగీకార్యం కాదు" - అనే పర్యంతం మధురకవుల హృదయ తాత్పర్యం కనుక, ఆழ்వార్లే తమకు నిరుపాధికంగా అంగీకరించదగిన పురుషార్థమని ధ్వనింజేసిన అర్థాన్ని ఈ ప్రయోగం సూచిస్తున్నది.
4. **(ఇకழாద పల్లుఱవిల్)** - ఏనాడూ నశించని బంధుత్వంలో - అని అర్థం. **"అన్నైయాయ్ అత్తనాయ్"** అనే సూక్తిని ఇది సంగ్రహిస్తున్నది.
5. **(ఇరాకమ్ మాఱ్ఱిల్)**-అనుచితవిషయాలపట్ల ఉండే ఆశను పోగొట్టడం - అని అర్థం. **"మున్నెలామ్-నమ్బినేన్, ఇన్ఱు శదిర్‌త్తేన్"** అనే సూక్తులలో దీనికి దృష్టి.
6. **(తన్ పఱ్ఱిల్)** - తానే తన సంబంధాన్ని కల్గిస్తే - అని అర్థం. **"ఇన్ఱు తొట్టుమ్..... తన్ పుకழ்ేత్త అరుళినాన్"** అనే ప్రయోగంలో దృష్టి.
7. **(వినై మిక్కిల్)**- పాపనివారణంలో - అని అర్థం. **"పణ్డై వల్‌వినై పాఱ్ఱి అరుళినాన్"** అనే సూక్తిలో దీనికి దృష్టి.
8. **(తకవు వుక్కత్తిల్)** - కృపయొక్క ఉత్కర్షలో - అని అర్థం. **"అరుళ్ కణ్డీర్ ఇవ్వులకినిల్ మిక్కదే"** అనే సూక్తిలో దీనికి దృష్టి.
9. **(తత్తువత్తై ఉణర్త్తుదనిల్)** - తత్త్వాన్ని తెలుపడంలో - అని అర్థం. **"వేదత్తి నుట్పొరుళ్ నిఱ్క ప్పాడి"** అనే సూక్తిలో దీనికి దృష్టి.
10. **(తన్మై ఆక్కిల్)** - స్వరూపవికాసాన్ని కల్గించడంలో - అని అర్థం. **"శెయల్ నన్టాక త్తిరుత్తి ప్పణికొళ్‌నాన్"** అనే సూక్తిలో దృష్టి.

పై పది ప్రయోగాలు విషయసప్తమీ ప్రయోగాలు. (వీటి విషయంలో - అని ఈ సప్తమీ విభక్తికి అర్థం. వీటికి **"తోన్ఱ క్కాట్టుమ్"** అనే పదంతో అన్వయం. ఈ అర్థాలను పురస్కరించుకొని మధురకవులు పలికారు - అని భావం.

**(అన్బర్క్కు-ఇత్యాది)** ఆశ్రితులకోసమే అవతరించేవాడైన భగవానుడు ఉన్నా, అతనిని అనాదరించి, వేదాలను ద్రావిడభాషలో అనుగ్రహించిన నమ్మాళ్వార్ల శ్రీచరణాలనే ఆశ్రయించి, దుఃఖం తీరిన మధురకవులు సుస్పష్టంగా తెల్పిన మార్గమే ముముక్షువులకు ఉపాదేయమైన మార్గం. సర్వఫలప్రదుడైన సర్వేశ్వరుని సంబంధం ఉన్నా, సదాచార్య సమాశ్రయణం లేనివారికి మోక్షం లభించదు - అని ఘోషించే మధుర కవులఉక్తి - అనుష్ఠానాలే ఆశ్రయణీయమని తాత్పర్యం.

**తిరువాయ్మొళ్ళి - కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రయోగ సామ్యాలు**

నమ్మాళ్వార్ల తిరువాయ్మొళ్ళి ప్రబంధం భగవద్వైభవ ప్రతిపాదకమైనందున ప్రధానంగా అది ప్రథమపర్వనిష్ఠాత్మకం. మధురకవి ఆళ్వార్ల కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధంలో ఆచార్య వైభవం ప్రతిపాదింపబడినందున అది చరమపర్వనిష్ఠాత్మకం. నమ్మాళ్వార్లు భగవానుని విషయంలో వ్యక్తం చేసిన భావాలనే మధురకవులు తమ ఆచార్యులైన నమ్మాళ్వార్ల విషయంలో వ్యక్తం చేయడం గమనించదగిన అంశం. ఈ సూక్తి సామ్యాలు పూర్వాచార్యవ్యాఖ్యానాలలో ఆయా సందర్భాలలో ప్రస్తావించ బడ్డాయి. తమ్బిరాన్పడి వ్యాఖ్య అవతారికలో తెలుపబడిన విశేషాలలో కొన్ని ఇక్కడ సంగ్రహంగా తెలుపబడుతున్నాయి.

1. **అణ్ణిక్కుమ్ అముదూఱుమ్** - (కణ్ణినుణ్-1)
   **అప్పొళ్ళుదైక్క ప్పొళ్ళుదు ఎన్నారావముదమ్** - (తిరువాయ్-2-5-4).
2. **నావినాల్ నవిఱ్ఱు ఇన్బమెయ్దినేన్** - (కణ్ణినుణ్-2)
   **మలక్కు నావుడైయేఱ్కు మాఱుళదో** - (తిరువాయ్-6-4-9).
3. **మేవినేన్ అవన్పొన్నడి** - (కణ్ణినుణ్-2)
   **అడిక్కీళ్ అమర్న్దు పుకున్దేన్** - (తిరువాయ్ 6-10-10
4. **"తేవు మఱ్ఱఱియేన్"** - (కణ్ణినుణ్-2)
   **కణ్ణనల్లాల్ దెయ్వమిల్లై** - (తిరువాయ్-5-2-7)
5. **పాడి త్తిరివనే** - (కణ్ణినుణ్-2)
   **పాడి ఇళప్పిలమ్** - (తిరువాయ్-1-7-10)



6. **నమ్బిక్కు ఆళ్ ఉరియనాయ్** - (కణ్ణినుణ్-3)
   **ఉరియ తొణ్డర్ తొణ్డర్ తొణ్డన్ శడకోపన్** - (తిరువాయ్-6-9-11)
7. **తిరితన్దాకిలుమ్** - (కణ్ణినుణ్-3)
   **ఇజ్ఞే తిరుత్తేఱ్కు** - (తిరువాయ్-8-10-4)
8. **అడియేన్** - (కణ్ణినుణ్-3)
   **అడియేన్** - (తిరువాయ్-6-1-3)
9. **అన్నైయాయ్ అత్తనాయ్** - (కణ్ణినుణ్-4)
   **తాయాయ్ తన్దైయాయ్** - (తిరువాయ్-7-8-1)
10. **ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్** - (కణ్ణినుణ్-4)
    **ఆళ్కిన్హాన్ ఆళ్ళియాన్** - (తిరువాయ్-10-4-3)
11. **తక్క శీర్ చ్చడకోపన్** - (కణ్ణినుణ్-9)
    **కడియనాయ్ క్కఞ్జనై క్కొన్ఱ** - (తిరువాయ్-9-6-11)
12. **నమ్బినేన్ పిఱర్ నన్ పొరుళ్తన్నైయుమ్** - (కణ్ణినుణ్-5)
    **యానే ఎన్ఱనదే** - (తిరువాయ్-2-9-9).
13. **ఇన్ఱు తొట్టుమ్ ఎళ్ళుమైయుమ్ ఎమ్బిరాన్** - (కణ్ణినుణ్-6)
    **ఎమర్ కీళ్ళ్మేల్ ఎళ్ళుపిఱప్పుమ్** - (తిరువాయ్-2-8-1)
14. **నిన్ఱు తన్పుకళ్ళ్ ఏత్త** - (కణ్ణినుణ్-6)
    **ఎన్నాల్ తన్నై ఇన్దమిళ్ళ్ పాడియ ఈశన్** - (తిరువాయ్-7-9-1)
15. **ఎన్ఱు మెన్నై ఇకళ్ళ్ విలన్** - (కణ్ణినుణ్-6)
    **ఒట్టుమో ఇని ఎన్నై ఇకళ్ళ్విక్క** - (తిరువాయ్.1-7-7)
16. **శడకోపన్ అరుళైయే** - (కణ్ణినుణ్-7)
    **మయర్వఱ మదినలమ్ అరుళినన్** - (తిరువాయ్-1-1-1)
17. **అరుళ్ కణ్డీర్ ఇవ్వులకినిల్** - (కణ్ణినుణ్-8)
    **అరుళ్ ఉడైయవన్** - (తిరువాయ్-2-10-11)

18. **నిఙ్ఙ ప్పాడి ఎన్ నెఞ్జళ్ నిఱుత్తినాన్** - (కణ్ణినుణ్-9)
**పేరేన్ ఎన్ఱు ఎన్ నెఞ్జు నిఱైయ** - (తిరువాయ్-10-8-2)

19. **ఆట్పుక్క కాదల్ అడిమైప్పయన్** - (కణ్ణినుణ్-9)
**వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్** - (తిరువాయ్-3-3-1)

20. **ఆట్పుక్క కాదల్** - (కణ్ణినుణ్-9)
**ఆరాద కాదల్** - (తిరువాయ్ - 2-1-11)

21. **పయనన్ఱాకిలుమ్ - పణికొళ్వాన్** - (కణ్ణినుణ్-10)
**పొరుళల్లాద ఎన్నై...... అడిమై కొణ్డాయ్** - (తిరువాయ్-5-7-3)

22. **తెన్కురుకూర్ నమ్బిక్కు అన్బనాయ్** - (కణ్ణినుణ్-11)
**మలర్ప్పావైక్కు అన్బాకియ ఎన్ అన్బే యో** - (తిరువాయ్-10-10-7)

23. **మధురకవి** - (కణ్ణినుణ్-11)
**పడైత్తాన్ కవి** - (తిరువాయ్-3-9-10)

24. **నమ్బువార్ పది వైకున్దమ్** - (కణ్ణినుణ్-11)
**వైకున్ద మాకుమ్ తమ్మూరెల్లామ్** - (తిరువాయ్-5-3-11)





# కణ్ణినుణ్ శిఱుత్తామ్బు సూక్తులతో కొన్ని దివ్యసూరిసూక్తి సామ్యాలు

1. **నమ్బి విట్టుశిత్తన్ - (నాచ్చియార్ తిరు-13-10)**
**తెన్కురుకూర్నమ్బి - (కణ్ణినుణ్ శిఱు-1)**

ఉపదేశరత్తినమాలైప్రబంధంలో శ్రీవరవరమునులు **"ఆழ்వార్ తిరుమకళార్ అణ్డాళ్ మదుర కవియாழ్వార్ ఎతిరాశరామ్ ఇవర్కళ్"** అని అంటూ ఆణ్డాళ్, మధుర కవులు, శ్రీరామానుజులు అనే ముగ్గురు చరమపర్వనిష్ఠులైనందున, వారిని ఒక కోవలోనికి చేర్చారు. ఈ విషయాన్ని శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ తమ వ్యాఖ్యలో వ్యక్తం చేశారు కూడా. గోదాదేవి తమకు ఆచార్యులైన పెరియాழ్వార్లను **"నమ్బి"** అని నిర్దేశించారు. ఈ రీతిలోనే మధురకవులు కూడా తమ ఆచార్యులైన నమ్మాழ్వార్లను **"తెన్కురుకూర్ నమ్బి"** అని నిర్దేశించారు. **"నమ్బి"** - అంటే - గుణపూర్ణులని అర్థం. **"నమ్బియై త్తెన్కుఱుఙ్గుడి నిన్ఱ"** అని అంటూ భగవానుని **"నమ్బి"** అని కీర్తించారు. భగవద్విషయంలోని గుణపూర్తివంటిది కాదు - ఆచార్యవిషయంలోని గుణపూర్తి - అని మన పూర్వాచార్యులు అంటారు. భగవానుని ఆశ్రయిస్తే ఆచార్యుల వరకు రావలసి ఉన్నది. ఆచార్యులను ఆశ్రయిస్తే ఇక దానికి మించి పోవలసిన చోటు - గంతవ్యభూమి - ఇంకొకటి లేదు.

2) **నిలాయ శీర్ వేదవాణర్ - (తిరుచ్చంద విరుత్తమ్-9)**
**మిక్క వేదియర్ - (కణ్ణినుణ్ - 9)**

**(నిలాయ శీర్)** - స్థిరంగా ఉండే గుణాలను కలవారు - అని అర్థం. అమానిత్వం, అదంభిత్వం మొదలైన ఆత్మగుణాలతోను, ఉపాసనకు అంగాలైన శమదమాది గుణాలతోను సంపన్నులై ఉండేవారు - అని భావం. లేక, **"నిలాయ శీర్ వేదమ్"** అని **"నిలాయ"** అనేపదాన్ని వేదానికి విశేషణంగా చేసి, దీనిద్వారా నిత్యత్వ - అపౌరుషేయత్వ - నిర్దోషత్వాలతో వేదానికి గల కారణదోషబాధకప్రత్యయాది దోషరహిత కల్యాణగుణాలు తెలుపబడుతున్నాయని చెప్పవచ్చు.

**"మిక్కవేదియర్"** అనే కణ్ణినుణ్ శిఱుత్తామ్బి ప్రయోగం కూడా ఇటువంటిదే. **"మిక్కార్ వేదవిమలర్" "శుడర్ మికు శురుది"** అనే నమ్మాழ్వార్ల సూక్తిని ఆలకించిన

మధురకవులు ఈవిధంగా పల్కుతున్నారని వ్యాఖ్యాతల రసోక్తి, **"మిక్కార్ వేద విమలర్"** ఎన్ఱు **ఆழ్వార్** పాడే కేట్కైయాలే **"మిక్కవేదియర్"** ఎన్గిఱార్. **అన్ఱిక్కే, "మిక్కవేదియర్"** ఎన్ఱు **"శుడర్మికుశురుది"** ఎన్గిఱపడియే ప్రత్యక్షాదికళిల్ అధికమాస **వేదప్రమాణ నిష్ఠర్-ఎన్ఱుమామ్"** అని నాయనార్ వ్యాఖ్య. భగవత్ప్రాప్తియే పురుషార్థ మని, శరణాగతియే పరమసాధనమనే వేదాంతవిజ్ఞానంలో సునిశ్చితులై ఉండేవారు- అని అర్థం. లేక, **"మిక్కవేదియర్ వేదమ్"** అని "మిక్క" అనే పదాన్ని వేదానికిని విశేషణంగా చేసి, **"శుడర్ మికు శురుది"** అనే రీతిలో ప్రత్యక్షాదిప్రమాణాల కంటే అధికమైన వేదప్రమాణమనే అర్థం చెప్పవచ్చు. ఇక్కడ అరుంబద వివరణంలో **"ఇప్పడి విశేషణ మిట్టు చ్చొల్లవేణ్డుమో? ఎన్న, ఆழ్వార్ విశేషణమిట్టాప్పోలే అరుళిచ్చెయ్ కిఱార్ - ఎన్గిఱార్"** అని తెలుపబడడం గమనించవచ్చు. ఇటువంటి అన్వయమే **"నలజ్కొళ్ నాన్మఱైవాణర్కళ్"** (తిరువాయ్-10-1-2) అనే నమ్మాழ్వార్ల సూక్తికి, **"నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్"** (కణ్ణినుణ్-4) అనే మధురకవుల సూక్తికి చేయబడడం గమనార్హం.

3) **కావలిల్ పులనై వైత్తు - (తిరుమాలై-1)**
**ఇచ్చువై . . . . . - (తిరుమాలై-2)**
**నమ్బి ఎన్ఱక్కాల్ అణ్ణిక్కుమ్ - (కణ్ణినుణ్-1)**
**పణ్డై వల్ వినై పాఱ్ఱి అరుళినాన్ - (కణ్ణినుణ్-7)**

భగవన్నామాలు పావనాలు - అనే విషయాన్ని **"కావలిల్"** అనే పాశురం ద్వారా, పరమ భోగ్యాలు అనే విషయాన్ని **"ఇచ్చువై"** అనే సూక్తి ద్వారా తొణ్డరడిప్పొడి యాழ్వార్ తెలిపారు. ఇది ప్రథమపర్వ విషయం.

మధురకవులు, తమ ఆచార్యులైన నమ్మాழ్వార్లు పరమభోగ్యులనే విషయాన్ని **"నమ్బి ఎన్ఱక్కాల్ అణ్ణిక్కుమ్"** అనే సూక్తిద్వారా, పరమపావనులు అనే విషయాన్ని **"పణ్డైవల్ వినై పాఱ్ఱి అరుళినాన్"** అనే సూక్తి ద్వారా తెలిపారు. ఇది చరమపర్వ విషయం.

4) **శదిర్త్తేన్ ఇన్ఱే - (కణ్ణినుణ్-5)**
**వరవాఱు ఒన్ఱిల్లై, ఆల్! వాழ్వు ఇనిదు, ఆల్! (పెరియ తిరువన్దాది-56)**

ఈ రెండు సూక్తుల మధ్యగల భావసామ్యం నాయనార్ అనుగ్రహించిన రస ఘనమైన వ్యాఖ్యానంద్వారా గ్రహించి ఆనందించవచ్చు.



**"ఇన్ఱే శదిర్త్తేన్ - అన్ఱు అప్పడి యానేన్, ఇన్ఱు ఇప్పడి యానేన్. అన్ఱు మడవారై నమ్బినేన్; ఇన్ఱు తిరుక్కురుకూర్ నమ్బిక్కు అన్పనానేన్. నడువిల్ ఇదుక్కు ఎన్కైయిల్ కిడప్పదొరు హేతువై క్కణ్డి లేన్." ఇదుక్కు - "వరవాఱు ఒన్ఱి"ల్లైక్కే యిరుక్క "వాழ్వు ఇనిదామ్పడి విழున్దదు - ఎన్ఱు విస్మితరాకిఱార్".** (ఈనాడు చాతుర్యాన్ని కలిగినవాడ నయ్యాను. ఆనాడు ఆవిధంగా ఉన్నాను. ఈనాడు ఈవిధంగా అయినాను. ఆనాడు కాంతలను విశ్వసించాను. ఈనాడు తిరుక్కురుక్కూర్‌లోని గుణపూర్ణులైన నమ్మాழ్వార్లకు భక్తుడనయ్యాను. మధ్యలో దీనికి (నాకు లభించిన ఈ గొప్ప ఫలానికి) నా చేతిలో ఉండే హేతువును దేనినీ నేను చూడలేదు. కారణమేమీ లేకపోయినా, నాకు ఉజ్జీవనం భోగ్యంగా ప్రాప్తించింది! ఆహా! - అని ఆశ్చర్య పడుతున్నారు)

పై రెండు సూక్తులు పరగతస్వీకారానికి ప్రమాణాలే అయినా, నమ్మాழ్వార్ల సూక్తి ప్రథమపర్వానికి చెందినది కాగా, మధురకవులసూక్తి చరమ పర్వానికి చెందినదై ఉండడం గమనించాలి.

5) **ఆయిరమ్ ఇన్ తమిழ్ - (కణ్ణినుణ్-8)**
**కోవై ఇన్ తమిழ్ - పెరియతిరు - (9-10-9)**

తిరుమంగైమన్నన్ తమ పెరియతిరుమొழి ప్రబంధాన్ని **"ఇన్తమిழ్"** అని, మధురకవులు తమ ఆచార్యుల ప్రబంధాన్ని **"ఇన్తమిழ్"** అని అంటూ వాటి భోగ్యతను తెలిపారు. అంగి మధురమైనపుడు, అంగం మధురంగా ఉండడంలో ఏమి ఆశ్చర్యం! అంతేకాదు, తిరుమంగైమన్నాన్ సూక్తి ప్రథమ పర్వాత్మకం, మధుర కవుల సూక్తి చరమ పర్వాత్మకం.

6) **ఇవ్వులకినిల్ మిక్కదే - (కణ్ణినుణ్-8)**
**దివత్తిలుమ్ పశునిరై మెయ్ప్పు ఉవత్తి - (తిరువాయ్-10-3-10)**

**"ఇవ్వులకినిల్"** అనే సూక్తిలోను **"తివత్తిలుమ్"** అనే సూక్తిలో గల **"ఇల్"** అనే విభక్తి ప్రత్యయాన్ని సప్తమీవిభక్త్యర్థంలో, పంచమీ విభక్త్యర్థంలో - రెండు రీతులలో అన్వయించి అర్థాలు తెలుపబడడం గమనించదగిన విషయం. దీని వివరం వ్యాఖ్యాన గమ్యం.

### 7) **తిరువురు క్కాణ్బన్ నాన్ - (కణ్ణినుణ్-3)**

**కోవిన్దనై కైతొళ్ళుదన్టి అవనుఱైయుమ్ తిరువాఱన్ విళైతొళ్ళ-(తిరువాయ్-7-10-3)**

నమ్మాళార్ల విషయంలో అభినివేశాన్ని పొందిన మధురకవులు వారిని విడచి, **"తిరువురు క్కాణ్బన్ నాన్"**-అని అంటూ ఆ నమ్మాళ్వార్లు కొలిచే దైవమైన శ్రీకృష్ణుని దర్శించారు.

భగవానుడు గరుడుని అధిరోహించి వేంచేసే సన్నివేశాన్ని దర్శించినా, ఆ స్వామిని విడచిపెట్టి, అతడు నివసించే తిరువాఱన్ విళై అనే దివ్యదేశాన్ని ఎపుడు సేవించ గలము! - అనే అభినివేశాన్ని నమ్మాళ్వార్లు ప్రదర్శించారు.

ఈ విధంగా ఈ శిష్యాచార్యులిద్దఱు ఒక్కొక్క రీతిలో తమకు ప్రాప్యమైన విషయాన్ని వీడి, వేఱొక విషయంలో అభినివేశాన్ని పొందిన సంగతిని ఈ రెండు సూక్తులు తెల్పుతున్నాయి. ప్రాప్య విషయాన్ని వీడి వేఱొక విషయంలో మధురకవులు ఆసక్తిని పొందవచ్చునా? అంటే, భగవానుడు, ఆళ్వార్లు అభిమానించిన విషయం కనుక, ఆ భగవానునిపట్ల మధురకవులు అభినివేశాన్ని పొందడం ఆళ్వార్లు ప్రీతికరం. అంతేకాక, **"పుంసాం దృష్టిచిత్తాపహారి"** అయిన భగవత్సౌందర్యం ఎటువంటి వారినైనా ఆకర్షిస్తుంది - అనే రెండు హేతువులు వ్యాఖ్యానంలో సమాధానంగా తెలుపబడ్డాయి. నమ్మాళ్వార్ల సూక్తిలో తోచే సందేహానికికూడా ఈ రెండు హేతువులే సమాధానం. **"తిరువాఱన్ విళై"** క్షేత్రం భగవానుడు అభిమానించిన చోటు కనుక, ఆ దివ్యదేశం పట్ల ఆళ్వార్లు అభిమానాన్ని చూపడం భగవత్ప్రీతికరం. అధేవిధంగా, ఆ క్షేత్రవైలక్షణ్యం ఎటువంటివారినైనా వశీకరించుకొన గల్గినది. ఇక్కడ విశేషమేమంటే - మధురకవులు చరమపర్వానుభవంనుండి ప్రథమ పర్వానుభవంలోకి రాగా, నమ్మాళ్వార్లు ప్రథమపర్వానుభవంనుండి చరమ పర్వానుభవంలోకి రావడం విశేషం. ఈ అనుభవాలు రెండు ఒకదానిని విడచి ఇంకొకటి ఉండవు కదా.

ఇటువంటి ఎన్నో సహృదయహృదయరంజకాలైన భావసామ్యరత్నాలు ఆచార్య సూక్తిసాగరంలో లోతుగా గమనించినపుడు దర్శనమిస్తాయి. విస్తృతిభీతివల్ల ఏతావన్మాత్రంతో విరమింపబడుతున్నది.



## కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారి

## దివ్యార్థదీపికా వ్యాఖ్యలోని కణ్ణినుణ్ శిఱుత్తాంబు అవతారిక

సత్త్వగుణాత్మకమైన మార్గంలో మాత్రమే వర్తించకుండా, త్రిగుణాలకు వశులై వర్తించిన ఋషులకంటే ఆళ్వార్లు పరమ విలక్షణులు. ఏవిధంగా? అంటే,

ఋషులు, తాము అనుష్ఠించిన తపోరూపమైన ధర్మంయొక్క శక్తివల్ల పొందిన జ్ఞానంతో జ్ఞాతవ్యార్థాలను గ్రహించి, ఆనందించి, ఆ జ్ఞానానందాలను శబ్దరూపంగా ఆవిష్కరించారు. ఆళ్వార్లు, దానికి మాఱుగా, భగవానునివల్ల **"మయర్వఱ మది నలమ్"**ను పొంది, జ్ఞానవరీపాకరూపమైన భక్తితో విరహవ్యసనాన్ని అనుభవించి, ఆ జ్ఞానం అంతా పూర్తిగా కలత చెంది, తాము ఆశపడిన రీతిలో భగవానుని అనుభవించ లేనందున శోకాన్ని పొంది, **"ఎత్తిఱమ్! ఉరలినోడు ఇణైన్దిరున్దు ఏఙ్గియ ఎళివే!"** అని, **"పిఱన్ద వాఱుమ్"** అని, **"కణ్గళ్ శివన్దు"** అని ఒక్కొక్క దశకంలో ఆఱు ఆఱు మాసాల తరబడి మోహించి, ఒక మాటను పలకాలంటే ఒక పెద్ద కొండను ఎత్తేటట్లుగా శ్రమపడి, భగవదనుభవాన్ని సాక్షాత్తు పొందలేని అశక్తిచేత, ఆ భగవానుని ప్రకారాలను పలు రీతులలో తలచి పల్కి, వెక్కి వెక్కి ఏడ్చి, మనస్సులో ద్రవించి, తదనుభవపరీవాహాలైన దివ్యప్రబంధాలను అనుగ్రహించారు.

ఇంతేకాక, వేదాన్ని **"ఓది ఉణర్న్ద"** ఋషులు. అష్టాంగయోగాలను అభ్యసించి, తన్మార్గంలో పరమాత్మను ఇదమిత్థంగా గ్రహించలేక - ఈ విధంగా స్వప్రయత్నంతో తాము పొందిన సాక్షాత్కారంలో వైశద్యం లేనందువల్ల ఈనాటివరకు సంసారభోగ విషయాలైన ఆశాపాశాలతో బంధింపబడ్డారు. తనను సేవించడానికి సాధనంగా భగవానుడు అనుగ్రహించిన దివ్యనేత్రంతో బ్రహ్మరుద్రాదులకు సైతం దుర్లభుడైన అతనిని విశదతమంగా సాక్షాత్కరించుకొనగల్గిన ఆళ్వార్లకు ఆస్వామి కృపవల్ల బలిష్ఠమైన ఇహలోక బంధాలన్నీ సవాసనగా విడచి తొలగిపోయాయి.

ఇంతేకాక, ఋషులకు ఫల-మూల-పత్ర-వాయు - తోయాలు ధారకాలు, పోషకాలు. **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** అని ఉండేవారు, ఆళ్వార్లు.

ఇంతేకాక, భగవానుని విశ్లేషించిన దుఃఖంచేత కన్నీరు మున్నీరై, సముద్రంతో, పర్వతాలతో, ఆకాశంతో తేడా లేకుండా అంతటా భగవానుని అన్వేషించి, మనస్సులో

క్లేశపడి **"తిరుమాలే!"** అని ఎలుగెత్తి పిలచి, **"ఎజ్జే కాణ్గేన్"** అని భగవానుని విషయంలో ఆ*ళ్వా*ర్లు పడే పాట్లను 'ఋషులు' తమ సంతానాన్ని కోల్పోయినపుడు అనుభవించారు. (వశిష్ఠుడు పుత్రవిశ్లేషక్లేశంవల్ల మరణాన్ని కోరి, పర్వతం పైకి ఎక్కి కిందకు దూకడం, గొంతుకు రాతిని కట్టుకొని సముద్రంలోకి పడడం, వేద వ్యాస భగవానుడు పుత్రవిరహాన్ని సహించలేక "పుత్రా!" అని నోరు తెఱచి ఆక్రందించి, పుత్రుని చూడలేనందువల్ల అలమటించి పరిభ్రమించడం - ఇత్యాదులను ఋషుల చరిత్రలలో గమనించవచ్చు).

ఇంతేకాక, భగవానుని పొందడమే ప్రాప్యమని, కర్మ-జ్ఞానాదులే ఆ ప్రాప్యానికి సాధనాలని, ఇంద్రాది దేవతలకు అంతర్యామియైన భగవానుడే ఉద్దేశ్యమైనందున, ఇంద్రాది దేవతలు అనువర్తనీయులని ఋషులు పలికారు. ఆ రీతులో కాకుండా, కైంకర్యమే పరమపురుషార్థమని, **"నాకజై మిశై నమ్బిరాన్ శరణే శరణ్"** అని, దేవతాంతరాలు అనువర్తనీయులు కాదని ఆ*ళ్వా*ర్లు నిశ్చయించి పలికారు.

ఈ రీతులలో ఋషులకంటే ఎంతో వైలక్షణ్యాన్ని కల్గిన ఆ*ళ్వా*ర్లు అందఱిలోను పరమవిలక్షణులు - మధురకవి ఆ*ళ్వా*ర్లు. ఏవిధంగా? అంటే - భగవానునకు శేషభూతులై ఉండడం కంటే, భాగవతులకు శేషమై ఉండడమే పరమపురుషార్థం- అనే సారమైన రహస్యార్థాన్ని చక్కగా గ్రహించి, ఆ అర్థంలో స్థిరంగా నిలచినవారు కనుక.

**"అవనడియారడియే కూడుమిదు వల్లాల్ విడుమాఱెన్బదెన్?"** అని, **"ఎమ్బెరుమాన్ తాళ్ తొ*ழு*వార్ కాణ్మిన్ ఎన్తలైమేలారే"** అని, **"అళియన్ ఎన్ఱరుళి ఉన్ అడియార్క్కు ఆట్పడుత్తాయ్"** అని, **"అడియార్క్కెన్నై ఆట్పడుత్త విమలన్"** అని అంటూ పలు పాశురాలతో మిగిలిన ఆ*ళ్వా*ర్లు భగవచ్ఛేషత్వంతో కలిపి అనుసంధించిన భాగవతశేషత్వాన్ని ఈ ఆ*ళ్వా*ర్లు నిష్కృష్టవేషంలో గ్రహించి, ఆచార్యచరణారవిందం తప్ప వేఱు దేనినీ తెలియకుండా తదేకనిష్ఠులై ఉండడం అనేది వీరికి అనన్యసాధారణమైన అతిశయం.

ముముక్షువునకు ఆదరించదగిన వ్యక్తులు నల్గురు. వారు భగవానుడు, లక్ష్మీదేవి, ఆచార్యుడు, శ్రీవైష్ణవులు (భగవద్భక్తులు). వీరి నల్గురిలో, భగవానుడు- అసత్కల్పుడై ఉండే జీవునకు కరణకళేబరాలను తన కృపతో అనుగ్రహించి, అతనిని సంసార సాగరం దరిచేర్చే దేవుడైనందున ఆదరించదగినవాడు. లక్ష్మీదేవి - మాతృత్వ



సంబంధంవల్ల జీవుని పట్ల నిరుపాధికవాత్సల్యాన్ని కల్గినది కనుక, ఇతడు (జీవుడు) తన దోషాలను గమనించి భయపడి, భగవానుని సమీపించడానికి జంకేటపుడు పురుషకారంచేసి, స్వామి వద్దకు అతడు చేరేటట్లు చేస్తుంది, కనుక ఆదరించదగినది. ఆచార్యుడు - జీవునకు భగవద్విషయాన్ని గూర్చి, లక్ష్మీదేవివైభవాన్నిగూర్చి ఉపదేశించేవాడైనందున, ఇతని దోషాలను చూచినప్పటికీ విడువనివాడైనందున, తాను అనుష్ఠించి చూపి ఇతనిచే అనుష్ఠింప జేసేవాడైనందున, ఇతని దోషాలను చూచినా విడచిపెట్టనివాడైనందున, తన కార్యాన్ని మఱచి అయినా ఇతని హితాన్నే చేసేవాడైనందున, ఆదరించదగినవాడు. శ్రీవైష్ణవులు-ఇతనికి (జీవునకు) ముందుగా భగవానుని పట్ల రుచిని కల్గించేవారైనందున, ఆచార్యులుపదేశించిన జ్ఞానానికి అభివృద్ధిని కల్గించేవారై భగవదనుభవంలో సహకారులు అయినందున, ఆచార్యుల పట్ల భయభక్తులను కల్గించేవారైనందున, ప్రకృతిపారవశ్యంచేత ఇతనికి సంభవించే దోషాలను తీర్చి, సంస్కరించేవారైనందున ఆదరించదగినవారు. ఈ విధంగా ఈ నల్గురు ఆదరణీయులనే విషయాన్ని **"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ"** అని ఉపనిషత్తు తెల్పింది. ఇక్కడ అతిథిశబ్దం శ్రీవైష్ణవ వాచకమా? అని అంటే, అవును. అతిథులంటే-తాము పూర్వం ఉన్న స్థితిని కోల్పోయి, ఇతరుల ఇంటికి వచ్చేవారు. శ్రీవైష్ణవులు కూడా తమ పూర్వస్థితిలోని ప్రకృతి ప్రాకృతాలను విడచి, భగవానుని చరణాలలో ఆశ్రయించేవారైనందున అతిథి శబ్దం శ్రీవైష్ణవవాచకం కావడంలో లోటు లేదు. ఇక, ఈ నల్గురిలో మిక్కిలి ఆదరించదగినవారెవరు? అని అంటే? శ్రీవైష్ణవుల వైభవజ్ఞానం, భగవానునియొక్క, లక్ష్మియొక్క వైభవజ్ఞానం ఇతనికి కల్గడం ఆచార్యుని అంగీకారం తరువాతనే కనుక, విశేషించి ఆదరణీయుడు ఆచార్యుడే.

అందువల్ల ఈ మధురకవి ఆ*ళ్వా*ర్లు ఆచార్యవైభవాన్ని చక్కగా తెలిసినవారైనందున, ఆ*ళ్వా*ర్ల శ్రీచరణాలలో చిరకాలం కైంకర్యాన్ని చేసి, వారి అనుగ్రహానికి లక్ష్యభూతులైనందున, వారు చేసిన ఉపకారానికి బదులు ఉన్నదని భావించనివారైనందున, వారిని నోరార పొగడి, తమలో ఇముడని భక్తిని బయటకు వ్యక్తం చేయవలసి ఉన్నందున, ఈ కణ్ణినుణ్ శిఱుత్తాముృద్వారా తమ ఆచార్యులైన ఆ*ళ్వా*ర్ల వైభవాన్ని పల్కుతున్నారు. భగవానుడు, ఆరాధించడానికి దుర్లభుడైనా, ఆచార్యుడు ఆదరించడానికి సులభుడై ఉంటాడు. ఈశ్వరుని ఆరాధించాలని ప్రయత్నించిన ఆ*ళ్వా*ర్లకు తిరువిరుత్తమ్ మొదలైన నాల్గు దివ్యప్రబంధాలు ఆవశ్యకాలయ్యాయి.

ఆచార్యుని ఆరాధించడానికి ప్రయత్నించిన శ్రీమధురకవులకు కేవలం ఈ పది పాశురాలే పర్యాప్తమైనవి.

ఈ మధురకవుల అధ్యవసాయానికి పురాణపురుషులలో ఎవరైనా సాటి చెప్ప గలిగేవారున్నారా? అంటే, శ్రీరామాయణ పురుషులు నల్గురిలో ఒకరైన శత్రుఘ్నాళ్వాన్‌ను సాటిగా పల్కడం యుక్తం. వేదోపబృంహణంగా అవతరించిన శ్రీరామాయణంలోని రామ-లక్ష్మణ-భరత-శత్రుఘ్నులనే రామాయణ పురుషులు నల్గురు నాల్గు అర్థాలను అనుష్ఠించి చూపారు. పెద్దలు చెప్పినదానిని చిన్నవారు చేయాలి" అనే సామాన్య ధర్మక్రమాన్ని పితృవచనపరి పాలనాది రూపంలో శ్రీరాముడు అనుష్ఠించి చూపించాడు. శేషభూతుడు శేషివిషయంలో కైంకర్యాన్ని చేసి స్వరూప లాభాన్ని పొందాలి - అనే విశేషధర్మాన్ని లక్ష్మణుడు అనుష్ఠించిచూపాడు. భరతాళ్వాన్ కూడా ఈ శేష-శేషి క్రమాన్నే పరిపాలించినా, వీరిమధ్య ఒక వైలక్షణ్యమున్నది. లక్ష్మణుడు నిర్బంధించి కైంకర్యం చేశాడు. భరతుడు ఆవిధంగా కాకుండా "శేషి మెచ్చిన సేవయే శేష భూతునకు ఆదరణీయం" అనే ధర్మాన్ని అనుష్ఠించి చూపాడు. శ్రీరాముని విశ్లేషించి ప్రాణాలను నిలువుకొనలేని తన ఆర్తిని కూడా గమనించకుండా భగవానుని మనస్సును గమనించి, **"ఆరురోహ రథం హృష్టః"** అని చిత్రకూటంనుండి ఆనందంగా వెనుదిరి గాడు కదా, భరతుడు. అందువల్ల భరతునకు విశేషమున్నది.

అటువంటి భరతుడు తప్ప వేఱు విషయాన్ని దేనినీ తెలియనివాడైనందున, శత్రుఘ్నాళ్వాన్ భగవచ్ఛేషత్వ కాష్ఠ అయిన భాగవతశేషత్వాన్ని అనుష్ఠించాడు, ఈ శత్రుఘ్నునకు వాల్మీకిమహాముని విశేషణాన్ని ప్రయోగించేటపుడు **"నిత్యశత్రుఘ్నః"** అని అన్నారు. బాహ్యశత్రువులను మాత్రమేకాక, ఆంతర శత్రువులైన ఇంద్రియాలను కూడా జయించాడని దీనికి అర్థాన్ని తెల్పిన పెరియవాచ్చాన్‌పిళ్ళై - "ఈ ఇంద్రియ జయం యొక్క అవధి ఎంతవరకు! అని అంటే, **"పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్"** అనే రీతిలోని రామసౌందర్యంలోకూడా లగ్నం కాకుండా ఉండడం. అంటే -శ్రీరాముని ఆశ్రయించేటపుడు తన సంతోషంకోసంగాని, అతని వైలక్షణ్యాన్ని చూచిగాని కాకుండా, తనకు ఉద్దేశ్యుడైన ఇతడు (భరతుడు) అభిమానించిన విషయం - అని ఆశ్రయించడం" అని పల్కడం ఇక్కడ అనుసంధేయం.





శ్రీమతే రామానుజాయ నమః

మధురకవి ఆళ్వార్లు అనుగ్రహించిన

# కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు - సవ్యాఖ్యానమ్

("భావదీపిక" ఆంధ్ర వివరణ సహితం)

శ్రీనాథమునులు అనుగ్రహించిన తనియన్

1. **అవిదితవిషయాంతరః శఠారేః ఉపనిషదా ముపగానమాత్రభోగః ।**
**అపి చ గుణవశా త్తదేకశేషీ మధురకవిః హృదయే మమావిరస్తు ॥**

అవిదితవిషయాంతరః = (నమ్మాళ్వార్లను తప్ప) వేఱొక విషయాన్ని తెలియనివారు, శఠారేః = నమ్మాళ్వార్ల (దివ్యసూక్తులనబడే), ఉపనిషదామ్ = (ఉపనిషత్తులవంటి) దివ్యప్రబంధాలను, ఉపగానమాత్రభోగః = గానం చేయడంలో మాత్రమే గొప్ప ఆనందంగా కలవారు, గుణవశాదపి చ = (ఆళ్వార్ల) గుణాలవల్ల కూడా, తత్+ఏకశేషీ = ఆ నమ్మాళ్వార్లు ఒక్కరే తమకు శేషిగా కల్గినవారైన, మధురకవిః= మధురకవి ఆళ్వార్లు, మమ హృదయే = నాహృదయంలో, ఆవిరస్తు= ఆవిర్భవించాలి.

## పిళ్ళైలోకమ్‌జీయర్ అరుళిచ్చెయ్‌త తనియన్ వ్యాఖ్యానమ్

**అవతారికై - (అవిదితవిషయాన్తర శ్శఠారే రిత్యాది) ఇతిల్ - "వేఱొన్ఱుమ్ నానఱియేన్' ఎన్ఱు - ఆళ్వారై యొళ్ఙిన్ద విషయఙ్గళిల్ అవిదితరా యిరుప్పారాయ్, శడకోపరెన్నుమ్ తిరునామత్తై యుడైయరాన నమ్మాళ్వారు డైయ అనుభవపరీవాహరూపమాన తిరువాయ్‌మొళియిన్ గానమే భోగమా యిరుక్కుమవరాయ్, అవ్వళవిలుమ్ నిల్లాతే, అతుక్కు మేలుమ్ వాత్సల్య గుణత్తాలుమ్ తోన్ఱి, అవరైయే తమ్మై యడిమై కొళ్ళుమ్ శేషి ఎన్ఱు అఱుతి యిట్ట మధురకవికళ్‌తమ్‌నిలై ఉణ్డామ్పడి ఎన్ హృదయత్తిలే సుప్రతిష్ఠిత రాకక్కడవర్ - ఎన్గిఱతు.**

**వ్యాఖ్యానమ్ - (అవిదితవిషయాన్తరః) ఆళ్వారై యొళ్ఙిన్ద విషయఙ్గళిలే వ్యుత్పత్తిపణ్ణి అఱియార్ - ఎన్గిఱతు. "శ్నై మఱ్ఱొన్ఱిన్ తిఱత్తతల్లా", "మఱ్ఱొన్ఱినై**

క్కాణావే", "భావో నాన్యత్ర గచ్ఛతి" ఎన్నక్కడవతిఱే. ఇజ్గు విషయాన్తరజ్గళా కిఱతు - పాట్టు క్కేట్కుమిడమాన పరవిషయమ్, కూప్పీడు కేట్కు మిడమాన వ్యూహవిషయమ్, కుతిత్త ఇడమాన విభవవిషయమ్, వళైత్త ఇడమాన అర్చావతారవిషయమ్ - ఎల్లామ్ వకుత్త ఇడమాన ఆ*ళ్వా*రే యాకైయాలే మ*ర్రొ*రు విషయజ్గళైయు మఱియాతే యిరుప్పర్.

"మాతా పితా", "అన్నైయాయ్ అత్తనాయ్", "సర్వం యదేవ" ఎన్ఱు సమస్తసాంసారికవిషయసుఖజ్గళుమ్ శఠకోపాచార్యరెన్ఱు అఱుతియిట్టు, తదన్యజ్గళై యఱియాతనర్ - ఎన్ఱుమామ్. ఆ*ళ్వా*ర్, "ఎల్లామ్ కణ్ణన్" ఎన్ఱిరుక్కుమాపోలే, "కోయిల్‌కొళ్ తెయ్వ మెల్లామ్ తొ*ళ* వైకున్దమ్ కోయిల్ కొణ్డ కుడక్కూత్త వమ్మాన్, కోయిల్ కొణ్డాన్ అతనోడు మెన్నెఞ్జకమ్" ఎన్ఱుమ్, "మొయ్త్త తిరై మోతు తణ్ పాఱ్కడలుళాన్, పైత్తేయ్ శుడర్ప్పామ్బణై నమ్బరనై - వైత్తేన్ మతియాల్" ఎన్నైయాలే. "అవన్ కిడన్ద మెన్నెఞ్జకలాన్" ఎన్ఱుమ్, "ఉరుప్పిణి నజ్గై అణినెడున్దోళ్ పుణర్న్దాన్", "ఎన్ఱు మెపోతు మెన్నెఞ్జమ్ తుతిప్ప ఉళ్ళే యిరుక్కిన్ఱ పిరాన్" ఎన్ఱుమ్, "కణ్గళ్ శివన్దిల్" పడియే, "ఒరువన్ అడియే నుళ్ళాన్" ఎన్ఱుమ్, "తిరుప్పేర్ నకరాన్ తిరుమాలిరుమ్ శోలై, పొరుప్పే యుఱైకిన్ఱ పిరాన్ ఇన్ఱు వన్దు, ఇరుప్పేన్ ఎన్ఱు ఎన్నెఞ్జు నిఱైయ ప్పుకున్దాన్" ఎన్ఱుమ్, "విణ్మీతిరుప్పాయ్" ఎన్గిఱ ఐన్దుమ్, "ఎనతావియుళ్ మీతాడి" ఎన్ఱుమ్, "తేవర్‌కోలత్తొడుమానాన్" ఎన్గిఱ తెయ్వవురువిలే ఇవర్క్కు ఎల్లా ముణ్డాకైయాలేయాయ్త్తు - "కరియ కోల త్తిరువురు క్కాణ్బన్" ఎన్ఱతుమ్.

"అవిదితవిషయాన్తర శ్శఠారేః " ఎన్నైయాలే - శఠారియై క్కాట్టిలుమ్ అఱియామల్ ఇరుప్పతాన అన్యవిషయజ్గళై యుడైయవర్ - ఎన్గిఱతు. అతావతు - ఆ*ళ్వా*ర్‌కక్కుమతు - "ఇళమ్ తెయ్వత్తై" యాయ్త్తు. ఇవర్ ఉకక్కుమతు - "పెరున్దెయ్వ"మాయ్, "కరున్దేవనమ్మాన్ కణ్ణ"నాన పెరున్దేవనై యాయ్త్తు. "కట్టుణ్ణ ప్పణ్ణియ పెరుమాయన్ ఎన్నప్పనిల్ నణ్ణి" ఎన్ఱారిఱే. "ఉన్నిత్తు మ*ర్రొ*రు తెయ్వమ్ తొ*ళా*ళ్", "ఒరు మా తెయ్వమ్ మ*ర్రు*



డైయమో యామే", "తేవు మ*ర్రు*ఱియేన్" ఎన్ఱాయ్త్తు ఇవర్‌కళ్ పేచ్చిరుప్పతు. ఇప్పడి ఆ*ళ్వా*రిల్ వ్యావృత్తరాయిరుక్కిఱవర్. " శఠారే రుపనిషదా ముపగాన మాత్రభోగః" ఎన్నైయాలే - ఆతు, "నాట్టియల్ ఒ*ళి*న్దు శఠరై యోట్టిన" శఠకోపన్, "మొ*ళి*పట్టోడుమ్ కవియముతమాన" "యా*ళి*నిశై వేతత్తిన్" "పణ్ణార్ పాడలిన్ అనుభవరసజ్ఞరాయ్, "పావినిన్నిశై పాడిత్తిరివనే" "నావినాల్ నవి*ర్రు* ఇన్బ మెయ్తినేన్ మేవినేనవన్ పొన్నడి మెయ్మ్మైయే" ఎన్ఱిరుక్కై - ఎన్ఱపడి. ఇత్తాల్ - అవరోపాది అవర్ సమ్బన్ధముడైయతుమ్ ఉద్దేశ్య మెన్ఱాయ్త్తు, ఇవర్ విరుమ్బువతు.

"అవిదితవిషయాన్తర శ్శఠారేః" ఎన్ఱు - స్వరూపప్రయుక్తమాన దాస్యమ్ శొల్లి*ర్రు*. "అపి చ గుణవశాత్తదేకశేషీ" ఎన్ఱు గుణకృతదాస్యమ్ ఉణ్డెన్గిఱదు.

(అపి చ) కీ*ళ్*చ్చొన్నవళవన్ఱిక్కే పిన్నైయుమ్. (గుణవశాత్) తమ్మై యె*ళు*తిక్కొళ్ళు కైయాలే, "తదేకశేషీ" ఎన్గిఱతు. "గుణవశాత్" ఎన్ఱు తృతీయార్థే పఞ్చమియాయ్ క్కిడక్కిఱతు "ఆతలిల్ అన్నైయాయత్తనాయ్ ఎన్నై యాణ్డిడుమ్ తన్మైయాన్ శఠకోపన్ ఎన్నమ్బియే" ఎన్ఱుమ్, "పయనన్ఱాకిలుమ్ పాజ్గలరాకిలుమ్ శెయల్ నన్ఱాక త్తిరుత్తి ప్పణికొళ్వాన్, కుయిల్ నిన్ఱార్ పొ*ళి*ల్ శూ*ళ్* కురుకూర్‌నమ్బి" ఎన్ఱు మనుసన్ధిత్త వాత్సల్యాది గుణపూర్తియాలుమ్ "గుణైర్దాస్య"ముపాగతరాయ్, తదేకశేషియాయిరుప్పారాయ్త్తు.

ఏవమ్భూతరాన మధురకవిళ్, "అణ్ణిక్కుమ్ అముతూఱుమ్ ఎన్నావుక్కే" ఎన్నుమ్బడియాన వాఙ్మాధుర్యత్తై యుడైయవర్. (మమ హృదయే) మధుర కవికళ్ నిష్ఠైయై అపేక్షిక్కిఱ ఎన్ మనస్సిలే అన్ఱిరున్దు పట్టోలైకొణ్డ నిలైయోడే. (ఆవిరస్తు) ఆవిర్భవిక్కక్కడవర్ - సన్నిధానమ్ పణ్ణక్కడవర్. ఇత్తాల్ - అనుకూలరాన ఆచార్యపరతన్త్రర్ ఆదరణీయర్ - ఎన్నుమర్థమ్ శొల్లి*ర్రా*య్త్తు.

## శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానానికి భావదీపిక (ఆంధ్రవివరణం)

**అంతిమోపాయనిష్ఠా యా వేదోక్తా సూరిసంమతా।**
**తాం జగౌ మధురం "కణ్ణినుణ్శిఱుత్తాంబ్బు" నామకే॥**

**దివ్యప్రబంధే మధురః కవిః సూరివరో మహాన్।**
**పరాంకుశమునే రన్యత్ నైవ వేద్మీతి ఘోషయన్॥**

**కృష్ణసూరిగురో ర్భవ్యాం వ్యాకృతిం ద్రావిడీం స్మరన్।**
**ఆంధ్ర్యాం శ్రీశింగరార్యోఽయం కురుతే భావదీపికామ్॥**

**అవతారిక :** ఈ తనియన్ పాశురంలో **"వేఱొన్ఱుమ్ నానఱియేన్"** (వేఱేమీ తెలియను) అని అంటూ నమ్మాழ்వార్లను తప్ప అన్యవిషయాలను తెలికుండా ఉండేవారు, **"శఠకోపులు"** అనే పేరును కల్గిన నమ్మాழ்వార్ల భగవదనుభవం యొక్క వ్యక్తీకరణ రూపమైన తిరువాయ్మొழிప్రబంధాన్ని గానం చేయడమే ఆనందంగా కల్గినవారై, అంతటితో నిలువకుండా, నమ్మాழ்వార్లు తమ పట్ల చూపిన వాత్సల్య గుణానికి జితులై, వారే తమను దాసునిగా పరిగ్రహించే శేషి (స్వామి)- అని విశ్వసించినవారైన మధురకవులు నా మనస్సులో ఎల్లప్పుడు స్థిరంగా వేంచేసి ఉండాలి- అని శ్రీనాథమునులు పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్ : (అవిదితవిషయాంతరః)** - ఆழ்వార్లు తప్ప అన్యవిషయాలను వేనినీ పూర్తిగా తెలియనివారు. **"ఇది"** అని కూడా తెలియనివారని (సామాన్యమైన జ్ఞానం కూడా లేనివారని) భావం. **"శిన్దై మఱ్ఱొన్ఱిన్ తిఱత్తదల్లా"** (నా మనస్సు వేఱొక విషయంపట్ల ఆసక్తిని కల్గినదికాదు) (తిరువాయ్-7-10-10) అని, **"ఎన్ అముదినై క్కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** (అమృతంవంటి నా శ్రీరంగనాథుని దర్శించిన నా కన్నులు ఇంకొక వస్తువును దేనినీ దర్శించవు) (అమలనాది పిరాన్-10) అని, **"స్నేహో మే పరమే రాజన్! త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తిశ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి"** (రామా-ఉత్తర-40-15) (ప్రభూ! నీపట్ల నాకు గొప్ప స్నేహం ఎల్లప్పుడు స్థిరంగా నిలచి ఉన్నది. ఓ వీరా! నీ విషయంలో భక్తికూడా నిత్యంగా ఉన్నది. నా భావం శ్రీవైకుంఠనాథుని విషయంలో లగ్నం కావడం లేదు) అని భగవానుని విషయంలో క్రమంగా నమ్మాழ்వార్లు, తిరుప్పాణ్ ఆழ்వార్లు, హనుమానుడు అనుసంధించారు (పలికారు). వారు త్యజించిన విషయాలని



అనువదించిన (పల్కిన) అన్యవిషయాలతో సమానంగా, వారు ముగ్గురు గ్రహించిన ఆయా భగవద్రూపాలనుకూడా త్యజించినవారుగా వీరు (మధురకవులు) చెప్పబడుతున్నారు. భగవానుడు ఒక్కడే అయినా, ఇక్కడ **"విషయాంతరాణామ్"** (అన్యవిషయాలు) అని బహువచనంలో పల్కడం ఎందుకు ? అంటే- నిత్యముక్తుల సామగానాన్ని వినేవాడైన పరమపదనాథుడు (పరత్వం), అసురులవల్ల, రాక్షసులవల్ల బాధను పొందిన దేవతల ఆర్తనాదాన్ని వినే చోటు అయిన పాలకడలి మొదలైన వ్యూహం, అక్కడనుండి ఈ లోకానికి దుమికి (దిగి) అవతరించే చోటు అయిన (రూపాలైన) రామకృష్ణాది విభవావతారాలు, చేతనులను అందఱిని ఉపాయాన్ని పన్ని పట్టుకొని, మూటకట్టుకొని తీసికొని పోవడంకోసం అవతరించిన అర్చావతారాలు -అనే వీటిని మనస్సులో పెట్టుకొని బహువచనంలో పల్కుతున్నారు. ఇవి అన్నీ వీరికి (మధురకవులకు) ప్రాప్త (స్వరూపానికి తగిన) స్థానమైన ఆழ்వార్లే కనుక, ఇక మిగిలిన విషయాలను వేనినీ తెలియకుండా ఉన్నారని చెప్పబడింది.

**"మాతా పితా యువత స్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్, ఆద్యస్య న కులపతే ర్వకుళాభిరామం శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా"** (నావంశంలోనివారికి ఎల్లప్పుడు తల్లి, తండ్రి, భార్య, సంతానం, గొప్ప సంపద, ఇంకా మిగిలిన అన్నీ ఏ ఆళ్వార్ల శ్రీచరణాలలో, మనకు ఆద్యులు కులపతి, వకుళపూలమాలికచే అలంకరింపబడిన, శ్రీవైష్ణవ సిరిని కల్గిన ఆ (నమ్మాழ்వార్ల) శ్రీచరణాలను శిరసా నమస్కరిస్తున్నాను.) అని ఆళవందార్ తల్లి, తండ్రిమొదలైన సంసారసంబంధాలను కల విషయాలు అన్నీ నమ్మాழ்వార్లే- అని నిశ్చయించుకొని, మిగిలిన విషయాలను వేనినీ తెలియనివారైనట్లే, వీరుకూడా **"అన్నైయాయ్ అత్తనాయ్ ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్ శడకోపన్ ఎన్ నమ్బియే"** (కణ్ణినుణ్-4) (తల్లి, తండ్రి నన్ను పాలించే స్వభావాన్ని కల స్వామి- శఠకోపులనే నా గుణపూర్ణులే) అని అంటూ అన్నీ ఆழ்వార్లే- అని అన్నారు కదా ! నమ్మాழ்వార్లు **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (తిరువాయ్-6-7-1) (నాకు భుజించే అన్నం, తాగే నీరు, అనుభవించే తాంబూలం వంటి ధారకపోషక భోగ్యపదార్థాలు అన్నీ శ్రీకృష్ణుడే) అని అంటూ అన్నీ భగవానుడే అని తలచినట్లే, మధురకవులు కూడా తమకు అన్నీ ఆழ்వార్లే- అని భావించారు.

**"కోయిల్కొళ్ దెయ్వ మెల్లామ్ తొழுవైకున్దమ్ కోయిల్ కొణ్డ కుడక్కూత్త అమ్మాన్ కోయిల్ కొణ్డాన్ ఆదనోడుమ్ ఎన్ నెఞ్జకమ్"** (తిరువాయ్-8-6-5) (ఆలయాలను

కల దేవతాంతరాలన్నీ తనను సేవించగా వైకుంఠాన్ని ఆలయంగా కల్గినవాడు, శ్రీకృష్ణావతారంలో కుంభనృత్యాన్ని చేసినవాడైన స్వామి ఆ వైకుంఠంతో పాటుగా నా మనస్సును ఆలయంగా పరిగ్రహించాడు) అని, **"మొయ్త్తే తిరైపొమ్బుణై వైత్తేన్ మదియాల్"** (తిరువాయ్-8-7-10) (ధ్వనించే కెరటాలను కల సముద్రంలో ఆదిశేషుని శయనంగా కల్గినవానిని నా మనస్సులో నిలుపుకొన్నాను) అని, **"అవన్ కిడన్దుమ్ ఎన్ నెఞ్జకలాన్"** (పెరియ తిరువన్దాది- 35) (అతడు వేంచేసి ఉండే నా మనస్సును ఏనాడూ వీడిపోవడం లేదు) అని, **"ఉరుప్పిణి నఙ్గై అణినెడున్దోళ్ పుణర్న్దాన్"** (రుక్మిణీదేవి అందమైన బాహువులను ఆలింగనం చేసికొన్నాడు) అని, **"ఎప్పోదుమ్ ఎన్ నెఞ్జమ్ తుదిప్ప ఉళ్ళే ఇరుక్కిన్ఱ పిరాన్"** (నా మనస్సు స్తుతించగా ఎల్లప్పుడు లోపల వేంచేసి ఉండే స్వామి) (తిరువాయ్-7-10-6) అని, **"కణ్గళ్ శివన్దు"** (తిరువాయ్-8-8) (ఎఱ్ఱని, పెద్దపెద్ద నేత్రాలను ఎఱ్ఱని పెదవిని. ఆ నోటిలోపల తెల్లగా వెలిగే దంతాలను, ప్రకాశించే మకరకుండలాలను కలవాడు, మేఘవర్ణుడు, ప్రకాశించే కిరీటాన్ని కలవాడు, చతుర్భుజుడు, కొంచెం వంగిన శార్ఙ్గమనే వింటిని కలవాడు, అందమైన శంఖాన్ని, గదను, ఖడ్గాన్ని, సుదర్శనాన్ని కలవాడైన అద్వితీయుడైన స్వామి దాసుడనైన నా హృదయంలో ఉన్నాడు) అని **"తిరుప్పేర్ నకరాన్ తిరుమాలిరుమ్శోలై పొరుప్పే యుఱైకిన్ఱ పిరాన్ ఇన్ఱు వన్దు ఇరుప్పేన్ ఎన్ఱు ఎన్నెఞ్జు నిఱైయ ప్పుకున్దాన్"** (తిరువాయ్-10-8-6) (**తిరుప్పేర్నకర్**-అనే దివ్యదేశాన్ని కలవాడు, **తిరుమాలిరుమ్ శోలై** అనే క్షేత్రంలో పొందికగా ఉండేవాడైన స్వామి ఇపుడు ఈనాడు వచ్చి- "నీ మనస్సులోపల ఉంటాను" అని అంటూ నా మనస్సు అంతా నిండి ఉండేటట్లు ప్రవేశించాడు) అని, **"విణ్మీదిరుప్పాయ్! మలైమేల్ నిఱ్పాయ్! కడల్ శేర్ప్పాయ్! మణ్మీదు ఉఴల్వాయ్! ఇవఱ్ఱుళ్ ఎఙ్గుమ్ మఱైన్దు ఉఱైవాయ్! ఎణ్మీదియన్ఱ పుఱ అణ్డత్తాయ్! ఎనదావి ఉన్ మీదాడి"** (తిరువాయ్-6-9-5) (పరమపదంలో ఉండేవాడా ! తిరుమలగిరిపై ఉండేవాడా ! సముద్రంలో చేరి పవళించి ఉండేవాడా! భూమిపై అవతారరూపాలలో సంచరించేవాడా! ఈజీవులందఱిలో అంతర్యామిగా మఱుగుపడి ఉండేవాడా! లెక్కలేనన్ని బ్రహ్మాండాలను సృష్టించేవాడా! నాప్రాణాలు నీపై నిలచి ఉన్నాయి) అని నమ్మాఴ్వార్లు **"దేవార్కోలత్తొడుమానాన్"** (తిరువాయ్-5-1-9) (దివ్యత్వాన్ని పూర్ణంగా కల రూపాన్ని కలవాడయ్యాడు) అనే దివ్యరూపంలో తమకు భగవానుని రూపాలన్నీ తమ మనస్సులో ఉన్నాయని అన్నారు. కనుక, భగవానుని పూర్తిగా



విడువలేక, **"తేవు మఱ్ఱఱియేన్"** (వేఱొక దైవాన్ని తెలియను) (కణ్ణినుణ్-2) అని పల్కినా, **"దేవపిరానుడైయ కరియకోలత్తిరువురువు క్కాణ్బన్"** (కణ్ణినుణ్-3) (దేవతలకు అధిపతి అయిన స్వామియొక్క నల్లని, అందమైన దివ్యరూపాన్ని దర్శిస్తాను) అని అన్నారు.

**"అవిదితవిషయాంతరః శఠారేః"** అని పల్కినందువల్ల శఠారి అయిన నమ్మాఴ్వార్లు - "భగవానుడు తప్ప అన్యదైవాలను నేను ఎఱుగను" అని అంటూ అపరదైవాలను కాదన్నారు (నిషేధించారు). వీరు - **"కఴి పెరుమ్ దెయ్వమ్"** (తిరువిరుత్తమ్-20) (మిక్కిలి గొప్పదైవమై), **"కరున్దేవన్ ఎమ్మాన్ కణ్ణన్"** (తిరువాయ్-9-3-4) (నల్లని వర్ణాన్ని కల్గిన దేవుడు నా స్వామి కృష్ణుడు) అయిన పరదైవాన్ని కూడా కాదన్నారు- అని చెప్పబడుతున్నది. **"కట్టుణ్ణ ప్పణ్ణియ పెరు మాయన్ ఎన్నప్పనిల్ నణ్ణి"** (తనను తాను యశోదచే బంధింపజేసికొన్న గొప్ప మాయావి, నా స్వామి అయిన శ్రీకృష్ణుని విడచి ఆఴ్వార్లను ఆదరించి) (కణ్ణినుణ్-1) అని అంటూ ఈ విషయాన్ని వీరే (మధురకవులే) పలికారు కదా! **"ఉన్నిత్తు మఱ్ఱొరు దెయ్వమ్ తొఴాళ్ అవనై యల్లాల్"** (భగవానుని తప్ప వేఱొక దైవాన్ని ఆదరించి పరాంకుశ నాయకి కొలువదు) (తిరువాయ్-4-6-10) అని, **"ఎమ్బెరుమామాయనై యల్లదు ఒరుమా దెయ్వమ్ మఱ్ఱుడైయమో యామే"** (తిరువాశిరియమ్-7) (ఆశ్చర్యచేష్టితుడైన భగవానుని తప్ప వేఱొక ఏ గొప్పదైవాన్ని మేము కల్గినవారం కాము) అని నమ్మాఴ్వార్లు అన్యదైవాలను కాదన్నారు. **"తేవు మఱ్ఱఱియేన్"** (వేఱొక దైవాన్ని తెలియను) (కణ్ణినుణ్-2) అని వీరు (మధుర కవులు) ఈ ప్రబంధంలో ఆ భగవానునిసైతం కాదన్నారు. వీరి మాటల వల్లనే- భగవానుని ఆశ్రయించిన ఆఴ్వార్ల కంటే, ఆ ఆఴ్వార్లను ఆశ్రయించిన వీరు (మధురకవులు) చాలా గొప్పవారని తెలుస్తున్నది.

**(శఠారే రుపనిషదా ముపగానమాత్రభోగః) -"నాట్టారోడు ఇయల్వు ఒఴిన్దు నారణనై నణ్ణినమే"** (తిరువాయ్-10-6-2) (లోకంలోనివారితో సంబంధాన్ని తెంచుకొని నారాయణుని ఆశ్రయించాము) అనే విధంగా సాంసారికజీవనాన్ని వదలిపెట్టి, అందులో అభినివేశాన్ని కల్గిన శఠులను (అజ్ఞానులను) తరిమికొట్టినందున **"శఠకోపులు"** అనే పేరును పొందిన ఆఴ్వార్ల **"మొఴిపట్టోడుమ్ కవియముదమ్"** (శబ్దస్వరూపమై ప్రవహించే తిరువాయ్‌మొఴి అనే అమృతం) (తిరువాయ్-8-

10–5) **"యాళ్లినిశై వేదమ్"** (వీణాగానం వంటి తీయని గానాన్ని కల సామవేదం), (తిరువాయ్‌మొళ్లి తనియన్) (వీణాగానం వలె మధురమైన ద్రావిడవేదం), **"పణ్ణార్ పాడల్"** (గానంతో నిండిన పాశురాలు) (తిరువాయ్–10–7–5) అని పొగడబడే ఉపనిషత్‌సారమైన పాశురాలను ఆస్వాదించి అనుభవించినవారై, **"పావిన్ ఇన్నిశై పాడి త్తిరివనే"** (పాశురాలలోని మధురమైన గానాన్ని చేసి సంచరిస్తాను) (కణ్ణినుణ్–2), **"నావినాల్ నవిఱ్ఱు ఇన్బమ్ ఎయ్‌దినేన్ మేవినేన్ అవన్ పొన్నడి మెయ్‌మ్మైయే"** (జిహ్వతో పాడి ఆనందం పొందాను). వాస్తవంగానే వారి బంగారువలె ఆశపడదగిన శ్రీచరణాలను పొందాను) (కణ్ణినుణ్–2) అని తలచి ఉండే స్థితి తెలుపబడుతున్నది.  ఇందువల్ల నమ్మాళ్వార్ల వలె వారి సంబంధాన్ని కల్గిన వారి పాశురాలు కూడా అభిలషించదగినవి – అని మధురకవులు భావించిన విషయం తెలుపబడింది.

**"అవిదితవిషయాంతరః శఠారేః"** అనే ప్రయోగంద్వారా నమ్మాళ్వార్ల విషయంలో మధురకవులకు స్వరూపప్రయుక్తదాస్యం (సహజంగానే ఉండే దాస్యం) ఉన్నదని తెలుపబడింది. **"అపి చ గుణవశాత్తదేకశేషీ"** అనే మూడవ పాదంతో నమ్మాళ్వార్ల విషయంలో మధురకవియాళ్వార్‌కు గుణకృతదాస్యం కూడా (నమ్మాళ్వార్ల గుణాలపట్ల అభినివేశాన్ని పొందినందున ఏర్పడిన దాస్యం కూడా) ఉన్నదని తెలుపబడింది.

**(అపి చ)** – పూర్వం పల్కిన సహజమైనదాస్యంతో పాటుగా– అని అర్థం. ఈ రెండు విధాలైన (స్వరూపగత–గుణకృత) దాస్యాలు కలసి ఉండడం చాలా అరుదు– అనే విషయం (ఈ పదంద్వారా) తెలుపబడుతున్నది.

**(గుణవశాత్ తదేకశేషీ)** నమ్మాళ్వార్లు తమగుణంతో మధురకవి ఆళ్వార్లను తమ వశం చేసికొన్నందున,

**(తదేకశేషీ)**– వారిని (ఆళ్వార్లను) ఒక్కరిని మాత్రమే తమకు శేషిగా కల్గినవారయ్యారు– అని అంటున్నారు. సహజమైన దాస్యం ఒక చోట, గుణంవల్ల దాస్యం ఇంకొక చోట ఉండడం– అనే విషయం (దీనివల్ల) నిషేధింపబడుతున్నది. **"గుణవశాత్"** అనేది పంచమీవిభక్త్యంతపదం. ఇది ఇక్కడ తృతీయావిభక్త్యర్థాన్ని ఇస్తుంది. **"గుణంచేత"** అని అర్థం. ఈవిషయాన్ని **"ఆదలిన్ అన్నైయాయ్ అత్తనాయ్**



**ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్ శడకోపన్ ఎన్ నమ్బియే"** (కణ్ణినుణ్–4) (అందువల్ల తల్లియై, తండ్రియై, నన్ను పాలించే స్వభావాన్ని కలవారైన, గుణపూర్ణులైన శఠకోపులు) అని, **"పయనన్నాకిలుమ్ పాఙ్గలరాకిలుమ్ శెయల్ నన్నాక త్తిరుత్తి ప్పణికొళ్‌వాన్ కుయిల్ నిన్నార్ పొళ్లిల్ శూళ్ కురుకూర్‌నమ్బి"** (కణ్ణినుణ్–10) (నావల్ల ఏ ప్రయోజనం లేకపోయినా, నాలో ఏ యోగ్యత లేకపోయినా, నా ప్రవర్తన చక్కగా ఉండేటట్లు తీర్చిదిద్ది, నా నుండి దాస్యాన్ని స్వీకరించడంకోసం, కోయిలలు నిలచి, కూసే తోటలను చుట్టు కల తిరునగరిలోని గుణపూర్ణులైన శఠకోపులు) అని మధురకవి ఆళ్వార్లు, వాత్సల్యం మొదలైన గుణాల పూర్ణతవల్ల నమ్మాళ్వార్లు తమను దాసులుగా చేసికొన్నందున తాము వారికి గుణాలవల్ల వశులై, శేషభూతులై, వారిని ఒక్కరినే శేషిగా కల్గినవారై ఉన్న విషయాన్ని పలికారు కదా!

**(మధురకవి)** ఇటువంటివారైన మధురకవులు– అని అర్థం. **"అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్నావుక్కే"** (నా జిహ్వకు రుచిస్తుంది, అమృతం స్రవిస్తుంది) (కణ్ణినుణ్–1) అనే రీతిలోని వాఙ్మాధుర్యాన్ని కలవారు.

**(మమ హృదయే)–** మధురకవుల చరమపర్వనిష్ఠను ప్రార్థించే నా మనస్సులో,

**(ఆవిరస్తు)**– నమ్మాళ్వార్లతో కలసి ఉండి, వారి దివ్యప్రబంధాలను గ్రంథస్థం చేసిన స్థితిలోనే (సన్నివేశంలోనే) మధురకవులు ఆవిర్భవించాలి; ఎల్లప్పుడూ ఆ సన్నివేశంతో వేంచేసి ఉండాలి– అని ఈ తనియన్ అనుగ్రహించిన నాథమునులు– అంటున్నారు. అందువల్ల శ్రీవైష్ణవులకు అనుకూలురైన ఆచార్యనిష్ఠులు అభిలషించదగినవారు– అనే అర్థం చెప్పబడింది.

2. **వేఱొన్ఱుమ్ నానఱియేన్ వేదమ్ తమిళ్ శెయ్‌ద,**
**మాఱన్ శడకోపన్ వణ్‌కురుకూర్– ఏఱెఙ్గళ్;**
**వాళ్ వామెన్ఱేత్తుమ్ మధురకవియార్ ఎమ్మై**
**యాళ్‌వార్; అవరే అరణ్.**

వేఱు ఒన్ఱుమ్ నాన్ అఱియేన్ = (నమ్మాళ్వార్లను తప్ప) వేఱొక ఏ వస్తువును నేను తెలియలేను, వేదమ్ తమిళ్ శెయ్‌ద = వేదార్థాలను ద్రావిడభాషలో పల్కిన, మాఱన్ = **"మాఱన్"** అనే పేరును కలవారు, వణ్ కురుకూర్ ఏఱు = అందమైన కురుకాపురికి నాథులైన, శడకోపన్ = నమ్మాళ్వార్లు, ఎఙ్గళ్ వాళ్వు ఆమ్ ఎన్ఱు =

"మనలను ఉజ్జీవింపజేసేవారు" అని, ఏత్తుమ్ = స్తుతించిన, మదురకవియార్ = మధురకవి ఆళ్వార్లు, ఎమ్మై ఆళ్వార్ = మనలను పాలించేవారు, అవరే = ఆ మధురకవులే, అరణ్ = (ప్రపన్నకులానికి) రక్షకులు.

**అవ - (వేఱొన్ఱుమ్ నానఱియేన్) ఆళ్వారైయొఴియ "త్తేవు మఱ్ఱఱియాత, మధురకవికళ్ నమక్కు స్వామియుమ్, రక్షకరుమెన్గిఱతు.**

**వ్యా - "వేఱొన్ఱుమ్ నానఱియేన్ వేదమ్ తమిళ్ శెయ్త మాఱన్ శడకోపన్ వణ్ కురుకూర్ ఎఙ్గళ్ వాళ్వామెన్ఱేత్తుమ్ మతురకవియార్ ఎమ్మై యాళ్వార్" ఎన్నుమళవుమ్ - మధురకవిశొల్లై అనుసరిత్తు చ్చొన్నపడి. మేల్ ఏవమ్విధ రానవర్ నమక్కు శేషియుమ్ శరణ్యరుమ్ - ఎన్గిఱతు.**

**"తేవు మఱ్ఱఱియేన్" ఎన్గత్తై - "వేదమ్ తమిళ్ శెయ్త మాఱన్ శడకోపన్" ఎన్గతు. "కారిమాఱప్పిరాన్", "శడకోపన్ ఎన్నమ్బి" "ఎన్గత్తై" - "మాఱన్ శడకోపన్" ఎన్గతు. "పెరియ వణ్ కురుకూర్ కర్ నమ్బిక్కాళు రియనాయ్డి అడియేన్ పెఱ్ఱ నన్మైయే" ఎన్గత్తై - వణ్కురుకూర్ ఎఙ్గళ్ వాళ్వామెన్గతు. ఎఙ్గళ్ వాళ్వామెన్ఱేత్తుమ్ మతురకవియార్" ఎన్గతు. "ఎన్నై యాణ్డిడు న్దన్మైయాన్" ఎన్గత్తై - "ఎమ్మై యాళ్వార్" ఎన్గిఱతు. అవరై యాళు కిఱవర్ ఆళ్వార్, నమ్మై యాళుకిఱవర్ ఇవర్. అవరే, అరణ్ - రక్షై. "శరణ్" ఎన్ను పాఠమానపోతుమ్ రక్షై - ఎన్ఱే అర్థమ్. మధురకవికళుక్కు ఎల్లామ్ ఆళ్వారే యానాప్పోలే, నమక్కు ఎల్లామ్ మధురకవికళ్ ఎన్గిఱతు.**

**శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ అరుళిచ్చెయ్త తనియన్ వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు**

**పిళ్ళైలోకమ్ జీయర్ తిరువడికళే శరణమ్.**

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**అవతారిక :** ఆళ్వార్లు తప్ప వేఱు దైవాన్ని తెలియని మధురకవులే మనకు స్వామి, రక్షకులు– అని అంటున్నారు, నాథమునులు.

వ్యాఖ్య : **"వేఱొన్ఱుమ్ నానఱియేన్ వేదమ్ తమిళ్ శెయ్ద మాఱన్ శడకోపన్ వణ్కురుకూర్ ఏఱు ఎఙ్గళ్ వాళ్వామ్ ఎన్ఱేత్తుమ్ మదురకవియార్ ఎమ్మై ఆళ్వార్"**



అనే పర్యంతం మధురకవుల శ్రీసూక్తిని అనుసరించి పల్కుతున్నారు. ఆ తరువాత గల **"అవరే అరణ్"** అనే భాగంతో, "ఇటువంటి మధురకవి ఆళ్వార్లే మనకు స్వామి, రక్షకులై ఉన్నారు"– అని అంటున్నారు.

**"తేవు మఱ్ఱఱియేన్"** (వేఱొక దైవాన్ని తెలియను) అని మధురకవి ఆళ్వార్లు పల్కిన సూక్తిని **"వేదమ్ తమిళ్ శెయ్ద మాఱన్ శడకోపన్ అవరే అరణ్"** (వేదార్థాలను ద్రావిడభాషలో పల్కినవారు మాఱన్ – అనే పేరును కల శఠకోపులు. వారే మనకు రక్షకులు) అని అంటున్నారు. **"కారిమాఱన్ శడకోపన్"** (కణ్ణినుణ్–7) **"శడకోపన్ ఎన్ నమ్బి"** (కణ్ణినుణ్–4) అని మధురకవి ఆళ్వార్లు పల్కిన సూక్తిని **"మాఱన్ శడకోపన్"** అని అంటున్నారు, వీరు. **"పెరియవణ్కురుకూర్ నమ్బిక్కు ఆళురియ నాయ్ అడియేన్ పెఱ్ఱ నన్మైయే"** (కణ్ణినుణ్–3) అని మధురకవులు పల్కిన సూక్తిని వీరు **"వణ్కురుకూర్ ఏఱు ఎఙ్గళ్ వాళ్వామ్"** అన్ని అన్నారు. **"ఎళుమైయుమ్ ఎమ్బిరాన్ నిన్ఱు తన్ పుకళ్ ఏత్త అరుళినాన్"** (కణ్ణినుణ్–7) అని వారు పల్కిన సూక్తిని, వీరు **"ఏఱు ఎఙ్గళ్ వాళ్వామ్ ఎన్ఱేత్తుమ్ మధురకవియార్"** అని అంటున్నారు. **"ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్"** (కణ్ణినుణ్–4) అని నమ్మాళ్వార్లు పల్కిన సూక్తిని **"ఎమ్మై ఆళ్వార్"** అని వీరు అంటున్నారు. మధురకవి ఆళ్వార్లను పాలించేవారు– నమ్మాళ్వార్లు. నాథమునులనే మనలను పాలించేవారు –మధురకవి ఆళ్వార్లు.

**(అవరే అరణ్)** రక్షించేవారు. **"శరణ్"** అని పాఠమైతేకూడా రక్షకులనే అర్థం. మధురకవి ఆళ్వార్లకు అన్నీ ఆళ్వార్లే అయినట్లుగా, మనకు అన్నీ మధురకవులే– అని నాథమునులు అంటున్నారు.

**తనియన్ భావదీపిక (ఆంధ్రవివరణం) సంపూర్ణం.**



శ్రీమతే రామానుజాయ నమః

## మధురకవి ఆఴ్వార్లు అనుగ్రహించిన

# కణ్ణినుణ్శిఱుత్తామ్బు - సవ్యాఖ్యానమ్

## పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానావతారికై

"త్రైగుణ్యవిషయా వేదాః" ఎన్గిఱపడియే - ఐశ్వర్యాది సకలపురుషార్థఙ్గళైయుమ్ యథాధికారమ్ విధిక్కిఱ వేదమర్యాదైయిలే నిన్ఱార్‌కళ్ - ఋషికళ్. అతాకిఱతు - వేదోపబృంహణముఖత్తాలే చేతనరుడైయ గుణాను కూలమాక ఐశ్వర్యాదిక్షుద్రపురుషార్థఙ్గళైయుమ్, పరమపురుషార్థ లక్షణమాన మోక్షత్తైయు ముపదేశిక్కై. "ప్రాజాపత్యం గృహస్థానాం బ్రాహ్మం సన్యాసినాం స్మృతమ్" ఎన్ఱు తొడఙ్గి, కేవలాశ్రమానుష్ఠానఙ్గళైయే ఐశ్వర్య విశేషఙ్గళుక్కు సాధనమాక ఉపదేశిత్తు, "యోగినా మమృతం స్థానం స్వాత్మసన్తోషకారిణామ్" ఎన్ఱు కైవల్యనిష్ఠరుక్కు ఆత్మప్రాప్తియై ఉపదేశిత్తు, "ఏకాన్తిన స్సదా బ్రహ్మ ధ్యాయినో యోగినో హి యే, తేషాం తత్పరమం స్థానం యద్వై పశ్యన్తి సూరయః" ఎన్ఱు నిత్యసత్త్వస్థర్‌క్కు భగవత్ప్రాప్తియై ఉపదేశిత్తానిఱే, శ్రీపరాశరభగవాన్.

ఇన్ద ఋషికళిఱ్కాట్టిల్ ఆఴ్వార్‌కళుక్కు నెడు వాశి యుణ్డు. ఎఙ్గనే? ఎన్నిల్, వేదతత్పార్యమాయ్, ఉత్తమపురుషార్థమాన భగవత్ప్రాప్తియిలే నిష్ఠరాయ్, పిఱర్‌క్కు ఉపదేశిక్కు మిడత్తిలుమ్ శాస్త్రసిద్ధమాన ఐశ్వర్యాది కళైయుమ్ త్యాజ్యమాక ఉపదేశిక్కుమవర్‌కళిఱే. ఇవ్వాఴ్వార్‌కళుక్కుమ్, మధురకవియాఴ్వార్‌క్కుమ్ నెడు వాశి యుణ్డు. ఎఙ్గనే? ఎన్నిల్, ఇవ్విలక్షణ పురుషార్థత్తినుడైయ కాష్ఠైయాన తదీయశేషత్వత్తళవిలే వరప్పుకుర నిన్ఱార్, శ్రీమధురకవికళ్.

ఇవర్‌క్కు ఇవ్వేఱ్ఱమ్ వన్దపడి ఎఙ్గనే? ఎన్నిల్, ఆఴ్వార్, "పొయ్‌న్నిన్ఱ ఞానమ్" తొడఙ్గి "అవావఱ్ఱు వీడుపెఱ్ఱ" ఎన్నుమళవుమ్ శెల్ల అనుభవిత్త విడత్తిల్, ఆఴ్వార్ తమక్కు ప్పురుషార్థకాష్ఠైయాక అభిమతమాన తదీయ



శేషత్వత్తై ప్పఱ్ఱినార్. "ఆచార్యరుచిపరిగృహీతమాన అర్థమే సాత్త్వికర్‌క్కు ప్పరిగ్రాహ్యమ్" ఎన్నుమిడమ్ - మహాభారతసారమాన శ్రీసహస్రనామాధ్యాయత్తిలే శొల్లిఱ్ఱిఱే.

శ్రీభీష్మర్ పక్కలిలే సకలార్థఙ్గళైయుమ్ కుఱైవఱ క్కేట్ట ధర్మపుత్రన్, "ఇవర్‌తమక్కు ఉద్దేశ్యమాక స్వీకరిత్త తత్త్వహితఙ్గళే నమక్కు ఉద్దేశ్యమ్" ఎన్ఱు నినైత్తు, "కో ధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమో మతః" ఎన్ఱు కేట్క, "ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః" ఎన్ఱు తన్నుడైయ రుచి పరిగృహీతమాన అర్థత్తై ఉపదేశిత్తానిఱే. త్రిపురాదేవియారై. "ప్రమాణ ప్రాబల్యత్తాలేయో?, ఎమ్బెరుమానే ఆశ్రయణీయన్ ఎన్ఱు నీఙ్గళ్ పఱ్ఱి ఱ్ఱు" ఎన్న, "అతు వొన్ఱు మన్ఱు, ఎమ్బెరుమానార్ కాడిచ్చాల్ మూలైయిల్ దేవత్తైయై ఆశ్రయిత్తారాకిల్, అతువే ఎఙ్గళుక్కు మాశ్రయణీయ వస్తువాకక్కడవతు" ఎన్ఱాళ్. అన్ద న్యాయత్తాలే, ఆఴ్వార్‌తమక్కు త్తఙ్జమాక నినైత్తిరుమ్ తదీయ శేషత్వత్తైయే ఇవరుమ్ తమక్కు ప్పురుషార్థమాక అధ్యవసిక్కిఱార్.

ఇతుతాన్ రామాయణపురుషర్‌కళిల్ శ్రీశత్రుఘ్నాఴ్వాన్ వక్కలిలే అనుష్ఠానశేషమాక క్కాణప్పట్టతు. ఎఙ్గనే? ఎన్నిల్, "వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" ఎన్గిఱపడియే - వేదోబృంహణార్థమాక ప్రవృత్తమాన శ్రీరామాయణత్తిల్, రామాయణపురుషర్‌కళ్ నాల్వరుమ్ ధర్మసంస్థాపనార్థమాక అవతరిక్కైయాలే, నాల్వరుమ్ నాలర్థత్తై అనుష్ఠిత్తు క్కాట్టినార్‌కళ్,"కర్తా కారయితా చ సః" ఎన్గిఱపడియే అనుష్ఠిప్పిక్కైక్కాక, "ఒరువన్ శొల్లిఱ్ఱై ఒరువన్ శెయ్యక్కడవన్" ఎన్గిఱ ముఱై నేరాక అఴున్ఱు కిడక్కైయాలే, పితృవచన పరిపాలనాదికళాలే సామాన్యధర్మత్తై అనుష్ఠిత్తార్ - పెరుమాళ్. "పితుర్వచన నిర్దేశాత్", "అగస్త్యవచనాత్", "సుగ్రీవవచనాత్" ఎన్ఱిఱే ఇవరనుష్ఠానమ్.

"నిరుపాధికశేషియై క్కుఱిత్తు శేషభూతన్ కిఞ్చిత్కరిత్తు త్తాన్ ఉళనాకక్కడవన్" ఎన్గిఱ విశేషధర్మత్తై అనుష్ఠిత్తార్ - ఇళైయపెరుమాళ్, "కురుష్వ మా మనుచరమ్", "అహం సర్వం కరిష్యామి", "స భ్రాతుః" ఇత్యాది.

"రాజ్యఞ్చ తవ రక్షేయ మహం వేలేవ సాగరమ్, ప్రతిజానామి తే వీర మా భూవం వీరలోకభాక్" ఎన్గిఱపడియే - నిర్బన్ధిత్తు అడిమై శెయ్కై యన్ఱిక్కే,

"శేషి యుకన్ద అడిమైయే శేషభూతనుక్కు క్కర్తవ్యమ్" ఎన్నుమిడత్తై అనుష్ఠిత్తార్ - శ్రీభరతాழ்వాన్. తన్ శెల్లామైయై ప్పారాతే, శేషియుడైయ హృదయత్తై ప్పార్త్తు, "ఆరురోహ రథం హృష్టః" ఎన్ఱు ప్రీతియోడే మీణ్డానిఱే.

(రాజ్యఞ్చ తవ రక్షేయమ్) "రరక్ష ధర్మేణ బలేన" ఎన్గిఱపడియే - ఉమ్ముడైయ రక్షణమ్ పణ్ణుకైయన్ఱిక్కే, ఉమ్ముడైయ రాజ్యత్తైయుమ్ రక్షిక్కక్కడవేన్. ఎనక్కు తాదర్థ్యమ్ స్వరూపమానాలుమ్, ఉమ్మాల్ ఎన్నై మీఱవొణ్ణాతుకాణుమ్. (అహం వేలేవ సాగరమ్) కడలుక్కు క్కరై శేషమా యిరుక్కచ్చెయ్తేయుమ్, కరైయై అతిక్రమిక్కమాట్టాతిఱే', కడల్. అప్పడియే, "నీర్ పెరియార్" ఎన్నా ఉమ్మాల్ ఎన్నై మీఱవొణ్ణాతుకాణుమ్.

(ప్రతిజానామి) నాన్ ఇప్పడి ప్రతిజ్ఞై పణ్ణుకిఱేన్. (తే వీర) ఒరు కోழைయున్నేయో, నాన్ ప్రతిజ్ఞై పణ్ణిற்ఱు. ప్రతిజ్ఞై పణ్ణినాల్ అత్తై త్తలైక్కట్టి త్తరవల్ల ఆణ్పిళ్ళైత్తనముడైయ ఉమ్ముడైయమున్నేయన్ఱో. (మా భూవమ్) ఇప్పడి శెయ్తిలేనాకిల్, ఉమ్ముడైయ సన్నిధియిల్ వర్తిక్క ప్పెఱాతొழிకై యుమన్ఱిక్కే, ఉమ్ముడైయ రాజ్యత్తిలుమ్ వర్తిక్క ప్పెఱాతవనాకిఱేన్. (వీరలోకభాక్) ఉమ్మై ముడిశూడి అనుభవిక్క ప్పారిత్తు, అతు పెఱాతే పోన చకవర్తిపుక్క లోకమ్ పుకుకిఱేన్"- ఎన్గిఱపడియే నిర్బన్ధిత్తడిమై శెయ్కైయన్ఱియే, "శేషి ఉకన్ద అడిమై శెయ్యక్కడవేన్" ఎన్నుమిడత్తై అనుష్ఠిత్తార్, శ్రీభరతాழ்వాన్.

తన్ శెల్లామైయై ప్పారాతే, శేషియినుడైయ ఆదరత్తైయే పార్త్తు, "అరురోహ రథం హృష్టః ఎన్ఱు ప్రీతియోడే మీణ్డానిఱే, ఇప్పడి ఇరుక్కిఱ ఇవనై యల్లతఱియాతే యిరుక్కైయాలే, భగవచ్ఛేషత్వకాష్ఠైయాన తదీయ శేషత్వత్తై అనుష్ఠిత్తాన్ - శ్రీశత్రుఘ్నాழ்వాన్. "గచ్ఛతా మాతులకులం భరతేన తదా నఘః, శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః"

(గచ్ఛతా) ఎన్గిఱ వర్తమాననిర్దేశత్తాలే - పోకిఱ విడత్తిల్ తనక్కొరు ప్రయోజనముణ్డాయాతల్, ఇజ్గే మాతాపితాక్కళై క్కేళ్వికొళ్ళుతల్, పూర్వజరాన పెరుమాళై క్కేళ్వికొళ్ళుదతశెల్ శెయ్యు మివ్వళవుమిన్ఱిక్కే, అవనై యొழிయ జీవిక్క మాట్టాతపడియాలే పోనాన్ - ఎన్నై. (మాతులకులమ్) యుధాజిత్తు



అழைత్తతు అవనైయాకేయాలే, పోక్కిల్ ఉద్దేశ్యత్తైయు మవనుక్కు. ఇవనుక్కు అవన్ ఉద్దేశ్యనాయ్ పోనాన్-ఎన్నై. (భరతేన) చక్రవర్తియుమ్ తుఞ్జి, పెరుమాళుమ్ రాజ్యత్తై ప్పోకట్టు, ఇళైయపెరుమాళుమ్ "తొడర్న్దు అడిమై శెయ్యవేణుమ్" ఎన్ఱు పోయ్, శత్రుఘ్నాழ்వానుమ్ "నిన్నైయల్లతఱియేన్" ఎన్ఱిరుక్కుమ్ దశై యిలుమ్ "రాజ్యత్తై భరిక్కక్కడవన్" ఎన్ఱాయ్త్తు, శ్రీవసిష్ఠ భగవాన్ తిరునామమ్ శాత్తిற்ఱు. "భరత ఇతి రాజ్యస్య భరణాత్" ఎన్ఱానిఱే శ్రీశతానీకన్.

(తదా) ఇరువరుమ్ రాజపుత్రర్కళాయ్ నక్షత్రభేదముణ్డానాల్. పిరిత్తు ముహూర్తమిట్టుప్పోక ప్రాప్తమాయిరుక్క, అవన్ పోనతువే ముహూర్తమాక ప్పోనాన్-ఎన్నై. "గచ్ఛతా" ఎన్గిఱతిలే - అర్థసిద్ధమన్ఱో, "తదా" ఎన్గతెన్? ఎన్నిల్, అజ్గు - మమతానివృత్తియై చ్చొల్లిற்ఱు. ఇజ్గు - అతుక్కాశ్రయమాన అహజ్కార నివృత్తియై చ్చొల్లుకిఱతు. ఆకైయాలే పునరుక్తిదోష మిల్లై. శేషత్వ విరోధియిఱే యిరణ్డుమ్.

(అనఘః) అఘమిల్లాతతు ఇవనుక్కేయిఱే. అఘమావతు - ఉద్దేశ్య విరోధియిఱే. ఇవ్విడత్తిల్ అఘమావతు - రామభక్తి. ఇత్తై ప్పాపమెన్నప్పో మో? ఎన్నిల్, పాపత్తిల్ పుణ్యమ్ నన్ఱాయిరుక్క, మోక్షవిరోధియాకైయాలే పుణ్యముమ్, "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్" ఎన్ఱు పాపశబ్ద వాచ్య మాయిற்ఱిఱే. ఆకైయాలే, భరతానువృత్తియాకిఱ ఉదేశ్యత్తుక్కు విరోధి యాకిల్ రామసౌన్దర్యత్తిల్ కాల్ తాழுమతువుమ్ పాపమామిత్తనైయిఱే. "రామే ప్రమాదం మా కార్షీః" ఎన్ఱు రామానువృత్తిమ్ ఇడైచ్చువరాక చ్చొల్లి ற்ఱిఱే. రామసౌందర్యత్తై భరతానువృత్తిక్కు ఇడైచ్చువరెన్నుమిడమ్ శొల్ల వేణ్డావిఱే.

(శత్రుఘ్నః) పిళ్ళైకళుడైయ సన్నివేశజ్గళై ప్పార్త్తు త్తిరునామమ్ శాత్తుకిఱ శ్రీవసిష్ఠభగవాన్, పెరుమాళ్, కణ్డారై ఆழ்కాలే తువక్కవల్లారాక తోற்ఱు కైయాలే "రామన్" ఎన్ఱుమ్, ఇళైయ పెరుమాళుక్కు క్కైజ్కర్యమే నిరూపకమాక తోற்ఱుకైయాలే" లక్ష్మణన్" ఎన్ఱుమ్ తిరునామమ్ శాత్తినాప్పోలే,

ఇవరుడైయ సన్నివేశత్తై క్కాణవే శత్రుక్కళ్ మణ్ణుణ్ణుమ్పడి యిరుక్కైయాలే, 'శత్రుఘ్నన్" ఎన్ఱు - తిరునామమ్ శాత్తినాన్. (నిత్యశత్రుఘ్నః) బాహ్యశత్రుక్కళై యన్ఱిక్కే ఆన్తరశత్రుక్కళాన ఇన్ద్రియఙ్గళైయుమ్ జయిత్తిరుక్కుమెన్నై. అవ్విన్ద్రియ జయత్తిన్ ఎల్లై ఎవ్వళవు? ఎన్నిల్. "పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్" ఎన్గిఱ రామసౌన్దర్యత్తిలుమ్ తువక్కుణ్ణాతిరుక్కై, ఆతాకిఱతు పెరుమాళై ప్పఱ్ఱు మ్బోదుమ్ తన్ ఉకప్పాలే యాదల్, అవనుడైయ వైక్షణ్యత్తాలే యాతలిన్ఱిక్కే, "తనక్కు ఉద్దేశ్యనాన ఇవన్ ఉకన్ద విషయమ్" ఎన్ఱు పఱ్ఱుకై.

(నీతః) రాజాక్కళ్ పోమ్బోతు ఉడైవాళ్ మఱ్ఱొన్ఱై కొణ్డుపోమోపాతి అవన్ కొడుపోక ప్పోనాన్. ద్రవ్యత్తుక్కు ద్రవ్యాన్తరఙ్గళోట్టై సంయోగమ్ ఉభయనిష్ఠమాయిరుక్కుమితే. అతుపోలన్ఱిక్కే, జాతిగుణఙ్గళోపాతి పోనాన్. (ప్రీతిపురస్కృతః) "జ్యేష్ఠానువృత్తి కర్తవ్యమ్" ఎన్ఱు పోనానల్లన్. "అహం సర్వం కరిష్యామి" ఎన్ఱు పోన ఇళైయపెరుమాళైప్పోలే, "పోనవిడత్తిలే సర్వశేషవృత్తియుమ్ పణ్ణలామ్" ఎన్ఱు పారిత్తుక్కొణ్డు ప్రీతి ప్రేరిక్క ప్పోనాన్. పడైవీట్టిల్ ఇరున్దాల్ పలరుముణ్డాకైయాలే, విట్టుక్కాట్టోపాతియితే సిద్ధిప్పతు.

(నీతః) ఎన్నైయాలే - శేషత్వత్తిల్ అచిత్కల్పనాయిరుక్కక్కడవన్. (ప్రీతిపురస్కృతః) ఎన్నైయాలే - స్వరూపానురూపమాన వృత్తియిలే చైతన్య ప్రయుక్తమాన ధర్మఙ్గళుణ్డాయిరుక్కై. "పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే" ఎన్ఱితే అభియుక్తర్ వార్త్తై. "అనఘః నిత్యశత్రుఘ్నః" ఎన్ఱు పావనత్వ త్తాలుమ్, భోగ్యత్తైయాలుమ్ అవనైయే పఱ్ఱినాన్ - ఎన్నవుమామ్.

"అనఘః, నిత్యశత్రుఘ్నః ఎన్ఱతుక్కు ప్రయోజనమెన్? ఎన్నిల్, "శ్రీ శత్రఘ్నాళ్వాన్ పెరమాళుక్కు నల్లనానపడి - అవనై యల్లతఱియాద శ్రీభరతాళ్వానైయల్లతు వేఱొన్ఱు అఱియాతపడి యానాన్" ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్తార్. ఇతువే ప్రయోజనమానాల్, శొన్న మిక్కై యెల్లామ్ పొఱుక్కు మితే. అక, ఇప్పడి శ్రీశత్రఘ్నాళ్వానైప్పోలే ఇరుప్పార్ ఒరువరాయ్త్తు, శ్రీమధురకవికళ్.



ఇని, ఇవర్క్కు త్తదీయర్ ఉద్దేశ్యరామిడత్తిల్, భగవత్సమ్బన్ధమాత్రత్తిలే విషయీకరిత్తుమ్, తద్విషయత్తిలే ఇప్పోతు అవగాహిప్పిత్తుమ్, గుణానుసన్ధానత్తాలల్లతు శెల్లాత దశైయిలే "బోధయన్తః పరస్పరమ్" ఎన్గిఱపడియే పోతుపోక్కుకైక్కు ఉశాత్తుణైయాకవుమ్, "యత్ర పూర్వే సాధ్యా స్సన్తి దేవాః" ఎన్గిఱపడియే ప్రాప్తిదశైయిల్ భగవదనుభవసహకారికళాయుమ్ - ఇప్పడి బహుముఖమాన ఉపకారత్తాలే సర్వావస్థైయిలుమ్ తదీయరై "ఉద్దేశ్యర్" ఎన్ఱధ్యవసిత్తు, తమక్కు వైష్ణవవిషయీకారత్తుక్కు మున్బే అజ్ఞాతజ్ఞాపనముఖత్తాలే భగవద్విషయత్తిల్మూట్టిన మహోపకారకరాన ఆళ్వార్ తమ్మైయే పఱ్ఱుకిఱార్.

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానావతారికై ముఱ్ఱిఱ్ఱు.

## అరుమ్బద విళక్కమ్

తిరుమన్త్రార్థప్రతిపాదకఙ్గళాన దివ్యప్రబన్ధఙ్గళై వ్యాఖ్యానమ్ శెయ్తరుళుకిఱ పరమకారుణికరాన పెరియవాచ్చాన్ పిళ్ళై తమ్ముడైయ పరమకృపైయాలే, "వేదత్తుక్కు ఓమెన్నుమతుపోల్ ఉళ్ళతుక్కెల్లామ్ శురుక్కాన" తిరుప్పల్లాణ్డుక్కుమ్, "మత్తిమమామ్ పతమ్పోల్ శీర్త్త మతురకవి శెయ్ కలైక్కుమ్", తృతీయపదార్థ ప్రతిపాదకఙ్గళాన మఱ్ఱుముళ్ళ దివ్యప్రబన్ధఙ్గళుక్కు ముళ్ళ తాత్పర్యఙ్గళై అఱిన్దు ఎల్లారుమ్ ఉజ్జీవిక్కవేణ్డుమెన్ఱు తిరువుళ్ళమ్బుఱ్ఱి, అతిల్, మధ్యమపదార్థ నిష్ఠాప్రతిపాదకమాన కణ్ణినుణ్ శిఱుత్తామ్బిన్ పొరుళై అఱివిక్కక్కోలి, వక్తృవైలక్షణ్యత్తైయుమ్, ప్రతిపాద్య వైలక్షణ్యత్తైయుమ్ అరుళిచ్చెయ్యవే ప్రబన్ధవైలక్షణ్యమ్ అర్థసిద్ధమాకైయాలే, ప్రథమమ్ వక్తృవైలక్షణ్యత్తై అరుళిచ్చెయ్కిఱార్ (త్రైగుణ్యేత్యాది - ఇరుప్పార్ ఒరువరాయ్త్తు శ్రీమధురకవికళ్) ఎన్నుమళవుమ్. (ఇని) ఇత్యాదివాక్యఙ్గళిల్ ప్రతిపాద్యవైలక్షణ్యమెన్ఱు కణ్డుకొళ్వదు.

అతిల్– వక్తృవైలక్షణ్యసిద్ధ్యర్థమాక ఋషికళుక్కుమ్ ఆళ్వార్కళుక్కుముళ్ళ నెడు వాశియై ఉపపాదిక్కిఱార్ (త్రైగుణ్యేత్యాది). "త్రయో గుణాః త్రైగుణ్యమ్ - సత్త్వరజస్తమాంసి. సత్వరజస్తమసిప్రచురాః పురుషాః త్రైగుణ్యశబ్దేనోచ్యన్తే. తద్విషయా వేదాః" ఎన్ఱితే భాష్యమ్, ఇత్తై యుట్కొణ్డు (యథాధికారమ్ విధిక్కిఱ) ఎన్గిఱతు.

కీఴ్‌వాక్యవివరణమ్ (అతాకిఱతు- ఇత్యాది). ఇప్పడి ఉపదేశిత్తార్‌కళో? ఎన్న; ఋషికళిల్ తలైయాన శ్రీపరాశరభగవాన్దానే శొన్నానెన్ఱు కాట్టుకిఱార్ (ప్రాజాపత్యమిత్యాది) ప్రాజాపత్యమ్- ప్రజాపతిలోకమ్, బ్రాహ్మమ్- బ్రహ్మలోకమ్.

"ఏడునిలమ్", "అణ్డక్కులమ్" ఎన్గిఱ పాట్టుక్కళైయుమ్, "ఒరు నాయకమ్" ముదలాన దివ్యసూక్తికళైయుమ్ నోక్కి వాశియై ఉపపాదిక్కిఱార్ (వేదతాత్పర్య మిత్యాది) ఆఴ్వార్‌కళిలు మివరుక్కుణ్డాన తన్నేఱ్ఱమ్ కాట్టుకిఱార్ (ఇవ్విలక్షణేత్యాది). (తదీయ శేషత్వత్తళవిలే) తదీయశేషత్వమాత్రత్తిలే.

ఆఴ్వార్ తమక్కు-ముఴుచ్చొల్లు. (తదీయశేషత్వత్తై) ఎన్ఱ అనంతరమ్ "మధుర కవికళ్" ఎన్ఱు కూట్టిక్కొళ్వతు. ఆఴ్వారుక్కు - అభిమతమానాల్ ఇవర్‌క్కు అత్తై ప్పఱ్ఱవేణ్డుమో? ఎన్న (ఆచార్యేత్యాది).

శ్రీసహస్రనామాధ్యాత్తిలే శొన్న ప్రకారమేతు? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (శ్రీభీష్మరిత్యాది) "ఆచార్యరుచిపరిగృహీతమాన అర్థమే పరిగ్రాహ్యమ్" ఎన్నుమతుక్కు సంవాదమాక ఓర్ ఐతిహ్యమ్ అరుళిచ్చెయ్‌కిఱార్ (త్రిపురాదేవియారిత్యాది) త్రిపురాదేవియార్- రాజపత్నీ. (కాడిచ్చాల్‌మూలై) ఈశాన్యదిక్కు; అవ్విడత్తుక్కు దేవతై- రుద్రన్. అవనై ఇప్పడి శొన్నతు పేర్ శొల్లవుమ్ అసహ్యమాకైయాలే. ఉక్తత్తై ప్రకృతోపయోగి- యాక్కుకిఱార్ (అన్ద న్యాయత్తాలే -ఇత్యాది).

కీఴ్ ప్రమాణముఖత్తాలుమ్, ఐతిహ్యముఖత్తాలుమ్ సిద్ధిత్త అర్థత్తిల్ అనుష్ఠానముమ్ కాట్టుకిఱార్ (ఇతుతానిత్యాది). (అనుష్ఠానశేషమ్) ఎన్ఱతు - బహువ్రీహి. ఇత్తాల్- శెయ్‌తఱ్ఱదు- ఎన్ఱపడి. శత్రుఘ్నాఴ్వాన్ అనుష్ఠానన్దాన్ ఉపాదేయమాన పడి ఎన్? ఎన్న; (వేదోపబృంహణేత్యాది). ధర్మసంస్థాపనార్థమ్ నాల్‌వరు మవతరిక్కైయాలే శ్రీశత్రుఘ్నాఴ్వానతుమ్ ఉపాదేయమెన్ఱు కరుత్తు. తౌ- కుశలవౌ, ప్రభు:- వాల్మీకి:, అగ్రాహయత-గ్రహిప్పిత్తాన్. మఱ్ఱై మూవర్ పడియు మన్ఱిక్కే, శ్రీశత్రుఘ్నాఴ్వాన్‌పడియై అనుష్ఠిక్కైక్కు నియామకమెన్? ఎన్గిఱ శఙ్కైయిల్, ఇతువే పరమధర్మమెన్ఱు అరుళిచ్చెయ్య త్తిరువుళ్ళమ్బుఱ్ఱి, తారతమ్యమ్ కాట్టుకైక్కాక ప్రయోజనకథనముఖేన పెరుమాళ్ ప్రకాశిప్పిత్త అర్థమిన్నతు- ఎన్గిఱార్ (కర్తా ఇత్యాది) ముఱై-మర్యాదై. అనుష్ఠిత్తార్ ఎన్గైక్కు ప్రమాణఙ్గళ్ (పితుర్వచనేత్యాది).



రామానుజసిద్ధాన్తత్తై సప్రమాణమాక క్కాట్టుకిఱార్ (నిరుపాధికేత్యాది).

ఇళైయపెరుమాళ్‌వృత్తియై క్కాట్టిలుమ్ శ్రీభరతాఴ్వానుడైయ అనుష్ఠానత్తుక్కు వైలక్షణ్యమ్ కాట్టువారాక, ఇళైయపెరుమాళ్ పడిక్కు ప్రమాణమ్ కాట్టుకిఱార్ (రాజ్యం చేత్యాది)

ప్రతీకగ్రహణపూర్వకమాక వ్యాఖ్యానమ్ (రాజ్య మిత్యాది). చకారత్తై అనుక్తసముచ్చయమాక్కి అర్థమరుళిచ్చెయ్‌కిఱార్ (రరక్షేత్యాది). "తవ రాజ్యఞ్చ రక్షేయమ్" ఎన్గైయాలే శేషత్వమ్ తోన్ఱుకైయాలే, శేషభూతనాన నీ ఎన్నై రక్షిక్కైయావతెన్? ఎన్గిఱ శఙ్కైయిలే "రక్షేయమ్" ఎన్గిఱ లిఙ్గై, ఆవశ్యకకార్యకర ప్రవర్తననిమన్త్రణత్తిలే ఆక్కి అరుళిచ్చెయ్‌కిఱార్ (ఎనక్కిత్యాది). (మీఱవొణ్ణాతు) అతిక్రమిక్కవొణ్ణాతు; రక్షియాతే పోకేన్- ఎన్గై. ఇతుక్కు ఉపపత్తిపరమాన దృష్టాన్త కథనత్తుక్కు భావ మరుళిచ్చెయ్‌కిఱార్ (కడలుక్కిత్యాది వాక్యద్వయముమ్).

"రామ" ఎన్నాతే "వీర" ఎన్ఱతుక్కు ప్రతిజ్ఞానిర్వహణమ్ పణ్ణవిల్లైయో? ఎన్గిఱ శఙ్కాపరిహారపరమాక త్తాత్పర్యమరుళిచ్చెయ్‌కిఱార్ (ఒరు కోఴై-యిత్యాది వాక్యద్వయత్తాలే) (కోఴై) అచతురన్. ఇప్పడి చక్రవర్తియుమ్ ప్రతిజ్ఞై పణ్ణవిల్లైయో? ఎన్గిఱ శఙ్కైక్కు ఉత్తరమాక త్తాత్పర్యమరుళిచ్చెయ్‌కిఱార్ (ఇప్పడి యిత్యాది వాక్య ద్వయత్తాలే) ఇతిల్ "నోచే న్మాభూవమ్" ఎన్ఱు కూట్టి అసత్తాక క్కడవనెన్ఱు పొరుళాక్కి, ఇతుక్కు త్తాత్పర్యమ్ (ఇప్పడి శెయ్‌తిలేనాకి లిత్యాది). (వర్తిక్కప్పెఱాతవన్ ఆకిఱేన్) ఎన్గైయాలే- అసత్కల్పనాకిఱేన్ -ఎన్ఱు కరుత్తు. "వీరలోకభాగ్భవేయమ్" ఎన్ఱు కూట్టి వీరపదత్తుక్కు చక్రవర్తిపరమాక భావమ్ (ఉమ్మై - యిత్యాది).

యద్వా, "వీరలోకభాక్ మా భూవమ్" ఎన్ఱు ఒరు వాక్యమాయ్, ప్రతిజ్ఞైయై ప్పణ్ణి చ్చెయ్యాత దశరథన్‌లోక మడైయక్కడవేనల్లేన్ - ఎన్ఱు శబ్దార్థమాకైయాలే, "నానుమ్ శెయ్యావిడిల్ అవన్‌లోకత్తై యడైన్ద దేవరీర్ సన్నిధియిల్ రాజ్యత్తిలుమిరాదే పోకక్కడవేన్" - ఎన్ఱు శపథమ్ పణ్ణుకిఱదాక త్తాత్పర్య మరుళిచ్చెయ్‌కిఱార్ (ఇప్పడి యిత్యాది వాక్యద్వయత్తాలే). (పుక్క లోకమ్) పుకక్కడవలోకమ్, "న దేవలోకా క్రమణమ్" ఎన్ఱ ఇళైయపెరుమాళుక్కు వీరస్వర్గమ్ అనుద్దేశ్యమాకైయాలే, ప్రతిజ్ఞై పణ్ణిన అర్థత్తై ప్పణ్ణావిడిల్ వీరస్వర్గత్తై యడైయాతవనాకక్కడవేన్ - ఎన్ఱ శపథమ్

ఇవర్ప్రతిజ్ఞైక్కు చ్చేరాతు; ఆకైయాలే, దశరథన్ పుక్క లోక మెన్ఱు వ్యాఖ్యానమ్ శెయ్తార్ – ఎన్ఱు కణ్డుకొళ్వతు.

ఇతు శేషియుకన్ద అడిమై ఎన్గైక్కు సూచకమేన్? ఎన్న (తన్ శెల్లామై – యిత్యాది). తన్శెల్లామై– రామవిశ్లేషమ్ సహియామై. ఉక్తత్తై హేతువాక్కికొణ్డు శ్రీశత్రుఘ్నా*ళ్వా*న్ పడియై క్కాట్టుకిఱార్ (ఇప్పడి–యిత్యాది). ఉక్తార్థే ప్రమాణమ్ (గచ్ఛతేత్యాది).

ఇన్ద శ్లోకార్థవివరణమ్ (గచ్ఛతా ఎన్గిఱ–ఎన్ఱు తొడఙ్గి, ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్తార్– ఎన్నుమళవుమ్). వర్తమాననిర్దేశత్తాలే ఇరువరుడైయ గమన కాలముమ్ ఏకమాక త్తోన్ఱుకైయాలుమ్, శ్రీశత్రుఘ్నా*ళ్వా*న్ గమనత్తుక్కు విళమ్బనివృత్తి తోన్ఱుకైయాలుమ్, విళమ్బహేతుక్కళై వ్యావర్తిప్పిత్తుక్కొణ్డు, తన్నివృత్తియై ఉపపాదిత్తు, గమనహేతువైయుమ్ శొల్లుకిఱార్ (గచ్ఛతా ఎన్గిఱ– ఇత్యాది). కులమ్–గృహమ్. యుధాజిత్తుకుల మెన్నాతే, "మాతులకులమ్" ఎన్ఱతుక్కు త్తాత్పర్య మరుళిచ్చెయ్కిఱార్ (యుధాజిత్తిత్యాది). (అవనై) భరతా*ళ్వా*నై. "భృఙ్–భరణే" ఎన్గిఱ ధాతువై యుట్కొణ్డు భరతపదతాత్పర్యమ్ (చక్రవర్తియు మిత్యాది). (తుఙ్జీ) నశిత్తు. "రాజ్యత్తై ప్పొకట్టుప్పోయ్" ఎన్ఱు, "తుఙ్జీ" ఎన్ఱ అనన్తరమ్ శొల్లుకైయాలే శ్రీభరతా*ళ్వా*న్ "ప్రసాదం కర్తు మర్హసి" ఎన్ఱుకొణ్డు మీళువరో? శ్రీభరతా*ళ్వా*న్ "ప్రసాదం కర్తు మర్హసి" ఎన్ఱుకొణ్డు మీళావరో? ఎన్నుమ్ నశైయాలే శ్రీచిత్రకూటత్తళవుమ్ శెల్ల, పెరుమాళ్ రాజ్యత్తై ఇవన్మేలే పొకట్టుప్పోన అప్పోతు– ఎన్ఱు కరుత్తు (నిన్నై) ఎన్ఱతు. శ్రీభరతా*ళ్వా*నై. త్రికాలజ్ఞనాకైయాలే ఇప్పడి తిరునామమ్ శాత్తినాన్ – ఎన్ఱు కరుత్తు. ఇప్పడి తామ్ అరుళిచ్చెయ్తతుక్కు సంవాదమ్ కాట్టుకిఱార్ (భరత ఇత్యాది).

ప్రకారాన్తరేణ వరుకిఱ కాలభేదశఙ్కైయై ప్పరిహరిత్తుక్కొణ్డు శబ్దార్థమ్ (ఇరువరుమిత్యాది) పారతన్త్ర్యత్తాలే పోనాన్ఎన్ఱపడి. "పుష్యే జాతస్తు భరతః" "సార్పే జాత స్తు సౌమిత్రిః" ఎన్ఱ వచనఙ్గళై యుట్కొణ్డు (నక్షత్రభేదమ్) ఎన్ఱతు. ఇప్పార తన్త్ర్యమ్, "గచ్ఛతా" ఎన్గిఱవిడత్తిల్ తానే శొల్లలామే ఎన్ఱు శఙ్కిత్తు, గోబలీ వర్ద



న్యాయత్తాలే పరిహరిక్కిఱార్ (గచ్ఛతేత్యాది). అఙ్గు మమతానివృత్తియుమ్, ఇఙ్గు అహఙ్కారనివృత్తియుమాక చ్చొల్లుకైక్కు క్కరుత్తు. –మున్దుఱ అహఙ్కారనివృత్తి శొల్లిల్ తత్కార్యమాన మమతానివృత్తి అర్థసిద్ధమాకైయాలే, "తదా" ఎన్ఱతుక్కు ప్రయోజనమ్ సిద్ధియాతెన్ఱు కణ్డుకొళ్వతు. మమతానివృత్తి శొన్నాల్ పోతాతో? అహఙ్కారనివృత్తి శొల్లవేణ్డుమో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (శేషత్వేత్యాది).

(వక్ష్యమాణత్తై త్తిరువుళ్ళమ్బ*ఱ్ఱి* నఞర్థత్తై అరుళిచ్చెయ్తు కొణ్డు విద్ధరాకిఱార్ (అఘమిల్లాతతిత్యాది). అఘపదార్థ మరుళిచ్చెయ్కిఱార్ (అఘమావతు–ఇత్యాది) అహఙ్కారమమకారనివృత్తి శొన్నపోతే పాపరాహిత్యమ్ సిద్ధమన్ఱో! పునః శొల్లవేణు డమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (ఇవ్విడత్తిలిత్యాది) రామభక్తి ఉద్దేశ్యమెన్న లాయిరుక్క, ఉద్దేశ్యవిరోధియాక్కి చ్చొల్లప్పోమో? ఎన్గిఱ శఙ్కైయై అనువదిత్తు దృష్టాన్తముఖేన పరిహరిక్కిఱార్ (ఇత్తై ఇత్యాది వాక్యత్రయత్తాలే) సౌన్దర్యత్తిల్ కాల్ తా*ళ్వై* కైయే రామభక్తి, ఇతు భరతానువృత్తిక్కు విరోధి ఎన్నుమిడత్తై కిమ్బునర్న్యా యత్తాలే సాధిక్కిఱార్ (రామప్రమాద మిత్యాది). ఇడైచ్చువర్– ప్రతిబన్ధకమ్.

అప్రాప్తవిషయప్రావణ్యమాకిఱ అనిష్టత్తై అనాదియాక జనిప్పిక్కైయాలే నిత్యశత్రువెన్ఱు. ఇన్ద్రియఙ్గళాక అరుళిచ్చెయ్కిఱార్ (బాహ్యేత్యాది). "శత్రుఘ్న శ్చత్ర మాదదే" ఎన్ఱుమ్, "రామ మేవానుచిన్తయన్" ఎన్ఱుమిరుక్క, సౌన్దర్యత్తిల్ తువక్కుణ్ణామై శొల్లక్కూడుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (అతాకిఱతు – ఇత్యాది).

"భరతే గచ్ఛతి గతవాన్" ఎన్ఱు శొల్లామల్, "భరతేన నీతః" ఎన్ఱు భరత కర్తృకనయన క్రియాకర్మత్వమ్ శొల్లుకైయాలే "స్వతన్త్రః కర్తా" ఎన్ఱు భరతా*ళ్వా*నుక్కు స్వాతన్త్ర్యముమ్, శ్రీశత్రుఘ్నా*ళ్వా*నుక్కు అచిద్వత్ పారతన్త్ర్యముమ్ తో*ఱ్ఱు*కిఱతెన్ఱు అరుళిచ్చెయ్కిఱార్ (రాజాక్కళిత్యాది) కీ*ళ్*–అహఙ్కారమమ కారనివృత్తి శొన్నపోతే పారతన్త్ర్యమ్ సిద్ధమాకైయాలే, ఇప్పదత్తుక్కు అచిద్వత్పార తన్త్ర్యమ్ వివక్షిత మెన్ఱు కరుత్తు. (ఉడైవాళ్) అరైప్పుడైవైయిలే శొరుకిఱ ఆయుధమ్. ఉక్తపారతన్త్ర్యత్తిల్ ఎల్లై నిలమ్ కాట్టువారాక ఉక్తత్తై వ్యావర్తిప్పిత్తుక్కొణ్డు అతిలుమ్ అతిశయమ్ కాట్టుకిఱార్ (ద్రవ్యత్తుక్కిత్యాది). (ఉభయనిష్ఠమ్) ఎన్ఱతు – ఉభయాధీనమెన్ఱపడి. ఇత్తాల్–

అన్యతరరాల్ విడప్పోకాతు–ఎన్నై. "ప్రీతిపురస్కృతః" ఎన్గతఱ్కు, "భరతేన ప్రీతి పురస్కృతః" ఎన్రాయ్ – భరతనాలే బహుమతనాయ్ ప్పోవానెన్ఱు అర్థమ్ శొల్లు మళవిల్, కీழ் శొన్న అత్యన్తపారతన్త్ర్యాదికళుక్కు విరుద్ధమాకైయాలే, "స్వపిత్యా పురస్కృతః" ఎన్ఱు వివక్షిత్తు ప్రీతియాలే ప్రేరిక్కప్పట్టాన్ – ఎన్ఱు అర్థమరుళిచ్చెయ్ కిఱార్ (జ్యేష్ఠానువృత్తీత్యాది) ఇత్తాల్–కీழ் శొన్న పారతన్త్ర్యమ్ వైధమెన్ఱుకరుత్తు.

"నీతః" ఎన్ఱు శొల్లియిరుక్క, "ప్రీతిపురస్కృతః" ఎన్ఱు శొల్లక్కూడుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (నీత ఇత్యాది). (ఇరుక్కక్కడవన్) ఎన్ఱ అనన్తరమ్ "ఎన్ఱపడి" ఎన్ఱు శేషమ్. ఇతఱ్కు ప్రమాణమ్ (పడి యిత్యాది). కీழ் "అనఘః" ఎన్గతుక్కు– సౌన్దర్యత్తాల్ రామభక్తిరహితనెన్ఱు అర్థమాక్కి, ఇతఱ్కు హేతువాక "నిత్యశత్రుఘ్నః" ఎన్గత్తై యుట్కొణ్డు, ఇవ్విరణ్డాలుమ్ పెరుమాళిడత్తిఱ్కాట్టిలుమ్ శ్రీభరతాழ்వానిడత్తిల్ భోగ్యతాతిశయమ్ తోఱ్ఱ వ్యాఖ్యానమ్ శెయ్తరుళినార్. ఇని, ఇవ్విరణ్డుపదత్తాలుమ్ పావనత్వ – భోగ్యత్వఙ్గళ్ పెరుమాళిడత్తిఱ్కాట్టిలుమ్ శ్రీభరతాழ்వానిడత్తిలే తోఱ్ఱ అర్థాన్తరమరుళిచ్చెయ్కిఱార్ (అనఘః – ఇత్యాది). అనఘపదత్తాల్. రామవిషయత్తిల్ పావనత్వప్రయుక్తమాన మహనీయతైయాలే వరుకిఱ ప్రీతిరహిత నెన్ఱు తోఱ్ఱు కైయాలే, భరతవిషయత్తిల్ పావనత్వాతిశయమ్ తోఱ్ఱుకిఱతెన్ఱు కరుత్తు. "నిత్య శత్రుఘ్నః" ఎన్ఱు రామసౌన్దర్యత్తిల్ కణ్ వైయార్ –ఎన్నైయాలే, ఇఙ్గు కణ్వైత్తవనుక్కు భోగ్యతాతిశయమ్ తోఱ్ఱుమెన్ఱు కరుత్తు.

"అనఘః" ఎన్గతుక్కు "రామభక్తిరహిత:" ఎన్ఱుమ్, "నిత్యశత్రుఘ్న:" ఎన్గతుక్కు– రామవిషయత్తిల్ కణ్వైయానెన్ఱుమ్ శొల్లక్కూడుమో? "కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునన్దన !" ఎన్గిఱపడియే– పెరుమాళుక్కు శత్రుఘ్ననిడత్తిల్ ప్రీతియుణ్డాకైయాలే, ఇవరుక్కుమ్ అవరిడత్తిల్ కణ్వైక్క వేణ్డుకైయాలే, ఇవ్విరణ్డు పదత్తుక్కుమ్ పొరుళిల్లామైయాల్ ప్రయోజనమిల్లై ఎన్ఱు మున్బుళ్ళ ముతలికళ్ కేట్క; అతఱ్కు– ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్త శ్రీసూక్తియై ఇఙ్గుమ్ అన్ద శఙ్కైయై ప్పరిహరిక్కవేణ్డుకైయాలే సంవాదమాక అరుళిచ్చెయ్కిఱార్ (అనఘః – ఎన్ఱు తొడఙ్గి, అరుళిచ్చెయ్తార్ –ఎన్నుమళవుమ్)



ఇన్ద ప్పరిహారత్తుక్కు ఇరువర్క్కుమ్ శ్రీభరతాழ்వానై యిట్టు పరస్పరప్రీతి యుణ్డా కిలుమ్, నేరే రామవిషయత్తిల్ భక్తియిల్లై– ఎన్ఱుమ్, కణ్ వైయాన్– ఎన్ఱుమ్ తాత్పర్యమ్. (శొన్న మికై యెల్లామ్ పొఱుక్కుమితే) ఎన్ఱతు – పెరుమాళుక్కు నల్లనాన శ్రీభరతాழ்వానై యల్లతు అఱియాతిరుక్కైయాలే, "అనఘ: నిత్యశత్రుఘ్న:" ఎన్ఱు శొన్న మికై యెల్లామ్ పొఱుక్కుమ్– ఎన్ఱపడి.

ఇత్తాల్ – ఈశ్వరవిషయత్తిల్ కణ్ణழிవఱ్ఱ రుచియుడైయారభిమానత్తిలే ఒతుఙ్గి అవర్తిరువడికళే ప్రాప్యముమ్, ప్రాపకముమెన్ఱధ్యవసిత్తిరున్దవర్. "తిరితన్దాకిలుమ్" ఎన్గిఱపడియే ఈశ్వరనుక్కు మికవుమ్ ప్రియవిషయరావర్– ఎన్ఱతాయ్త్తు. ఆక, ఇవ్వళవుమ్ వర వక్తృవైలక్షణ్య మరుళిచ్చెయ్తార్.

ఇని, వైలక్షణ్యాన్తర కథనముఖేన ప్రతిపాద్యవైభవత్తై అరుళిచ్చెయ్కిఱార్ (ఇని ఇత్యాది) (ఉద్దేశ్యరా మిడత్తిల్) ఎన్ఱతుక్కు (అధ్యవసిత్తు) ఎన్ఱత్తోడే సమ్బన్ధమ్. (భగవత్సమ్బన్ధమాత్రత్తిలే) ఎన్ఱతు – భగవదాభిముఖ్యముళ్ళమాత్రమ్ కొణ్డు –ఎన్ఱపడి. (తద్విషయత్తిలే ఇప్పోతు) ఎన్ఱతు– ఇవ్విభూతియిల్ ఇరుక్కుమ్ కాలమ్. (ప్రాప్తిదశైయిల్) ఎన్ఱతు– మోక్షదశైయిల్ – ఎన్ఱపడి.

అవతారికై అరుమ్బదమ్ ముఱ్ఱిఱ్ఱు

# కణ్ణినుణ్శిఱుత్తామ్బు – సవ్యాఖ్యానమ్

## పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్ – అవతారిక

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"** ప్రబంధాన్ని అనుగ్రహించిన మధురకవి ఆழ்్వార్లు ఋషులకంటే, మిగిలిన ఆழ்్వార్ల కంటే చాలా గొప్పతనాన్ని కలవారు. **"త్రైగుణ్యవిషయో వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!, నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్"** (భగవద్గీత–2–45) (అర్జునా! సత్తరజస్తమస్సులనే త్రిగుణాలలో ఒక్కొక్క గుణాన్ని అధికంగా కల్గిన మానవులకోసం (సాత్త్విక–రాజస– తామస పురుషుల

కోసం) - వేదాలు ఉన్నాయి. నీవు, ఒక దానితో ఇంకొకటి కలసిన త్రిగుణాలను లేనివాడవు (సాత్త్విక గుణాన్ని కలవాడవు)గా, నిత్యం ఆ సత్త్వగుణాన్నే వృద్ధి చేసికొందువుగాక. సుఖదుఃఖాదులనే సాంసారిక స్వభావాలను లేనివాడవై, ఎల్లప్పుడు సత్త్వగుణాన్నే స్థిరంగా కల్గి ఉండేవాడవై, లేని వస్తువులను పొందడం, ఉండేవానిని రక్షించుకోవడం- అనే యోగక్షేమాల పట్ల ఆసక్తి లేనివాడవై, ఆత్మస్వరూపంలోనే అభినివేశాన్ని కలవాడవై ఉందువుగాక) అనే రీతిలో వారి వారి గుణాలకు తగిన రీతిలో ఐశ్వర్యం, కైవల్యం, భగవత్ప్రాప్తి- అనే అన్ని పురుషార్థాలను, వాటికి తగిన సాధనాలను (ఉపాయాలను) విధించే వేదాన్ని వివరించారు- ఋషులు.

అంటే-వేదాన్ని ఉపబృంహణంచేసే (వివరించే) ఇతిహాసపురాణాలను రచించడంద్వారా సంసారిచేతనులవద్ద గల త్రిగుణాల హెచ్చుతగ్గులకు తగినట్లుగా వారు కోరే ఐశ్వర్యాది క్షుద్రపురుషార్థాలను గూర్చి, ఉత్తమపురుషార్థమైన మోక్షాన్ని గూర్చి చేతనులకు ఋషులు ఉపదేశించారు. **"ప్రాజాపత్యం గృహస్థానాం బ్రాహ్మం సన్న్యాసినాం స్మృతమ్, యోగినా మమృతం స్థానం స్వాత్మసంతోషకారిణామ్, ఏకాంతినః సదా బ్రహ్మధ్యాయినో యోగినో హి యే, తేషాం తత్ పరమం స్థానం యద్వై పశ్యంతి సూరయః"** (విష్ణుపురాణం-1-6-37,38) (గృహస్థధర్మాన్ని అనుష్ఠించేవారికి ప్రజాపతిలోకం, సన్న్యాసధర్మాన్ని అనుష్ఠించేవారికి బ్రహ్మలోకం, తన ఆత్మయొక్క ఆనందస్వరూపాన్ని దర్శించే కైవల్యనిష్ఠునకు నశించనిది అయిన కైవల్యస్థానం, ఎల్లప్పుడు పరబ్రహ్మను ధ్యానించే ఏకాంతులైన యోగులకు, నిత్యసూరులు ఎల్లప్పుడు దర్శించే, గొప్పదైన పరమపదమనబడే స్థానం పొంద దగినవి) అనే రీతిలో పలు విధాలైన ఐశ్వర్యాలను ఆశించేవారికి వాటికి కారణమైన (వాటిని పొందించే) వర్ణాశ్రమ ధర్మాలను ఉపదేశించారు. ఆత్మానుభవరూపమైన కైవల్యమోక్షాన్ని అభిలషించేవారికి తమ ఆత్మను పొందడాన్నిగూర్చి, దానికి తగిన సాధనాలనుగూర్చి ఉపదేశించారు. పరాశరమహర్షి పల్కిన (పూర్వం ప్రస్తావించిన) ప్రమాణం మిగిలిన మహర్షులు చేసిన ఉపదేశాలకు ఉపలక్షణం.

ఈ ఋషులకంటే దివ్యసూరులకు చాలా వైలక్షణ్యం (అతిశయం) ఉన్నది. ఏవిధంగా? అంటే-వేదంద్వారా ప్రతిపాదింపబడే తాత్పర్యమై, గొప్ప పురుషార్థమైన భగవత్ప్రాప్తిలోనే అభినివేశాన్ని కలవారై (నిష్ఠను కలవారై), ఇతరులకు ఉపదేశించేటపుడు కూడా - శాస్త్రాలలో గ్రహింపతగినవిగా చెప్పబడే ఐశ్వర్యాన్ని, కైవల్యాన్ని త్యాజ్యాలుగా - విడువదగినవిగా దివ్యసూరులు ఉపదేశించారు. ఇదే



ఋషులకు దివ్యసూరులకు మధ్యగల తారతమ్యం. మిగిలిన ఆళ్వార్లకంటే మధుర కవి ఆళ్వార్లకు చాలా అతిశయం ఉన్నది. అది ఏవిధంగా? అంటే- ఆళ్వార్లు ఉపదేశించిన గొప్ప పురుషార్థమైన భగవత్ప్రాప్తియొక్క చరమావధి అయిన తదీయ శేషత్వం (భగవద్భక్తులకు శేషమై ఉండడం) వరకు ఆ శేషత్వాన్ని అనుసంధించి అనుష్ఠించి, దానినే ఇతరులకు శ్రీ మధురకవులు ఉపదేశించారు.

వీరికి ఈ అతిశయం ఏవిధంగా కల్గింది? అని అంటే, నమ్మాళ్వార్లు **"పొయ్న్నిన్ఱ ఞానమ్"** (వాస్తవం కాని జ్ఞానం) (తిరువిరుత్తం-1) అని అంటూ మొదటి ప్రబంధాన్ని ఆరంభించి, రెండవ, మూడవ ప్రబంధాలైన తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది ప్రబంధాలను పూర్తి చేసి, చివరి ప్రబంధమైన తిరువాయ్మొழி చివరలో **"అవా వఱ్ఱు వీడు పెఱ్ఱ కురుకూర్ చ్చడకోపన్"** (భగవానునిపట్ల ఆర్తి ఉపశమించి, పరమపదప్రాప్తిని పొందిన కురుకాపురిలోని శఠకోపులు) (తిరువాయ్-10-10-11) అనే పర్యంతం మొత్తం భగవద్విషయాన్నే ఇంచుమించుగా అనుసంధించి, అనుభవించారు. అయినా, అందులో **"పయిలుమ్ శుడరొళి"** (తిరువాయ్-3-7) అనే దశకం, **"నెడుమాఱ్కడిమై"** (తిరువాయ్-8-10) అనే దశకం మొదలైన సందర్భాలలో నమ్మాళ్వార్లు పరమ పురుషార్థంగా (పురుషార్థంయొక్క చరమావధిగా) అభిమానించిన తదీయ శేషత్వాన్ని అభిమానించారు. దానిని అంటే భగవానుని భక్తులకు శేషభూతులై ఉండే స్థితిని వీరు నేరుగా ఆశ్రయించి, నమ్మాళ్వార్లే తమకు గొప్ప ఉపాయం, ఉపేయం - అని (మధురకవులు) అంటున్నారు. ఈవిధంగా "ఆచార్యులు ఆదరించి, గ్రహించిన అర్థమే సత్త్వగుణం అతిశయించి ఉండేవారికి గ్రహింపదగినది" అనే అర్థం మహాభారతసారమైన శ్రీవిష్ణుసహస్రనామాధ్యాయంలో చెప్పబడింది కదా!

అది ఏవిధంగా? అంటే- అంపశయ్యపై శయనించి ఉండే భీష్ముని వద్ద తెలిసికోదగిన అన్ని అర్థాలను అన్నిటినీ ఏదీ కొఱత పడకుండా ఆలకించిన ధర్మపుత్రుడు, "ఈ భీష్మాచార్యులు తమకు రక్షకంగా గ్రహించిన తత్త్వహిత పురుషార్థాలే మాకు కూడా రక్షకం" అని తలచి, **"కో ధర్మస్సర్వధర్మాణాం భవతః పరమో మతః"** (సహస్రనామాధ్యాయం) (అన్ని ధర్మాలలోను, ఏ ధర్మం చాలా గొప్పది? అని నీవు భావిస్తున్నావు?) అని అంటూ గొప్పదైన ధర్మాన్ని గూర్చి ప్రశ్నించగా, **"ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః, యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరః సదా"** (సహస్రనామాధ్యాయం) (మానవుడు భక్తిపూర్వకంగా

పుండరీకాక్షుని స్తోత్రాలతో ఎల్లప్పుడు అర్చించడమనేదే అన్ని ధర్మాలలోను గొప్పదైన ధర్మమని నా అభిప్రాయం) అని భీష్ముడు తాను ఆదరించి పరిగ్రహించిన అర్థాన్ని ఉపదేశించాడుకదా! మన భగవద్రామానుజదర్శనంలో ఆబాలగోపాలం శ్రీరామానుజులు ఆదరించిన అర్థాన్నే పరిగ్రహించారు. భగవద్రామానుజుల శిష్యురాలు త్రిపురాదేవి అనే రాజమహిషి వద్దకు కొందఱు వచ్చి "మీరు- శ్రీమన్నారాయణుడే ఉపాయంగా, ఉపేయంగా గ్రహించదగినవాడు- అనే విశ్వాసంతో ఉండడం - ప్రబలప్రమాణాలైన వేదాలు, స్మృతులు మొదలైనవి ఆవిధంగా పల్కి నందు వల్లనా?" అని కొందఱు ప్రశ్నించారు. అపుడామె, "అందువల్ల కాదు. ఇళ్ళలో వాడి పాతబడిన అన్నపు కుండలను పెట్టే ఈశాన్యమూలకు అధిపతి అయిన శివుని శ్రీరామానుజులు ఒకవేళ ఆశ్రయిస్తే, ఆ దైవాన్నే మేముకూడా ఆశ్రయించి ఉండేవారం. ఆవిధంగా కాకుండా, శ్రీమన్నారాయణునే వారు ఆశ్రయించినందున మేముకూడా ఆ శ్రీమన్నారాయణునే ఆశ్రయించాము" అని బదులు పల్కిన ఐతిహ్యం ఇక్కడ అనుసంధేయం. అదే న్యాయంలో నమ్మాళ్వార్లు తాము రక్షకంగా ఆశ్రయించిన తదీయశేషత్వాన్నే శ్రీమధురకవి ఆళ్వార్లు, తమకు గొప్ప ప్రాప్యంగా నిశ్చయించు కొంటున్నారు, ఈ దివ్యప్రబంధంలో.

భగవద్భక్తులకు శేషమై ఉండడం - అనే ఈ పరమపురుషార్థం శ్రీరామాయణ పురుషులలో శ్రీశత్రుఘ్నాళ్వాన్‌చే అనుష్ఠింపబడింది. ఏవిధంగా అంటే- **"స తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ, వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః"** (రామా-బాల-4-6) (ఆ వాల్మీకి, భగవానుడు, మేధావులు, వేదాలలో ఆరితేరిన వారైన కుశలవులను ఇద్దఱిని చూచి, వేదాన్ని వివరించడంకోసం వారిని పరిగ్రహించాడు) అనే రీతిలో వేదార్థాలను వివరించడంకోసం ఏర్పడినది- ఇతిహాసమైన శ్రీరామాయణం. శ్రీరామాయణంలో ప్రధానపురుషులైన రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనే నల్గురు ధర్మాలను ప్రతిష్ఠించడంకోసం అవతరించినవారు కనుక, వారు క్రమంగా నాల్గు ధర్మాలను అనుష్ఠించి చూపారు. **"మర్యాదానాం చ లోకస్య కర్తా కారయితా చ సః"** (రామాయణం- సుందర-35-11) (లోకంలోని మర్యాదలను అనుష్ఠించేవాడు, అనుష్ఠింపజేసేవాడు శ్రీరాముడే) అనే రీతిలో పెద్దవాడు చెప్పిన దానిని చిన్నవాడు వినాలి- అనే ధర్మం ఇంచుమించుగా అందఱికి తెలిసినది కనుక, శ్రీరాముడు తండ్రి పల్కిన మాటను వినడం, పెద్దలు చెప్పిన మాటను వినడం,స్నేహితులు పల్కిన మాటను వినడం మొదలైన, అందఱు పరిగ్రహించవలసిన



సామాన్యధర్మాలను అనుష్ఠించి చూపాడు. **"స జగామ వనం వీరః ప్రతిజ్ఞా మనుపాలయన్, పితు ర్వచననిర్దేశాత్ కైకేయ్యా ప్రియకారణాత్"** (రామా-బాల-1-24) (వీరుడైన ఆ శ్రీరాముడు ప్రతిజ్ఞను పరిపాలించేవాడై, తండ్రి ఆజ్ఞతో, కైకేయికి ప్రియంగా ఉంటుందనే కారణంచే వనానికి వెళ్ళాడు) అనే రీతిలో తల్లిదండ్రులు చెప్పిన విధంగా విన్నాడు. **"అగస్త్య వచనా చ్చైవ జగ్రాహైంద్రం శరాశసనమ్, ఖడ్గం చ పరమప్రీతః తూణీ చాక్షయసాయకౌ"** (రామా-బాల-1-42) (అగస్త్యుని ఆజ్ఞను అనుసరించి శ్రీరాముడు ఇంద్రుని వింటిని, కత్తిని, అక్షయతూణీరాలను రెండిటిని గ్రహించాడు) అనే విధంగా మహర్షి అయిన అగస్త్యుడు పల్కిన మాటను పరిగ్రహించాడు. **"తతః సుగ్రీవ వచనాత్ హత్వా వాలిన మాహవే, సుగ్రీవమేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్"** (రామా- బాల-1-70) (దానికి పిమ్మట సుగ్రీవుడు పల్కిన మాటను అంగీకరించి, వాలిని యుద్ధంలో వధించి, సుగ్రీవునే అతని రాజ్యంలో నిలిపాడు) అని స్నేహితుడైన సుగ్రీవుని మాటను విని, అతడు కోరిన కోరికను తీర్చాడు. అందువల్ల, శ్రీరాముని అవతారం సామాన్య ధర్మాలను అనుష్ఠించడంకోసం ఏర్పడింది.

"సహజశేషి అయిన భగవానునకు శేషమై ఉండే జీవుడు ఆస్వామికి కైంకర్యం చేసి సత్తను-అస్తిత్వాన్ని పొందుతాడు" అనే గొప్ప ధర్మాన్ని లక్ష్మణుడు అనుష్ఠించి చూపించాడు. **"కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే"** (రామా-అయో-31-24) (నన్ను నీ కైంకర్యాన్ని చేసేవానినిగా-నీ అనుచరునిగా- చేసికో. ఇందులో అధర్మం ఏదీ లేదు. ఇందువల్ల నేను ధన్యుడను కాగలను. నీ కార్యంకూడా నెఱవేరుతుంది), **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (రామా-అయో-1-25) (నీవు వైదేహితో పాటు కూడి పర్వతసానువులలో విహరిస్తావు, నీవు మేల్కొని ఉండేటపుడు, నిద్రించేటపుడు కూడా నీకు అన్నివిధాలైన కైంకర్యాలను నేను చేస్తాను), **"స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః, సీతా మువాచాతియశాః రాఘవం చ మహావ్రతమ్"** (రామా-అయో-31-2) (రఘు కులాన్ని ఆనందింపజేసేవాడు, గొప్ప కీర్తిని కలవాడైన ఆ లక్ష్మణుడు, అన్న అయిన శ్రీరాముని శ్రీచరణాలను చక్కగా పట్టుకొని, సీతను, ఆశ్రితసంరక్షణ మనే గొప్ప వ్రతాన్ని కల శ్రీరాముని చూచి పలికాడు) అనే శ్రీరామాయణవచనాలు ఈ విషయంలో ప్రమాణాలు.

**"రాజ్యం చ తవ రక్షేయ మహం వేలేవ సాగరమ్, ప్రతిజానామి తే వీర ! మా భూవం వీరలోకభాక్"** (రామా–అయో–23–27) (ఓ వీరా! సముద్రాన్ని తీరంవలె, నేను నీ రాజ్యాన్ని రక్షిస్తాను. ఆవిధంగా చేయకపోతే నీ రాజ్యంలోనే నివసించను. వీరుడైన దశరథుడు చేరిన వీరస్వర్గమనే లోకాన్ని చేరగలను–అని ప్రతిజ్ఞను చేస్తున్నాను) అనే రీతిలో తాను కోరిన శ్రీరామకైంకర్యాన్ని నిర్బంధించి చేసిన లక్ష్మణుని వలె కాకుండా, "శేషి అభిలషించిన దాస్యాన్ని–కైంకర్యాన్ని–చేయడం– అనే పారతంత్ర్యమే శేషభూతునకు గ్రాహ్యం" అనే అర్థాన్ని శ్రీభరతాழ்వాన్ అనుష్ఠించి చూపాడు. శ్రీరాముని విశ్లేషించి, నిలువలేని తన స్థితిని సైతం లెక్కించకుండా, శేషి అయిన అతని మనస్సును గమనించి, **"తతః శిరసి కృత్వా తు పాదుకౌ హేమభూషితౌ, ఆరురోహ రథం హృష్టః శత్రుఘ్నేన సమన్వితః"** (శ్రీరామా–అయో–113–1) (తరువాత, శత్రుఘ్నునితో కూడిన భరతుడు తన శిరస్సులో శ్రీరామపాదుకలను పెట్టుకొని, మిక్కిలి ఆనందించినవాడై, అపుడే రథాన్ని అధిరోహించాడు) అని సంతోషంతో శ్రీరాముని విశ్లేషించి, అయోధ్యకు తిరిగి వెళ్ళాడు కదా, భరతాழ்వాన్.

ఇపుడు, భరతాழ்వాన్ స్థితిని చక్కగా తెలిపే **"రాజ్యం చ"** ఇత్యాది శ్లోకం వివరింపబడుతున్నది.

**(రాజ్యం చ తవ రక్షేయమ్)**– నీ రాజ్యాన్ని నేను రక్షిస్తాను. **"తం మత్తమాతంగ విలాసగామీ గచ్ఛంత మవ్యగ్రమనా మహాత్మా, స లక్ష్మణో రాఘవ మిష్టచేష్టో రరక్ష ధర్మేణ బలేన చైవ"** (రామా– కిష్కింధ–1–128) (మదాన్ని కల్గిన ఏనుగు నడకవలె గంభీరమైన గమనాన్ని కలవాడు, శ్రీరాముని తప్ప వేఱొక విషయంలో అభినివేశం లేని మనస్సును కలవాడు, మహాపురుషుడు, శ్రీరామకైంకర్యాన్నే భోగ్యంగా, ప్రాప్యంగా గ్రహించేవాడైన లక్ష్మణుడు తనకు ముందు వెళ్ళే శ్రీరాముని ధర్మంతో, బలంతోను రక్షించాడు) అని ఆరంభించి, "లక్ష్మణుని వలె నిన్ను రక్షించడంలో మాత్రమే అభినివేశాన్ని కల్గి ఉండకుండా, మీ రాజ్యాన్ని కూడా రక్షిస్తాను' "నాకు శేషమైన నీవు నన్ను రక్షించడం సాధ్యమా?" అని అంటే, "నేను మీకు శేషమై ఉన్నా, నా భక్తికి కట్టుబడిన మీకు నన్ను మీఱడం సాధ్యం కాదు సుమా" అని అంటున్నాడు, భరతాழ்వాన్.



**(అహం వేలేవ సాగరమ్)**– సముద్రానికి తీరం అవధిని తెలియజేసేదిగా ఉన్నా, సముద్రం ఆతీరాన్ని దాటలేదుకదా! ఆ రీతిలోనే, నీవు పెద్దవాడవనే కారణంతో నిన్ను నేను రక్షించడాన్ని నీవు అడ్డుకోలేవు సుమా!– (అని భావం)

**(ప్రతిజానామి)** నేను ఈక్రింది విధంగా ప్రతిజ్ఞ చేస్తున్నాను.

**(తే వీర !)**– ఒక పిఱికిపంద సమక్షంలోనా నేను ప్రతిజ్ఞను చేస్తున్నాను! శేషభూతుడు ప్రతిజ్ఞ చేస్తే, దానిని పూర్తిచేయగల్గిన వీరుడవైన నీ ముందర (సమక్షంలో) కదా ప్రతిజ్ఞను చేస్తున్నాను.

**(మా భూవమ్)**– నీ రాజ్యాన్ని విడచి వెళ్ళిపోతాను. ఈ ప్రతిజ్ఞను నెఱవేర్చలేకపోతే, నీ ముందు జీవించి ఉండనివాడను కావడంతోపాటు, నీ రాజ్యంలో కూడా నివసించనివాడను కాగలను.

**(వీరలోకభాక్)** – వీరుడైన దశరథచక్రవర్తి పోయిన లోకంలోకి ప్రవేశిస్తాను. నీకు పట్టాభిషేకం చేసి ఆనందించాలని ప్రయత్నించి, దానిని పొందకుండా పోయిన చక్రవర్తి పోయిన స్వర్గలోకంలోకి పోగలను– అని భావం. భరతాழ்వాన్ ఉద్దేశ్యంలో ఇది గొప్ప అనర్థం. (అందువల్లనే **'వీరలోకభాక్ మా భూవమ్"** అని అన్వయించి అర్థం చెప్పే తీరు ఇక్కడ విడువబడింది) ఈ శ్లోకంలో తెలుపబడినట్లుగా లక్ష్మణునివలె (ఇళైయపెరుమాళ్‌వలె) నగరంలో, వనంలోను నిర్బంధించి కైంకర్యం చేయడంలో ఊనికను కల్గినవాడు కాకుండా, శేషి అయిన శ్రీరాముడు మెచ్చే కైంకర్యాన్ని చేయడమనే పారతంత్ర్యాన్ని శ్రీభరతాழ்వాన్ అనుష్ఠించాడు. ముందు తెల్పినట్లుగా, శ్రీరాముని విశ్లేషించి, ప్రాణాలను ధరించలేని తన స్థితిని లెక్కించకుండా, శేషి అయిన శ్రీరాముని అభిమతాన్నే గమనించి, **"ఆరురోహ రథం హృష్టః"** అన్నట్లు ఆనందంతో ఊరికి (అయోధ్యకు) తిరిగి వెళ్ళిపోయాడు కదా, శ్రీభరతాழ்వాన్.

ఇటువంటి భరతాழ்వాన్ తప్ప వేఱెవ్వరిని తెలియనివాడైనందున భగవానునకు శేషమై ఉండడం –అనే స్థితికి చరమావధి అయిన తదీయశేషత్వాన్ని (భగవద్భక్తులకు శేషభూతుడై ఉండే స్థితిని) శ్రీశత్రుఘ్నాழ்వాన్ అనుష్ఠించాడు. **"గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘః, శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః"** (రామా–అయో–1–1) (పాపం లేనివాడు, నిత్యశత్రువులైన ఇంద్రియాలను జయించినవాడైన శత్రుఘ్నుడు ప్రీతిపూర్వకంగా తన మేనమామ ఇంటికి వెళ్ళే భరతునిచే

తీసికొనిపోబడ్డాడు) అనే శ్రీరామాయణశ్లోకంలో ఈ స్థితి తెలుపబడినందున, ఈ శ్లోకం వివరింపబడుతున్నది.

**(గచ్ఛతా)**– (మేనమామ ఇంటికి) వెళ్ళే భరతునిచే –అని అర్థం. **"గచ్ఛతా"** (వెడుతున్న) అనే వర్తమాన కాలప్రయోగానికి, తనకు ప్రత్యేకంగా ఏ ప్రయోజనం లేకుండా, శత్రుఘ్నాళ్వాన్, భరతుని వెంటవెళ్ళేటపుడు అయోధ్యనుండి తండ్రివద్ద, తల్లివద్ద, అన్నగారైన శ్రీరాముని వద్ద అనుమతిని తీసికోకుండానే, భరతుడు లేకపోతే ప్రాణాలు నిలుపుకొనలేనివాడైనందున, ఆ భరతుడు వెళ్ళేటపుడు అతని నీడవలె (శత్రుఘ్నుడు) కూడా వెంటవెళ్ళాడు– అని భావం.

**(మాతులకులమ్)**– మేనమామ ఇంటికి– అని అర్థం. భరతునకు మేనమామ అయిన యుధాజిత్తు తన మేనల్లుడైన భరతుని మాత్రమే పిలిచాడు. అందువల్ల అక్కడకు వెళ్ళవలసిన నిర్బంధం అతనికే (భరతునకే) ఉన్నది. శత్రుఘ్నాళ్వాన్ భరతుడు లేనిదే బ్రతుకలేడు కనుక, తత్కారణంగా ఇతడు (శత్రుఘ్నుడు) కూడా భరతుని వెంటవెళ్ళాడని భావం.

**(భరతేన)** – భరతునిచే– అని అర్థం. రాజ్యాన్ని భరించేవాడైనందున, దశరథచక్రవర్తి మరణించి, శ్రీరాముడు రాజ్యాన్ని వీడి వనానికి వెళ్ళగా, లక్ష్మణుడు కూడా శ్రీరాముని వెంబడించి, అతనికి కైంకర్యం చేయాలని తలచి, అతని వెంట వెళ్ళిపోగా, శత్రుఘ్నాళ్వాన్ కూడా "భరతుడు తప్ప ఇంకొకరిని తెలియను" అనే స్థితిలో ఉండగా, రాజ్యాన్ని భరించవలసినవాడు"– అనే కారణంవల్లనే, పుట్టినపుడే ఇతనికి భరతుడనే పేరును వశిష్ఠమహర్షి పెట్టాడు. **"భరత ఇతి రాజ్యభరణాత్"** (శాకుంతలమ్–7) (రాజ్యాన్ని భరించినందున భరతుడు –అనబడుతున్నాడు) అని భరతశబ్దంయొక్క అర్థాన్ని శ్రీశతానీకుడు తెలిపాడు కదా !

**(తదా)**– అపుడే –అని అర్థం. భరత, శత్రుఘ్నులు ఇద్దఱూ రాజపుత్రులైనందున, **"పుష్యే జాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః, సార్పే జాతౌ చ సౌమిత్రీ కుళీరేఽభ్యుదితే రవౌ"** (రామా–బాల–20–13) (స్వచ్ఛమైన జ్ఞానాన్ని, బుద్ధిని కల్గిన భరతుడు మీనలగ్నంలో పుష్యమీనక్షత్రంలో పుట్టాడు. సుమిత్రాదేవి పుత్రులైన లక్ష్మణ– శత్రుఘ్నులు ఇద్దఱు కర్కాటక లగ్నంలో సూర్యుడు ఉండగా ఆశ్లేషానక్షత్రంలో పుట్టారు) అనే రీతిలో వారి వారి జన్మనక్షత్రాలు వేఱ్వేరు అయినందున, వారి వారి నక్షత్రాలకు తగినట్లుగా వేఱ్వేరు దినాలలో, ముహూర్తాలలో బయలుదేరవలసి ఉన్నా, భరతుడు బయలుదేరిన ఆ ముహూర్తంలోనే శత్రుఘ్నుడు బయలుదేరాడు– అని భావం. **"గచ్ఛతా"** అనే వర్తమానకాలిక పదంతోనే "ఒకే కాలంలో బయలు దేరారు" అనే అర్థం స్ఫురిస్తుంది కదా! **"తదా"** అని అంటూ మళ్ళీ పలుకవలసి ఉన్నదా?– అని అంటే, అక్కడ తనకు అని అంటూ ఏదీ లేదు"– అనే మమకారం తీరిన విషయం ఆ పదం ద్వారా తెలుపబడింది. ఆ మమకారానికి స్థానమైన అహంకారం యొక్క (నేను– అనే గర్వంయొక్క) నివృత్తి ఇక్కడ **"తదా"** ఈ పదం ద్వారా తెలుపబడుతున్నది. అందువల్లనే **"పునరుక్తి"** అనే దోషం ఏమీ లేదు. శేషమై ఉండడానికి అహంకార– మమకారాలు అనే రెండు అవరోధాలేకదా!



**(అనఘః)** పాపం ఏమీ లేనివాడని అర్థం. **"అఘమ్"** అనేపదం తాను కోరినదానిని పొందడానికి అడ్డుగా ఉండే పాపాన్ని తెల్పుతుంది. ఇక్కడ పాపమనబడేది– రామభక్తియే. చాలా గొప్పదైన రామభక్తిని **"పాపమ్"** అని చెప్పవచ్చునా ?– అని అంటే, లోకంలో పాపమని చెప్పబడే దుష్కర్మకంటే పుణ్యమనే సత్కర్మ గొప్పది అయినా, **"అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య, ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామీత్యభిసంభవామీతి"** (ఛాందోగ్య–8–13–1) (అశ్వం తన జూలును విదలించుకొన్నట్లు, పాపాన్ని విదల్చుకొని, రాహువునోటినుండి బయటపడిన చంద్రునివలె శరీరాన్ని విడచి, నిత్యమైన భగవల్లోకాన్ని పొందినవాడను కాగలను, పొందినవాడను కాగలను) అనే ఉపనిషద్వాక్యంలో, ముక్తిని పొందేటపుడు విడువబడే పుణ్యపాపాలు రెండిటిని చేర్చి పాపమనే వ్యవహరించినట్లుగా, ఇక్కడ శత్రుఘ్నుడు తాను కోరిన భరతకైంకర్యానికి అడ్డుగా ఉన్నందున రామసౌందర్యంలో అభినివేశాన్ని పొందడమనే రామభక్తిని పాపమని చెప్పవచ్చుకదా ! **"సృష్ట స్త్వం వనవాసాయ స్వనురక్తః సుహృజ్జనే, రామే ప్రమాదం మా కార్షీః పుత్ర ! భ్రాతరి గచ్ఛతి"** (రామా–అయో–40–5) (కుమారా! నీవు వనంలో నివసించడంకోసమే సృష్టింపబడ్డావు. నీకు సుహృత్తు అయిన శ్రీరామునిపట్ల చాలా స్నేహభావాన్ని కల్గి ఉన్నావు. నీ అన్న రాముడు వనంలో నీకు ముందు నడచి వెడతాడు. అపుడు అతని గమన సౌందర్యంలో నీవు ఆసక్తిని పొంది, అతనిని కాపాడడంలో జాగరూకత లేకుండా ఉండకు సుమా !) అనిఅంటూ సుమిత్ర, శ్రీరాముని సౌందర్యంలో అభినివేశాన్ని పొందడం శ్రీరాముని రక్షించడమనే కైంకర్యానికి ఆటంకమని పల్కింది కదా ! అదే విధంగా రామభక్తి భరతకైంకర్యానికి అడ్డుగా ఉండడంవల్ల పాపమని అనడంలో ఏ లోటు లేదు.

**(శత్రుఘ్నః)** – శత్రువులను వధించేవాడని అర్థం. రాముడు మొదలైన నల్గురు కుమారులు జన్మించినపుడు వారి వారి రూపసన్నివేశాలను గమనించి, కులగురువైన శ్రీవసిష్ఠభగవానుడు వారికి పేర్లను పెట్టాడు. పెద్దకుమారుడు తనను చూచేవారిని అందఱిని తన అందంతో ఆనందింపజేస్తాడు కనుక, రాముడని, ఇళైయపెరుమాళ్‌కు (సుమిత్ర కుమారులిద్దరిలో పెద్దవానికి) భగవత్కైంకర్యమే అతని స్వరూపంగా తోచి నందున "కైంకర్యలక్ష్మిని కలవాడు" అనే విషయాన్ని పురస్కరించుకొని లక్ష్మణుడని, నాల్గవ కుమారుని చూచినపుడు, అతడు చూడగానే శత్రువులు నశించే రీతిలో ఉన్నందున, **"శత్రుఘ్నః"** (శత్రువులను నశింపజేసేవాడు) అనే పేర్లను పెట్టాడు.

**(నిత్యశత్రుఘ్నః)** నిత్యశత్రువులనుకూడా నశింపజేసేవాడు– అని అర్థం. బాహ్యశత్రువులను మాత్రమేకాకుండా శరీరంలోపల ఉండే శత్రువులైన ఇంద్రియాలనుకూడా జయించినవాడని భావం. ఆ ఇంద్రియజయం ఎంతవరకు (ఎంత పరిమితిలో) ఇతనివద్ద ఉన్నది? అని అంటే, **"రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"** (రామా–అయో–3–29) (రూప సౌందర్యం, ఔదార్యం, గుణాలు మొదలైనవానితో పురుషుల నేత్రాలను, మనస్సును అపహరించే శ్రీరాముని) అనే రీతిలో పురుషులను సైతం స్త్రీవేషం ధరింపజేసే శ్రీరాముని అందంలో కూడా చిక్కుకొనని పరిమితిలో ఇంద్రియాలను వశం చేసికొన్నాడని భావం. **"జగ్రాహ భరతో రశ్మీన్ శత్రుఘ్న చ్ఛత్ర మాదదే, లక్ష్మణో వ్యజనం తస్య మూర్ధ్ని సంపర్య వీజయత్"** (రామా– యుద్ధ–131–28) (శ్రీరాముని రథాశ్వాల పగ్గాలను భరతుడు బిగించి పట్టుకొన్నాడు. శత్రుఘ్నుడు (శ్రీరామునకు) గొడుగును పట్టాడు. ఆ శ్రీరాముని శిరస్సుపై లక్ష్మణుడు విసనకర్రతో విసిరాడు) అని పట్టాభిషేక సమయంలో శత్రుఘ్నుడు శ్రీరామునకు గొడుగును పట్టడమనే కైంకర్యాన్ని చేసినట్లుగా కన్పిస్తున్నదికదా? అని అంటే, "ఆ విధంగా రామకైంకర్యాన్ని చేసేటపుడు "తాను కోరిన కైంకర్యం" అనే భావనతోగాని, శ్రీరాముని అందంలో అభినివేశాన్ని పొందిగాని చేయకుండా, "భరతునకు ఇది ఇష్టమైనది" అనే భావనతోనే శత్రుఘ్నుడు శ్రీరామకైంకర్యాన్ని చేశాడని భావం.

**(నీతః)** తీసికొనిపోబడ్డాడు– అని అర్థం. ప్రభువులు బయటకు వెళ్ళేటపుడు చురకత్తి వంటి ఆయుధాలను తమ వెంట తీసికొనిపోయేటట్లే, భరతునిచే తన వెంట తీసికొని పోబడ్డాడు– అని భావం. రెండు ద్రవ్యాలు ఒకదానితో ఇంకొకటి కలసినపుడు, అవి ఒకదానినుండి ఇంకొకటి విడదీయడానికి వీలుంటుంది. కాని,



ఒక ద్రవ్యంతో, దాని జాతి, గుణాలు కలిసి ఉండేటపుడు, ఆ జాతిగుణాలను ఆద్రవ్యం నుండి వేఱు చేయడానికి వీలు కాదు. (ఈ సంబంధానికే అపృథక్ సిద్ధసంబంధమని పేరు) భరతుడు, శత్రుఘ్నుడు – అనే ఇద్దఱు రెండు వేఱ్వేఱు ద్రవ్యాలే అయినా, భరతుని జాతి, గుణాలవలె శత్రుఘ్నుడు అతనితో విడదీయడానికి వీలుకాని రీతిలో, భరతునిచే తీసికొని పోబడ్డాడు– అని భావం.

**(ప్రీతిపురస్కృతః)** – ప్రీతితో వెంట తీసికొని పోబడ్డాడు– అని అర్థం. "అన్న అయిన భరతునకు కైంకర్యం చేయడం తనకు కర్తవ్యం" అనే కర్తవ్యతాబుద్ధితో అతనితో వెళ్ళలేదు. **"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే"** (రామా–భార– 31–25) (నీవు వైదేహితో పాటు పర్వతసానువులలో విహరిస్తావు. అపుడు నేను, నీవు మేల్కొని ఉండేటపుడు, నిద్రించేటపుడు నీకు అన్నివిధాలైన కైంకర్యాలను చేస్తాను) అని శ్రీరామునితో అరణ్యానికి తోడుగా పోయిన లక్ష్మణునివలె, భరతుడు పోయే ప్రదేశాలో అన్నిచోట్ల అతనిని అన్నివిధాలైన సేవలను చేస్తాను" అనే కోరికతో ప్రేమచే ప్రేరేపింపబడి పోయాడు– అని భావం. అయోధ్యలో ఉండేటపుడు భరతునకు కైంకర్యం చేయడానికి పలువురు ఉంటారు కనుక, శత్రుఘ్నునకు భరతకైంకర్యంలో ఏదో ఒక భాగం మాత్రమే లభిస్తుంది. ఆవిధంగా కాకుండా, అన్నికైంకర్యాలను పొందవచ్చు– అని ఆశపడి వెళ్ళాడు– అని భావం.

"తీసికొనిపోబడ్డాడు" **(నీతః)** అని అన్నందువల్ల కైంకర్యాన్ని–దాస్యాన్ని చేసేటపుడు తనకు ప్రత్యేకంగా ఏ ఆనందం లేకుండా, భరతుని ఆనందమే తన ఆనందంగా తలచి, అచేతనవస్తువువలె "వెళ్ళాడు" అనే అర్థం ఇక్కడ తెలుపబడింది. "ప్రేమచే ప్రేరేపింపబడినవాడై వెళ్ళాడు– అని పల్కినందున స్వరూపానికి తగిన భరతకైంకర్యాన్ని చేసేటపుడు తన కొఱకుగా ఏ ఆనందం లేకపోయినా, జ్ఞానాన్ని–చైతన్యాన్ని–కల్గినవాడైనందున, భరతుని ఆనందాన్ని చూచి సంతోషించే ఆనందం ఇతనికి (శత్రుఘ్నునకు) ఉన్నది– అని తెలుపబడింది. **"పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** (నీ ఆలయంలో గడపగా పడి ఉండి నీ పగడపు మోవిని దర్శిస్తాను) (పెరుమాళ్–4–9) అని కులశేఖరాళ్వార్లు కూడా, శ్రీవేంకటేశ్వరునకు కైంకర్యాన్ని చేసేటపుడు, **"పడియాయ్ క్కిడన్దు"** (ఆలయంలో గడపగా పడి ఉండి) అని అంటూ తమకుగా ఏ ఆనందం ప్రత్యేకంగా లేకుండా అచిత్తువలె ఉండాలి– అని, **"ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** (నీ పగడపు మోవిని దర్శిస్తాను) అని అంటూ

శ్రీవేంకటేశ్వరుని ఆనందాన్ని చూచి తాము పొందే ఆనందం తమకు ఉన్నదని తెలియజేశారుకదా!

**"అనఘః"** (పాపం లేనివాడు) అనే పదానికి-రామభక్తి అనే పాపం లేనివాడు- అని, **"నిత్యశత్రుఘ్నః"** అనే పదానికి-రాముని అందంలో కూడా అభినివేశాన్ని పొందని అవధిలో ఇంద్రియాలను జయించినవాడని అర్థం గ్రహింపబడింది. ఆవిధంగా కాకుండా, **"అనఘః"** అనే పదానికి-భరతుడు, రామునికంటే పావనం చేసేవాడు కనుక, అని **"నిత్యశత్రుఘ్నః"** అనే పదానికి- భరతుడు, రాముని కంటె భోగ్యుడై (ప్రాప్యుడై) ఉన్నందున, శ్రీరాముని ఆశ్రయించకుండా, భరతునే ఆశ్రయించాడు- అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**"కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునందన !"** (రామా- అర-16-40) (రఘుకులంలో జన్మించిన లక్ష్మణా! మహాత్ముడైన భరతునితో, వీరుడైన శత్రుఘ్నునితో, నీతో నేను ఏనాడు కలసి ఆనందించగలనో కదా!) అని అంటూ శ్రీరామునకు శత్రుఘ్నునిపట్ల ప్రేమ ఉన్నట్లే, శత్రుఘ్నునకు కూడా శ్రీరామునిపట్ల ప్రేమ ఉండడం కాదనడానికి వీలులేనిదై ఉండగా, శత్రుఘ్నునకు శ్రీరాముని పట్ల ప్రేమ అనేది ఏమీ లేనట్లుగా ఇక్కడ ఈ రెండు పదాలకు అర్థాన్ని చెప్పవచ్చునా? అని అంటే, శ్రీరామునకు శత్రుఘ్నుని పట్ల ప్రేమ దేనివల్ల ఉన్నది? అంటే, తనను (శ్రీరాముని) తప్ప ఇంకొకరిని తెలియనివాడు భరతుడు. ఆ భరతునిపట్ల తప్ప ఇంక దేనిపట్ల-అంటే-చివరకు తన (శ్రీరాముని) విషయంలో కూడా అభినివేశాన్ని లేనివాడై ఉన్నాడు-అనే కారణంచేతనే. అందువల్ల, ఈ రెండు పదాలు అర్థవంతాలే- అని శ్రీరామానుజులు అన్నారు. భరతుడు అభిమానించిన విషయం (వ్యక్తి) అనే కారణంవల్లనే శ్రీరామునిపట్ల శత్రుఘ్నునకు ప్రేమ ఉన్నదే తప్ప, సాక్షాత్తుగా శ్రీరామునిపట్ల ప్రేమను కలవాడు కాడని భావం. మధురకవి ఆళ్వార్ల స్థితికూడా ఇటువంటిదే. శ్రీరాముని పట్ల ప్రేమ లేకుండా ఉండడాన్ని- భరతుని విషయంలో గల అభినివేశమే కారణం- అనేది తెలిస్తే, రామభక్తిని పాపం అని, రామునిపట్ల అభిమానం కల్గి ఉండనంతటి పరిమితిలో శత్రుఘ్నుడు ఇంద్రియాలను జయించాడని అర్థం చెప్పడంలో అతిశయోక్తి ఏదీ లేదు. అందువల్ల, ఈ రీతిలో శత్రుఘ్నుడు భరతునిపట్ల అభినివేశాన్ని పొందినట్లే, నమ్మాళ్వార్ల పట్ల శ్రీమధురకవి ఆళ్వార్లు అభినివేశాన్ని పొందారు- అని ప్రకృతంలో భావం.



మధురకవి ఆళ్వార్లు **"తేవు మత్తఱియేన్"** (ఇంకొక దైవాన్ని తెలియను) (కణ్ణినుణ్-2) అని అంటూ భగవానునిపట్ల తమకు అభినివేశం లేదని పలికే పర్యంతంలో నమ్మాళ్వార్ల పట్ల అభినివేశాన్ని పొందడానికి కారణాలు అనేకం 1. భగవానుని భక్తులు- అనే ఒకే కారణాన్నిబట్టి నమ్మాళ్వార్లు మధురకవులను కటాక్షించారు. తెలియనివానిని తెలిపి (అజ్ఞాతజ్ఞాపనాన్ని చేసి) భగవద్విషయంలో ప్రవేశాన్ని కల్గించారు. 2. భగవద్భక్తులపట్ల అభినివేశాన్ని పొందేటట్లు చేశారు. 3. **మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరమ్, కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ"** (గీత-10-9) (నాపట్ల స్థిరమైన మనస్సును కలవారై, నా మీదనే తమ ప్రాణాన్ని నిలుపుకొన్నవారై, నా గుణాలను గూర్చి ఒకరికి ఇంకొకరు పలికేవారై సంతోషిస్తున్నారు, ఆనందిస్తున్నారు కూడా) అనే రీతిలో భగవానుని భక్తులయొక్క గుణాలను అనుసంధించకుండా ధరించలేని స్థితిలో, ఆవిధంగా అనుసంధిస్తూ కాలక్షేపం చేయడానికి సహాయభూతులై ఉన్నారు.) 4. **"తే హ నాకం మహిమాన స్సచం తే యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః"** (పురుషసూక్తం) (ఏ పరమపదంలో సాధ్యులనబడే దేవతలు ఉన్నారో, ఆ పరమపదాన్ని వారు మహిమను కలవారై పొందుతున్నారు.) అనే రీతిలో పరమపదాన్ని పొందిన తరువాత కూడా భగవద్భాగవతానుభవానికి సహాయంగా ఉండబోతున్నారు. ఈ విధంగా పలు రీతులలో ఉపకారం చేసినవారు కనుక, అన్ని సన్నివేశాలలోను భగవానుని దాసులైన (భక్తులైన) నమ్మాళ్వార్లే ఉద్దేశ్యం- అని నిశ్చయించుకొని, తమకు ఉపకారకులైన ఆళ్వార్లనే సమస్తంగా మధుర కవులు ఆశ్రయిస్తున్నారు, ఈ దివ్యప్రబంధంలో.

## నంజీయర్ అనుగ్రహించిన వ్యాఖ్యాన ప్రవేశంలోని విశేషాలు

**"చిత్, అచిత్, ఈశ్వరుడు"**- అనే మూడు తత్త్వాలను పురస్కరించుకొని పురుషార్థాలుకూడా ఉత్తమ- మధ్యమ- అధమాలని మూడు రీతులలో ఉంటాయి. వాటిలో, అల్పమైనందున, స్థిరంగా నిలచి ఉండనిదైనందున, అచిత్తు అనుభవమనే ఐశ్వర్యం- అధమపురుషార్థం. జన్మ మరణం మొదలైన వికారాలను లేనిదై, చాలా సుఖరూపమై ఉన్నప్పటికీ, భగవానునివద్దగల కల్యాణగుణాలు లేనందువల్ల **"తెరివరియ అళవిల్లా చ్చిఱ్ఱిన్బమ్"** (తిరువాయ్-4-9-10) (తెలిసికోవడానికి సాధ్యంకాని, అవధిలేని- అంటే- ఇహలోక సుఖం కంటే గొప్పది అయిన, భగవత్ప్రాప్తి కంటే అల్పమైన కైవల్యసుఖం) అని చెప్పబడే చిత్తు యొక్క అనుభవమనే ఆత్మాను

భవం–మధ్యమపురుషార్థం. ఈశ్వరుని అనుభవం–ఉత్తమపురుషార్థమే అయినా, అందులో కూడా, శ్రీవైకుంఠనాథునిపట్ల అభినివేశాన్ని పొందకుండా, శ్రీకృష్ణావతారం లోనే అభినివేశాన్ని పొంది, అందులోకూడా, చెఱకు తినేవారు, ఆచెఱకు గడలోని వేళ్ళను, కణుపులను, చివరి భాగాన్ని తీసివేసి, మధ్యలో ఉండే సారభూతమైన చెఱకు భాగాన్ని గ్రహించేటట్లే, కంసుని చెఱలో అవతరించిన (అవతారంలోని) ముందు భాగాన్ని, కంసవధకు పిమ్మట గల భాగాన్ని త్యజించి, మధ్యభాగమైన నవనీత చౌర్యాన్ని చేసి, యశోదాదేవి చేతితో కట్టుబడి, ఆమెకు భయపడి నిలచిన స్థితిని కల శ్రీకృష్ణుడే ఉపాయం, ఉపేయం, విరోధినిరసనాన్ని చేసేవాడు, అంతేకాక, ధారకపోషక భోగ్యాలుకూడా అతడే– అనే పర్యంతంలో నిలువకుండా, అతని అందం, గుణాలు మొదలైనవానిలో అభినివేశాన్ని పొందిన శ్రీవైష్ణవులే ఈ ఆత్మకు శేషిభూతులుగా, పరమపురుషార్థంగా ఉన్నారు– అని నమ్మాழ்వార్లు **“పయిలుమ్ శు డరొళి”** (తిరువాయ్–3–7), **“నెడుమాఱ్కడిమై”** (తిరువాయ్–8–10) మొదలైన దశకాలలో నిర్ణయించారు.

భరతాழ்వాన్‌కు గల రామభక్తిని సైతం కాదని, శ్రీశత్రుఘ్నుழ்వాన్ భరతునిపట్ల ఈడుపాడును (అభినివేశాన్ని) పొందినట్లుగా, శ్రీమధురకవి ఆழ்వార్, భగవానుని విషయంలో, శ్రీవైష్ణవుల విషయంలో ఆழ்వార్లు కల్గి ఉండే అభినివేశాన్ని అంతటినీ, ఆழ்వార్ల శ్రీచరణాలపట్ల కల్గి ఉండి, దానినే కోరి, దానినిగూర్చి ఈ కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు ప్రబంధంలో అనుభవిస్తున్నారు.

(నమ్బిళ్ళై ఈప్రబంధానికి అనుగ్రహించిన వ్యాఖ్యానంలో పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలోని అంశాలే గోచరిస్తున్నాయి. అందువల్ల ఆ వ్యాఖ్యానంలోని అంశాలు ప్రత్యేకించి ప్రస్తావింపబడడం లేదు).

## అழ்కియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ వ్యాఖ్యాన ప్రవేశంలోని విశేషాలు

భగవానునిపట్ల అభినివేశాన్ని కల్గినవారై, ఆ స్వామి గొప్పతనాలను అజ్ఞానులైన సంసారులు కూడా తెలిసేవిధంగా ఆయా పురాణాలలో ఉపదేశించిన శ్రీపరాశరమహర్షి మొదలైన ఋషులకు సంసారి చేతనులకంటే వైలక్షణ్యమున్నది. ఆవిధంగా ఉన్నప్పటికీ, ఋషులు **“తదస్య త్రివిధస్యాపి దుఖజాతస్య వై మమ, గర్భజన్మజరాద్యేషు స్థానేషు ప్రభవిష్యతః, నిరస్తాతిశయాహ్లాదసుఖభావైకలక్షణా,**



**భేషజం భగవత్ప్రాప్తి రేకాంతాఽత్యంతికీ మతా”** (విష్ణు–6–5–58, 59) (గర్భవాసస్థితి, జన్మ, ముసలితనం మొదలైన స్థితులలో పరిభ్రమించే ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికాలనే మూడు విధాలైన దుఃఖసమూహాలకు– తనకు మించినది లేనిది, ఆనందరూపమైన సుఖంగా ఉండడమనే దానినే లక్షణంగా కల్గినది, దుఃఖం లేనిది, అంతు లేనిది అయిన భగవత్ప్రాప్తియే ఔషధంగా చెప్పబడుతున్నది) అని అంటూ భగవానుని పొందడం పరమపురుషార్థమని, **“తస్మాత్ తత్ప్రాప్తయే యత్నః కర్తవ్యః పండితై ర్నరైః, తత్ప్రాప్తిహేతుజ్ఞానం చ కర్మ చోక్తం మహామునే !”** (విష్ణుపు–6–5–60) (ఓ గొప్పమునీ! పూర్వం పల్కిన కారణం వల్లనే జ్ఞానులైన మానవులచే ఆ భగవానుని పొందడానికి ప్రయత్నం చేయబడాలి. అతనిని పొందడానికి జ్ఞానం, కర్మ ఉపాయాలుగా చెప్పబడ్డాయి) అని అంటూ భగవానుని పొందడానికి ఉపాసనను సాధనంగా ఉపదేశించినప్పటికీ, అర్థం, కామం– అనే పురుషార్థాలను సంకీర్ణంగా ఉపదేశించారు.

ఆ మహర్షులకంటే, భగవానుని కటాక్షంవల్ల భ్రమవిప్రలంభాది దోషరహితమైన, భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని పొందిన ఆழ்వార్లకు వైలక్షణ్యం ఉన్నది. అది ఈవిధంగా–1. భగవానుని పొందడమనే పరమపురుషార్థాన్నే తమ ప్రబంధాలలో మొదటినుండి చివరివరకు అన్నిచోట్ల వారు ఉపదేశించారు. 2. దానికి సాధనంకూడా అతని శ్రీచరణాలే– అని ఉపదేశించారు. నమ్మాழ்వార్లు ఆ విధంగా ఉపదేశించడంలో నిలువకుండా **“వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్”** (ఏవిధమైన అంతరాయం లేని నిత్యకైంకర్యాన్ని మనం చేయాలి” (తిరువాయ్–3–3–1) అని ఉపదేశించి, **“అడిక్కీழ்”** (తిరువాయ్–6–10–10) అని అంటూ తాము వాటిని అనుష్ఠించారుకూడా. మిగిలిన ఆழ்వార్లకంటే వీరికి గల వైలక్షణ్యం ఇది.

ఈవిధంగా భగవానుడే పురుషార్థం, సాధనం –అని ఉపదేశించి అనుష్ఠించిన నమ్మాழ்వార్ల కంటే, ఆ ఆழ்వార్లే పురుషార్థం, వారిని పొందడానికి సాధనం– వారి శ్రీచరణాలే– అని భావించిన శ్రీమధురకవి ఆழ்వార్లు చాలా వైలక్షణ్యాన్ని కలవారు. ఆழ்వార్లు, ప్రథమపర్వమైన భగవద్విషయంలో నిలిచారు. వీరు, చరమపర్వమైన ఆழ்వార్ల విషయంలో నిలిచారు. వారు (ఆழ்వార్లు) అష్టాక్షరికి సంగ్రహమైన ఓంకారంలో అవధారణార్థాన్ని తెలిపే ఉకారంలో నిలిచారు. వీరు (మధురకవులు)

దాని వివరణమైన **"నమః"** అనే శబ్దంయొక్క అర్థంలో నిలచారు. భగవన్నిష్ఠులైన ఆళ్వార్లకంటే ఆచార్యనిష్ఠను కల పెరియాళ్వార్ల పుత్రిక ఆణ్డాళ్‌ను వీరు అనుసరించారు. శ్రీరామాయణ పురుషులలో భరతునే సర్వస్వంగా తలచిన శత్రుఘ్నాళ్వాన్‌ను అనుసరించారు. మన ఆచార్యులలో నాథమునులనే సర్వస్వంగా తలచిన ఆళవందార్‌ను వీరిని అనుసరించారు.

భగవానుని గుణాలు ఆళ్వార్ల వాక్కువల్ల అతిశయాన్ని పొందినట్లుగా, ఆళ్వార్ల గుణాలు కూడా వీరి వాక్కువల్ల ఉత్కర్షను పొందాయి. వేదం వలె అనంతంగా ఉండకుండా, తిరువాయ్‌మొழி వలె వేయి పాశురాలుగా ఉండకుండా, కేవలం పది పాశురాలలో పరమసారాన్ని పల్కుతున్నది, వీరి ప్రబంధం. తిరువాయ్‌మొழி – వేదసారం. వీరి ప్రబంధం– తిరువాయ్‌మొழிసారం. **"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ"** (తల్లిని దైవంగా కలవాడవు కావాలి, తండ్రిని దైవంగా కలవాడవు కావాలి, ఆచార్యుని దైవంగా కల వాడవు కావాలి, అతిథిని దైవంగా కలవాడవు కావాలి) అనే ఉపనిషద్వాక్యానుసారం నిరుపాధికజనని అయిన లక్ష్మీదేవిని, నిరుపాధికపిత అయిన భగవానుని, **"విరున్దాకుమ్ పెరుమ్ తక్కోర్"** (అతిథులైన గొప్పయోగ్యులు) అయిన శ్రీవైష్ణవులను ఆశ్రయించినవారు– ఆళ్వార్లు. ఆ ముగ్గురి గొప్పతనాలను తెలిపే ఆచార్యుని ఆశ్రయించారు – వీరు. (మధురకవులు). ఈశ్వరుని ఆరాధించడం అరుదు కనుక, అతని విషయంలో నమ్మాళ్వార్లు నాల్గు ప్రబంధాలను అనుగ్రహించారు. ఆచార్యుని ఆరాధించడం సులభం కనుక, ఈ ప్రబంధంలో మధురకవులు కేవలం పది పాశురాలను మాత్రమే పలికారు.

పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానావతారిక భావదీపిక – ఆంధ్రవివరణం సంపూర్ణం







శ్రీమతే రామానుజాయ నమః

## మధురకవి ఆళ్వార్లు అనుగ్రహించిన

# కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు – సవ్యాఖ్యానమ్

**కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్**
**కట్టుణ్ణప్పణ్ణియ పెరుమాయన్, ఎన్నప్పనిల్,**
**నణ్ణి త్తెన్గురుగూర్, నమ్బి ఎన్ఱక్కాల్,**
**అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్నావుక్కే.** 1

కణ్ణి = (శరీరంలో ఒరసి (గుచ్చు) కొనేటట్లుగా పలు) ముడులను కల్గినది, నుణ్ = (శరీరంలో ఒత్తుకొనేటట్లుగా) సన్నగా ఉన్నది, శిఱు = (పొడుగు చాలని రీతిలో), చిన్నదైన, తామ్బినాల్ = దారంతో, కట్టుణ్ణ ప్పణ్ణియ = యశోదాదేవిచే తనను కట్టబడేటట్లుగా చేయించుకొన్న, పెరు మాయన్ = గొప్ప ఆశ్చర్యకరమైన శక్తిని కలవాడై, ఎన్ అప్పనిల్ = నాకు స్వామి అయిన సర్వేశ్వరుని విడచి, నణ్ణి = (ఆళ్వార్ల) దరిచేరి ఆశ్రయించి, తెన్ కురుకూర్ నమ్బి = దక్షిణ దిక్కులో ఉండే ఆళ్వార్ తిరునగరి అనే కురుకూర్‌కు నాథులైన ఆళ్వార్", ఎన్ఱక్కాల్=అని అంటూ వారి తిరునామాన్ని పల్కితే, అణ్ణిక్కుమ్ = మిక్కిలి తీయగా ఉంటుంది, ఎన్ నావుక్కే= నా ఒక్కని నాలుకకే, అముదు ఊఱుమ్ = అమృతం ప్రవిస్తుంది.

## పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానమ్

**అవ - ముతఱ్పాట్టిల్ - ఆళ్వారుడైయ నిరతిశయభోగ్యతైయై చ్చొల్లు కిఱతు. ప్రాప్యకాష్ఠైయాన ఆళ్వారై ప్పఱ్ఱుకిఱ ఇవర్, ప్రథమావధియాన భగవద్విషయత్తిల్ ఇழிవానెన్? ఎన్నిల్. ఆళ్వారుడైయ భోగ్యతాతిశయమ్ తోఱ్ఱుకైక్కాకవుమ్, ఆళ్వారుడైయ ముకమలర్త్తిక్కాకవుమ్, అవరు కక్కుమ్ భగవద్విషయమాకైయాలుమ్ పేశుకిఱార్. "ఉరలినోడిణైన్దిరున్దేఙ్గియ వెళివు - ఎత్తిఱమ్" ఎన్ఱుమ్, "పిఱన్ద వాఱుమ్ వళర్న్ద వాఱుమ్" ఎన్ఱుమ్, "పైయవే నిలైయుమ్" ఎన్ఱుమ్ - ఆళ్వార్ ఆழ்ఙ్గాఱ్పట్ట విషయామాకైయాలే అత్తై ప్పేశుకిఱార్.**

వ్యా - (కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్) ఆఴ్వార్‌పక్కల్ ఇవర్‌క్కు ఉణ్డాన ఉద్దేశ్యత్తై ఇరుస్దపడి - అవరుడైయ ఉద్దేశ్యవస్తువై క్కట్టినతొరు కయిఱ్ఱు నుడైయ ఉళ్‌మానమ్, పుఱమానమ్ ఆరాయుమ్బడియాయ్‌త్తు, ఇవర్ భగవద్విషయత్తిలే కైయొఴిన్ద పడి, ఇవర్ ఆఴ్వార్ పక్కలిలే న్యస్తభరరాన పడియితే.

(కణ్ణిత్తామ్బు) ఉడమ్బిలే కట్టప్పుక్కాల్ ఉఱుత్తుమ్బడి పల పిణైకళై యుడైత్తాయిరుక్కై. కణ్ణి - ముడి. (నుణ్ తామ్బు) ఉడమ్బిలే అఴున్దుమ్బడి నేరియతాయిరుక్కై . (శిఱుత్తామ్బు) ఇవనై క్కట్టిన పిన్బు ఉరలోడే శేర్‌క్కైక్కు ఎట్టమ్ పోరాతిరుక్కై.

(కట్టుణ్ణ ప్పణ్ణియ) "ఉరలై నేరియతాక చ్చెతుక్కప్పోకాతు, ఆప్పోతాక క్కయిఱ్ఱు నెడుకవిడప్పోకాతు. ఇని, ఇవన్దన్నై విట్టు నెడియ కయిఱు తేడి ఎడుక్కప్పుకిల్, పిన్నై ఇవన్దాన్ ఎట్టాన్, కాఱ్ఱిఱ్కుడియనాయ్ ఓడుమ్, ఇని చ్చెయ్‌వతెన్?" ఎన్ఱు అవళ్ తడుమాఱుకిఱపడియై క్కణ్డాన్. (కట్టుణ్ణ ప్పణ్ణియ) "సదైకరూపరూపాయ" ఎన్గిఱ తన్నుడైయ తిరుమేనియై నెరుక్కి ఇడఙ్గణ్డు కట్టుణ్ణుమ్బడి పణ్ణినాన్. "కట్టుకైక్కు ప్పరికర మిల్లై" ఎన్ఱు నివృత్తైయా మాకిల్, పిఱన్దు పడైక్క నినైత్త గుణత్తై ఇఴక్కుమిత్తనైయితే. ఆకైయాలే, తిరుమేనియిలే ఇడఙ్గొడుత్తాన్. "కణ్ణియార్ కుఱుఙ్గయిఱ్ఱాల్ కట్ట వెట్టెన్ఱిరున్దాన్", "కణ్ణి క్కుఱుమ్ కయిఱ్ఱాల్ కట్టుణ్డాన్" ఎన్ఱుమ్ ఎల్లారు మీడుపడుమ్ తుఱైయితే ఇతుతాన్. "దామ్నా చైవ.... యది శక్నోషి గచ్ఛ త్వ మతిచఞ్చలచేష్టిత" ఎన్ఱు - "తాయ్ కట్టిన కట్టై అవిఴ్క్క శక్తనల్లేన్" ఎన్ఱిరున్దానితే.

(సంసారబన్ధస్థితిమోక్షహేతుః) స్వవ్యతిరిక్తరైయడైయ క్కట్టుకైక్కుమ్, విడుకైక్కుమ్ హేతువానవన్ కిడీర్, ఇప్పోతు ఓరబలై కట్టిన కట్టై అవిఴ్త్తు క్కొళ్ళ శక్తనన్ఱిక్కే యిరుక్కిఱాన్. శెరుక్కనాన సార్వభౌమన్, అభిమతవిషయత్తిన్ కైయిలే అకప్పట్టు, ఒరు కరుముకైమాలైయాలే కట్టుణ్డాల్, అతుక్కు ప్రతిక్రియై పణ్ణమాట్టాతే ఇరుక్కుమాపోలేయితే, ఇవళ్ కట్టిన కట్టుక్కు



ప్రతిక్రియైయై పణ్ణమాట్టాదే. ఇరుస్ద ఇరుప్పుమ్. పిఱరుడైయ కర్మనిబన్ధమాక వరుమ్ కట్టై అవిఴ్క్కు మత్తనై యల్లతు, తన్ అనుగ్రహత్తాలే వస్ద కట్టు త్తన్నాలుమ్ అవిఴ్క్కప్పోకాతు - ఎన్నై.

ఆఴ్వార్ - "మయర్వఱ మతినలమరుళ" ప్పెఱ్ఱవరాకైయాలే, "ఉయర్వఱ ఉయర్‌నల ముడైయవన్" ఎన్ఱు అనన్దగుణత్తై వర్ణిత్తార్. ఇవర్- ముతలడియిల్ ఆఴ్వార్‌తమ్మైయే పఱ్ఱుకైయాలే, అవన్ తిరుమేనియిల్ స్పర్శిత్తతొరు తామ్బై వర్ణిక్కిఱార్, అవరుడైయ ఉద్దేశ్యవస్తు ఇవరుక్కు వెళియతాయ్ క్కఴికిఱతితే.

ఇవన్దన్నై క్కట్టువతు-"ఒరుపెణ్ణై క్కళవు కణ్డాన్; వెణ్ణెయై క్కళవు కణ్డాన్; ఊరైమూలై యడియే నడత్తినాన్" ఎన్ఱితే. ఇవన్ "సామాన్యన్" - ఎన్ఱు ఇడుమీడెల్లా మిడుఙ్గోళ్" ఎన్ఱిరున్దాన్. అతావతు - కళవిలే తకణేఱిన పడి. ఇవళ్ కట్టివైత్తు అడిక్క ప్పుక్కవాతే "తొఴుకైయుమ్" ఎన్గిఱపడియే తొఴత్తొడఙ్గుమే. ఎల్లారైయుమ్ తొఴవిత్తుక్కొళ్ళుమవనితే తొఴుకిఱాన్. "ఇద్దశైయిల్ అభిమతసిద్ధిక్కు అఞ్జలియే సాధనమ్" ఎన్దఱియుమవనితే. (అతిచఞ్చలచేష్టిత ) తురుతురుక్కైయాక క్కొణ్డు ఊర్‌పూశల్ విళైత్తవనల్లైయో! (ఇత్యుక్త్వా) ఒరు శొల్లాలే విలఙ్గిట్టు వైత్తు. (అథ నిజం కర్మ సా చకార) అవళ్‌తాన్ కఱప్పతు, కడైవతాక త్తొడఙ్గినాళ్. (కుటుమ్బినీ) ఇవనైప్పోలే నియమిక్కవేణ్డువన అనేకముణ్డితే.

(పెరు మాయన్) నిరతిశయాశ్చర్యయుక్తన్. ఇత్తాల్ - అవాప్తసమస్తకామనుక్కు ఒరు కుఱై యుణ్డామ్; అతుతన్నై క్షుద్రరైప్పోలే కళవాకిఱ వఴియల్లా వఴియిలే ఇఴిన్దు, సర్వశక్తియానవన్దాన్, అతు తన్నైయుమ్ తలైక్కట్టమాట్టాతే "వాయతు కైయతాక అకప్పట్టు క్కట్టుణ్డు అడియుణ్డు" "పైయవే నిలైయుమ్" ఎన్ఱు ఉడమ్బు వెళుత్తు, నిన్దనిలై యళవుమ్ శెల్ల నినైక్కిఱార్. (ఎన్నప్పనిల్) ఆఴ్వార్ ఇవర్‌క్కు ఉద్దేశ్యరాయ్ నిఱ్క, ఇఙ్గనే శొల్లువానెన్? ఎన్నిల్, భగవత్సమ్బన్ధ మఱ వార్తై శొన్నారాకిల్, ఆఴ్వారోట్టై సమ్బన్ధత్తై యఱుత్తుక్కొణ్డారావరితే. అత్తాలే శొల్లుకిఱార్. అథవా, "పుంసాం

దృష్టిచిత్తాపహారిణమ్" ఎన్గిఅపడియే, అవ్వరుకే పోవారైయుమ్ తువక్కవల్ల విషయనూకైయాలే, తువక్కుణ్డు శొల్లుకిఱార్ - ఎన్నవుమామ్.

(ఎన్నప్పనిల్ నణ్ణి) భగవద్విషయత్తిల్ నిన్టుమ్ ఆళ్వార్ పక్కలితే కిట్టి. శబ్దాదివిషయప్రావణ్యఙ్గళై విట్టు భగవద్విషయత్తై క్కిట్టుకైయిలుణ్డాన అరుమై పోరుమ్ - ప్రథమావధియాన భగవద్విషయత్తై విట్టు పురుషార్థత్తిల్ చరమా వధియాన తదీయశేషత్వత్తై క్కిట్టుకై. శబ్దాదివిషయఙ్గళై విడలామ్, అతిన్ దోషదర్శనత్తాలే. ఇఙ్గు అఙ్గనొరు దోషమ్ కాణ విరకిల్లైయాకైయాలే, ఇతు అతిలుమరితు.

(తెన్ కురుకూర్ నమ్బి) "నల్కి ఎన్నై విడాన్ నమ్బి నమ్బి" ఎన్టు ఆళ్వార్ తామ్ ఉద్దేశ్యమాక ప్పఱ్ఱిన విషయత్తిన్ పూర్తియళవన్టితే, ఇవర్ పఱ్ఱిన విషయత్తిన్ పూర్తి. ఎఙ్గనే? ఎన్నిల్, భగవద్విషయత్తై ప్పఱ్ఱినాల్ అతిన్ ఎల్లైయాన ఆళ్వారళవుమ్ వరవేణ్డియిరుక్కుమ్. ఆళ్వారై ప్పఱ్ఱినాల్ అవ్వరుకు గన్తవ్యభూమి యిల్లైయితే. ఆచార్యర్కళై "నమ్బి" ఎన్న క్కటప్పిత్తార్ - శ్రీమధురకవికళితే" ఎన్టు జీయర్ అరుళిచ్చెయ్వర్. (ఎన్టక్కాల్) మనోవాక్కాయఙ్గళ్ మూన్టుమ్ వేణ్డియిరుక్కుమ్, భగవద్విషయత్తుక్కు. ఓరుక్తిమాత్రమే యమైయుమ్. ఇవ్విషయత్తుక్కు, పూర్తియాల్ వన్ద ఏఱ్ఱమే యన్టు, సౌలభ్యత్తాలు మేఱ్ఱముణ్డు - ఎన్గై.

(అణ్ణిక్కుమ్) తిత్తిక్కుమ్. భగవద్విషయత్తై అనుభవిత్తాల్ ఆళ్వారుక్కు ప్పిఱక్కు మానన్దమెల్లామ్ ఇవ్విషయత్తిలే ఓరుక్తిమాత్రత్తాలే ఎనక్కు సిద్ధిత్తతు.

(అముతూఱుమ్) అముతూఱ్ఱు మాఱాతే నిఱ్కుమ్. "న చ పునరావర్తతే" ఎన్టు-అవ్విషయమ్ ఆళ్వారుక్కు తత్ప్రసాదత్తాలే నిత్యమాయ్ శెల్లుమాపోలే, ఎనక్కు ఆళ్వార్ప్రసాదత్తాలే నిత్యాపూర్వమాయ్ చ్చెల్లప్పెఱ్ఱేన్.

(ఎన్నావుక్కే) "ఇతు పిన్నై ఎఙ్గళుక్కు రసిక్కిఅతిల్లైయో!" ఎన్నిల్, ముతలడియాన భగవద్విషయముమ్ కూడ రసియాతిరుక్కిఅ ఉఙ్గళుక్కు అతిన్ ఎల్లైయిలే నిఱ్కిఅ ఎనక్కు రసిక్కుమాపోలే రసిక్కుమో? (ఎన్నావుక్కే)



అనాదికాలమ్ విషయాన్తరఙ్గళ్ రసిత్తు పోన్ద ఎన్నావుక్కే ఇవ్విషయమ్ రసిక్కిఅతు - ఎన్టుమామ్.

## అరుమ్బద విళక్కమ్

ముదల్పాట్టు :- "అణ్ణిక్కుమ్ అముతూఱుమ్" ఎన్టత్తై క్కటాక్షిత్తు భావమ్ (ముతఱ్పాట్టిల్ ఇత్యాది). ఆనాల్ "ఎన్నప్పనిల్" ఎన్టు శొల్లవాన్ ఎన్? ఎన్గిఅ శఙ్కైయై అనువదిత్తు, ఇతుక్కు మూన్టు వకైయాక ప్పరిహరిక్కిఱార్ (పాప్యేత్యాది). (ఆళ్వారుడైయ) ఇత్యాదిక్కు-అవరుడైయ భోగ్యతాతిశయమ్ శొల్లుకైక్కు కీళ్అవధి శొల్లవేణ్డుకైయాలే, "అప్పనిల్" ఎన్గిఱా రెన్టు కరుత్తు. (ఆళ్వారుడైయ ముకమలర్త్తిక్కాక) ఎన్టతుక్కు "ఎన్" ఎన్గిఅ పద మనుసన్ధిత్తాల్ ఆళ్వార్ తిరువుళ్ళ ముకక్కుమెన్టు తిరువుళ్ళమ్. (అవరుకక్కుమ్) ఆళ్వార్ వ్యామోహిక్కుమ్. ఇప్పడి వ్యామోహిక్కిఅ అపదానమాకైయాలే, "కణ్ణినుణ్" ఇత్యాదియాలే విశేషిత్తార్-ఎన్టు తాత్పర్యమ్. "మాయన్" ఎన్ట పదత్తిలే ఆశ్చర్యచేష్టితఙ్గళై ఎల్లామ్ వివక్షిత్తు మూన్టామ్ పరిహారత్తై వివరిక్కిఱార్ (ఉరలినోడు ఇత్యాది).

"తామ్బినాల్" ఎన్న అమైన్దిరుక్క, "కణ్ణి, నుణ్, శిఱు" ఎన్టు వర్ణిక్కైక్కు క్కరుత్తెన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (ఆళ్వార్ పక్కలిత్యాది). (ఉద్దేశ్యత్తై ఇరున్దపడి-ఆరాయుమ్బడియాయ్త్తు) ఎన్టన్వయమ్. (ఉళ్మానమ్ పుఱమానమ్) అన్తర్బాహ్య స్వరూపమెల్లా మెన్టపడి. తామ్బినాల్ కట్టుణ్గైయిలే ఆళ్వార్ వ్యామోహిత్తపడియాలే అవరై యిట్టు క్కణ్ణియై వర్ణిత్తారెన్టు కరుత్తు. అవ్యవహితమాక భగవద్విషయత్తై ప్పఱ్ఱి వర్ణిత్తాలాకాతో? ఆళ్వారై యిట్టు ఎన్బానెన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (ఇవరిత్యాది). (న్యస్తభరరానపడి) ఎన్టతు - న్యస్తభరరాకైయాలే -ఎన్టపడి.

"కణ్ణి" ఎన్టతుక్కు ఫలితమ్ం (కణ్ణిత్తామ్బిత్యాది) ఇత్తాల్- ఆళ్వార్ వ్యామోహిత్తతుక్కు సూచకమెన్టు తిరువుళ్ళమ్. నేరియతాయిరుక్కై - మెల్లియతాయిరుక్కై. ఇతువుమ్ వ్యామోహత్తుక్కు సూచకమ్.

"కట్టుణ్డ" ఎన్నాతే, "పణ్ణియ" ఎన్బానెన్? ఎన్గిఅ శఙ్కై ఉదిక్కైక్కాక ప్రతీకగ్రహణమ్ పణ్ణుకిఱార్ (కట్టుణ్ణ ప్పణ్ణియ) ఎన్టు. ఇన్ద శఙ్కైయై ప్పరిహరిప్పతాక తాత్పర్య మరుళిచ్చెయ్కిఱార్ (ఉరలై యిత్యాది) (నేరియతాక చ్చెతుక్క పోకాతు)

ఎన్నతు– మెల్లియతాక చ్చెతుక్క ప్పోకాతు–ఎన్నపడి. (కడియన్) వేగవాన్. (కణ్డాన్) ఎన్న అనన్తరమ్ "ఆకైయాలే కట్టుణ్డప్పణ్ణినాన్ –ఎన్నైక్కాక అరుళిచ్చెయ్‌తార్" ఎన్ఱు కూట్టువతు.

ఏకరూపమాక శాస్త్రసిద్ధమాన తిరుమేనియై చ్చురుక్కప్పోకామైయాల్ కట్టుణ్ణ ప్పణ్ణక్కూడుమో? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (సదైకేత్యాది). (నెరుక్కి) స్వసఙ్కల్పత్తాలే నెరుక్కి –ఎన్నపడి. ఆకైయాల్, "సదైకరూపరూపాయ" ఎన్నతు– కర్మకృతవికార రాహిత్యత్తై చ్చొల్లుకిఱతు – ఎన్ఱు కరుత్తు.

తన్ సఙ్కల్పత్తాల్ తానే కట్టుణ్డవేణుమో? అవళ్ కట్టాతేపోనాల్ నల్లతన్ఱో ! ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (కట్టుకైక్కు– ఇత్యాది వాక్యద్వయత్తాలే). ఆక, "కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్ కట్టుణ్ణ ప్పణ్ణియ" ఎన్న ఇత్తాల్ – సౌలభ్యత్తాల్ తాన్ కట్టుణ్డానెన్ఱు ఆఴ్వారుడైయ వ్యామోహమ్ సూచిప్పిక్కప్పడవతు. ఇప్పడి ఇవ్వపదానత్తిల్ వ్యామోహిత్తారుణ్డో? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (కణ్ణియారిత్యాది). ఇతుక్కు అర్థమ్ – పల ప్పిణైకళై యుడైత్తాయ్, కుఱళాయిరున్దుళ్ళ తామ్బాలే కట్ట విశైన్దతిఱే.

"ఇరున్దాన్" ఎన్ఱు– కట్టుకైక్కుమ్, అతుక్కు ఇశైన్దిరుక్కైక్కుమ్ అడైవే ప్రమాణ ద్వయ మరుళిచ్చెయ్‌తు, అర్థానుసన్ధానత్తాలే విద్ధరాకిఱార్ (దామ్నా చైవేత్యాది). 'దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నాదులూఖలే, కృష్ణ మక్లిష్టకర్మాణ మాహ చేద మమర్షితా, యది శక్నోషి గచ్ఛ త్వ మతిచఞ్చలచేష్టిత, ఇత్యుక్త్వాథ నిజం కర్మ సా చకార కుటుమ్బినీ".

సర్వశక్తనానవన్ అశక్తనెన్ఱిరుక్కక్కూడుమో? ఎన్న, ప్రేమత్తాలే ఇప్పడి ఇరుక్కిఱానెన్ఱు ఈడుపడుకిఱార్ (సంసారేత్యాది). ప్రేమత్తాలే తాన్ ఇప్పడి కట్టుణ్డానో? ఎన్న; దృష్టాన్తమ్ శొల్లిక్కొణ్డు ఆశ్చర్యప్పడుకిఱార్ (శెరుక్కనాన– ఇత్యాది). సంసార బన్ధ మవిఴ్క్కైక్కుమ్, ఇన్ద క్కట్టై అవిఴ్త్తుక్కొళ్ళామైక్కుమ్ హేతువేతు? ఎన్న; అరుళిచ్చెయ్ కిఱార్ (పిఱరుడైయ ఇత్యాది). ఆక, "యది శక్నోషి గచ్ఛ త్వమ్" ఎన్నుమతుక్కుమ్ అర్థమరుళిచ్చెయ్‌తార్. ప్రబన్ధాదియిలే భగవద్గుణఙ్గళిలే ఇఴియాతే తామ్బై వర్ణిప్పానెన్? ఎన్గిఱ శఙ్కైయిలే సింహావలోకనన్యాయేన పరిహరిక్కిఱార్ (ఆఴ్వారిత్యాది వాక్యత్రయత్తాలే) (వెళియతు) అసారమ్.



ఇని, ప్రకృతశ్లోకత్తిలే, "అతిచఞ్చలచేష్టిత" ఎన్నతుక్కు అవతారికై అరుళిచ్చెయ్ కిఱార్ (ఇవన్దన్నై – ఇత్యాది అఱియుమవనిఱే – ఎన్నుమళవుమ్) (సామాన్యనెన్ఱు ఇడుమీడెల్లామ్) ఎన్నతు–అఴకర్ తిరుమలైయిలే, సామాన్యరెన్ఱుమ్, శోత్రియరెన్ఱుమ్ ఇరణ్డు వకై యుణ్డాయ్, అవర్‌కళుక్కుళ్ అన్యోన్యస్పర్ధై యుణ్డాకైయాలే, శోత్రియర్ ఎల్లారుమాక సామాన్యరై క్కణ్డాల్ అడిక్కవేణు మెన్ఱు కూడియిరుక్కచ్చెయ్‌తే, ఇరుట్టిన విడత్తిలే శోత్రియరుక్కుళ్ళే ఒరువన్ వర, అవనై అఱియామల్ అడిక్క, 'నాన్ శోత్రియన్, ఏన్ అడిక్కిఱీర్‌కళ్? ఎన్న; సామాన్యనెన్ఱిరున్దోమెన్న; అనాల్ "ఇన్నుమ్ కుత్తుఙ్గళ్" ఎన్న; అవన్‌పక్కల్ స్పర్ధైయాలే తన్నోవు తోఱ్ఱామల్ శొన్నా నెన్ఱు ఐతిహ్యమ్; అప్పడియే కృష్ణనుమ్, వెణ్ణెయ్ కళవు కణ్డానెన్ఱు కట్టినాలుమ్, అడిత్తాలుమ్ "కళ్ళనెన్న డిత్తాల్ నమక్కిష్టమ్, అత్తాల్ నమక్కు భరమిల్లై" – ఎన్ఱిరున్దాన్ ఎన్నపడి.

"తొఴుకైయు మివై కణ్ణ అశోతై" ఎన్గిఱపడియే– తాయై త్తొఴ త్తొడఙ్గినాన్– ఎన్గిఱార్ (ఇవళిత్యాది).

తొఴుతాల్ అడియారో? ఎన్న (ఇద్దశైయిలిత్యాది). ఇవఱ్ఱై ఎల్లామ్ నినైత్తు. "అతిచఞ్చలచేష్టిత" ఎన్గిఱారెన్ఱు కరుత్తు. ఫలితార్థమ్ (తురుతురుక్కై యిత్యాది) "ఇత్యుక్త్వా" ఎన్ఱు – నిజకర్మకరణత్తుక్కు హేతువాక అనువదిక్కైయాలే అత్తైయుమ్ ఒరు బన్ధమాక అరుళిచ్చెయ్‌కిఱార్ (ఒరు శొల్లాలే – యిత్యాది). ఇప్పడి ఇవన్ శొల్లుక్కు ప్పరతన్త్రనాయిరుక్కైయాలే తానే కట్టుణ్ణప్పణ్ణినానెన్ఱు కరుత్తు. కట్టాతే అడియాతే అవనుడైయ అణ్డైయిలేతానే యిరుక్కవొణ్ణాతో? ఎన్న; అరుళిచ్చెయ్‌కిఱార్ (ఇవనై– యిత్యాది).

కట్టుణ్గై ముతలానవై ఆశ్చర్యఙ్గళానపడియై ఉపపాదిక్కిఱార్ (ఇత్తాల్–ఇత్యాది). "అవరప్పనిల్" ఎన్ఱు సమ్బన్ధమఱ చ్చొల్లాతే "ఎన్నప్పనిల్" ఎన్నక్కూడుమో? ఎన్గిఱ శఙ్కైయై అనువదిక్కిఱార్ (ఆఴ్వారిత్యాది). "సమ్బన్ధ మఱ వార్త్తై శొన్నారాకిల్" ఎన్ఱు పరిహారవాక్యత్తిలే యిరుక్కైయాలే ఇప్పడి తాత్పర్యమ్ కొళ్ళవేణుమ్. సమ్బన్ధమఱ చ్చొన్నారాకిలుమ్ అవశమాక చ్చొన్నారెన్ఱు పరిహారాన్తర మరుళిచ్చెయ్‌కిఱార్ (అథవేత్యాది).

"ఎన్నప్పనిల్ –తెన్‌కురుకూర్" ఎన్టాల్ పోతాతో?, "నణ్ణి" ఎన్బానెన్? ఎన్న, అరుమై తోన్ఱ చ్చొల్లుకిఱారెన్టు, అవ్వరుమైయై దృష్టాన్తముఖేన ఉపపాదిక్కిఱార్ (శబ్దాదిత్యాది) కీఴ్– శబ్దాదికళోడే సామ్యమ్ తోన్ఱ అరుళిచ్చెయ్‌తు, ఆధిక్యమ్ తోన్ఱ అర్థాన్తరమరుళిచ్చెయ్‌కిఱార్ (శబ్దాదివిషయజ్గళిత్యాది).

"ఎన్నప్పనిల్– అముతూఱుమ్" ఎన్గిఱపడియే "కురుకూర్ చ్చడకోపన్" ఎన్బామల్, "కురుకూర్‌నమ్బి" ఎన్బానెన్? ఎన్న; అరుళిచ్చెయ్‌కిఱార్ (నల్‌కి–ఇత్యాది). (కట్పిత్తార్) అభ్యసిప్పిత్తార్. (సౌలభ్యమ్) ఎన్టతు– ఏకకరణసాధ్యత్వత్తాలే వన్ద సౌలభ్యమ్– ఎన్టపడి.

"ఊఱుమ్" ఎన్ఱ విడత్తిల్ వర్తమానతాత్పర్య మరుళిచ్చెయ్‌కిఱార్ (అముతూఱ్ఱిత్యాది) ఇత్తై సహేతుకమాక ఉపపాదిక్కిఱార్ (న చేత్యాది).

"ఎన్‌నా" ఎన్టతుక్కు ఇరణ్డు తాత్పర్యమ్ – భాగవతనిష్ఠనెన్టుమ్, విషయాన్తరప్రవణనెన్టుమ్. మున్దిన అర్థత్తై శజ్కాపూర్వకమాక అరుళిచ్చెయ్‌కిఱార్ (ఇతు పిన్నై యిత్యాది). ఇరణ్డావతు (అనాదికాల మిత్యాది). "విరోధివ్యసనత్తై అనుభవిక్కిఱ ఎన్నావుక్కు ఇతు రసిక్కుమ్బడి ఎన్ !" ఎన్టు విద్ధరాకిఱారెన్టు కరుత్తు.

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**మొదటి పాశురం – అవతారిక :** (ఈ) మొదటి పాశురంలో ఆళ్వార్ల సాటి లేని మాధుర్యం తెలుపబడుతున్నది. పొందదగిన ప్రాప్యంయొక్క చరమావధియైన ఆళ్వార్లను ఆశ్రయించే వీరి (మధురకవుల) ప్రాప్యంయొక్క ప్రథమదశ భగవద్విషయం. దానిని వీరు ఈ పాశురంలో ప్రస్తావించడానికి కారణమేమి? అని అంటే, భగవద్విషయం కంటే నమ్మాళ్వార్లకుగల భోగ్యత స్ఫురించడం కోసం, తమకు (ఆళ్వార్లకు) భోగ్యమైన భగవద్విషయాన్ని పాడినపుడే ఆళ్వార్ల ముఖం వికసిస్తుంది కనుక, ఆళ్వార్లు భగవద్విషయాన్ని అభిమానించి అభిలషించినవారు కనుక, ఈ పాశురంలో ముందుగా మధురకవులు భగవద్విషయాన్ని గూర్చి పల్కుతున్నారు. అందులోను, **"ఉరలినోడు ఇణైన్దిరున్దు ఏజ్గియ ఎళివు ఎత్తిఱమ్!"** (తిరువాయ్–1–3–1) (రోలుతో ఒకటిగా కలిసి ఉండి వెక్కి వెక్కి ఏడ్చిన సౌలభ్యగుణం ఏ విధమైనది?) అని, **"పిఱన్ద వాఱుమ్ వళర్న్ద వాఱుమ్"** (తిరువాయ్–5–10–1) (జన్మించిన ప్రకారం, పెరిగిన ప్రకారం) అని, **"నెయ్యుణ్ వార్త్తైయుళ్ అన్నై కోల్ కొళ్ళ నీ ఉన్ తామరైక్కణ్‌గళ్ నీర్ మల్‌క పైయవే నిలైయుమ్"** (నీవు నేతిని భుజించా వనే వార్తను వినగానే, నీ తల్లి బెత్తాన్ని చేతిలో తీసికోగా, నీవు నీ తామరలవంటి నేత్రాలలో నీరు నిండగా బెదరుతూ నిలచిన సన్నివేశం) (తిరువాయ్–5–10–3) అని ఆళ్వార్లు అభినివేశాన్ని పొందిన శ్రీకృష్ణావతారంలో యశోదచే పట్టుబడిన వృత్తాంతాన్నిగూర్చి పల్కుతున్నారు.



**వ్యాఖ్యానమ్ : (కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్)** ముడులను కల్గినదై, సన్నగా ఉన్నదై, చిన్నదై ఉండే దారంతో– అని అర్థం. ఆళ్వార్లు అభిమానించే శ్రీకృష్ణుని కట్టిన ఒక దారానికి గల స్వభావాలను అన్నిటిని గమనించి పలికే రీతిలో, వీరు (మధుర కవులు) ఆళ్వార్ల పట్ల అభినివేశాన్ని పొందారు. శ్రీకృష్ణుడు దారంతో బంధింప బడడాన్ని తలచి ఆళ్వార్లు ఆఱు నెలల కాలంపాటు మోహాన్ని పొందినందువల్ల, ఆ వృత్తాంతాన్నిగూర్చి మధురకవులు పల్కుతున్నారు. భగవానునిగూర్చిన మిగిలిన లీలలలో వీరు అభినివేశాన్ని పొందలేదు. ఆళ్వార్లనే తమకు ప్రాప్యప్రాపకాలుగా గ్రహించినవారు కనుక, వారు మోహాన్ని పొందిన లీలనుగూర్చి పల్కుతున్నారు.

**(కణ్ణిత్తామ్బు)** – ముడులను కల దారం కనుక, కట్టేటపుడు శ్రీకృష్ణుని శరీరంలో ఒరసికొనేటట్లుగా అది ఉండడాన్ని గమనించి, "ఇటువంటి దారంతో బంధింపడ్డాడే!" అనే కారణం చేత ఆళ్వార్లు మోహాన్ని పొందుతున్నారు కదా ! **కణ్ణి**–ముడి (చిన్న కిణం)

**(నుణ్‌తామ్బు)**– శరీరంలో ఒత్తుకొనేటట్లు సన్నగా ఉన్నది– అని అర్థం. ఇది కూడా ఆళ్వార్లయొక్క మోహానికి ఒక హేతువు.

**(శిఱుత్తామ్బు)**– శ్రీకృష్ణుని కట్టిన తరువాత రోటితో కలిపి కట్టడానికి దారం పొడుగు చాలనందువల్ల చాలా బిగించి కట్టవలసి వచ్చినందున, శ్రీకృష్ణుని తిరుమేని బాధను పొందుతుందికదా– అని కదా అని ఆళ్వార్లు తలచి వ్యామోహాన్ని పొందారు.

**(కట్టుణ్ణ ప్పణ్ణియ)**– రోటిని చెక్కి చిన్నదిగా చేయడం సాధ్యం కాదు. ఈమె (యశోద) చేతికి దొరికిన దారం చిన్నదిగా ఉన్నందువల్ల దానిని పొడుగుగా చేయడం వీలుకాదు. ఇక, ఇతనిని తన పట్టునుండి విడచి పెట్టి, వేఱొక పొడుగైన దారాన్ని వెదకి తీసికొని రావాలని ప్రయత్నిస్తే, ఇతడు మళ్ళీ చేతికి దొరకడు ! **"కాఱ్ఱిల్ కడియనాయ్ ఓడి అకమ్ పుక్కు"** (గాలికంటే వేగంగా పరుగెత్తి ఇంటిలో దూరి)

(పెరియాళ్వార్ తిరు-2-10-1) అనే రీతిలో శ్రీకృష్ణుడు వేగంగా పరుగెత్తుకొని పోతాడు. ఇక, ఏమి చేయాలి? అని యశోద తడబడడాన్ని చూచి, ఆమెపట్ల జాలితో తన తిరుమేనిని చిన్నదిగా చేసికొని, ఆమె తనను బంధించేటట్లుగా చేసికొన్న శ్రీకృష్ణభగవానుని సౌలభ్యంలో ఆళ్వార్లు అభినివేశాన్ని పొందారు కదా!

**(కట్టుణ్ణ ప్పణ్ణియ)– "అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే, సదైక రూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే"** (విష్ణుపురాణం- 1-2-1) (అచేతనంవలె స్వరూప వికారాన్ని పొందడాన్ని పొందేవాడు కాకుండా, ఏ విధమైన వికారాన్ని లేనివాడు, సంసారిచేతనుని వలె స్వభావవికారాన్ని పొందేవాడు కాకుండా, ఏ విధమైన స్వభావ వికారాన్ని లేనివాడు, ముక్తాత్మవలె కాకుండా నిత్యమైనవాడు, నిత్యసూరులవలె కాకుండా తనకు మించిన ఇంకొకడు లేనివాడు, ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండే దివ్యమంగళరూపాన్ని కలవాడు, సర్వవ్యాపి, అన్నిటిని జయించేవాడైన భగవానునకు నమస్కారం) అని శ్రీవిష్ణుపురాణంలో శ్రీపరాశరమహర్షి పల్కిన రీతిలోనే, ఎల్లప్పుడు ఒకే విధంగా ఉండే తన తిరుమేనిని సంకల్పం ద్వారా సంకోచింపజేసికొని, యశోద తనను బంధించేటట్లుగా చేసికొన్నాడు కదా! ఈవిధంగా శ్రీకృష్ణుడు తన తిరుమేనిని సంకల్పం ద్వారా సంకోచింపజేసికొని, యశోద తనను బంధించడానికి అవకాశం ఇవ్వకపోతే, "ఈ చిన్నదారంతో ఇతనిని కట్టడం వీలుకాలేదే"- అని ఆమె తన ప్రయత్నాన్ని విరమిస్తుంది. అపుడు ఇతనికి "యశోద చేతిచే కట్టుబడ్డాడు"- అనే గుణం లేకుండా పోతుంది. ఈ గుణాన్ని పొందడంకోసమే కదా ఇతడు శ్రీకృష్ణుడుగా అవతరించాడు. అందువల్ల భగవానుడు తన మేనిని చిన్నదిగా చేసికొని తనను కట్టడానికి అవకాశాన్ని ఇచ్చాడు. **"కణ్ణియార్ కుఱుమ్ కయిఱ్ఱాల్ కట్ట వెట్టెన్ఱిరున్దాన్"** (పెరియ తిరు-5-9-7) (ముడులు కల్గిన, కుఱుచగా ఉండే దారంతో బంధించగా ఊరకున్నాడు) అని, **"కణ్ణి క్కుఱుమ్ కయిఱ్ఱాల్ కట్టుణ్డాన్"** (ముడులు కల, కుఱుచగా ఉండే దారంతో బంధింపబడ్డాడు) (పెరియ తిరు-11-5-5) అని, మిగిలిన ఆళ్వార్లు కూడా అభినివేశాన్ని ఈ లీలలోనే కదా పొందారు. **"దామ్నా చైవోదరే బధ్వా ప్రత్యబధ్నాదు లూఖలే, యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచలచేష్టిత!, ఇత్యుక్త్వాథ నిజం కర్మ సా చకార కుటుంబినీ"** (విష్ణు-పు-5-6-15, 16) (యశోద ఒక దారాన్ని తీసికొని ఒక కొసను శ్రీకృష్ణుని నడుమునకు, ఇంకొక కొసను రోటికి కట్టింది. ఈవిధంగా బంధించి, "అల్లరిపనులను చేసేవాడా ! నీకు సాధ్యమైతే ఇక్కడ నుండి వెళ్ళిచూడు"- అని అంటూ పల్కి, తరువాత గృహిణి అయిన ఆమె తన ఇంటి



పనులను చేసికొన్నది) అనే రీతిలో తల్లి కట్టిన కట్టును విప్పుకోవడం తనకు సాధ్యం కాదు- అని ఉండడం గొప్పతనంగా తలచినవాడు కదా, ఇతడు. **"ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః, సంసారమోక్షస్థితిబంధహేతుః"** (శ్వేతాశ్వతర-6-16) (ప్రకృతికి, జీవునకు స్వామియై, గుణాలు నిండినవాడై, సంసారం తొలగిపోవడానికి, స్థితికి, బంధానికి కారణమై ఉండేవాడు- పరమాత్మయే) అనే రీతిలో జీవులను సంసారబంధంలో బంధించడానికి, దానినుండి వారిని విడిపించడానికి భగవానుడేకదా కారణం. అటువంటివాడు ఇపుడు ఒక ఆడది (యశోద) కట్టిన కట్టును విప్పుకోవడానికి చేతగానివాడై ఉన్నాడు. లోకాలను పాలించే చక్రవర్తి తన భార్య (మహిషి) చేతిలో చిక్కుకొని, అతిసుకుమారమైన పూమాలతో ఆమెచే బంధింపబడి, దానినుండి విడిపించుకోలేకుండా ఉండే స్థితివంటిదే కదా – తల్లి అయిన ఈమె కట్టిన బంధం నుండి విడివడలేక, ఇతడు ఉండే సన్నివేశం. జీవులకు చేసిన కర్మల కారణంగా వారికి వచ్చే సంసారబంధాన్ని ఇతడు తొలగించగలడు తప్ప, (తన) కృపకారణంగా తల్లిచే కట్టిన తాను బంధింపబడేటట్లు చేసికొన్న బంధాన్ని ఇతడు కూడా తొలగించుకోలేడు కదా!

ఈ ప్రబంధం ఆరంభంలో శ్రీమధురకవులు, తాము అభిమానించిన నమ్మాళ్వార్లు **"ఉయర్వఱ ఉయర్నలమ్"** (తిరువాయ్-1-1-1) (అంత కంటే మించినది ఇంకొకటి లేని గొప్ప ఆనందం) అని భగవానుని ఆనందాది గుణాలలో అభినివేశాన్ని పొందినట్లుగా తాముకూడా గుణాలలో అభినివేశాన్ని పొందకుండా, శ్రీకృష్ణుని యశోద బంధించిన దారాన్ని వర్ణించడానికి ఏమి కారణం? అని అంటే, ఆళ్వార్లు భగవానునిచే భక్తిగా రూపొందిన జ్ఞానం అనుగ్రహింపబడిన వారైనందున, **"ఉయర్వఱ ఉయర్ నల ముడైయవన్"** (నిస్సమాభ్యధికమైన గొప్ప ఆనందమనే గుణాన్ని కలవాడు) (తిరువాయ్-1-1-1) అని అతని ఆనంద గుణాన్ని వర్ణించారు. వీరు (మధుర కవులు), నేరుగా ఆళ్వార్లనే ఆశ్రయించినందున, తాము అభిమానించిన ఆళ్వార్లకు భగవానునికంటే ఉండే వైలక్షణ్యాన్ని మనస్సులో నిలుపకోవడంకోసం అతని (భగవానుని) తిరుమేనిని కట్టిన ఒక దారాన్ని వర్ణిస్తున్నారు. ఆళ్వార్లకు ఇష్టమైన అతనిని (భగవానుని) వీరు (మధురకవులు) అసారమని త్యజిస్తున్నారు.

శ్రీకృష్ణావతారంలో భగవానుని (యశోద) బంధించడం – "రేపల్లెలో ఉండే గోపికలను అపహరించాడు, వెన్నను దొంగిలించాడు, రేపల్లెలో పలు తుంటరి పనులను చేశాడు" – అనే ఇతని లీలలను అనుభవించడంవల్లకదా. ఈ లీలలను

చేశాడని పల్కి ఇతనికి యశోద దండనలను ఇచ్చినా, అవి శ్రీకృష్ణునకు కూడా భోగ్యంగానే ఉన్నవి. ఈవిషయాన్ని **"ఇవన్ సామాన్యనెన్టు ఇదుమీడెల్లామ్ ఇదుజ్గోళ్- ఎన్టు ఇరున్దాన్"** అనే ఒక దృష్టాంతం ద్వారా పెరియవాచ్చాన్‌పిళ్ళై వివరించారు. ఈ వాక్యానికి అరుంబద వివరణంలో తెలుపబడిన విషయాన్నిబట్టి ఈ క్రింది వృత్తాంతం స్ఫుటపడుతున్నది- "పూర్వకాలంలో, చోళదేశంలో చోళులు అనే గొప్ప విలక్షణమైన నామాన్ని పొందిన పూర్వశిఖా శ్రీవైష్ణవులే నివసించేవారు. దివ్యదేశాలు వారి నిర్వాహంలోనే ఉండేవి. తరువాతి కాలంలో **"వడమర్"** మొదలైన అపరశిఖాశ్రీవైష్ణవులు స్థిరపడిన తరువాత, కోవెలల నిర్వాహంలో వీరికి సంబంధం క్రమంగా తొలగిపోయినందున, వీరిని "సామాన్యులు" అని వ్యవహరించారు. తరువాత, సమీపకాలంలో అనూచానంగా **తెన్‌కలై** సంప్రదాయంలో ఉండే ఆలయాల హక్కులను నిర్వాహాన్ని **వడకలై** శాఖవారు స్వాధీనం చేసికోవడం ఆరంభించినపుడు, **"తెన్‌కలై- వడకలై"** తగవులు ఏర్పడినట్లే, సామాన్యులైన అపరశిఖా **(తెన్‌కలై)** శ్రీవైష్ణవులు ఆలయాల నిర్వాహాలను ఆక్రమించడం ఆరంభించినపుడు, కోవెలనిర్వాహకులైన చోళలు అందఱు, సామాన్యులను చూస్తే వారిని ప్రహరించాలని యత్నించేవారు. అటువంటి ఒకానొక సమయంలో ఒక వ్యక్తి రాగా, అతడెవరో తెలియనందున, మిగిలిన చోళులు అతనిని కొట్టారు. అతడపుడు "నేను చోళుడను, నన్ను ఎందుకు కొడుతున్నారు?" అని అడిగాడు. అపుడు మిగిలిన చోళులు "నిన్ను సామాన్యుడవని (**"వడమర్"** అని) భావించి కొట్టాము" అని అన్నారు. దానికి ఆ చోళుడు "ఆ విధంగా సామాన్యుడనని నన్ను మీరు భావిస్తే తప్పక నన్ను కొట్టవలసినదే. ఇంకా నన్ను మఱి రెండు దెబ్బలు నన్ను కొట్టండి" అని అంటూ అంతకుముందు వారు కొట్టినందువల్ల తనకు కల్గిన బాధను లెక్కించకుండా, వడమర్ పట్ల ద్వేషంతో కూడిన మనస్సుతో అన్నాడట. అదే రీతిలో, చిలిపి చేష్టలను చేసి, రేపల్లెలో దెబ్బలు తినాలి- అని తలచి జన్మించినవాడు కనుక, శ్రీకృష్ణుడు చిలిపి పనులను చేయక పోయినపుడు కూడా, చిలిపి పనులను చేశాడని అంటూ యశోద దెబ్బలు కొట్టినా, దానిని భోగ్యంగా గ్రహించాడని భావం. శ్రీకృష్ణుడు చిలిపి పనులను చేయడంలో కాయ కాచి (ఆరితేరి) ఉన్నాడు- అని దీనివల్ల తెలుస్తున్నది. "శ్రీకృష్ణుడు చిలిపి పనులను చేశాడు"- అని అంటూ యశోద అతనిని కట్టివేసి, దెబ్బలు కొట్టడం ప్రారంభించగానే, **"తొழுకైయుమ్ ఇవై కణ్డ అశోదై తొల్లై యిన్బ*ర్రి*ఱుది కణ్డాళే"** (పెరుమాళ్‌తిరు-7-8) (చేతులను జోడించి నమస్కరించడంవంటి శ్రీకృష్ణుడు చేసిన ఈ చేష్టలను చూచిన యశోదాదేవి అనాది అయిన బ్రహ్మానందంయొక్క



పరమావధిని చూచింది- అనుభవించింది) అనే రీతిలో యశోదకు నమస్కరించడం మొదలుపెడతాడు. లోకంలోని చేతనులు అందఱిచేత నమస్కారం చేయించు కొనేవాడు కదా, ఇపుడు యశోదకు నమస్కరిస్తున్నాడు. వేఱు దారి లేనపుడు, తన కార్యసిద్ధికి తగిన సాధనం అంజలియే- అనే విషయాన్ని మిగిలిన చేతనుల అనుష్ఠానాన్నిబట్టి ఇతడు గ్రహించాడు. ఈవిధంగా శ్రీకృష్ణుడు చేసిన ఏడవడం, అంజలిని చేయడం మొదలైన చేష్టలనుగూర్చి మధురకవులు పల్కుతున్నారు. (ఇపుడు పూర్వం ఉదహరించిన **"యది శక్నోషి"** అనే శ్రీవిష్ణుపురాణ శ్లోకం వివరింపబడు తున్నది)

**(అతిచంచలచేష్టిత)** - ప్రతిక్షణం మాఱే మిక్కిలి చంచలమైన చేష్టలను- లీలలను కలవాడా! రేపల్లెలో పలు చిలిపి పనులను చేసినవాడవుకదా నీవు.

**(ఇత్యుక్త్వా) -** అని పల్కి, అతనిని రోటికి కట్టివేయడం మాత్రమే కాకుండా, ఈ మాటతో కూడా కదలలేనట్లుగా చేసి, బంధించిన యశోద,

**(అథ నిజం కర్మ సా చకార)** తరువాత ఆమె గోవుల వద్దపాలను తీయడం, పెరుగును చిలకడం మొదలైన గృహకర్మలను చేసికోవడం ఆరంభించింది.

**(కుటుంబినీ)**- ఇతనినివలె ఇంకా ఎంతో మందిని అదుపులో పెట్టి ఏల వలసినవారుండే గృహిణికదా ఈమె. ఇన్ని అర్థాలను ఇముడ్చుకొన్న ఈ శ్రీవిష్ణు పురాణ శ్లోకాన్ని భావించి, **"కట్టుణ్ణ ప్పణ్ణియ"** అని అన్నారు, శ్రీమధురకవి ఆ*ழ்*వార్లు.

**(పెరు మాయన్)-** సాటిలేని, ఆశ్చర్యాన్ని కల్గించే లీలలను కలవాడు - అని అర్థం. **"మాయా"** అనే శబ్దం ఆశ్చర్యాన్ని తెలిపే శబ్దమని (గీతావ్యాఖ్యానాదులలో) శ్రీరామానుజులవారిచే వివరింపబడింది. ఇటువంటి, సాటిలేని ఆశ్చర్యాన్ని కలవాడు ఇక్కడ **"పెరు మాయన్"** అని అనబడుతున్నాడు. ఈ పదం ద్వారా- అన్ని మనోరథాలు నెఱవేరిన, పూర్ణుడైన పరమాత్మకు కూడా ఒక కొఱత ఉన్నదని, ఆ కొఱత తీర్చుకోవడంకోసం లోకంలో ఉండే చోరులవలె చౌర్యమనే తగని దారిలో సైతం ప్రవర్తించి, సర్వశక్తియైన అతడు ఆ చౌర్యాన్ని సైతం పూర్తిచేయలేకుండా, సాక్షాత్తుగా పట్టుబడి, బంధింపబడి, దెబ్బలు తిని, **"నెయ్యుణ్ వార్‌త్తైయుళ్ అన్నై కోల్ కొళ్ళ నీ ఉన్ తామరైక్కణ్‌గళ్ నీర్ మల్క, పైయవే నిలైయుమ్ వన్దు ఎన్నెఞ్జై ఉదుక్కుజ్గళే"** (తిరువాయ్-5-10-3) (నీవు నేతిని భుజించావనే మాటను విని నిన్ను దండించాలని నీ తల్లి యశోదాదేవి బెత్తాన్ని తీసికోగానే, నీవు నీ తామరలవంటి నేత్రాలలో అశ్రు

వులు నిండగా, బెదరతూ నిలచిన సన్నివేశం నా మనస్సును ద్రవీకరిస్తున్నది సుమా!) అని నమ్మాళ్వార్లు అనుగ్రహించిన రీతిలోచ శరీరం తెల్లబడి (ముఖం పాలిపోయి) నిలచిన స్థితి వరకు గల సన్నివేశాలను అన్నిటిని ఈ ప్రయోగంద్వారా భావింపజేస్తున్నారు, మధురకవులు.

**(ఎన్ అప్పనిల్)**– నా తండ్రి అయిన శ్రీకృష్ణుని విడచిపెట్టి– అని అర్థం. శ్రీకృష్ణుని విడచి, నమ్మాళ్వార్ల దగ్గరకు చేరుతున్నట్లు పలికే ఈ మధురకవులకు ఆళ్వార్లే స్వామి– అని స్ఫుటపడుతున్నది కదా ! మఱి, ఆ శ్రీకృష్ణుని **"ఎన్ అప్పన్"** (నాకు స్వామి) అని ఎందువల్ల వీరు పల్కుతున్నారు ? అంటే, ఆళ్వార్లకు స్వామి అయిన శ్రీకృష్ణునితో సంబంధాన్నితెంచుకొని వీరు పల్కినట్లయితే, ఆళ్వార్లతో కూడా సంబంధాన్ని తెంచుకొన్నట్లుగా అవుతుంది. అందువల్ల **"ఎన్ అప్పన్"** అని అంటున్నారు– అని సమాధానం. లేక, **"రూపౌదార్యగుణైః పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్"** (రామా– అయో– 3–29) (రూపసౌందర్యం, ఔదార్యం మొదలైన గుణాలతో పురుషుల దృష్టిని, చిత్తాన్ని అపహరించేవానిని) అనే రీతిలో తనను విడచి దూరంగా ఉండాలని భావించేవారిని సైతం తనపట్ల ఆకర్షించగల్గిన భగవానుని గుణాలలో నిమగ్నులై, **"ఎన్ అప్పన్"** అని పల్కుతున్నారని కూడా చెప్పవచ్చు.

**(ఎన్ అప్పనిల్ నణ్ణి)**– శ్రీకృష్ణుని విడచి ఆళ్వార్ల వద్దకు చేరి – అని అర్థం. సంసారులు శబ్దస్పర్శ రూపరస గంధాలనే ప్రాకృతవిషయాలను విడచి, భగవానుని చేరడం ఎంత శ్రమతో కూడినదో, పురుషార్థంలో ప్రథమపర్వం అయిన భగవానుని విడచి, ఆ పురుషార్థంయొక్క చరమావధి అయిన తదీయులకు దాసుడై ఉండడం అనేది అంత శ్రమతో కూడినది. శబ్దాదులనే ప్రాకృతవిషయాలు అల్పాలుగా, అస్థిరాలుగా ఉండడం గమనిస్తే, వాటిని సులభంగా విడువవచ్చు. భగవద్విషయాన్ని విడిచేవారికి అందులో, ఆ రీతిలో ఏ దోషం లేనందువల్ల, దానిని వీడి తదీయులకు దాసుడై ఉండడం– ముందు తెల్పిన దానికంటే (లౌకిక విషయాలను వీడి భగవానుని చేరడమనే మొదటిపర్వం కంటే) దుర్లభంగా ఉంటుంది.

**(తెన్‌కురుకూర్‌నమ్బి)**– **"నల్‌కి ఎన్నై విడాన్ నమ్బి నమ్బి"** (తిరువాయ్– 1–10–8) (గుణపూర్ణుడైన శ్రియఃపతి నాపట్ల ప్రీతిని చూపి, నన్ను దాసునిగా నమ్మి నన్ను విడువడు) అని అంటూ నమ్మాళ్వార్లచే ఆశ్రయింపబడిన, గుణపూర్ణుడైన భగవానునికంటే, వీరు (మధురకవులు) ఆశ్రయించిన ఆళ్వార్లు మిక్కిలి ఎక్కువ గుణపూర్తిని కలవారనే విషయాన్ని తెల్పుతున్నారు. ఏ విధంగా? అంటే, ఆ



భగవానుని ఆశ్రయిస్తే, దానిని పర్యంతసీమ అయిన ఆళ్వార్ల వరకు రాగల్గినపుడే అది (భగవదాశ్రయణం) పూర్తి అవుతుంది. ఆళ్వార్లను ఆశ్రయిస్తే, దానికి పిమ్మట (అది చరమపర్వం కనుక, దానికి మించి) పోవలసిన చోటు (పర్వం) ఏమీ లేదు కదా! ఇదే, ఆళ్వార్లు ఆశ్రయించిన నమ్బికంటే **"తెన్‌కురుకూర్‌నమ్బి"**కి గల అతిశయాన్ని తెల్పుతున్నది. మన పూర్వాచార్యులను **"తిరుక్కచ్చి నమ్బి, మణక్కాల్ నమ్బి, పెరియ నమ్బి, తిరుక్కోట్టియూర్ నమ్బి, తిరుమలై నమ్బి"**– అని ఈ రీతిలో **"నమ్బి"** అనే పదంతో విలక్షణంగా నిర్దేశించే క్రమాన్ని నేర్పించినవారు మధుర కవులే కదా– అని నంజీయర్ అనేవారు.

**(ఎణ్ణక్కాల్)**– అని అంటూ నోటితో పల్కినంతనే– అని అర్థం. భగవద్విషయంలో ఆనందాన్ని పొందడానికి వాక్కు, మనస్సు, శరీరం– అనే త్రివిధకరణాలతో అభినివేశాన్ని పొందవలసి ఉంటుంది. ఆళ్వార్ విషయంలో నోటితో ఒకమాటను పల్కినంత మాత్రంలోనే చాలు. **"నమ్బి"** అని చెప్పబడ్డ పూర్తివల్ల కల్గిన అతిశయం మాత్రమేకాదు; భగవద్విషయం కంటే సులభమై ఉన్నందువల్ల కల్గిన వైలక్షణ్యం కూడా (ఆళ్వార్లకు) ఉన్నది– అని భావం.

**(అణ్ణిక్కుమ్)**– తీయగా ఉంటుంది– అని అర్థం. భగవానుని త్రికరణాలతో అనుభవించినపుడు ఆళ్వార్లకు కలిగే ఆనందం అంతా, ఆళ్వార్ల విషయంలో ఒక మాటను పల్కినంతమాత్రంలోనే నాకు లభిస్తున్నది.

**(అముదూఱుమ్)**– **"ఊఱుమ్"**– అనే భవిష్యత్కాలిక ప్రయోగం, అమృతం నిరంతరం స్రవిస్తుంది – అని తెల్పుతుంది. **"స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే, న చ పునరావర్తతే, న చ పునరావర్తతే"** (ఛాందోగ్యే–1–15–1) (ఆ ముముక్షువు తన ఆయుస్సు చివరి వరకు ఈ రీతిలో వర్తిస్తూ, ఆయుస్సు పూర్తి అయిన తరువాత బ్రహ్మలోకాన్ని చేరగలడు. మళ్ళీ తిరిగి ఇక్కడకు రాడు, మళ్ళీ తిరిగి ఇక్కడకు రాడు) అనే రీతిలో ఆళ్వార్లకు, భగవానుని యొక్క అనుగ్రహంవల్ల మోక్షం లభించినపుడు, నిత్యమైన ఆనందం లభిస్తుంది. నాకు, ఆళ్వార్ల అనుగ్రహంవల్ల ఇక్కడ ఉన్నపుడు, అక్కడ ఉండేటపుడు తేడా లేకుండా ఎప్పటికప్పుడు నిత్యనూతనమైన **"అప్పొழுదైక్కు అప్పొழுదు ఎన్నారా వముదమ్"** (ఎప్పటికపుడు నిత్యనూతనంగా భాసించే నా అతృప్తామృత స్వరూపం) అనే విధంగా అతృప్తామృతంగా ఉంటుంది.

**(ఎన్ నావుక్కే)–** నా జిహ్వకు ఈ ఆనందం కల్గుతున్నది. "మఱి, ఇటువంటి ఆనందం మాకు లేదే !" అని సంసారుల అభిప్రాయంగా తలచి, "ప్రథమపర్వమైన భగవానుని విషయంలో ఏ అభినివేశం లేకుండా ఉండే మీకు దాని పరమావధిలో ఉండే నేను పొందే గొప్ప ఆనందం లభిస్తుందా ?" అని అంటున్నారు.

**(ఎన్ నావుక్కే)–** అనాది కాలంగా శబ్దాది విషయాలను అనుభవిస్తూ ఉండే నా జిహ్వకే ఇపుడు ఆళ్వార్ల అనుభవం ఈ విధంగా కల్గుతున్నదే! అని భావం– అని కూడా చెప్పవచ్చు.

**నంజీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు**

**(కణ్ణినుణ్ శిఋత్తామ్బు)–** ఒక స్త్రీ కట్టిన దారం అయినందున పలు ముడులను (ముడుపులను) కల్గినదై, తిరుమేనిలో ఒత్తుకొంటూ, ఒరసికొంటూ ఉన్నందువల్ల పూవు కంటే సుకుమారమైన చేతిని కల్గిన ఇతనిచే దానిని విడిపించుకోవడం సాధ్యం కానందువల్ల తిరుమేని క్లేశపడుతుంది– అని వీరు భయపడుతున్నారు.

**(కట్టుణ్ణ ప్పణ్ణియ)–** ప్రభువు తన శత్రువులను బంధించడం, తన పట్టమహిషి చేతిలో పూమాలికతో బంధింపబడడం– అనేవి అతని పురుషత్వాన్ని తెలియజేసేటట్లే, ఇతడు (భగవానుడు) కూడా తనను ఆశ్రయించనివారిని కట్టివేయడం అనేది అతనిపరత్వాన్ని తెల్పుతున్నది. భక్తుల చేతిలో కట్టుబడి ఉండడం అతని సౌలభ్యాన్ని తెల్పుతున్నది.

**(పెరుమాయన్)–** నమ్మాళ్వార్లు భగవానుని విషయంలో **"ఎత్తిఱమ్!"** (తిరువాయ్–1–3–1) అని అతని సౌలభ్యంలో అభినివేశాన్ని పొందినట్లే, వీరుకూడా ఆ గుణంలో అభినివేశాన్ని పొందుతున్నారు. (1) అప్రాకృతమైన తిరుమేనిని ప్రాకృతతిరుమేనిగా మలచుకోవడం, (2) ఆకలి ఏమాత్రం లేని అతనికి ఆకలి బాధ ఏర్పడడం, (3) వెన్నను భుజించడంలో అభిలాషను పొందడం, (4) దానిని పెట్టేవారులేనపుడు, దొంగిలించడం, (5) ఆ చౌర్యం కూడా పూర్తిగాచేయలేక, దొంగిలిస్తూ చేతిలో వెన్నతో పట్టుబడడం, (6) తనచే సృష్టింపబడినవారిచేతిలో కట్టుబడడం, (7) ఈ బంధాన్నిగూర్చి అనుసంధించే ఇతరులను వారి సంసార బంధంనుండి విడిపించగల్గినా, తల్లి కట్టిన కట్టునుండి విడవడలేకుండా ఉండడం– ఇది అంతా ఏమి ఆశ్చర్యం! అని అంటున్నారు, మధురకవులు. ఇతని పరత్వంయొక్క అవధిని గమనించవచ్చు; ఇతని సౌలభ్యాన్ని మాత్రం గమనించలేము.



**(ఎన్ అప్పనిల్)–** ఆళ్వార్లే వీరికి ఉద్దేశ్యభూతులైనపుడు, భగవానుని **"ఎన్ అప్పన్"** (నాస్వామి) అని అనవచ్చునా? అంటే, ఆళ్వార్లను ఉద్దేశించి తాము (మధురకవులు) పోయే మార్గంగా (సాధనంగా) భగవానుడున్నందున అంటున్నారు. ఉద్దేశ్యమైన ఒక ప్రదేశాన్నిగూర్చి పోయేటపుడు, వెళ్ళే దారి నీటితో, నీడతో చక్కగా ఉన్నది– అని కొంచెం సేపు అక్కడ విశ్రమిస్తే, అంతమాత్రంతో అదే ఉద్దేశ్యం అవుతుందా? (కాదుకదా!)

**(నణ్ణి)–** ఈపాదు గోతినుండి తప్పుకొనగల్గినపుడుకదా ఆళ్వార్లను పొందడం సాధ్యం– అని అంటున్నారు. భగవానుని **"పాదుగోయి" (పదుకుళి)** అని అనవచ్చునా? అని అంటే, భగవానుని పొందడానికి శబ్దాదిలౌకికవిషయాలు అడ్డు అయినట్లే, ఆళ్వార్లను ఆశ్రయించే వీరికి భగవానుడు అడ్డు– అని భావం. అవి అల్పమై ఉండడం, అస్థిరమై ఉండడం మొదలైన దోషాలను కల్గి ఉన్నందున, వానిని విడువవచ్చు. భగవద్విషయం దోషరహితం కనుక, దానిని విడువడం దుర్లభం. ఇదే స్థిరమైన విరోధి.

**(తెన్‌కురుకూర్‌నమ్బి)** భగవానుడు ప్రాప్యంయొక్క ప్రథమపర్వం కనుక, అతనిని గూర్చి సగం కడుపుతో (అసంతృప్తితో) పల్కి, ఆళ్వార్లు చరమపర్వమైనందున వారిని పూర్ణులని (**"నమ్బి"** అని) అంటున్నారు.

**(అణ్ణిక్కుమ్ అముదూఋమ్)–** మిక్కిలి రుచికరమైన పదార్థాలను నాలుకపై పెడితే, పెట్టిన వస్తువు ఎంత మధురమైనా, అది కఱగిపోగానే దాని రుచి ముగిసిపోతుంది. ఇక్కడ ఆరీతిలో కాకుండా, ఒకసారి జిహ్వలో ఆళ్వార్లనామం పెడితే సర్వదా అమృతం మాఱకుండా స్రవిస్తుంది.

**అళగియమణవాళప్పెరుమాళ్ నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు**

**(కణ్ణినుణ్ శిఋత్తామ్బినాల్)–** లేగదూడలను కట్టడానికి చక్కని దారాలను సాధనాలుగా ఉపయోగించినందున, ఇక దేనికీ పనికిరానివి, పలుచోట్ల జీర్ణమై నగిలిపోయి, ఒకటిగా జోడించబడిన కట్టబడినవి అయిన దారాలతో శ్రీకృష్ణుని యశోద బంధించింది. వేఱొకరిని కట్టేవానితో ఇతనిని బంధించడం వీలుకాదు. సంగం, కామం, అనురాగం – మొదలైన అవస్థలను కల అనన్యభక్తి అనే దారంతోనే ఇతనిని కట్టడం సాధ్యం– అని ఇక్కడ భావం ఈ రీతిలో ఇతనిని సంబంధించిన రోలుకూడా **"పొత్త ఉరలై క్కవిళ్ళన్దు అదన్‌మేలేఱి"** (పెరియాళ్వార్ తిరు 1–10–7)

(బంధించిన రోటిని విప్పి, దానిపైకి ఎక్కి) అనే రీతిలో క్రిందిభాగంలో (మూల భాగంలో) జీర్ణమైనదై, దేనికీ పనికిరానిదై, ఇతనిని కట్టడంకోసంగానే ఉన్నట్లు ఉంటుంది.

**(కట్టుణ్ణ ప్పణ్ణియ)** – దేనికీ పనికి రానిదిగా, మృదువుగా ఉన్నప్పటికీ, వక్షస్థలంలో ఉండే లక్ష్మీదేవిని, శ్రీకృష్ణభగవానుని కలిపి యశోద ఒక రోటికి కట్టినపుడు, అచేతనమైన రోలుకు, తనకు మధ్య ఏవిధమైన తేడాలేని రీతిలో స్వామి ఉన్నాడు. (రెండు అచేతనాలే– అనేటట్లు ఉన్నాడు) అయితే, ఇతనికి (శ్రీకృష్ణునకు) చైతన్యం ఉన్నందున, బయటకు దుఖం పొంగిరాగా వెక్కివెక్కి ఏడ్చాడు. ఈ సౌలభ్యగుణాన్ని చూచి నమ్మాఴ్వార్లు వ్యామోహాన్ని పొందారు. (ఆఴ్వార్ల) మోహాన్ని చూచి మధురకవులు అభినివేశాన్ని పొందుతున్నారు.

**"కణ్ణి–నుణ్–శిఱు–త్తామ్బు"** అనే మూడు విశేషణాలు స్వాపదేశంలో– జ్ఞానం– భక్తి– వైరాగ్యం– అనే మూడిటిని సూచిస్తాయి. అందువల్లనే వాటిని సూచించే రీతిలో ఈ దారాన్ని శ్లాఘిస్తున్నారు. రుచి, సంగం, భక్తి, పరభక్తి, పరజ్ఞానం, పరమభక్తి– అని భక్తి పలు అవస్థలను కల్గినదై, ఈసన్నని దారం కూడా పలు ముడులను కల్గి ఉన్నది అతడు భక్తికి కట్టుబడేవాడు కనుక, ఆ దారానికి కట్టుబడ్డాడు. స్వయంప్రయోజనమైన భక్తి –భగవానుడే ప్రాప్యం, ప్రాపక– అనే జ్ఞానాన్ని కల్గిస్తుంది. అందువల్ల అది సూక్ష్మమైన జ్ఞానం. **"నుణ్ తామ్బు"** అనే పదం స్వాపదేశార్థంలో ఈ సూక్ష్మమైన జ్ఞానాన్ని సూచిస్తుంది.

భక్తిని కల్గినా, అతడు తానే తనను సాక్షాత్కరింపజేసినపుడే చేతనుడతనిని దర్శించగలడు. ఈ విషయం **"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్"** (కఠ–1–2–23) (ఈ పరమాత్మ భక్తి లేని శ్రవణంతో గాని, మననంతో గాని, ధ్యానంతో గాని పొందడానికి వీలైనవాడు కాడు. ఎవనిని, ఈ పరమపురుషుడు వరిస్తున్నాడో, అతనిచేతనే పరమాత్మ పొందడానికి సాధ్యమవుతున్నాడు. అతనికి ఈ పరమాత్మ తన దివ్యమంగళ విగ్రహాన్ని –స్వరూపాన్ని– చక్కగా దర్శింపజేస్తున్నాడు) అనే ఉపనిషద్వాక్యంలో తెలుపబడింది. **"కట్టుణ్ణ ప్పణ్ణియ"** అని అంటూ ఆ అర్థాన్ని ఇక్కడ సూచిస్తున్నారు. **"ఎట్టినోడు ఇరణ్డెనుమ్ కయిఱ్ఱినాల్ మనన్దన్నై క్కట్టి"** (తిరుచ్చంద–83) (ఎనిమిదితో పాటు రెండు–అంటే–పది–అనేదారంతో) అనే పాశురంలో – **"ఎట్టు, ఇరణ్డు"** (ఎనిమిది పది) అనే పదాలు **"పత్తు"** (పది) అనే



పదాన్ని సూచించడం ద్వారా లక్షితలక్షణాప్రక్రియలో భక్తిని సూచిస్తున్నాయి. **"ఎట్టుమ్, ఇరణ్డుమ్ పత్తాయ్, భక్తియై చ్చొల్లుకిఱదు"** అని అంటూ పెరియ వాచ్చాన్పిళ్ళై తిరుచ్చన్దవిరుత్త దివ్యప్రబంధ వ్యాఖ్యానం ఈ విషయాన్ని తెలిపారు. **"ఎట్టు"** అనే పదం అష్టాక్షరిని, **"ఇరణ్డు"** అనే పదం ద్వయమంత్రాన్ని సూచిస్తాయి. ఈ రెండు పదాలలో "ఒక మంత్రం ద్వారానే భగవవానుని వశీకరించుకోవడం సాధ్యం" అనే అర్థాన్ని అఴకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ తమవ్యాఖ్యలో తెలియజేశారు.

**(పెరుమాయన్)– "తొడువే శెయ్దు ఇళవాయ్చ్చియర్ కణ్ణినుళ్ విడవే శెయ్దు విఴిక్కుమ్ పిరానైయే"** (తిరువాయ్–1–7–5) (కపటాన్ని చేసి చిన్నగోపికల నేత్రాలతో కన్పించి, వారిని కటాక్షించే ఉపకారకుని) అనే రీతిలో గోపకాంతలందఱు కలసి రావడంకోసం నవనీతాదులను దొంగలించడమనే సాధనాన్ని ఇతడు (శ్రీకృష్ణుడు) అనుష్ఠించగా, దానిని దర్శించడం కోసం తుల్యమైన పరువాన్ని కల స్త్రీలు అందఱు రాగా, పురుషునివలె వారిని చూపుతో వశీకరించుకొన్న ఈ ఆశ్చర్యాన్ని **"పెరు మాయన్"** అని మధురకవులు అంటున్నారు. ఆభిముఖ్యం లేనివారిని ఆభిముఖ్యాన్ని పొందేటట్లు కటాక్షిస్తాడు. అభిముఖ్యాన్ని కలవారిని ఆత్మసమర్పణం చేసేటట్లు కటాక్షిస్తాడు. ప్రణయకోపాన్ని కలవారిని వారి కోపం తీరేటట్లు కటాక్షిస్తాడు. ఈ విధంగా భగవత్కటాక్షమే అన్నీ చేస్తుంది. **"తొఴుకైయుమ్"** (పెరుమాళ్–తిరు–8–8) (అంజలిని చేయడం) అని అంటూ, కోపం చెందిన తనను తన భక్తులు వశం చేసికొనే ఉపాయం అంజలియే – అనే సంగతిని గ్రహించినవాడు కనుక, యశోద యొక్క కోపాన్ని తీర్చగల్గిన అంజలిని ఉపయోగించిన ఆశ్చర్యకరలీలను ఇది తెల్పుతున్నది. **"తొల్లై ఇన్బత్తు ఇఱుది కణ్డాళే"** (పెరుమాళ్ తిరు–8–8) (సనాతన మైన మహానందంయొక్క అవధిని యశోద దర్శించింది. అనుభవించింది కదా) అనే రీతిలో నిత్యముక్తులకు సైతం లభించని ఆనందాన్ని యశోదకు అనుగ్రహించిన ఆశ్చర్యాన్ని ఈ పదం తెల్పుతున్నది – అని కూడాచెప్పవచ్చు. నిత్యులు, ముక్తులు, భగవానుని జ్ఞానం, శక్తి మొదలైన గొప్ప గుణాలను దర్శించి ఆనందిస్తారు. యశోద– ఇతని అందం, భయంతో చూచే బెదఱుచూపులు, పక్కచూపులు, దుఖంతో అందమైన ఎఱ్ఱని చిఱు అధరాలు స్పందించడం, అంజలిని చేయడం **"అఴుకైయుమ్, అఞ్జినోక్కుమ్, అన్నోక్కుమ్, అణికొళ్ శెమ్శిఱువాయ్ నెళిప్పదువుమ్, తొఴుకైయుమ్"**– (పెరుమాళ్– తిరు–8–8) (ఏడవడం, భయపడి చూడడం, చుట్టూ

చూడడం, అందమైన ఎఱ్ఱని పెదవి అదరడం, అంజలిచేయడం) అనే సౌలభ్యగుణ చేష్టితాలను అన్నిటిని దర్శించింది కనుక, ఈమె దర్శించినదే బ్రహ్మానందావధి. నిత్యులు, ముక్తులు భగవానుని జ్ఞానశక్త్యాదులను అనుభవించారు. ఈమె సౌశీల్యాదులను దర్శించి ఆనందించింది.

**(ఎన్నప్పనిల్)** – నా స్వామి అయిన శ్రీకృష్ణుని విడచి– అని అర్థం. ఆళ్వార్ల పట్లనే లగ్నమైన వీరిని (మధురకవులను) కూడ శ్రీకృష్ణుని లీలలు అభినివేశాన్ని పొందించినందున **"అప్పనిల్"** అని అంటున్నారు. నమ్మాళ్వార్లు లేత మనస్సును కలవారైనందున, భగవానుని సౌలభ్యప్రకాశకమైన లీలలో లగ్నమై, మోహాన్ని పొందారు. వీరు ఆ విధంగా లేతమనస్సును కలవారు కానందున, ప్రథమపర్వమైన శ్రీకృష్ణుని విడచి, చరమపర్వమైన నమ్మాళ్వార్ల వద్దకు వచ్చారు.

**(ఎన్ అప్పనిల్ నణ్ణి)** – శ్రీకృష్ణుని విడచి, ఆళ్వార్లను ఆశ్రయించి– అని అర్థం. భగవానునకు గల వైలక్షణ్యం (ఆశ్రితులను) శబ్దాదిలౌకికవిషయాలలోని అభిరుచిని లేకుండా చేసి, ఆస్వామిపట్ల అభినివేశాన్ని పొందేటట్లు చేస్తుంది. ఆళ్వార్లకు గల వైలక్షణ్యం– భగవానుని విషయంలోని మాధుర్యంనుండి నివర్తింపజేసి, తన పట్ల ఆసక్తిని కల్గి ఉండేటట్లు చేస్తుంది. అందువల్ల ఆళ్వార్ల వైలక్షణ్యమే గొప్పది– అని భావం.

**(తెన్ కురుకూర్ నమ్బి ఎన్ఱక్కాల్ అణ్ణిక్కుమ్)– "కుఱుఙ్గుడినమ్బి"** కంటే **"కురుకూర్ నమ్బి"**కి గల అతిశయాన్ని ఈప్రయోగం వ్యక్తం చేస్తున్నది. భగవానునకు పూర్ణత –జ్ఞానం, శక్తి మొదలైనవానితో కల్గింది. లోకాన్ని తన వశం చేసికొనే గుణాలు– భగవానునిగుణాలు. భగవానుని తన వశం చేసే రీతిలోనివి– ఆళ్వార్ల గుణాలు.

**(అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్ నావుక్కే)–** ఆళ్వార్లను తలచిన మనస్సులోని మాధుర్యాన్ని మొదటి పదం తెల్పుతున్నది. వారి నామాన్ని పల్కిన జిహ్వాకూడ మధురమై ఉండే విషయాన్ని రెండవ పదం తెల్పుతున్నది.

**(ఎన్ఱక్కాల్ అముదూఱుమ్)** – పల్కినది ఒక్కసారి మాత్రమే అయినా, ఆనందం పొందినది అన్ని కాలాలలోను. ఇక భగవద్విషయాన్ని గూర్చి భావించడానికి మనస్సు అనేది లేదు; పలుకడానికి జిహ్వా లేదు.



**(ఎన్ నావుక్కే)**– భగవద్విషయం భోగ్యంగా, ఆళ్వార్లు కూడా భోగ్యంగా ఉండే మీ నాలుక (లోకంలోనివారి నాలుక) వంటిది కాదు కదా, నా జిహ్వా. ప్రారంభం నుండి ఆళ్వార్ల భోగ్యతలో ప్రవర్తించి, అలవాటు పడిన జిహ్వా కదా, నాజిహ్వా.

**(ఎన్ నావుక్కే)**–ఆళ్వార్ల విషయంలో అభినివేశాన్ని పొందడంలో నా జిహ్వా మొదలైన ఇంద్రియాలకు, వాటిని కల్గిన నాకు తేడా లేదు. ఆళ్వార్లు, భగవద్విషయాన్నిగూర్చి **"ఎన్ నెఞ్జినాల్ నోక్కి క్కాణీర్"** (తిరువాయ్–5–5–2) (నా మనస్సుతో గమనించి చూడండి) అని అన్నారు. అదే రీతిలో వీరు, ఆళ్వార్ల విషయంలో **"ఎన్ నావుక్కే"** (నా జిహ్వాకు) అని అన్నారు.

**నావినాల్ నవిత్తు ఇన్బమెయ్దినేన్,**
**మేవినేన్ అవన్ పొన్నడి మెయ్మ్మైయే,**
**తేవు మఱ్ఱఱియేన్ కురుగూర్ నమ్బి,**
**పావి నిన్నిశై పాడి త్తిరివనే.** 2

నావినాల్ నవిఱ్ఱు = కురుకూర్‌నమ్బి అయిన నమ్మాళ్వార్ల తిరునామాన్ని నోటితో పల్కి, ఇన్బమ్ ఎయ్దినేన్ = గొప్ప ఆనందాన్ని పొందాను, అవన్ పొన్ అడి = ఆ ఆళ్వార్ల బంగారువలె భోగ్యమైన శ్రీచరణాలను, మెయ్మ్మైయే మేవినేన్= ఇహలోక, పరలోకాలు రెండిటిలో ఉద్దేశ్యంగా ఆశ్రయించాను, తేవు మఱ్ఱు అఱియేన్ = (ప్రాప్యంగా, ప్రాపకంగా ఉండే) వేఱొక దైవాన్ని తెలియను, కురుకూర్ నమ్బి = కురుకూర్‌లోని పూర్ణులైన ఆళ్వార్లయొక్క, పావిన్ ఇన్ ఇశై = పాశురాలలోని భోగ్యమైన రాగాన్ని, పాడి త్తిరివనే = ఆనందంతో పాడి, అదే జీవనధారకంగా జీవిస్తాను.

## పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానమ్

**అవ - ఇరణ్డామ్బాట్టు. ముతఱ్పాట్టిల్ - "ఆళ్వార్" ఎన్ఱాల్ తమక్కు రసిక్కుమపడి శొన్నార్. ఇప్పాట్టిల్ - అవరుడైయ పాశురమే దేహయాత్రై యామ్బడి ధారకమాన పడియై చ్చొల్లుకిఱార్.**

**వ్యాఖ్యానమ్ - (నావినాల్ నవిఱ్ఱు ఇన్బమెయ్తినేన్) "ఎన్ఱక్కాల్ అణ్ణిక్కుమ్" ఎన్ఱు ప్రస్తుతమానత్తై అనుభాషిక్కిఱార్, అతిలుణ్డాన ఆదరాతి**

శయత్తాలే, మనస్సహకార మిల్లాత ఉక్తిమాత్రమడియాక నిరతిశయసుఖమ్ ప్రయోజన మానాల్, పిన్నాట్టుకై తవిరాతితే. (నావినాల్ నవిఱ్ఱు) మనస్సహకారమిల్లై ఎన్గిఱార్. భగవద్విషయత్తిల్ ఉపకారకరై స్తోత్రమ్ పణ్ణకడవ నావై క్కొణ్డు, అన్ద క్కార్యత్తై. క్కొళ్ళప్పెఱ్ఱేన్ - ఎన్నవుమామ్. "ప్రత్యక్షే గురవ స్స్తుత్యాః" ఎన్నక్కడవతితే. ఈశ్వరసృష్టిక్కు ప్రయోజనమ్ కొళ్ళప్పెఱ్ఱేన్ నానొరు వనుమే- ఎన్గిఱార్.

(ఇన్పమెయ్‌తినేన్) "వీవిల్ ఇన్బమ్ మిక ఎల్లై నికழ்న్ద నన్మేవి" ఎన్ఱు ఆழ்వార్ అవ్విషయత్తిల్ పెఱ్ఱ పేఱ్ఱై ఇవ్విషయత్తిలే పెఱ్ఱే న్ ఎన్గిఱార్. "శిన్దైయాలుమ్ శొల్లాలుమ్ శెయ్‌కైయినాలుమ్" ఎన్ఱు కరణత్రయత్తాలుమ్ అవ్విషయత్తై ఆశ్రయిత్తవర్ పెఱ్ఱ పేఱ్ఱై ఉక్తిమాత్రత్తాలే పెఱ్ఱేన్. అనాదికాలమ్ నరకత్తిలే సృష్టియుమ్, నరకత్తిలే సంహారము మామ్పడి పాపత్తై పణ్ణిప్పోన్ద నావాలే నిరతిశయానన్దత్తై ప్రాపిత్తేన్-ఎన్నవుమామ్.

(మేవినేన్ అవన్ పొన్నడి) ఆழ்వారుడైయ స్పృహణీయమాన తిరువడికళై ఉద్దేశ్యమాక ప్పొరున్దినేన్. "క్షిపామి" ఎన్ఱు ఈశ్వరునుమ్ కూడ ఉపేక్షిత్త దశైయిలే విషయీకరిత్త ఆழ்వారుడైయ విలక్షణమాన తిరువడికళోడే పొరున్దప్పెఱ్ఱేన్. నీర్ శెయ్‌తతు ఇతువాకిల్, పేఱ్ఱిల్ ఉఱుతిప్పాడిరున్దపడి ఎన్? ఎన్నిల్. (మెయ్‌మ్మైయే మేవినేన్) ఉపకారకవిషయత్తిలే నిఱ్కిఱవళవిలే వేఱొరు విషయముద్దేశ్యమాయ్, అతు కిట్టినవాఱే అతిలే తోళ్‌మాఱుమ్పడి యన్ఱిక్కే, ఐహికాముష్మికఙ్గళ్ ఇరణ్డుమ్ ఆழ்వార్‌తిరువడికళే యాక ప్పొరున్దినేన్. ఇఙ్గిరున్ద నాళ్ అజ్ఞాతజ్ఞాపనత్తాల్ ఉపకారకరాకవుమ్, భగవల్లాభత్తుక్కు పురుషకారమాకవుమ్, నిత్యవిభూతియిల్ "యత్ర పూర్వే సాధ్యా స్సన్తి దేవాః" ఎన్గిఱపడియే ప్రాప్యమాకవుమ్ ఇవర్ తమ్మైయే పఱ్ఱి నేన్. ఆళవన్దార్ "అత్ర పరత్ర చాపి" ఎన్ఱైక్కుమ్ అడి ఇవరితే.

(తేవు మఱ్ఱఱియేన్) ప్రాప్యముమ్, ప్రాపకముమాక వేఱొరు వస్తు ఉణ్డు ఎన్ఱిరేన్. "మెయ్‌మ్మైయే" ఎన్ఱ విడమ్ - అన్వయత్తాలే శొన్నార్. "తేవు మఱ్ఱఱియేన్" ఎన్ఱు వ్యతిరేకత్తాలే శొల్లుకిఱారితే - తమ్ముడైయ అధ్యవసాయమ్ తోఱ్ఱుకైక్కాక. "మఱ్ఱఱియేన్" ఎన్ఱు-పురుషార్థాన్తరఙ్గళోపాతి భగవద్విషయత్తైయుమ్ కழிక్కిఱారితే - అతినెల్లైయాన ఆழ்వార్ తిరువడి కళళవుమ్ వన్దవరాకైయాలే. శాస్త్రవాసనైయాలేయాతల్, ఆచార్యోపదేశత్తాలే యాతల్ శొల్లుకిఱారల్లర్. ఉపకారకరాన ఆழ்వార్ తిరువడికళిల్ భావబన్ధత్తాలే శొల్లుకిఱార్.



(కురుకూర్ నమ్బి) ఇవరైయుమ్ పఱ్ఱి, వేఱొరు విషయత్తైయుమ్ పఱ్ఱ వేణ్డుమ్పడియో, ఇవరుడైయ పూర్తి యిరుప్పతు? "కురుకూర్ నమ్బిపా" ఎన్గిఱతు - ఆழ்వార్‌తిరువాయాలే అరుళిచ్చెయ్‌తు ఎన్ఱాయ్‌త్తు, త్తిరువాయ్‌మొழி తన్నైయు మాదరిప్పతు. అతిలే "కురుకూర్ చ్చడకోపన్" ఎన్ఱరుళిచ్చెయ్‌తారితే. అవ్వழியాలేయాయిఱ్ఱు తిరువాయ్‌మొழிయిల్ ఆదరమ్. ఆழ்వార్ ప్రతిపాద్యరాకైయాలే, "కురుకూర్‌నమ్బి పా" ఎన్ఱు కణ్ణినుణ్ శిఱుత్తామ్బై చ్చొల్లుకిఱతు - ఎన్నవుమామ్.

(పావినిన్నిశై) పావోడేకూడ ప్పుణర్‌ప్పుణ్ణ ఇనియ ఇశై. (పాడి) ప్రీతి ప్రేరితనాయ్‌క్కొణ్డు శొల్లి. ఇతువే ధారకమాక సఞ్చరిప్పన్. "ఉణ్డు తిరివన్" ఎన్నుమాపోలే "పాడి త్తిరివన్" ఎన్గిఱార్. "నమన్దమర్ తలైకళ్‌మీతే - నావలిట్టుழி తరుకిన్డోమ్" ఎన్నుమాపోలే ఇతువే యాత్రైయాయిరుక్కిఱ ఎన్నుడైయ గతినివృత్తియై పణ్ణవల్లారుణ్డో? ఎన్ఱుమామ్. ప్రాక్తనకర్మఫలాను భవత్తై పణ్ణువిక్కుమ్ యమన్ గతిభఙ్గమ్ పణ్ణవో! అతుక్కడియాన విషయాన్తరఙ్గళ్ గతిభఙ్గమ్ పణ్ణవో!

## అరుమ్బద విళక్కమ్

ఇరణ్డామ్‌పాట్టు :- సఙ్గత్యర్థమ్ వృత్తవర్తిష్యమాణకీర్తనమ్ (ముతఱ్పాట్టి లిత్యాది). కీழ்ప్పాట్టిల్ ఆழ்వారుడైయ భోగ్యత్తైయెయుమ్, అనన్తరమ్, తత్సమన్ధత్తైయుడైయ ప్రబన్ధమే తమక్కు ధారకమెన్నత్తైయుమ్ శొల్లుకిఱార్ -ఎన్ఱు కరుత్తు (అవరుడైయ పాశురమ్) ఎన్ఱు- తిరువాయ్‌మొழிయుమ్, కణ్ణినుణ్ శిఱుత్తామ్బుమ్.సమ్బన్ధసామాన్యషష్ఠియాకైయాలే; "దేహయాత్రైయామ్బడి" ఎన్ఱత్తై వివరిక్కిఱార్ (ధారకమాన పడియై) ఎన్ఱ ఇతిల్.

“పాడి త్తిరివనే” ఎన్గత్తై ప్పఱ్ఱ, “ఎన్గక్కాల్” ఎన్గత్తోడు పునరుక్తమన్ఱో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (ఎన్గక్కాలిత్యాది). ఆదరాతిశయత్తుక్కు అడి అరుళిచ్చెయ్‌కిఱార్ (మనస్సహకార మిత్యాది). (నిరతిశయసుఖమ్) ఎన్గతు. “ఎన్నప్పనిల్ అణ్ణిక్కుమ్” ఎన్గత్తై క్కటాక్షిత్తు. “నవిఱ్ఱు” ఎన్ఱు శొల్లుకైయాలే నా అర్థసిద్ధమాయిరుక్క, “నావినాల్” ఎన్ఱు శొల్లువానెన్? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (మన ఇత్యాది). నైరపేక్ష్యమ్ శొల్లుకైయన్ఱిక్కే, “నావినాల్” ఎన్ఱు శ్లాఘ్యార్థ మెన్గిఱార్ (భగవదిత్యాది).

ఉపకారకనై స్తుతిక్కవేణుమో ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (ప్రత్యక్షేత్యాది). నా ప్పడైత్త ప్రయోజనమ్ పెఱ్ఱవర్‌కళ్ వేఱిల్లైయో? ఎన్న; “విచిత్రా దేహసమ్పత్తిః” ఇత్యాదివచనత్తై యుట్కొణ్డరుళిచ్చెయ్‌కిఱార్. (ఈశ్వరేత్యాది).

“నావినాల్ నవిఱ్ఱు ఇన్బమ్ పెఱ్ఱారుణ్డో? ఎన్న; “ఇశైమాలైకళేత్తి మేవ ప్పెఱ్ఱేన్” ఎన్గత్తై కటాక్షిత్తు. “నావినాల్ నవిఱ్ఱు ఇన్బమెయ్‌తినేన్” ఎన్ఱు సముదాయతాత్పర్య మరుళిచ్చెయ్‌కిఱార్ (వీవిలిన్బ మిత్యాది) కీఴ్ ఉక్తిమాత్రత్తాల్ వన్ద ఆనన్దమ్ ఆఴ్వారుక్కు సమ మెన్గరుళిచ్చెయ్‌తు, అవరుక్కు క్కరణత్రయమ్. వేణ్డిఱ్ఱు; ఇవరుక్కొన్ఱే అమైన్దతెన్ఱు తాత్పర్యాన్తర మరుళిచ్చెయ్‌కిఱార్ (శిన్దైయాలు మిత్యాది). “నావినాల్” ఎన్గతుక్కు నైరపేక్ష్యశ్లాఘాద్యోతనమన్ఱిక్కే తాత్పర్యాన్తర మరుళిచ్చెయ్‌కిఱార్ (అనాదికాల మిత్యాది).

అనన్తక్లేశభాజనమాన సంసారత్తిలిల్ ఇరుక్కిఱ నాళెల్లామ్ ఈశ్వరన్ ఉపేక్షిత్తాన్ – ఎన్ఱుమ్, అవ్వళవిల్ ఆఴ్వార్ తమ్మై క్కటాక్షిత్తార్– ఎన్ఱుమ్ తిరువుళ్ళమాక క్కరుతి, తాత్పర్యకథనముఖేన కీఴ్ వాక్యవివరణమ్ (క్షిపామీత్యాది). పరమకారుణికరాకైయాలుమ్, అనాదియాన సంసారత్తిల్ యాదృచ్ఛికాదికళ్ సమ్భావితఙ్గళాకైయాలుమ్ చేతనరుక్కు “క్షిపామి” ఎన్ఱు అవన్ శొన్నతు అహృదయోక్తియాయ్, అచ్చుఱుత్తినాన్, ఇత్తనై–ఎన్ఱు తిరువుళ్ళమ్బఱ్ఱి (ఉపేక్షిత్త దశై) ఎన్గతు.

ఉపకారకరెన్ఱు ఆఴ్వారై నీర్ పఱ్ఱినీరాకిలుమ్, ఉమక్కు పురుషార్థమేతు? ఎన్గిఱ శఙ్కైయై యనువదిత్తు, నాన్ ఇవరై ఉపకారకత్వేన పఱ్ఱి వేఱు ఫలఙ్గళిలే పోకిఱవనన్ఱిక్కే, నియతమాక సకలపురుషార్థఙ్గళుమ్ ఆఴ్వార్ తిరువడికళాకవే పఱ్ఱినేన్ ఎన్గిఱార్ –ఎన్గరుళిచ్చెయ్‌కిఱార్ (నీర్ శెయ్‌తతిత్యాది). (మెయ్‌మ్మైయే) సత్యమాక



“మెయ్‌మ్మై” ఎన్గత్తోడు, “అవన్ పొన్నడి మేవినేన్” ఎన్గత్తై అనుషఙ్గిత్తారెన్ఱు కణ్డుకొళ్వతు. “సర్వం యదేవ నియమేన” ఎన్గిఱపడియే సకలఫలఙ్గళుమ్ తిరువడికళే –ఎన్ఱు కీఴరుళిచ్చెయ్‌తు, ప్రాప్యప్రాపకఙ్గళాక యోజనాన్తరమ్ (ఇఙ్గిరున్ద ఇత్యాది) ఇత్తై ప్పఱ్ఱియితే అభియుక్తరు మరుళిచ్చెయ్‌తారెన్ఱు ప్రమాణమ్ కాట్టుకిఱార్. (ఆళవన్దారిత్యాది). మెయ్‌మ్మై ఎన్గతు– ఇరణ్డామ్ యోజనైయిల్.

ప్రాప్యముమ్, ప్రాపకమెన్ఱు శొల్లియిరుక్క, పునః “తేవు మఱ్ఱఱియేన్” ఎన్ఱు శొల్లవేణుమో? ఎన్గిఱ శఙ్కైయై ప్పరిహరిక్కిఱార్ (మెయ్‌మ్మైయే ఎన్గ విడమిత్యాది). “సకలఫలఙ్గళుమాఴ్వార్ తిరువడికళాక ప్పఱ్ఱినేన్” ఎన్గ ప్రథమయోజనాను గుణమాక త్తాత్పర్యాన్తర మరుళిచ్చెయ్‌కిఱార్ (మఱ్ఱఱియేనిత్యాది). మున్దిన యోజనైయిల్ ప్రాప్యప్రాపకసాధారణ్యేన “తేవు” ఎన్ఱు సమాశ్రయణీయవస్తువై చ్చొల్లుకిఱతు; ఇరణ్డామ్ యోజనైయిల్ ప్రాప్యవస్తువై చ్చొల్లుకిఱతు. శాస్త్రఙ్గళ్ ఎమ్బెరు మానై ప్రాప్యప్రాపకమాక చ్చొల్లి, ఆచార్యోపదేశము అప్పడియేయిరుక్క, ఇవర్ ఇప్పడి కళిక్కైక్కు హేతువేతు? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (శాస్త్రేత్యాది).

నీర్ ఆఴ్వారై యొఴియ “తేవు మఱ్ఱఱియేన్” ఎన్ఱిరుక్కిఱవరాకిల్, ‘ముకిల్‌వణ్ణనడిమేల్ శొన్న శొన్మాలై ఆయిరమాన తిరువాయ్‌మొఴి అభ్యసిప్పాన్ ఎన్? ఎన్గిఱ శఙ్కైయిలే అరుళిచ్చెయ్‌కిఱార్ (ఇవరై యెన్ఱు తొడఙ్గి– తిరువాయ్‌మొఴియిల్ ఆదర మెన్నుమళవుమ్). “పూర్తి యిరుప్పతు” ఎన్గ అన్తరమ్ “ఆకైయాలే” ఎన్ఱు కూట్టి, “ఆదరిప్పతు” ఎన్గత్తోడే అన్వయిప్పతు. ఆఴ్వార్ తిరువాయాల్ శొన్నతుక్కు ప్రమాణమ్ (అతిలే – యిత్యాది). ఇతుక్కు “పరనడిమేల్ కురుకూర్‌చ్చడకోపన్ శొల్” ఇత్యాదికళిలే నోక్కు. “ఎన్ మున్ శొల్లుమ్” ఎన్ఱుమ్,“తన్నై త్తానే తుతిత్తు” ఎన్ఱుమ్ ఎమ్బెరుమాన్ శొల్లాక త్తోఱ్ఱుకైయాలే ఆఴ్వార్ శొల్లెన్ఱు అర్థమ్ శొల్లకూడుమో? ఎన్న; “కురుకూర్‌నమ్బి విషయమాన పా” ఎన్ఱు అర్థాన్తరమరుళిచ్చెయ్‌కిఱార్ (ఆఴ్వారిత్యాది).

“పా” ఎన్ఱు చ్ఛన్దస్సై యుదైత్తాన ప్రబన్ధమాయ్, ఇతుక్కు చ్చేర్‌న్ద అనురూప మాయ్, మనోహరమాన గాన మెన్గర్థ మరుళిచ్చెయ్‌కిఱార్ (పావోడిత్యాది). “పాడి త్తిరివన్” ఎన్గతుక్కు ఇరణ్డు తాత్పర్యమ్. పాడుకై–తిరికైక్కు హేతువాక్కి ధారకమాకవుమ్,

**పాదుకైయాలే అప్రతిహతసఞ్చారమాకవుమ్; అతిల్ – మున్దినత్తై శఙ్కాపరిహారముఖేన అరుళిచ్చెయ్‌కిఱార్ (ఉమ్ముడైయ– ఇత్యాది. ఇరణ్డామ్ తాత్పర్యమ్ (నమన్‌తమరిత్యాది). నమన్– యమన్, తమర్–అవనుడైయ దూతర్. నావలిడుకై– జయిత్తవర్‌కళ్ తోఱ్ఱవర్‌కళ్ వాశలిలే శెన్ఱు అడిక్కుం కూఱుకై. ఉఴ్ఱి తరుకై– సఞ్చరిక్కై. యాత్రైయాక– వ్యాపారమాక. గతినివృత్తియై పణ్ణవల్లారుణ్డో? ఎన్నత్తై వివరిక్కిఱార్ (ప్రాక్తనేత్యాది). (అతుక్కు) కర్మత్తుక్కు.**

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**రెండవ పాశురం – అవతారిక :** మొదటి పాశురంలో– ఆళ్వార్లు తమకు భోగ్యంగా (మధురంగా) ఉండే సంగతిని గూర్చి మధురకవులు తెలిపారు. ఈ పాశురంలో – వారి సూక్తియే తమకు జీవితంలో అంతా ప్రాణాన్ని నిలిపే ధారకంగా ఉండే రీతినిగూర్చి తెల్పుతున్నారు.

**వ్యాఖ్య : (నావినాల్ నవిఱ్ఱు ఇన్బమ్ ఎయ్‌దినేన్)** నా నోటితో కురుకూర్ నమ్బియొక్క తిరునామాన్ని పల్కి మహానందాన్ని పొందాను. **“తెన్‌కురుకూర్ నమ్బి ఎన్ఱక్కాల్ అణ్ణిక్కుమ్”** (దక్షిణదిక్కులో గల తిరుక్కురుకూర్‌లోని గుణపూర్ణులైన నమ్మాళ్వార్లను భావిస్తే, వారి నామాన్ని పల్కితే మధురంగా ఉంటుంది) అని అంటూ గడచిన పాశురంలో పల్కిన దానినే ప్రేమాతిశయంచేత మళ్ళీ పల్కుతున్నారు. **“నావిల్ నవిఱ్ఱు”**– అని అంటున్నారు. మనఃపూర్వకంగా పలుకకుండా, నోటితో (జిహ్వతో) పల్కినంతమాత్రంలోనే గొప్ప ఆనందం కల్గినందున, తిరిగి పల్కడం అపరిహారణీయం (మానలేనిది) కదా!

**(నావినాల్ నవిఱ్ఱు)**– భగవానునిగూర్చి లోకానికి తెలిపి ఉపకారం చేసిన ఆచార్యుని స్తుతించడంకోసమే సృష్టింపబడిన జిహ్వతో దానిని కల్గి ఉన్నందున తగిన ఫలాన్ని పొందాను– అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. **“ప్రత్యక్షే గురవః స్తుత్యాః పరోక్షే మిత్రబాంధవాః, కార్యాంతే దాసభృత్యాశ్చ న కదాచన పుత్రకాః”** (ప్రత్యక్షంలో ఆచార్యులు స్తుతించదగినవారు. స్నేహితులు, బంధువులు పరోక్షంలో స్తుతించదగినవారు. వారు చేయవలసిన కార్యాలను పూర్తిచేసిన తరువాత, పనిచేసేవారు, సేవకులు స్తుతించదగినవారు. మన పుత్రులు మాత్రం ఏనాడూ పొగడదగినవారు కారు) అనే రీతిలో ఆచార్యుని ప్రత్యక్షంలో స్తుతించడం కర్తవ్యం



కదా! భగవానుడు జిహ్వను సృష్టించడం ఎందుకు? అంటే, ఆచార్యుని స్తుతించడం కోసమే. ఆప్రయోజనాన్ని పొందినవాడను నేను ఒక్కడనే – అని అంటున్నారు.

**(ఇన్బమ్ ఎయ్‌దినేన్)– “వీవిల్ ఇన్బమ్ మిక ఎల్లై నికఴ్న్దనన్ మేవియే”** (తిరువాయ్–4–5–3) (అనుభవించి, అంతంలేని ఆనందం యొక్క చరమావధిలో నిలచాను) అని అంటూ నమ్మాళ్వార్లు భగవానుని చేరి తాము పొందిన మహానందాన్ని– నేను ఆళ్వార్లను ఆశ్రయించినందువల్లనే పొందాను–అని అంటున్నారు. **“శిన్దైయాలుమ్ శొల్లాలుమ్ శెయ్‌కైయినాలుమ్ దేవపిరానైయే తన్దై తాయ్ ఎన్ఱడైన్ద వణ్‌కురుకూర్ శడకోపన్”** (తిరువాయ్–6–5–11) (తమమనస్సుతో, వాక్కుతో, కృత్యాలతో నిత్యసూరినాయకుడే తమ తల్లి తండ్రి – అని భావించి ఆశ్రయించిన గొప్ప తిరుక్కురుకూర్‌లోని శఠకోపులు) అని త్రికరణాలతో భగవానుని ఆశ్రయించి, ఆళ్వార్లు పొందిన మహానందాన్ని నేను వాక్కుతో మాత్రమే ఆళ్వార్లనుగూర్చి పల్కడం ద్వారా పొందాను – అని అంటున్నారు. ఆ రీతిలో కాకుండా, నోటితో మిక్కుటమైన పాపాలను చేసినందువల్ల, ఆ పాపాల ఫలాన్ని అనుభవించడంకోసం నిరంతరం నరకంలోనే జన్మ, మరణం సంభవించే రీతిలో పాపాలను చేసిన తమ జిహ్వతో మహానందాన్ని పొందడాన్ని గమనించి, ఆశ్చర్యంతో పల్కుతున్నారని కూడా చెప్పవచ్చు.

**(మేవినేన్ అవన్ పొన్నడి)** బంగారంవలె ఆశ పడదగిన ఆళ్వార్ల శ్రీచరణాలను ఉద్దేశ్యంగా ఆశ్రయించాను. **“తానహం ద్విషత క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపామ్యజస్ర మశుభాన్ ఆసురీష్వేవ యోనిషు”** (గీత–16–19) (నన్ను ద్వేషించేవారు, క్రూరులు, మానవులలో అధములు, పాపకారులు అయిన వారిని సంసారంలో, అందులోను, ఆసురజాతిలోనే ఎల్లప్పుడు పడదోస్తాను) అనే రీతిలో సహజసంబంధాన్ని కల్గిన భగవానుడుకూడా నన్ను చేయివిడచిన దశలో నన్ను పరిగ్రహించిన ఆళ్వార్ల చాలా గొప్ప శ్రీచరణాల వద్ద పొందికగా చేరగలిగాను. భగవానునకు ఉపకారం చేసినవారని ఆళ్వార్లను ఆశ్రయించినవారైనా, పురుషార్థంగా భగవానునే ఆశ్రయించారా? అని అంటే,

**(మెయ్‌మ్మైయే మేవినేన్)**– భగవానునకు ఉపకారం చేసినవారని ఆళ్వార్లను ఆశ్రయించి, భగవానుడు లభించగానే, అతనినే ఉద్దేశ్యంగా (ప్రాప్యంగా) గ్రహించడం కాకుండా, ఇహలోక– పరలోకాలు రెండిటిలోను ఆళ్వార్ల శ్రీచరణాలనే రెండిటిని

ఉద్దేశ్యంగా గ్రహించాను. ఇక్కడ ఉండే దినాలలో భగవానునిగూర్చి, అతని భక్తులను గూర్చి తెలియని విషయాలను తెలిపినందున ఉపకారం చేసినవారు- అని, పరమపదంలో భగవానుని పొందడంలో పురుషకారంగా, **"తేహ నాకం మహిమా న స్సచం తే యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః"** (ఏ పరమపదంలో సాధ్యులనబడే దేవతలు ఉన్నారో, ఆ పరమపదాన్ని వారు మహిమను కలవారై పొందుతున్నారు) (పురుషసూక్తమ్) అనే రీతిలో పరమపదంలో పొందదగిన ప్రాప్యంగా కూడా ఆళ్వార్లనే ఆశ్రయించాను. **"తస్మై నమో మధుజిదంఘ్రిసరోజతత్త్వజ్ఞానానురాగ మహిమాతిశయాంతసీమ్నే, నాథాయ నాథమునయేఽత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్"** (స్తోత్రరత్నం-2) (ఈ లోకంలోను, పైలోకంలోను, ఎల్లప్పుడు ఏ శ్రీమన్నాథమునుల శ్రీచరణాలు నాకు శరణమో, మధువు అనే అసురుని సంహరించిన భగవానుని శ్రీచరణపద్మాలనుగూర్చిన యథార్థజ్ఞానం, ప్రేమ, అతిశయం- అనే వీటియొక్క పరమావధి అనదగినవారు, నాకు పితామహులైన ఆ నాథమునులకు నమస్కారం) అని అంటూ శ్రీయామునులు నాథములను పరమపదంలో తమకు ప్రాప్యంగా ఆశ్రయించడానికి కారణం- ఈ మధురకవి ఆళ్వార్లే.

**(తేవు మఱ్ఱఱియేన్)**- ప్రాప్యంగా, ప్రాపకంగా వేఱొక దైవం ఉన్నది- అని నేను తెలియను. **"అవన్ పొన్నడి మెయ్మ్మైయే మేవినేన్"** -అనే పదసందర్భంతో ఆళ్వార్లే ప్రాప్యం, ప్రాపకం- అనే అర్థాన్ని అన్వయంద్వారా తెలిపారు. ఇక్కడ **"తేవు మఱ్ఱఱియేన్"** అని అంటూ వేఱు ప్రాప్య-ప్రాపకాలు అనేవి లేవు- అని అన్నందువల్ల తమ నిశ్చయాన్ని వ్యక్తం చేయడం కోసం ఈవిధంగా వ్యతిరేక ముఖంగా పల్కుతున్నారు. **"మఱ్ఱు అఱియేన్"** అని అనడంద్వారా "మిగిలిన విషయాలనువలె భగవానునికూడా నేను ప్రాప్య-ప్రాపకాలుగా గ్రహించలేదు" అని నిషేధిస్తున్నారు కదా ! భగవద్విషయం యొక్క పర్యంతసీమ అయిన ఆళ్వార్ల శ్రీచరణాల పర్యంతం అభినివేశాన్ని పొందినవారైనందున ఈ విధంగా పల్కుతున్నారు. శాస్త్రాలు భగవానుని ప్రాప్యప్రాపక రూపునిగా తెల్పుతున్నాయి. ఆచార్యుల ఉపదేశాలు ఆ రీతిలోనే ఉన్నాయి. ఆవిధంగా ఉండగా, వీరు ఈవిధంగా భగవద్విషయాన్ని కాదనవచ్చునా? – అని అంటే, భగవానుడే ప్రాప్యం, ప్రాపకం- అనే అరుదైన అర్థాన్ని తెలిపి మహోపకారం చేసినవారైన ఆళ్వార్ల శ్రీచరణాల పట్ల గల అభినివేశంచేత ఈవిధంగా మధురకవులు అంటున్నారు, కనుక, విరోధం లేదు.



**(కురుకూర్నమ్బి)**- **"కుఱుఙ్గుడినమ్బి"** యొక్క గుణపూర్తికంటే కురుకూర్ నమ్బియొక్క గుణపూర్తి విలక్షణమైనదిగా (అతిశయించినదిగా) ఉన్నందున, ఆళ్వార్లను ఆశ్రయించిన తరువాత, భగవానుని ఆశ్రయించవలసిన ఆవశ్యకత లేదు – అని భావం. **"తిరువాయ్మొళి'** అని శబ్దతః నిర్దేశించకుండా, **"కురుకూర్నమ్బిపా"** అని అన్నందున, "ఆళ్వార్లు తమ నోటితో పల్కినది"- అనే వైలక్షణ్యంతోనే తిరువాయ్మొళిని కూడా వీరు ఆదరిస్తున్నారు- అని తెలుస్తున్నది. తిరువాయ్మొళిలో కూడా **"కురుకూర్చ్చడకోపన్ శొల్"** (కురుకూర్లో ఉండే శ్రీశఠకోపుల సూక్తి) (తిరువాయ్-1-1-11) అని ఆళ్వార్లు పలికారు. ఈ క్రమంలోనే వీరు కూడా తిరువాయ్మొళిని ఆదరిస్తున్నారు. **"ఎన్ మున్ శొల్లుమ్"** (తిరువాయ్-7-9-2) (నా సమక్షంలో పల్కుతున్నాడు) అని, **"తన్నై త్తానే తుదిత్తు"** (తిరువాయ్-10-7-2) (భగవానుడు తనను తానే స్తుతించి) అని తిరువాయ్మొళి భగవానుడే స్వయంగా పల్కినట్లుగా భాసించేటపుడు, **"కురుకూర్నమ్బిపా"** అని అంటూ "అది ఆళ్వార్లు పల్కిన పాశురాల" అని దానిని గ్రహించడం కొంచెం అస్వారస్యంగా ఉన్నందున, వేఱు రీతిలో కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. అది ఏమంటే- కురుకూర్నంబియైన ఆళ్వార్లను గూర్చి పలికే కణ్ణినుణ్శిఱుత్తామ్బునే **"కురుకూర్నమ్బిపా"** అని పల్కుతున్నారని కూడా ఇక్కడ అర్థాన్ని గ్రహించవచ్చు.

**(పావిన్ ఇన్నిశై)**- పాశురాలతో కలిసి ఉండే మధురమైన రాగాన్ని.

**(పాడి త్తిరివనే)**- మీ జీవన క్రమం ఏవిధంగా నడుస్తున్నది? అనే ప్రశ్న రాగా, **"కురుకూర్నమ్బి పావిన్ ఇన్నిశై"** (కురుకూర్లోని గుణపూర్ణులైన శ్రీశఠకోపుల తిరువాయ్మొళి ప్రబంధంలో గల పాశురాలలోని తీయని రాగాలను) ఆనందంగా పాడుతూ, దానిద్వారా ప్రాణధారణ చేసి, సంచరిస్తున్నాను- అని మధురకవులు అంటున్నారు. **"ఉణ్డు త్తిరివన్"** (తిని, తిరుగుతాను) అనే రీతిలో **"పాడి త్తిరివన్"** (పాడి తిరుగుతాను) అని అంటున్నారు. **"తిరివనే"** అనే పదంలోని **"ఏ"**కారం ద్వారా **"నమన్ తమర్ తలైకళ్ మీదే నావలిట్టు ఉళితరుకిన్ఱోమ్"** (తిరుమాలై-1) (యమదూతల తలలపై కాలుపెట్టి **"నావలో నావల్"** అని జయధ్వానాన్ని చేస్తాము) అనే రీతిలో ఇదే నా జీవన యాత్రగా ఉన్నది. నా సంచారాన్ని అడ్డుకోగల్గిన వారున్నారా?- అని అంటున్నారని కూడా చెప్పవచ్చు. పూర్వకృతకర్మల ఫలాన్ని అనుభవింపజేసే యముడు కూడా నా ఈ జీవనయాత్రాక్రమాన్ని అడ్డుకోగలడా ? ఆ ప్రాక్తనకర్మలకు కూడా కారణమైన అన్య (లౌకిక) విషయాలు సైతం దీనిని అడ్డుకోగలవా ?- అని భావం.

**నంజీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవతారిక :** భగవానుని వైలక్షణ్యం– పరమపదాన్ని చేరి, అప్రాకృత శరీరాన్ని పొందిన తరువాత, తెలియదగినది. ఆళ్వార్ల వైలక్షణ్యం అటువంటిది కాకుండా, వారి సూక్తులద్వారా ఇక్కడే అనుభవించే రీతిలో ఉన్నది.

**వ్యాఖ్యానమ్ : (ఇన్బమ్ ఎయ్దినేన్)–** ఆనంద రసంయొక్క పరమావధిని పొందాను. భగవానుని **"శుழిపట్టోడుమ్ శుడర్చ్చోది వెళ్ళత్తు"** (తిరువాయ్–8–10–5) (సుడులు తిరుగుతూ ప్రవహించే వెలిగే కాంతిప్రవాహం) అని చెప్పబడిన భగవదనుభవం సగం కడుపు (పూర్ణం కాదు) అనే రీతిలో కదా, ఈ మధురకవులు పొందిన ఆళ్వార్ల అనుభవమనే ఆనందం ఉన్నది.

**(మేవినేన్ అవన్ పొన్నడి)– "కోలమామ్ ఎన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కురై కழల్"** (తిరువాయ్–4–3–6) (నా శిరస్సుకు నీ కమలంవంటి, ధ్వనించే కడియాలను కల శ్రీపాదం ఆభరణం) అని, **"తళిర్ పురైయుమ్ తిరువడి ఎన్ తలైమేలవే"** (తిరునెడు–1) (చిగురుటాకువంటి శ్రీచరణం నా శిరస్సుపై ఉన్నది) అని పలికే రీతిలో ఆళ్వార్లు భగవానునియొక్క శ్రీచరణాన్ని దర్శించి అనుభవించారు. వీరికి (మధురకవులకు) అన్నీ ఆళ్వార్ల శ్రీచరణాలే అయినవి.

**(మెయ్మ్మైయే) –"ఇమైయోర్ తలైవా! మెయ్న్నిన్రు కేట్టరుళాయ్"** (తిరువిరు–1) (నిత్యసూరినాథా ! నేను చేసే ఈ విన్నపాన్ని నీవు ఆలకించు) అని ఆళ్వార్లు అన్నారు. **"కురుకూర్నమ్బి పొన్నడి మేవినేన్ మెయ్మ్మైయే"** అని వీరు అన్నారు.

**(తేవు మఱ్ఱఱియేన్)–** "భగవద్విషయం వద్దని నేను అనడం లేదు. దానిని గూర్చిన వ్యుత్పత్తి (జ్ఞానం) లేనందున అది "ఇటువంటిది" అని తెలియలేను– అని అంటున్నారు– అని భావం.

**(తేవు మఱ్ఱఱియేన్) –"భావో నాన్యత్ర గచ్ఛతి"** (రామా–ఉత్తర–40–15) (నా భావం వేఱొక విషయంలో పోవడం లేదు) అని అంటూ హనుమానుడు "శ్రీరామునిపై తప్ప ఇంకొకరిపై నామనస్సు అభినివేశాన్ని పొందదు" అని పల్కినట్లే, **"మఱ్ఱఱియేన్"** (వేఱొకరిని తెలియను) అని అంటూ వీరు (మధురకవులు) కూడా "నా మనస్సు ఆళ్వార్లలో తప్ప, వేఱొక విషయంలో ఆసక్తిని పొందదు" అని



అంటున్నారు. **'మఱ్ఱు"** (వేఱు) అని అనడంవల్ల విడచిన విషయంయొక్క పేరును కూడా చెప్పడంలో కూడా ఆసక్తి (ఉద్దేశ్యం) లేదు– అని తెలుస్తున్నది.

**(పావిన్ ఇన్నిశై పాడి త్తిరివనే)–** ఇహలోకంలోని ఐశ్వర్యాన్ని అల్పమని, అస్థిరమని తలచి, త్యజించి, స్థిరమైన ఆత్మప్రాప్తిని (కైవల్యాన్ని) మహానందం కాదని వదలిపెట్టి, స్థిరమైన, మహానందం అయిన భగవత్ప్రాప్తిని ప్రాప్యంయొక్క ప్రథమపర్వమేనని విడచి, దాని చరమపర్వమైన ఆళ్వార్లను కూడా ఉద్దేశ్యులుకారని వదలిపెట్టి, వారి సంబంధాన్ని కల్గిన పాశురాలను కూడా మిక్కిలి భోగ్యం కాదని తలచి త్యజించి, ఆ పాశురాలతో సంబంధాన్ని కల రాగమే తమకు ఉద్దేశ్యమని అంటున్నారు, మధురకవులు

**(పాడి త్తిరివనే)** –ఔషధ సేవను చేసి (బలాన్ని పొంది) సంచరించేవారివలె, ఇదే కదా వీరికి (మధురకవులకు) ధారకమై, సంచరించేటట్లు చేస్తున్నది.

**అழకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవతారిక :** ఆళ్వార్లు, శ్రీకృష్ణుని సౌశీల్యగుణంలో అభినివేశాన్ని పొంది మోహాన్ని పొందారు. వీరు (మధురకవులు), ఆ సౌశీల్యాన్ని అనుసంధించిన తరువాత కూడా, అందులో మునిగిపోకుండా, దానిని విడచిపెట్టి, ఆళ్వార్ల వైలక్షణ్యంలో అభినివేశాన్ని పొందారు. యశోద, శ్రీకృష్ణుని రోటికి బంధించిన తరువాత తన జాత్యుచితకర్మలను ఆచరించడానికి సూచకమని అంటూ నాయనార్ **"పెరియ తిరునాళిలుమ్ సంధ్యావందనమ్ ముట్టామల్ నడత్తువార్ఐప్పోలే"** అని అన్నారు.

**(నావినాల్ నవిఱ్ఱు)** – మనః సహకారం లేకుండానే, జిహ్వాతోమాత్రం పల్కి ఆనందాన్ని పొందాను – అని అంటున్నారు.

**(ఇన్బమ్)–** "ఇటువంటి ఆనందం" – అని పల్కనందువల్ల "పలు విధాలైన ఆనందాలను పొందాను" – అని భావం. **"ఎయ్దినేన్"–** అని అన్నందున భగవద్విషయాన్ని ఆశ్రయించినవారికి ఆనందం వేఱొక కాలంలో కల్గుతుంది. ఇక్కడ ఆ రీతిలో కాకుండా వెంటనే పొందాను– అనే భావాన్ని భూతకాలిక పదప్రయోగంద్వారా తెల్పుతున్నారు.

**(మేవినేన్ అవన్ పొన్నడి) –** శరీరానిన విడచిన తరువాత కలిగే ఆనందం కోసం ఆళ్వార్లు భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించినట్లుగా కాకుండా,

దానికోసంకూడా ఆ*ழ்*్వార్ల శ్రీచరణాలనే ఉపాయంగా ఆశ్రయించాను - అని అంటున్నారు.

**(అవన్ పొన్నడి)–** భగవానుని లోకాలను కొలిచిన బంగారు పాదాలు– ఊరికి అందటికి సాధారణం. అది అందటి శిరస్సులపై ఉంటుంది. నేను ఆశ్రయించిన ఆ*ழ்*్వార్ల శ్రీచరణాలు– "త్రైవిద్య వృద్ధజను"లైన వేదవిదుల శిరస్సులపై మాత్రమే ఉంటుంది.

**(పొన్నడి)** నేను తాకి సంవాహనం చేసినా దోషం సోకని శ్రీచరణాలు.

**(మేవినేన్) –** భగవద్విషయాన్ని ఆశ్రయించేటపుడు **"నాకణైమిశై నమ్బిరాన్ శరణే శరణ్ నమక్కెన్ఱు నాడొఱుమ్ ఏక శిన్దైయనాయ్"** (ఆదిశేషుని శయనంగా కల్గిన స్వామి శ్రీచరణాలే మనకు శరణం– అని ప్రతిదినం ఒకే విధమైన చింతను కలవారై) (తిరువాయ్–5–10–11) అనే రీతిలో అతని శ్రీచరణాలను ఉపాయంగా నిరంతరం చింతించాలి. ఆ*ழ்*్వార్ల విషయంలో ఆ రీతిలో అక్కఱ లేకుండా ఒక పర్యాయం చింతిస్తేనే చాలు.

**(అవన్ పొన్నడి మేవినేన్)–** భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించేటపుడు **"ఉన్నడికీ*ழ்* అమర్న్దు పుకున్దేనే"** (తిరువాయ్–6–10–10) (నీ శ్రీచరణాల కింద అమరి ఉండి ఆశ్రయించాను) ఇత్యాది ప్రమాణాల ప్రకారం వారికి నేరుగా సమీపంలో ఉండి ఆశ్రయించవలసి ఉన్నది. ఇక్కడ, **"అవన్ పొన్నడి"** అని అన్నందువల్ల, ఆ*ழ்*్వార్ల శ్రీచరణాలు ఎక్కడ ఉన్నా ఆశ్రయించదగినట్లున్నవి. భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించేటపుడు ఒక పురుషకారాన్ని పురస్కరించుకోవాలి. కాని, ఆ*ழ்*్వార్ల శ్రీపాదాలను ఆశ్రయించేటపుడు పురుషకారం ఆవశ్యకం కాదు. ఈ రెండిటికి సమానంగా– **"ఇజ్జే జీయర్ వార్త్తైయై అనుసంధిప్పదు"** (ఇక్కడ ఈ సందర్భంలో జీయర్ వార్తను అనుసంధించాలి) అని నాయనార్ అన్నారు. ఈ వార్త అరుంబదంలో వివరింపబడిన రెండు రీతులు ఈ క్రింది విధంగా ఉన్నవి.

1. "ఎక్కడ ఉండి అనుసంధించినా, ఆచార్యాభిమానమే ఉత్తారకం". అనేదానికి సంవాదంగా ఒక ఐతిహ్యాన్ని తెల్పుతున్నారు– **"ఇజ్జే జీయర్వార్త్తైయై అనుసంధిప్పదు"** అని అంటూ. **"జీయర్వార్త్తై"** అంటే– జీయర్‌కు సంబంధించిన వార్త– అని అర్థం. అది ఏమంటే – నంజీయర్ సన్న్యాసాశ్రమస్వీకారాన్ని చేసిన తరువాత వారిని అనంతార్యులు చూచి, "శరీరం శ్రమపడి స్వేదం కలిగినపుడు స్నానం చేసి, ఆకలి అయినపుడు భుజించి, భట్టర్ శ్రీచరణాలే శరణం– అని ఎక్కడ ఉన్నా, మీ మోక్షప్రాప్తికి లోటు ఉన్నదా? లేదు కదా. అయినా, కైంకర్యానికి అడ్డంకిగా ఉండే ఈ సన్న్యాసి వేషాన్ని గ్రహించి ఏమి చేసినవారయ్యారు?" అని అన్నారట– ఇది ఒక వార్త.



2. ఇక రెండవ వార్త : ఆ*ழ்*్వార్లను ఆశ్రయించడానికి పురుషకారం అక్కరలేదు. అనే దానికి సంవాదంగా ఒక ఐతిహ్యాన్ని పల్కుతున్నారు. **"ఇజ్జే జీయర్"** ఇత్యాదిగా. జీయర్‌వార్త అంటే నంజీయర్ పల్కిన సూక్తి– "భట్టర్ మేల్‌నాడుకు వేంచేసినపుడు, అడవులను, పర్వతాలను దాటి, ఏపురుషకారం లేకుండానే నన్ను స్వీకరించి అభిమానించారు కదా !" అనేది భట్టర్ పట్ల నంజీయర్ అభినివేశంతో పల్కిన వార్త.

**(తేవు మ*ற்ற*ఱియేన్) –"ఆచార్యదేవో భవ"** (తైత్తిరీయ–శీక్షా–11–2) (ఆచార్యుని దైవంగా కలవాడవు కావాలి) అని శాస్త్రం చూపిన ఆచార్యుడనే దైవం తప్ప మిగిలిన దైవాలను ఏమీ తెలియను.

**(మెయ్మ్మైయే)–** ఇది సత్యమే.

**(మేవినేన్ అవన్ పొన్నడి మెయ్మ్మైయే తేవు మ*ற்ற*ఱియేన్)** – శ్రీశఠకోపుల పాదాలను శిరస్సుపై పెట్టుకొన్నవారు కూడా అసత్యాలు పల్కుతారా! ఏవిధంగా అయినా కాలక్షేపానికి భగవద్విషయాన్ని ఆశ్రయించి కాలాన్ని గడపాలి కదా! అని అంటే,

**(కురుకూర్‌నమ్బి పావిన్ ఇన్నిశై పాడిత్తిరివనే)–** నాకు కాలక్షేపవిషయం, మీవలె, ఒకటి రెండు మాత్రమేనా ? వేయి పాశురాలున్నాయి కదా!

**(కురుకూర్‌నమ్బి)– "ప్రాప్తరాజస్య రామస్య వాల్మీకి ర్భగవాన్ ఋషిః, చకార చరితం కృత్స్నం విచిత్రపద మాత్మవాన్"** (రామా–బాల–4–1) (జ్ఞానాది గుణాలతో నిండినవాడు, మనస్సును నియంత్రించినవాడైన వాల్మీకి మహర్షి రాజ్యాన్ని పొందిన శ్రీరాముని చరిత్రను అంతటిని, విచిత్రమైన పదాలను కల కావ్యంగా రచించాడు) అనే రీతిలో శ్రీరాముని కీర్తించిన వాల్మీకి, జ్ఞానాది గుణాలతో పూర్ణుడై ఉండేటట్లే, వీరు (నమ్మా*ழ்*్వార్లు) కూడా గుణాలతో నిండి ఉన్నందున, ఆ*ழ்*్వార్లను **"నమ్బి"** అని అంటున్నారు. **"ఏఱ్ఱుమ్ పెరుమ్ పుక*ழ்* వానవరీశన్ కణ్ణన్‌తనక్కు ఏఱ్ఱుమ్ పెరుమ్ పుక*ழ்* వణ్‌కురుకూర్ చ్చడకోపన్"** (తిరువాయ్–3–9–11) (తగిన గొప్ప

కల్యాణగుణాలను కలవాడు, నిత్యసూరినాథుడైన శ్రీకృష్ణునకు తగిన కల్యాణగుణాలను కల, ఉదారులైన తిరుకురుకూర్‌లోని శ్రీశఠకోపులు) అనే రీతిలో స్తుతింపబడే భగవానునకు పరత్వం, సౌలభ్యం– మొదలైనవానిలో పూర్తి ఆస్వామిని స్తుతించే ఆళ్వార్లకు జ్ఞానభక్తులలో పూర్తి. అందువల్ల ఆళ్వార్లను **"నమ్బి"** అని అనడంలో లోటు లేదు.

**(తిరివనే)** – అక్కడకు– పరమపదానికి –పోయినపుడుకదా సామగానాన్ని చేసి ఒక చోటనే ఉండే స్థితి ఏర్పడుతుంది. ఇక్కడ, ఆ రీతిలో కాకుండా, అడ్డు లేకుండా తిరుగుతాను. అందువల్ల "సుఖరూపమై ఉండేవారు, సాధనమై ఉండేవారు, స్వామి, కాలక్షేప విషయం– అంతా నాకు ఆళ్వార్లే" అని అంటూ భగవద్విషయాన్ని అనుభవించగోరేవారికి మధురకవులు బదులు పలికారు. (ఈ పాశురంలో).

**తిరితన్దాగిలుమ్ దేవపిరానుడై,**
**కరియకోల త్తిరువురు క్కాణ్బన్ నాన్,**
**పెరియవణ్ కురుగూర్ నగర్ నమ్బిక్కు ఆళ్**
**ఉరియనాయ్, అడియేన్ పెఱ్ఱ నన్మైయే. 3**

తిరితన్దాకిలుమ్ = (ఆళ్వార్లను విడచిపెట్టి) తిరిగి వచ్చినా, దేవపిరానుడై = నిత్యసూరులకు నాథుడైన భగవానుని, కరియ = (నీలమేఘం వలె) నల్లని, కోలమ్= అందమైన, తిరు వురు = దివ్యరూపాన్ని, నాన్ కాణ్బన్ = నేను సేవిస్తాను, పెరియ వణ్ కురుకూర్ నకర్ నమ్బిక్కు = గొప్పతనాన్ని ఔదార్యాన్ని కల ఆళ్వార్లకు, ఉరియ ఆళ్ ఆయ్ = అనన్యార్హశేషభూతుడనై ఉండి, అడియేన్ పెఱ్ఱ నన్మై = దాసుడనైన నేను పొందిన ప్రయోజనం ఇది కదా!

## పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానమ్

అవ - మూన్ఱామ్పాట్టిల్, "తేవు మఱ్ఱఱియేన్" ఎన్ఱు పురుషార్థాన్తరఙ్గళోడేకూడ భగవద్విషయత్తైయుమ్ కాఱ్కడై క్కొళ్ళుక్కడవీరో? ఎన్న, "ఎనక్కు అపురుషార్థమ్" ఎన్నుమళవాయ్‌త్తు క్కాఱ్కడైక్కొణ్డతు, "ఆళ్వార్ ఉకన్ద విషయమ్"ఎన్నుమివ్వళియాలే తేవుమఱ్ఱఱియులు మఱివన్-ఎన్గిఱార్. శూర్పణఖైయైప్పోలే కిడన్దానై కణ్డేఱుమతిఱే తవిర్‌త్తుక్కొణ్డతు. "విట్టుశిత్తర్ తఙ్గళ్ తేవరై వల్ల పరిశు వరువిప్పరేల్ అతు కాణ్డుమ్" ఎన్ఱు



పెరియాళ్వార్ మున్నాక ప్పఱ్ఱుమ్ ఆణ్ణాళైప్పోలే, ఆళ్వార్‌మున్నాక ప్పఱ్ఱుమ్ పఱ్ఱు త్తవిర్‌న్దిలరిఱే. ఆళ్వార్‌మున్నాక వరు ముద్దేశ్యత్తై తవిర్‌న్దిలరిఱే. "భవతః పరమో మతః" ఎన్ఱు కేట్క, "ధర్మోఽధికతమో మతః" ఎన్ఱాప్పోలే, ఆచార్యరుచిపరిగృహీతమాయ్ వరుమతు ఆదరణీయమిఱే, ఇవర్‌క్కు.

త్రిపురాదేవియార్, "వడకీళ్‌మూలైయిల్ తత్త్వత్తైయుమ్ "ఆశ్రయణీయమ్" ఎన్ఱు ఉడైయవర్ అరుళిచ్చెయ్‌తారాకిల్, 'ఎనక్కుమ్ అతువామ్; అత్తనై యన్ఱో!" ఎన్ఱాళ్. కుణమలై ప్పాడియుడైయార్ గాఙ్గేయన్ తెత్కే ఎడుత్తు విట్టపోతు, పిళ్ళైయాత్తాన్ అఙ్గే కుఱైవఱప్పు చ్చమైక్క. అవర్ "ఉమక్కు వేణ్డువతెన్?" ఎన్ఱు కేట్క, ఇవర్ "ఉమ్మైక్కొణ్డు పణ్డే ఉపకారమ్ కొణ్డోమ్ కాణుమ్" ఎన్న, "ఆవతెన్? ఎన్నై అఱియాతే వరుమతోరుపకారముణ్డో?" ఎన్న, "ఎఙ్గళా చార్యర్, నాన్ కోయిలిల్ మణ్ పెఱ్ఱతు అవ్వేళాళనాలే" ఎన్ఱరుళిచ్చెయ్య క్కేట్టిరున్దోమ్. ఇతుక్కు మేఱ్పట్టతో రుపకారముణ్డో నమక్కు?" ఎన్ఱార్.

ఉడైయవర్ వెళ్ళై శాత్తి ఎళున్దరుళిన కాలత్తిలే, తిరువడికళిల్ సమ్బన్ధముడైయారై "పెరుమాళై త్తిరువడి త్తొళవిడవేణ్డా" ఎన్ఱు విలక్క, ఆళ్వానై, "నీర్ ఆరేనుక్కుమ్ విరోధియో!, నీర్ పుక్కు త్తిరువడి త్తొళలాకాతో?" ఎన్న, ఆత్మగుణమ్ మోక్షహేతు ఎన్ఱిరున్దోమ్, అతు బన్ధహేతువాన పిన్బు ఎమ్బెరుమానార్ తిరువడికళిల్ సమ్బన్ధత్తై యఱుత్తుక్కొళ్ళవో!" ఎన్ఱు మీణ్డు పోన్దార్.

వ్యా: - (తిరితన్దాకిలుమ్) తిరితరుకైయావతు - మీళుకై. మీణ్డాకిలుమ్. తిరితరుతలెన్ఱతు అడైశొల్లాయ్, తిరితన్దాకిలుమ్ - పోన వళి యెల్లామ్ మీణ్డాకిలుమ్. అతావతు - తిరువాయ్‌మొళిప్పావై విట్టు, ఇశైకళై విట్టు, ఆళ్వారై విట్టు, "అవరుకన్ద విషయమ్" ఎన్ఱు ప్రథమావధియిలే వన్దు. (తేవపిరానుడై క్కరియ కోల త్తిరువురు క్కాణ్బన్) (తేవపిరావాన్) నిత్యసూరికళుక్కు త్తన్నై ముఱ్ఱూట్టాక అనుభవిక్కక్కొడుత్తుక్కొణ్డిరుక్కు ముపకారకన్,

ఇవర్ నిన్ఱ నిలై కులైన్దు భగవద్విషయత్తిలే ఏఱ్ఱుమ్బోతుమ్, అతినెల్లైయాన నిత్యసూరికళ్ యాత్రైయాయాయ్త్తిరుప్పతు. (తేవపిరానుడై క్కరియ కోల త్తిరువురు) నిత్యసూరికళుక్కు ప్పడి విడుమ్ వడివు. కాళమేఘనిభశ్యామమాయ్, అళ్కుతాన్ ఒరు వడివు కొణ్డాప్పోలేయిఱే యిరుప్పతు.

"కోలమే తామరైక్కణ్ణతోర్ అఞ్జననీలమే" ఎన్ఱు - ఆళ్వార్ వాయ్ పులత్త క్కేట్టిరుక్కుమవరాకైయాలే పేశుకిఱార్. పరమయోగికళ్, యోగమ్ కైపుకున్దాల్ ఊర్వశియుడైయ వడివై వర్ణిక్కుమాపోలే, ఇవరుమ్ ఇవ్విషయత్తై వర్ణిక్కిఱారిఱే. "కరియ కోలమ్" ఎన్ఱు స్ప్రుహై పణ్ణుమ్బడి ఆళ్వార్ వర్ణిక్క క్కేట్టిరున్దపడియాలే.

(కాణ్బన్) సాక్షాత్కరిప్పన్. సాక్షాత్కరిత్తనుభవిక్కిఱ ఇవరై విట్టాల్, పరమపదనిలయనైయాయ్త్తు సాక్షాత్కరిప్పతు. (నాన్) "తేవు మఱ్ఱఱి యేన్" ఎన్ఱు - భగవద్విషయత్తై సన్న్యసిత్త నాన్. (వణ్కురుకూర్ నకర్ నమ్బిక్కు) మహోదారరాయ్క్కొణ్డు తిరునకరియిలే తిరువవతరిత్త ఆళ్వారుక్కు. సర్వేశ్వరనుడైయ ఔదార్యమ్ జీవియాత కాలత్తిలే తన్ వాశి అఱివిత్త ఔదార్య మిఱే.

"కురుకూర్నకర్" ఎన్ఱు - వైకున్దమానకరై వ్యావర్తిక్కిఱతు. "పరమ పదమ్" ఎన్బతు, "అయర్వఱుమ్ అమరర్కళ్ అతిపతి" ఎన్బతాయ్, ఆళ్వార్ పడుమతెల్లామ్, ఇవరుమ్ "తిరునగరి" ఎన్ఱాలుమ్, "ఆళ్వార్" ఎన్ఱాలుమ్ అప్పడియేయాయ్త్తు అనుభవిప్పతు.

(నమ్బిక్కు) "నానొన్ఱై ప్పఱ్ఱినేన్, ఒన్ఱై విట్టేన్" ఎన్నలామ్బడియో ఆళ్వారుడైయ పూర్త్తియిరుప్పతు! అతావతు - ఆళ్వారై యనుభవిక్కు మనుభవత్తిలే భగవద్విషయము మన్తర్భూతమాయిరుక్కై. (ఉరియనాయ్) ఉరియ అడియనాయ్. ఉరియ అడియార్క్కు "తన్దాముక్కు" ఎన్న ఒరు ప్రియాప్రియఙ్గళిన్ఱిక్కే స్వామి ఉకన్దత్తైయే పఱ్ఱి, అవన్ కైవిట్ట విడత్తే విట్టిరుక్కుమతిఱే స్వరూపమ్.



(అడియేన్) ఆళ్వారుడైయ నీర్మైక్కు త్తోఱ్ఱ "అడియేన్" ఎన్గిఱార్. "తొణ్డీర్ ఎల్లీరుమ్ వారీర్" ఎన్నుమ్ నీర్మైయిఱే. (పెఱ్ఱ నమ్మై) పెఱ్ఱ భగవల్లాభమ్. ఆళ్వార్క్కు ఉరియ అడియనాయ్ ప్పెఱ్ఱ పేఱు ఇతిఱే నాన్. ప్రాప్తాప్రాప్తవివేకత్తిల్ ప్రావణ్యత్తాల్ వన్ద నన్మై యన్ఱు-ఎన్ఱై.

## అరుమ్బద విళక్కమ్

మూన్ఱామ్ పాట్టు – అవ :– కీళ్ ప్పాట్టిల్ – "తేవు మఱ్ఱఱియేన్" ఎన్ఱుమ్, ఇప్పాట్టిల్ "తేవపిరానుడైయ క్కరియ కోల త్తిరువురు క్కాణ్బన్" ఎన్ఱుమ్ శొల్ల క్కూడుమో? ఎన్గిఱ విరోధిపరిహారార్థమాక శఙ్కాన్తరపరిహారముఖేన సఙ్గతి అరుళిచ్చెయ్ కిఱార్ (తేవిత్యాది). (భగవద్విషయత్తైయుమ్) తమక్కు ఉద్దేశ్యరాన ఆళ్వారుక్కు ఉద్దేశ్యమాన భగవద్విషయత్తైయుమ్ కాఱ్ఱైక్కొణ్డ ప్రకారత్తై దృష్టాన్తముఖేన వివరిక్కిఱార్ (శూర్పణఖేత్యాది). ఇత్తాల్– అద్వారకమాక పఱ్ఱుకై అనర్థహేతు– ఎన్ఱు కరుత్తు. ఆళ్వార్ ఉకన్దవిషయ మెన్ఱు పఱ్ఱిన ప్రకారత్తుక్కు అఙ్గు దృష్టాన్తఙ్గళై అరుళిచ్చెయ్తుకొణ్డు వివరిక్కిఱార్ (విట్టుశిత్తరిత్యాది, మీణ్డుపోన్దారెన్నుమళవుమ్). కీళ్ వాక్యవివరణమ్ (ఆళ్వారిత్యాది). (ఇవరుక్కు) మధురకవికళుక్కు. (కుణమలైప్పాడి) గ్రామవిశేషమ్. "గాఙ్గేయన్" ఎన్ఱు– ఒరు వేళాళనుక్కు ప్పేర్. (ఎడుత్తువిట్టపోతు) సేనైయై త్తిరట్టిక్కొణ్డు పోనపోతు. (పిళ్ళైయాత్తాన్) ఒరు శ్రీవైష్ణవర్ (శమైక్క) అమైక్క. (మణ్ పెఱ్ఱతు) తిరుమాళికై లభిత్తతు; ఇవ్వైతిహ్యత్తాల్ ఆచార్యాభిమతన్ ఎన్ఱనక్కుమ్ అభిమతనెన్ఱు తోఱ్ఱుకిఱతు.

(కాలత్తిలే) ఎన్ఱ అనన్తరమ్ "అవర్" ఎన్ఱు శేషమ్. (వేణ్డావెన్ఱు) ఎన్ఱ అనన్తరమ్ "కోయిలిలే క్రిమికణ్డన్మనుష్యర్ విలక్క" ఎన్ఱు కూట్టువతు. ఆత్మగుణమెన్ఱతు– ఆరేనుక్కుమ్ విరోధియాకాతపడియాన శమముమ్, దమముమ్. ఇవ్విడత్తిల్ ఆత్మగుణఙ్గళిల్ ప్రధానమ్. "శమముమ్, దమముమ్" ఇత్యాదివాక్యఙ్గళ్ అనుసన్ధేయఙ్గళ్.

వ్యాఖ్యానమ్ :– "తిరితర" ఎన్నవేణ్డియిరుక్క "తిరితన్దు" ఎన్ఱు కడైక్కుఱైత్తలా యిరుక్కిఱతు. కీళిరణ్డు పాట్టిలుమ్, "ఎన్నప్పన్" ఎన్ఱుమ్, "పెరుమాయన్" ఎన్ఱుమ్, "నమ్బి ఎన్ఱక్కాల్" ఎన్ఱు ఆళ్వారైయుమ్, "కురుకూర్నమ్బి పావినిన్నిశై" ఎన్ఱవిడత్తిల్ తిరువాయ్మొళియైయుమ్", అతిన్ గానత్తైయుమ్ పఱ్ఱిన క్రమత్తై త్తిరువుళ్ళమ్బఱ్ఱి

మీణ్డ పడియై వివరిక్కిఱార్ (అతావతిత్యాది). "కరియ కోల త్తిరువురు క్కాణ్బన్" ఎన్గైయాలే, "తేవపిరాన్" ఎన్గతుక్కుమ్ తమ్మై అనుభవిప్పిత్తాప్పోలే అవర్కళై అనుభవిప్పిత్తానెన్ఱు తిరువుళ్ళమెన్ఱు తాత్పర్య మరుళిచెయ్కిఱార్ (నిత్యసూరికళిత్యాది). ఇవర్ మీణ్డారాకిల్ "ఎన్నప్పనిల్" ఎన్గ కణ్ణనై యన్ఱో ప*ఱ్ఱు*వతు! "తేవపిరాన్" ఎన్బాన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (ఇవర్ నిన్ఱ నిలై యిత్యాది). (నిన్ఱ నిలై) ఎన్గతు- తిరువాయ్మొ*ళి* యిశైయిలే నిన్ఱనిలై - ఎన్గపడి. అతినెల్లైయాన ఎన్గతు- భగవద్విషయత్తిన్ మేలెల్లైయాన నిత్యసూరికళుక్కుమ్ అనుభవమెన్గపడి. అవర్కళోడు కూడి, అవర్కళుకన్ద విషయమెన్ఱే ప*ఱ్ఱు*కై. నిత్యసూరికళ్ అనుభవిక్కుమ్ వడివు కరియ తిరువురువా యిరుక్కుమో ? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (నిత్యసూరికళుక్కు ఇత్యాది). "ఇతే" ఎన్గతు- ప్రమాణప్రసిద్ధియై చ్చొల్లుకిఱతు.

ఇతు ఇరున్ద పడి ఎన్? ఎన్న (కోలమే ఇత్యాది). భగవత్ప్రవణరన్ఱిక్కే యిరుక్కిఱ తామ్. అవన్ తిరుమేనియై వర్ణిత్తుక్కాణక్కడవేన్- ఎన్ఱు స్వార్థమాక ప్రార్థిప్పానెన్? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (పరమయోగికళిత్యాది). యోగికళ్ విరక్తరా యిరుక్కచ్చెయ్ తేయుమ్ శృఙ్గారార్థమాక వర్ణిక్కిఱాప్పోలే, తాముమ్ ఆసక్తియన్ఱిక్కే యిరుక్కచ్చెయ్తేయుమ్ వర్ణిక్కిఱార్- ఎన్గపడి.

"కాణ్బన్" ఎన్గత్తాలే తేవపిరానైయే కాణక్కడవేన్- ఎన్ఱు పొరుళాయ్, అత్తై అరుళిచ్చెయ్కిఱార్ (సాక్షాదిత్యాది).

"కాణ్బన్" ఎన్గత్తాల్ అర్థసిద్ధమాయిరుక్క, "నాన్" ఎన్గత్తాల్ ఫలితమ్ (తేవు మ*ఱ్ఱ్రి*త్యాది) పెరుమైయై వణ్మైక్కు విశేషణమాక్కి, అత్తై విశేషిక్కిఱార్ (సర్వేశ్వరను డైయ ఇత్యాది).

కురుకూర్పదవ్యావృత్యర్థమ్ (కురుకూరిత్యాది). వ్యామోహత్తాలే ఆ*ళ్వా*రైయుమ్, తిరునగరియైయుమ్ వర్ణిత్తతుక్కు దృష్టాన్తముఖేన తాత్పర్యమ్ (పరమపదమిత్యాది) "కురుకూర్ నకరాన్" ఎన్నాతే, 'నమ్బి" ఎన్గతుక్కు త్తాత్పర్యత్తై ఎల్లైయళవుమ్ అరుళిచ్చెయ్కిఱార్ (నాన్ ఒన్ఱై - ఇత్యాది వాక్యద్వయత్తాలే) "ఉరియనాయ్- ఆళాయ్" ఎన్ఱు విశేషిక్కైక్కు ప్రయోజన మరుళిచ్చెయ్వతాక ఉరియ అడియార్ నిలైయై క్కాట్టు కిఱార్ (ఉరియ ఇత్యాది).



నాన్ ఎన్ఱిరుక్క "అడియేన్" ఎన్బానెన్? - ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (ఆ*ళ్వా*రుడైయ- ఇత్యాది) "నన్మైయే" ఎన్ఱు విద్ధరాకిఱారెన్గిఱార్ (ఆ*ళ్వా*రుక్కిత్యాది) "సర్వం వాక్యమ్ సావధారణ"మెన్ఱు, "ఆళురియనాయ్ పె*ఱ్ఱ* నన్మై" ఎన్ఱు తాత్పర్యమ్ (ప్రాప్తేత్యాది). ప్రాప్తాప్రాప్త వివేకమావతు.- "భగవద్విషయమ్ ప్రాప్తమ్, ఇతర విషయమ్ అప్రాప్తమ్" ఎన్ఱు వివేకిత్తు ప్ప*ఱ్ఱ*విల్లై; ఉరియ అడియానాకైయాలే ప*ఱ్ఱ్రి*నేన్ - ఎన్గపడి.

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**మూడవ పాశురమ్ - అవతారిక :- "తేవు మ*ఱ్ఱ*ఱియేన్"** (వేఱొక దైవాన్ని ఎఱుగను) అని అంటూ ఐశ్వర్య కైవల్యాలతో పాటు, భగవద్విషయంపట్ల కూడా మీరు ఉదాసీనులై ఉండవచ్చునా? అనే ప్రశ్న రాగా, "నేను అభిలషించే ప్రాప్యం ఇది కాదు"- అనే భావనతో దానిపట్ల (భగవానుడనే ప్రాప్యం పట్ల) ఉదాసీనుడనై ఉన్నానే తప్ప, "ఆ*ళ్వా*ర్లు అభిమానించిన విషయం"- అనే భావనతో భగవానునికూడా నేను అనుభవించడంలో లోటు లేదు- అని ఇందులో అంటున్నారు.

శూర్పణఖవలె, పిరాట్టిని (సీతాదేవిని) అనాదరించి, స్వతంత్రంగా భగవానుని ఆశ్రయించడాన్ని వీరు త్యజించారు. **"విట్టుశిత్తర్ తఙ్గళ్ తేవరై వల్ల పరిశు వరువిప్పరేల్ అదు కాణ్డుమ్"** (నాచ్చియార్ తిరు-10-10) (విష్ణుచిత్తులు, తమ దేవుడైన భగవానుని తగిన ఉపాయంతో దర్శింపజేస్తే, అపుడా స్వామిని దర్శిస్తాము) అని పెరియా*ళ్వా*ర్లను పురస్కరించుకొని భగవానుని ఆశ్రయించే రీతిని వీరు వదలిపెట్టలేదు. ఆ*ళ్వా*ర్లకు, భగవానుడు ఉద్దేశ్యభూతుడు కనుక, తమకుకూడా ఉద్దేశ్యభూతుడవుతున్నాడు- అనే విషయాన్ని వీరు కాదనలేదు. **"కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః"** (ధర్మాలు అన్నిటిలోను ఏ ధర్మం మీకు మిక్కిలి అభిమతం?) (భారత-ఆనుశాసనిక పర్వం-149) అని ధర్మరాజు, తమకు తాత, ఆచార్యుడైన భీష్ముని ప్రశ్నించగా, భీష్ముడు **"యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నరః సదా"** (భక్తితో పుండరీకాక్షుని స్తుతులతో మానవుడు సదా అర్చించాలి- అనేది నా అభిమతం) అని పల్కినట్లుగా, ఆచార్యులు అభిమానించినదే తమకు అభిమానించదగినదని వీరు పల్కుతున్నారు.

ఈ సందర్భంలో పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యలో ఉట్టంకింపబడిన ఈ క్రింది ఐతిహ్యాలు స్మరణీయాలు.

1. ఆచార్యకులంలో అవతరించిన, భగవద్రామానుజుల శిష్యురాలైన త్రిపురాదేవిని కొందఱు "మీరు, దేవతాంతరాలను విడచిపెట్టి, దేవతాంతర భజనాన్ని చేయకపోవడానికి ఏమి కారణం? అని ప్రశ్నించారు. అపుడు త్రిపురాదేవి, "దేవతాంతరాల నామాన్నికూడా తన నోటితో ఉచ్చరించడానికి జంకి, సద్ది అన్నం కుండను పెట్టే ఈశాన్యమూలకు పాలకుడైన దైవాన్ని (ఈశ్వరుని) ఆశ్రయించాలి– అని మా ఆచార్యులైన శ్రీరామానుజులు పల్కితే, నేను దానినే ఆశ్రయణీయంగా భావిస్తాను సుమా!" అని అన్నది.

2. **కుణమలైప్పాడి–** అనే గ్రామానికి చెందిన గాంగేయుడనే కుమ్మరికులానికి చెందిన చిన్నరాజు, సేనను సమీకరించుకొని దక్షిణ దిక్కులో వెళ్ళినపుడు, అక్కడ ఉండే పిళ్ళైయా*ఱ్ఱా*న్ అనే శ్రీవైష్ణవుడు అతనికి పలు సహాయాలను చేశారు. ఆ కుమ్మరి పిళ్ళైయా*ఱ్ఱా*న్‌ను చూచి "మీకు నేను చేయదగిన ప్రత్యుపకృతి ఏది అయినా ఉంటే చెప్పండి. నేను దానిని తప్పక చేస్తాను" అని అన్నాడు. అపుడు పిళ్ళైయా*ఱ్ఱా*న్ "నీవు ఇతఃపూర్వమే నాకు ఉపకారం చేశావు. అందువల్ల ఇపుడు మళ్ళీ ఏమీ చేయనక్కరలేదు" అని అన్నారు. అపుడతడు "నేనే, నాకు తెలియకుండా మీకు చేసిన ఉపకృతి ఏమి?" అని ప్రశ్నించాడట. అపుడా శ్రీవైష్ణవుడు "మా ఆచార్యులు శ్రీరంగంలో నేను నివసించడానికి వీలుగా ఒక నివాసాన్ని పొందినది ఆ కుమ్మరివల్ల"– అని పల్కగా విన్నాను. మా ఆచార్యులకు మీరు చేసిన ఈ ఉపకారం కంటే గొప్పది ఇంకొకటి ఉంటుందా?" అని అన్నారు. దీనివల్ల ఆచార్యునకు కావలసినవారు మనకు కూడా కావలసినవారే –అని తెలుస్తున్నది.

3. శ్రీరామానుజులు, కృమికంఠునివల్ల కల్గిన ఉపద్రవంవల్ల శ్వేతవస్త్రధారణను చేసి, తిరునారాయణపురం వైపు వెళ్ళిన సమయంలో, కృమికంఠుడు "శ్రీరామానుజులతో సంబంధాన్ని కలవారిని ఎవరినీ శ్రీరంగనాథుని ఆలయంలోకి అనుమతించరాదు" అని ఆజ్ఞాపించాడు. దీనిని తెలియని కూరేశులు ఒకనాడు శ్రీరంగనాథుని ఆలయంలోకి శ్రీరంగనాథుని సేవించడకోసం వచ్చారు. అపుడు ఆలయాధికారులు "ఈ విధంగా ఆజ్ఞ చేయబడినా, మీరు అందఱిపట్ల మంచివారు; సద్గుణాలను కలవారు; అందువల్ల మీరు లోపలకు వెళ్ళి స్వామిని సేవించండి" అని అనుమతించారు. ఆ ఆజ్ఞనుగూర్చి అపుడే తెలిసికొన్న కూరేశులు, "మంచి ఆత్మగుణాలను కల్గి ఉండడం మోక్షానికి కారణమవుతాయి– అని భావించాను. ఈ గుణాలే శ్రీరంగనాథుని సేవించడానికి కారణం అయినా, శ్రీరామానుజుల శ్రీచరణసంబంధాన్ని



లేకుండా చేసికోవడానికి కారణమైనందున, సంసారబంధానికే అవి కారణం కాగలవు. అటువంటి శ్రీరంగనాథుని సేవ నాకు వద్దు" అని అంటూ శ్రీరంగాలయంనుండి తిరిగి వెళ్ళిపోయారట. దీనివల్ల, ఆచార్యసంబంధానికి అడ్డుగా ఉండే భగవత్సంబంధం సైతం విడువదగినదే– అని తెలుస్తున్నది.

**వ్యాఖ్యానమ్ : (తిరితన్దాకిలుమ్)**– తిరిగి వచ్చినా– నివర్తించినా– అని అర్థం. **"తిరితరుతల్"** అనే పదం **"ఆకిలుమ్"** అనే పదానికి విశేషణమై, "నివర్తించడమనే పనిని పూర్తిగా చేసినప్పటికీ"– అనే అర్థాన్ని ఇస్తుంది. దీని భావమేమంటే– తిరువాయ్‌మొ*ழி* పాశురాలనే పరమోద్దేశ్యంగా ఆశ్రయించిన తరువాత, ఆ పాశురాలను విడచి, వాటిలో ఉండే మధురమైన సంగీతాన్ని విడచి, వానిని పాడిన ఆ*ழ்*వార్లను విడిచి, వారు ఆనందించిన, ఆశ్రయించిన విషయమనే కారణంచేత ప్రథమపర్వమైన భగవానునివద్దకు వచ్చినా –అని భావం.

**(దేవపిరానుదై క్కరియకోల త్తిరువురుక్కాణ్బన్)**

**(దేవపిరాన్) – "అయర్వఱు అమరర్‌కళ్"** అయిన నిత్యసూరులకు, వారు అనుభవించేటట్లుగా పూర్ణంగా తనను వశం చేసికొనే ఉపకారకుడైన పరమపదనాథుని గూర్చి పల్కుతున్నారు. వీరు (మధురకవులు) ఆశ్రయించిన చరమపర్వమైన ఆ*ழ்*వార్ల వద్దనుండి నివర్తించి, భగవద్విషయంవైపు వెళ్ళేటపుడుకూడా **"కట్టుణ్ణ ప్పణ్ణియ పెరుమాయన్"** అని పల్కిన శ్రీకృష్ణునితో మాత్రమే నిలువకుండా, అతనికి మూలమూర్తియై, నిత్యసూరులు అనుభవించే పరమపదనాథునివరకు కొనసాగడం **"తేవపిరాన్"** అనే ఈపదం ద్వారా తెలుపబడుతున్నది.

**(తేవపిరానుదై క్కరియ కోల త్తిరువురు)** నిత్యసూరులకు జీవనాన్ని ప్రసాదించే ఉపకారకుడైన పరమపదనాథుని రూపసౌందర్యం నీలమేఘంవర్ణంవంటి వర్ణాన్ని కల్గినదై, అందమే మూర్తీభవించినట్లుగాకదా ఉంటుంది.

ఈ రూపాన్ని వీరు తెలిసికొన్నది ఏ రీతిలో ? అంటే, **"కోలమే ! తామరైక్కణ్ణదు ఓర్ అఞ్జన నీలమే"** (తిరువాయ్–3–8–8) (అందమా ! తామరపూలవంటి నేత్రాలను కల అద్వితీయమైన ఓ కాటుకపర్వతమా !) అని ఆ*ழ்*వార్లు ఈ రూపాన్ని గూర్చి నోరు తెరచి పలుమార్లు పల్కడంవల్ల, వీరు ఈవిధంగా పల్కుతున్నారు. పరమయోగులైన ఉపాసకులు, భక్తియోగం సిద్ధించి, భగవానుని తిరుమేని అందాన్ని దర్శించిన తరువాత, లోకంలో కన్పించే అందాన్ని కల్గిన ఊర్వశి మొదలైనవారి

రూపసౌందర్యంకంటే భగవత్సౌందర్యం భోగ్యమైనది – అని చూపడంకోసం ఆ (లౌకికమైన) అందాన్ని వర్ణించేటట్లే, వీరుకూడా భగవానుని అందాన్ని వర్ణిస్తున్నారు కదా ! ఈ సందర్భంలో నమ్బిళ్ళైవ్యాఖ్యానంలో **"యోగభ్రష్టర్ ఊర్వశియుడైయ వడివళ్గై వర్ణిక్కుమ్బోలే శొల్లుకిఱార్"** (యోగం నుండి భ్రంశాన్ని పొందినవారు ఊర్వశి యొక్క రూప సౌందర్యాన్ని వర్ణించేటట్లు పల్కుతున్నారు) అని ఉన్నది. సామాన్యంగా ఒకే రీతిలో ఉండే నమ్బిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాలలోని ఇక్కడ ఈ తారతమ్యం గమనించదగినది. **"కరియకోలమ్"** అని ఆశపడే విధంగా ఆళ్వార్లు వర్ణించడాన్ని మాటిమాటికి విన్నందువల్ల వీరు కూడా ఈ విధంగా వర్ణిస్తున్నారు.

**(కాణ్బన్)–** సాక్షాత్తుగా దర్శిస్తాను– అని అర్థం. **"దేవపిరాన్"** అని అన్నందువల్ల, నేరుగా దర్శించి అనుభవించే ఆళ్వార్లను విడచిపెట్టి, చాలా దూరంలో ఉండే పరమపదనాథునే నేరుగా దర్శిస్తాను– అని అంటున్నారు.

**(నాన్)– "తేవు మఱ్ఱఱియేన్"** (వేఱొక దైవాన్ని నేను తెలియను) అనే రీతిలో ఆళ్వార్లను తప్ప మిగిలిన ఏదైవాన్ని తెలియని నేను, ఆళ్వార్లు అభిమానించిన విషయం కనుక పరమపదనాథుని దర్శించి, ఆనందిస్తాను.

**(పెరియ వణ్‌కురుకూర్‌నమ్బిక్కు)** – గొప్ప ఔదార్యగుణం కలవారై, ఆళ్వార్ తిరునగరి అనే కురుకాపురిలో అవతరించిన ఆళ్వార్లకు –అని అర్థం. **"వణ్"** అనే పదం **"నమ్బి"** అనే పదానికి విశేషణం. **"పెరియ"** అనేది **"వణ్"** అనే పదానికి విశేషణం. "సర్వేశ్వరుని ఔదార్యం నన్ను సంస్కరించలేని సమయంలో, ఆళ్వార్ల గొప్ప ఔదార్యగుణమే వారి గొప్పతనాన్ని నాకు తెలియజేసి సంస్కరించింది" – అని భావం. **"కురుకూర్ నకర్"** అనే ప్రయోగం వైకుంఠమహానగరంకంటే కురుకూర్‌కు గల వైలక్షణ్యాన్ని సూచిస్తున్నది. ఆళ్వార్లు **"తిరునాడు"** అని, **"అయర్వఱుమ్ అమరర్ కళ్ అదిపతి"** (విస్మృతిలేని నిత్యసూరులకు నాథుడు) (తిరువాయ్–1–1–1) అని పలికేటపుడు అభినివేశాన్ని పొందినట్లుగా, వీరు కూడా **"తిరునగరి"** అని **"ఆళ్వార్"** అని పలికేటపుడు ఆ రీతిలోనే అభినివేశాన్ని పొందుతున్నారు.

**(నమ్బిక్కు)** – పూర్ణతను కల ఆళ్వార్లకు– అని అర్థం. ఆళ్వార్ల అనుభవంలో భగవానుని అనుభవంకూడా అంతర్భవించి ఉన్నందువల్ల, "ఆళ్వార్లను ఆశ్రయించాను, భగవానుని విడచిపెట్టాను" అని చెప్పనక్కఱలేనట్లుగా ఆళ్వార్ల పూర్ణత్వం ఉన్నది. అందువల్ల ఆళ్వార్ల పూర్ణత్వం భగవానుని పూర్ణతకంటే గొప్పది.



**(ఆళురియనాయ్)–** ఆళ్వార్లకే చెందిన దాసుడనై– అని అర్థం. అంటే– తమకు వేఱుగా ఏ ఇష్ట– అనిష్టాలు లేకుండా, ఆళ్వార్లు అభిమానించినదానినే తాముకూడా అభిమానించి, వారు విడచిపెట్టినదానినే తాముసైతం విడచిపెట్టారు– అని భావం. ఇది అనన్యార్హశేషభూతుని లక్షణం.

**(అడియేన్) –** ఆళ్వార్ల సౌలభ్యం, సౌశీల్యం, వాత్సల్యం మొదలైన గుణాలకు జితులై, **"అడియేన్"** అని మధురకవులు అంటున్నారు. **"తొణ్డీర్ ! ఎల్లీరుమ్ వారీర్"** (తిరువాయ్–5–2–2) (దాసులారా! అందఱు రండి) అని అంటూ ఉన్నతులు– అధములు అనే తేడా లేకుండా అందఱిని ఆహ్వానించిన సౌలభ్యంకదా, ఆళ్వార్ల సౌలభ్యం!

**(పెఱ్ఱ నన్మై)–** భగవానుని (అనుభవాన్ని) పొందడమనే హితాన్ని– అని అర్థం. నేను, ఆళ్వార్లకు అనన్యార్హశేషభూతుడనై పొందిన హితం ఇదే కదా! భగవద్విషయం మంచిది, విషయాంతరాలు చెడ్డవి– అని పరిశీలించడంలోని వివేకం ద్వారా కాదు నేను ఈ హితాన్ని పొందినది. ఆళ్వార్లకు అనన్యార్హశేష భూతుడను అయినందువల్లనే ఈ ప్రయోజనాన్ని పొందాను– అని అంటున్నారు.

### నంజీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

**వ్యాఖ్యానం : (తేవపిరానుడై క్కరియ కోల త్తిరువురు క్కాణ్బన్ నాన్)–** పరమపదనాథుని రూపాన్ని "ఇది ఆళ్వార్లు అభిమానించిన విషయం" అని దర్శిస్తానే తప్ప, అందులో (అంతకుమించి) అభినివేశాన్ని పొందను. **"పాణౌ గృహీత్వా విదురం సాత్యకిం చ మహాయశాః, జ్యోతీంష్యాదిత్యవత్ రాజన్! కురూన్ ప్రచ్ఛాదయన్ శ్రియా"** (భారత–ఉద్యో–94–45) (గొప్ప కీర్తిని కల శ్రీకృష్ణుడు విదురుని, సాత్యకిని చేతితో పట్టుకొని, సూర్యుడు, మిగిలిన జ్యోతిః పదార్థాలు వెలవెలపోయే రీతిలో చేసినట్లుగా, కౌరవులను తన తేజస్సుతో మసకబారేటట్లు చేస్తూ వచ్చాడు) అనే రీతిలోని (భగవానుని) తేజస్సును కదా – మనస్సుకు పొందనిది మాత్రమే కాక, కంటితో చూడడానికి కూడా ఆవశ్యకమైనది కాదు – అని మధురకవులు భావిస్తున్నారు.

**(పెరియవణ్ కురుకూర్‌నకర్ నమ్బిక్కు) –** భగవానుడు ఆళ్వార్లకు ఒక్కరికి మాత్రమేకదా. **"మయర్వఱ మదినలమ్"** (తిరువాయ్–1–1–1) (భ్రమ విప్రలంభాది దోషరహితమైన భక్తిగా రూపొందిన జ్ఞానాన్ని) అనుగ్రహించారు. ఆళ్వార్లు, లోకానికి

అంతటికి **"మయర్వర మదినలమ్"**ను అనుగ్రహించారు. అందువల్ల వీరి ఔదార్యం చాలా గొప్పది. **"వణ్"** అనే పదాన్ని **"కురుకూర్"**కు విశేషణంగా గ్రహించి, ఆళ్వార్లను తెలియజేసే ఊరు అయినందువల్ల, ఊరిలోని ఔదార్యవైలక్షణ్యాన్ని తెల్పుతున్నదనికూడా చెప్పవచ్చు. గొప్ప జ్ఞానాన్ని కలవారు అందఱు చేరిన ఆ గొప్ప ఊరికి తాము నాథులనే విషయాన్ని **"పెరియ వణ్కురుకూర్ వణ్ శడకోపన్"** (తిరువాయ్-8-1-1) (గొప్ప ఔదార్యాన్ని కల తిరుక్కురుకూర్‌కు నాథులు, ఔదార్యగుణాన్ని కల్గినవారైన శఠకోపులు) అని అంటూ ఆళ్వార్లే అన్నారు కదా! **"ఇవరుదైయ నారాయణత్వమ్ ఇరుక్కుమ్బడి"** అనే నంజీయర్ వ్యాఖ్యాన శ్రీసూక్తికి "మహనీయులైన నరసమూహానికి ఆశ్రయమైనందున వీరికికూడా (ఆళ్వార్లకు కూడా) నారాయణత్వం పొసగుతుంది"- అని భావం.

**(ఆళురియనాయ్ అడియేన్ పెఱ్ఱ నన్మైయే) - "అడియేన్"** అని అన్నందున అష్టాక్షరిలోని **"ఆయ"** అనే చతుర్థియొక్క అర్థం తెలుపబడింది. అంటే - శేషి అభిమానించినదానిని ఆదరించడమే కైంకర్యంయొక్క చరమావధి - అని తెలుపబడింది.

### నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

**అవ : "తేవు మఱ్ఱఱియేన్"** అని గడచిన పాశురంలో అన్నారు, మధుర కవులు ఇందులో, ఈ చరమపర్వనిష్ఠను కల తమ పట్ల భగవానుడు చాలా అభిమానాన్ని చూపిన విషయాన్ని తెల్పుతున్నారు. భగవానుని ఆనందింపజేయాలంటే- ఆచార్యునిపట్ల అభినివేశాన్ని కల్గి ఉండాలి. ఆచార్యుని ఆనందింపజేయాలంటే- భగవానునిపట్ల అభినివేశాన్ని కల్గి ఉండాలి. **"తేవు మఱ్ఱఱియేన్** అని అంటూ నన్ను కూడా మఱచి, ఆళ్వార్ల పట్ల వీరి అభినివేశాన్ని పొందారుకదా! నా భక్తులపట్ల కంటె, నా భక్తులకు భక్తుల పట్ల నాకు అభినివేశం ఎక్కువకదా! అందువల్ల నేను వీరికి ఇచ్చే బహుమతి (గౌరవం) ఏది?" అని ఆలోచించి చూచి, వీరి మనస్సులో, నీటిప్రవాహంలో కలువలు పూచినట్లుగా భోగ్యంగా ఉండే, తన తిరుమేనిని దర్శింపజేశాడు - భగవానుడు. దీనిని చూచి ఆనందించిన వీరు, "ఇది భగవచ్ఛేషత్వ జ్ఞానంతో గాని, భాగవతశేషత్వమాత్రంవల్లగాని, కల్గినది కాదు. ఇవి అన్నీ నేను ఆళ్వార్లకు అనన్యార్హశేషభూతుడను అయినందున పొందిన ప్రయోజనాలు కదా!"- అని తమలో ఆనందిస్తున్నారు - ఈ పాశురంలో. ఆచార్యుని ఆశ్రయించినవానిని



భగవానుడు స్వయంగా తానే ఆదరించి అభిమానిస్తాడు- అనే దానికి మధురకవి ఆళ్వార్లే ఉదాహరణం కదా!

**వ్యాఖ్య : (తిరితన్దాకిలుమ్)** - భగవానునితో సంబంధం లేకుండా చేసికొని సంచరించినప్పటికీ, ఈ ప్రాప్యాన్ని పొందాను.

**(తేవపిరానుడై)-** వీరి (మధురకవులు) మనస్సులో భగవానుడు ఆదరించి చూపిన తన రూపం నిత్యసూరులు అనుభవంకోసం చూపిన రూపం. భగవానుడు, నిత్యసూరులను, వీరిని పోల్చి చూచి, "వారు నాకు మాత్రమే మంచివారు; వీరు ఆళ్వార్లకే సాధువులు. వీరికే కదా నేను ఈ రూపాన్ని దర్శింపజేయాలి" అని తలచి వీరికి ఆ రూపాన్ని చూపి అనుభవింపజేశాడు (ఆనందింపజేశాడు.)

**(కరియ)** - నిత్యసూరులు ఈ రూపాన్ని అనుభవించేటపుడు, **"కణ్గళ్ శివన్దు"** (తిరువాయ్-8-8-1) అనే పాశురంలో ఆళ్వార్లు అనుభవించేటపుడు తెల్లగా ఉన్నది. వీరు అనుభవించిన (దర్శించిన) తరువాతనే తన వర్ణమైన నీలరూపాన్ని పొందింది. ఆళ్వార్లు అనుభవించేటపుడు కూడా **"శెమ్పొన్ తిరువుడమ్బు"** (తిరువాయ్-2-5-1) (అందమైన, బంగారు వంటిది భగవానుని తిరుమేని) అని పలికారే తప్ప, నల్లగా ఉన్నదని అనలేదుకదా!

**(కోలమ్)-** గజేంద్రుని రక్షించడానికి వచ్చినపుడువలె, ఆ సమయంలో అయథాయథంగా ఆభరణాలను ధరించి ఉండే సన్నివేశంతో రావడం కాకుండా, వీరిని అనుభవింపజేయడంకోసం- ఆభరణాలను, చక్కగా అలంకరించుకొని వచ్చాడు.

**(తిరువురు) "తిరు"** అనబడే లక్ష్మీదేవితో కలసి ఉండే రూపం- అని అర్థం. మిగిలిన ఆభరణాలవలె తొగించలేని, లక్ష్మి అనే ఆభరణాన్ని భగవానుడు ధరించివచ్చాడు. భగవానుని ఈ నల్లని రూపాన్ని మెఱపుతీగవలె ప్రకాశింపజేసి దర్శింపజేసేదై ఈమె ఉంటుంది. **"తిరుక్కణ్డేన్ పొన్మేని కణ్డేన్"** (మూన్ఱామ్ తిరు-1) (లక్ష్మీదేవిని దర్శించాను, భగవానుని బంగారు మేనిని సందర్శించాను) అనే రీతిలో ఈమెను దర్శిస్తేనే భగవానుని రూపాన్ని దర్శించడానికి వీలవుతుంది.

**(కాణ్బన్)-** తమ ప్రయత్నంతో దర్శించే ఉపాసకులు ఈ రూపాన్ని శ్రవణ- మనన- ధ్యానాలతో దర్శించాలి. ఇక్కడ వీరికి భగవానుడు తానే స్వయంగా ఆదరించి దర్శింపజేయడంచేత "ప్రత్యక్షంలో దర్శించినట్లుగా మనస్సులో దర్శించాను"- అని అంటున్నారు.

**(దేవపిరానుడై క్కరియ కోల త్తిరువురు క్కాణ్బన్)– "అమరర్ కళాది ముదల్వన్ కరుకియ నీల నన్మేని వణ్ణన్.... పూమకళార్ తనిక్కేళ్వన్ ఒరుకతియిన్ శువై తన్దిట్టు ఒళ్లివిలన్ ఎన్నోడుడనే"** (తిరువాయ్–1–9–3) (దేవతలకు కారణభూతుడు, జగత్కారణమైనవాడు, నల్లని నీలమణివంటి చక్కని వర్ణాన్ని కలవాడు... పద్మనివాసిని అయిన లక్ష్మీదేవికి వల్లభుడు, ఒక మార్గంలో తన భోగ్యతను అనుగ్రహించి, నాతో నిత్యం కలసి ఉన్నాడు) అని ఆళ్వార్లకు అనుభవింపజేసినట్లే, అనుభవింపజేశాడని అంటున్నారు.

**(నాన్ కాణ్బన్)– "తేవు మత్తఱియేన్"** అని అంటూ "భగవానుని దర్శించకూడదు" అని కన్నులను తిప్పికొన్న నేను కదా దర్శించాను– అని అంటున్నారు.

**(తేవపిరానుడై క్కరియ కోల త్తిరువురు క్కాణ్బన్)**– లక్ష్మీదేవికి సదా అనుభవయోగ్యమై, నిత్యసూరులకు సదా దర్శనీయమైన భగవానుని తిరుమేనిని కదా, ముఖాన్ని తిప్పుకొన్న నేను దర్శించగలిగాను– అని అంటున్నారు.

**(తిరితన్దాకిలుమ్... కాణ్బన్)**– దర్శించేటపుడు ఆళ్వార్లవర్ణంవలె బంగారు రంగులో కాకుండా, వేఱు రంగులో ఉన్నందున, దర్శించానే తప్ప, దానిలో అభినివేశాన్ని పొందలేదు. ఆళ్వార్ల తిరుమేనివలె వకుళపూల పరిమళం గుబాళించ కుండా తులసీ పరిమళం వీచినందున, అన్యపరిమళంగా వీరికి (మధురకవులకు) తోచింది. ఈవిధంగా అన్ని రీతులలోను వేఱు రీతిలో ఉన్నందున **"దేవర్ ఎన్ఱు అఞ్జి"** (తిరునెడు–21) (ఇతడు దేవుడని భయపడి) దూరంగా నిలచి చూచాను– అని అంటున్నారు.

**(ఆళురియనాయ్)**– ఆళ్వార్లకు దాసుడనై ఉండే ప్రయోజనాన్ని పొందిన వాడనై – అని అర్థం. భగవానునకు శేషభూతులై ఉండేవారే ఈలోకంలో లేనపుడు, ఇక, ఆళ్వార్లకు శేషభూతులు కావడం ఇంకా చాలా దుర్లభం కదా!

**(నమ్బిక్కు ఆళురియనాయ్)**– ఇది వీరి ప్రణవార్థానుసంధాన క్రమం. మకారంచే నిర్దేశింపబడే జీవుడు– అకారవాచ్యుడైన భగవానునకే శేషభూతుడు– అని ప్రణవం తెల్పుతున్నది. ఆ అకారవాచ్యుడైన భగవానునకు, చరమావధియైన ఆళ్వార్లకు శేషభూతుడై ఉండడమే జీవస్వరూపం– అనేది ప్రణవంలో వీరు గ్రహించిన సారమైన అర్థం.



**(పెరియవణ్కురుకూర్)**– పరమపదం ఒక పుడిసిలి పరిమితిలోనిది– అనే రీతిలో ఉభయవిభూతులు ఒదిగి ఉండదగినట్లుగా ఉండే గొప్పతనాన్ని కల్గిన ఊరు **కురుకూర్– "పువియుమ్ ఇరు విశుమ్బుమ్ నిన్నకత్త, నీ ఎన్ శెవియిన్ వళ్లి పుకున్దు ఎన్నుళ్ళాయ్"** (పెరియ తిరువన్దాది–75) (ఈ విభూతి, విశాలమైన పరమపదం నీలో ఉన్నాయి. అటువంటి నీవు నా చెవిద్వారా నాలో ప్రవేశించి, నామనస్సులో నిలచి ఉన్నావు) అనే రీతిలో రెండు విభూతులను కల భగవానుని, విభూతులను తమలో అంతర్భవించుకొన్న ఆళ్వార్లను తనలో నిలుపుకొనే ప్రదేశం. (కురుకూర్)

**(నకర్)**– పట్టణమని అర్థం. పట్టణంలో గొప్ప వస్తువులు వెలకు లభిస్తాయి. బయటి ఊరిలో ఉన్నవారు కూడా ఇక్కడకు వచ్చి అంగళ్ళను ప్రదర్శిస్తారు. అదే రీతిలో ఈ ఊరు కూడా గొప్ప వస్తువులు వచ్చి చేరే ప్రదేశమై ఉన్నది.

**(తేవపిరానుడై క్కరియ కోల త్తిరువురు క్కాణ్బన్ నాన్... నకర్)**– ఆ తీరంలో (విరజానదికి ఆవలి తీరంలో) ఉండే నిత్యసూరులు సైతం వచ్చి అంగళ్ళను ప్రదర్శించే చోటు కురుకూర్. ఈ నగరంలో కూడా ముక్తుల వరుస విస్తరించి ఉంటుంది. **"శొన్న శొల్ నమ్బువార్ పది వైకున్దమ్ కాణ్మినే"** (మధురకవి పల్కిన వాక్కును నమ్మేవారు ఉండే చోటు వైకుంఠమే, గమనించండి) (కణ్ణినుణ్–10) అని వీరు (మధురకవులు) పల్కిన రీతిలో ఇక్కడ ఉండేవారు ముక్తప్రాయులు కదా ! నగరంలో, రత్నాలు వెలకు లభిస్తాయి. ఈ నగరంలో, **"కురవై కోత్త కుళ్లకనై మణివణ్ణనై... ఏత్తుదల్ మనమ్ వైమ్మినో"** (తిరువాయ్–3–6–3) అని (రాసక్రీడ ఆడిన సులభుడు, మణివర్ణుడైనవానిని.... స్తుతించడంలో మీ మనస్సు నిలుపండి) **"తెన్నిలఙ్గై ఎరి ఎళ్ల చ్చెత్తఱ విల్లియై... పరవుమినో"** (తిరువాయ్–3–6–2) (దక్షిణ దిక్కులోని లంకలో మంటలు ఎగసిపడేటట్లుగా దానిని నాశనం చేసిన గొప్ప విలుకాడైన శ్రీరాముని స్తుతించండి) అనే రీతిలో దేవకీపుత్రరత్నమైన శ్రీకృష్ణుడు, ఆ మణికంటే గొప్పవెల కల్గిన మాణిక్యమైన, దశరథుడు పొందిన మరకతమణి కూడా వెలకు లభించే దేశమై ఉన్నది. (కురుకూర్)

**(పెత్తఱ నమ్బియే)– "అడియార్కళ్ కుళ్లాఙ్గళ్ ఉడన్ కూడువదు ఎన్ఱుకొలో!"** (తిరువాయ్–2–3–10) (భగవద్భక్తుల సమూహంతో కూడి ఉండడం ఏనాడోకదా) అని, **"మల్కు నీలచ్చుదర్ తళ్లైప్ప"** (వర్ధిల్లే నల్లని కాంతి సమృద్ధం కాగా) అని ఆరంభించి, **"ఎన్ తిరుమార్బనై వన్దెయ్దు మాఱు అడియేన్"** (తిరువాయ్–7–6–6)

(లక్ష్మిని వక్షస్సులో గల నా స్వామిని చేరిపొందే రీతిని తెలియను) అని ఆళ్వార్లు ఆశపడినందున, వారికి ఇంకా పొందదగిన కొన్ని హితాలున్నాయి. దాసుడనైన నేను పొందగోరిన హితాన్ని అంతటినీ పొందాను కనుక, ఇక పొందవలసిన హితాలేమీ ఇక లేవు.

**(నమ్బిక్కు ఆళురియనాయ్ అడియేన్ పెற்ற నన్మైయే)** భగవానునకు దాసులై ఉండే ఆళ్వార్లు ఆ స్వామిని, ఆ స్వామి భక్తుల సమూహాన్ని పొందలేక క్లేశపడ్డారు. ఆ ఆళ్వార్లకు దాసుడనైన నేను కోరిన దానిని అంతటినీ పొందాను **"పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్"** (శాండిల్యస్మృతి–1–15) (మృగం కాని, మానవుడు కాని, పక్షి కాని– ఎవరైనా, ఒక వైష్ణవుని ఆశ్రయించినవారైతే, దానివల్లనే వారు విష్ణువుయొక్క ఆ గొప్ప స్థానాన్ని– పరమపదాన్ని– పొందుతున్నారు) అనే రీతిలో వైష్ణవులను ఆశ్రయించిన దాసులకు పరమపదంలోకి పోయి ప్రాప్యం పొందవలసి ఉన్నది. ఆ రీతిలో కాకుండా, పరమవైష్ణవులైన ఆళ్వార్లను ఆశ్రయించిన నాకు ఉన్నచోటనే ఆ సంపద లభిస్తున్నది కదా. అంటే– ఆళ్వార్లకు దాస్యం చేయడమనే గొప్ప సంపద చేజిక్కింది కదా– అని అంటున్నారు. **"వేఱాక ఏత్తి ఇరుప్పారై వెల్లుమే– మற்றవరై చ్చాత్తి యిరుప్పార్ తవమ్"** (నాన్ముకన్ తిరు –18) (హిరణ్యకశిపుని వధించిన స్వామిని విలక్షణం దైవంగా కొలిచే వారి తపస్సుకంటే, ఆభగవద్భక్తులను ఆశ్రయించిన వారి తపస్సు గొప్పది.) అనే రీతిలో భగవానుని ఆశ్రయించినవారి తపస్సు కంటే అతని భక్తులను ఆశ్రయించినవారి తపస్సు గొప్పది– అనే వైలక్షణ్యం నా విషయంలో ఫలించింది కదా!– అని తలచి ఆనందిస్తున్నారు, మధురకవులు.

**నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్కళ్,**
**పున్మైయాగ క్కరుదువర్ ఆదలిల్,**
**అన్నైయాయ్ అత్తనాయ్ ఎన్నై యాణ్డిడుమ్**
**తన్మైయాన్, శడకోపన్ ఎన్నమ్బియే.** 4

నన్మైయాల్ మిక్క = మంచి గుణాలతో గొప్పతనాన్ని కలవారై, నాల్ మఱై ఆళర్కళ్ = నాల్గు వేదాలలో సమర్థులైన వైదికులు, (ఎన్నై =దాసుడనైన నన్ను), పున్మై ఆక కరుతువర్ ఆదలిల్ = నైచ్యమే మూర్తీభవించిన వాడు – అని తలచి నన్ను ఉపేక్షిస్తారు– అనే కారణం వల్ల, అన్నై ఆయ్ = తల్లియై, అత్తన్ ఆయ్ = తండ్రియై, ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్ = నన్ను పరిగ్రహించి పాలించే స్వభావం కల్గినవారైన, శడకోపన్ = నమ్మాళ్వార్లు, ఎన్ నమ్బి = నాకు నాథులు.



పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానమ్ :

**అవ-నాలామ్ పాట్టిల్ - "ఎన్నప్పనిల్ " ఎన్ఱు కాళ్కడైక్కొణ్డ విషయత్తై, "ఆళ్వారుకన్దార్" ఎన్ఱు విరుమ్బుకై క్కడియెన్? ఎన్నిల్, ఎన్ తణ్మై ప్పారాతే ఎన్నై విషయీకరిత్త నీర్మైయై అనుసన్ధిత్తాల్, అవరుకన్ద విషయత్తై ఉకవా తొழிవనో? ఎన్న, ఉమ్ముడైయ తణ్మై ఏతు? అతు పారాతే అవర్ విషయీ కరిత్తపడి ఎన్? ఎన్న, అత్తై ప్పేశుకిఱార్.**

**వ్యాబీ - (నన్మైయాల్ ఇత్యాది) ఆత్మగుణఙ్గళాల్ ప్రచురరాయ్, సంసారి కళుక్కు అపాశ్రయభూతరాయిరుప్పారిల్ ఆళ్వారై యొழிన్దారడఙ్గ, "ఇవన్ అవస్తు" ఎన్ఱుకై విడుమ్బడియన్ఱో ఎన్నుడైయ స్థితి యిరుక్కుమ్బడి.**

**ఒరుత్తనుక్కు నన్మైయావతు - దోషగుణఙ్గళ్ ఏకాశ్రయనిష్టఙ్గళా యిరున్దాల్, దోషత్తై విట్టు గుణాంశత్తై స్వీకరిక్కై. అతిల్ మికుతి యావతు- గుణమెన్ఱు పేరిడలావతు ఒన్ఱుమిన్ఱిక్కే దోషమే యాయిరున్దాల్, అతుతానే పற்றాశాక క్కైక్కొళ్ళుకై.**

**(నాన్మఱైయాళర్కళ్) అతుక్కడియాక హితానుశాసనమ్ పణ్ణిప్పోరుకిఱ వేదఙ్గళిలే అవగాహిత్తిరుక్కుమవర్కళ్. నాలు వకైప్పట్ట వేదఙ్గళుక్కుమ్ వ్యాసపదమ్ శెలుత్తవల్లవర్కళ్. అవర్కళాకిఱార్ - శ్రీజనకరాజన్ తిరుమకళా తల్, కూరత్తాళ్వానాతల్. ఇత్తాల్ శొల్లిற்றాయిற்ఱు - వేదార్థతాత్పర్యమ్ కైప్పడుకై. అతావతు - ఆనృశంస్యప్రధానరాకై - ఎన్ఱపడి.**

**(పున్మైయాక క్కరుతువర్) పున్మై యెన్ఱు ఒరు ధర్మముమ్, అతుక్కు ఆశ్రయమాన ధర్మియు మాయిరుక్కైయన్ఱిక్కే, పున్మైతాన్ ఒరు వడివు కొణ్డతు- ఎన్ఱిరుప్పర్కళ్. పున్మైయావతు - దుఃఖమాతల్, పొల్లాఙ్గాతల్, విషయాన్తర ప్రావణ్యమాతల్, దుర్మానమాతల్. ఇతుతాన్- మేలిఱ్పాట్టిలే ప్రసక్తమాక క్కడవతు.**

(ఆతలిల్అన్నై యాయత్తనాయ్ ఎన్నై యాణ్డిడుమ్ తన్మైయాన్) అప్పన్మైయే హేతువాక, "ఇవ్వళవిల్ నామల్లతు రక్షకరిల్లై" ఎన్ఱు ఎనక్కు సర్వవిధబన్ధువుమానవర్. "త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః" ఎన్గిఱపడియే, "కాకత్తోపాతి ఇవనుక్కుమ్ పుఱమ్బోరు పఱ్ఱాశిల్లై" ఎన్ఱు అతువే హేతువాక సర్వవిధరక్షకరానవర్. ప్రియమే శెయ్యక్కడవ మాతా శెయ్యుమతువుమ్, హితమే శెయ్యక్కడవ పితా శెయ్యుమతువుమ్, స్వరూపాను రూపమాన అడిమైకొళ్ళుమ్ నాయన్ శెయ్యుమతువుమ్ శెయ్యుమవర్. "తాయాయ్ త్తన్దైయాయ్ అఱియాతన అఱివిత్త అత్తా! నీ శెయ్తన" ఎన్ఱు- భగవద్విషయత్తిల్ ఆழ్వార్ శొల్లుమతెల్లామ్ ఆழ్వార్విషయత్తిలే శొల్లుకిఱార్, ఇవర్.

(తన్మైయాన్) అగ్నిక్కు ఔష్ణ్యమ్బోలేయుమ్, జలత్తుక్కు శైత్యమ్బో లేయుమ్ ఇస్స్వభావఙ్గళై నిరూపకమాకవుడైయవర్ అతాకిఱతు - "ఇవనుక్కు ఉపకరిత్తోమ్" ఎన్ఱు తామ్ నినైత్తల్, ఇవన్దనక్కు ప్రత్యుపకారత్తిల్ ఇழி యవేణ్డియిరుత్తల్ శెయ్యాతొழிకై.

(శడకోపన్) ఎన్నక్కల్ శాఠ్యత్తై పోక్కినవర్. కీழ் మూన్ఱు పాట్టిలుమ్- "తెన్ కురుకూర్నమ్బి " ఎన్ఱు శొన్నవర్, ఇప్పాట్టిల్- " శడకోపన్" ఎన్గారితే- స్వదోషత్తై పోక్కినపడియాలే.

(ఎన్నమ్బియే) తాయ్ శెయ్వతు తమప్పన్ శెయ్యమాట్టాన్. అవన్ శెయ్వతు ఇవళ్ శెయ్యమాట్టాళ్. ఆచార్యన్ శెయ్యుమతు ఇరువరుమ్ శెయ్య మాట్టార్కళ్. నాయన్ శెయ్యుమతు అడియాన్ శెయ్యమాట్టాన్. ఎల్లార్ శెయ్ వతుమ్ శెయ్యవల్ల పూర్త్తియైయుడైయవర్. (ఎన్నమ్బియే) ఎన్నుడైయ తణ్మై యాకిఱ పాழ்న్దాఱు నిరమ్బుమ్బుడియాన పూర్త్తియైయుడైయవరెన్ను మిత్తనై. ఇవరై క్కుఱిత్తు క్కీழ் చ్చొన్న దృష్టాన్తఙ్గళుక్కు సర్వథా సామ్యమిల్లై; కర్మోపాధికమాక వన్ద సంబంధమాకైయాలుమ్, అపూర్ణస్థలమాకై యాలుమ్.



## అరుమ్బద విళక్కమ్

నాలామ్పాట్టు : అవతారికై :- కీழ்ప్పాట్టుక్కుమ్ ఇప్పాట్టుక్కుమ్ శఙ్కాపరిహార రూపేణ సఙ్గతి అరుళిచ్చెయ్కిఱార్ (ఎన్నప్పనిల్- ఇత్యాది). "ఎన్నప్పనిల్" ఎన్గతు - "తేవు మఱ్ఱఱియేన్" ఎన్గతుక్కు ఉపలక్షణమ్. (ఉకన్దార్) ఎన్గ అనన్తరమ్ 'ఆకిలుమ్"- ఎన్ఱు అధ్యాహార్యమ్. ఆకైయాల్ ఆழ்వారుక్కై విరుమ్బుకైక్కు అడియాయిరుక్క (అడియేన్ ఎన్? ఎన్నిల్) ఎన్గిఱ శఙ్కై ఉదియాతెన్గిఱతు పరిహృతమ్. "పున్మైయాక క్కరుతువరాతలిల్" ఎన్గతై క్కటాక్షిత్తు, ఎన్నుడైయ నికర్షమే పఱ్ఱాశాక అఙ్గీకరిత్త ఆழ்వారుడైయ సౌలభ్యమ్ అవరుకన్ద విషయమెన్గాకిలుమ్ పఱ్ఱుకైక్కు హేతువెన్ఱు పరిహరిక్కిఱార్ (ఎన్ తణ్మై యిత్యాది). (ఎన్ తణ్మై పారాతే) "అతువే పఱ్ఱాశాక" ఎన్ఱు కూట్టువతు. (ఒழிవేనో ? ఎన్న) ఎన్గతు- ఇప్పడి ఉత్తరమరుళిచ్చెయ్య -ఎన్గపడి.

వ్యాఖ్యానమ్ :- నాన్మఱైయాళర్కళాకైయాలే నన్మైయాల్ మిక్కవర్కళెన్గాయ్, అత్తాలే ఉత్తారకరెన్ఱు ఫలితార్థమరుళిచ్చెయ్కిఱార్ (ఆత్మగుణఙ్గళాలిత్యాది). ఆత్మగుణఙ్గళ్- ఆనృశంస్యాదికళ్. పున్మైయాక క్కరుతుకిఱ ఇవర్కళిల్ ఆழ்వారైయుమ్ అన్తర్భూతరాక్కినాల్, మేలే "ఎన్నై యాణ్డిడుమ్" ఎన్నక్కూడామైయాలే (ఆழ்వారై యొழிన్దార్) ఎన్ఱు శొల్లుకిఱార్ (అదఙ్గ) కృత్స్నమ్. నాన్మఱైయాళర్కళ్ ఎల్లారుమ్

"నన్మైయాల్ మిక్క" ఎన్గతై వివరిక్కిఱార్ (ఒరుత్తనుక్కు - ఇత్యాదివాక్యద్వ యత్తాలే) (పఱ్ఱాశాక) హేతువాక. తాత్పర్యార్థమ్ (అతుక్కిత్యాది). అతుక్కు- పఱ్ఱాశాక క్కొళ్ళుకైక్కు. శబ్దార్థకథనముఖేన "ఆళర్కళ్" ఎన్గతుక్కు త్తాత్పర్య మరుళిచ్చెయ్కిఱార్ (నాలువకై ఇత్యాది). వ్యాసపదమ్- అఖణ్డమాన వేదత్తై అర్థత్తిన్ పడియే శాఖాకాణ్డాది రూపేణ విభజిక్కిఱ వ్యాసరుడైయ అధికారమ్. (అవర్కళాకిఱార్) ఎన్గతు- నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్కళాకిఱార్-ఎన్గపడి. ఉక్తార్థనిగమనమ్ (ఇత్తాలిత్యాది). వేదార్థతాత్పర్యత్తిన్పడియే అనుష్ఠిక్కవల్లవర్కళా-యిరుక్కై-ఎన్గపడి. (ఆనృశంస్యమ్)- సర్వభూతానుకూలాచరణమ్.

పున్మైశబ్దార్థమాకైయాలే దు:ఖమాతలెన్గతు- ఇవ్విడత్తుక్కు వివక్షితమన్ఱు; మేల్ పాట్టిల్ దుఃఖత్తై యుపపాదియామైయాలే. (దు:ఖమ్) పాపఫలమ్.(పొల్లాఙ్గు)-పాపమ్.

**తాత్పర్యార్థమ్ (అప్పున్మైయే – యిత్యాది). ఎల్లారుక్కుమ్ త్యాగహేతువాన పున్మై ఇవరుక్కు రక్షిక్కైక్కు హేతువాన పడియై ఉపపాదిక్కిఱార్ (త్రీన్ లోకానిత్యాది) అన్నైయాయ్ – ఇత్యాదిక్కు గౌణవృత్తియాలే శబ్దార్థమ్ (ప్రియమే- యిత్యాది). నాయన్– సర్వేశ్వరన్. వ్యాఖ్యాతా ఈడుపడుకిఱార్ (తాయాయిత్యాది).**

**“తన్మైయాన్” ఎన్గత్తై కీழ్ చ్చొన్న మూన్ఱు పదజ్గళిలుమ్ కూట్టి త్తాత్పర్యమ్ (అగ్నిక్కిత్యాది). ఇస్స్వభావజ్గళై నిరూపకమాక చ్చొన్నత్తాల్ ఫలితమ్ (అతాకిఱతిత్యాది). శార్యత్తై ప్పోక్కినతుక్కు జ్ఞాపకమెన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (కీழిత్యాదియాలే).**

**పదాన్తరమ్ శొల్లాతే, “నమ్బి” ఎన్గతుక్కు త్తాత్పర్యమ్ అరుళిచ్చెయ్కిఱార్ (తాయెన్ఱు తొడజ్గి అజ్ఞ వాక్యత్తాలే). (ఆచార్యన్) ఎన్గిఱ వాక్యతుక్కు, “శడకోపన్” ఎన్గతు– ఎన్ అజ్ఞానత్తై ప్పోక్కినవర్ ఎన్గైయాలే –ఎన్ఱు కరుత్తు. “నమ్బి” ఎన్గతుక్కు కీழ్ చ్చొన్నవర్కళోడు సామ్యమ్ శొన్నార్. అవర్కళిలుమ్ ఆధిక్యమాక అర్థాన్తరమ్ (ఎన్నుడైయ –ఇత్యాది). (పాழ్న్దాఱు) పడుకుழி. అతావతు– తమ్ముడైయ దోషజ్గాళాకిఱ వఞ్చకమాన పడుకుழియై త్తుఱ్ఱు ప్పోకడుకైక్కీడాన కృపాదిగుణపూర్తియై యుడైయవర్ –ఎన్గై. ఆధిక్యత్తై ఉపపాదిక్కిఱార్ (ఇవరై–యిత్యాది). “నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్కళ్ ఎన్నై పున్మైయాక క్కరుదువర్ ఆదలిల్ శడకోపన్ ఎన్నమ్బియే ఎన్నై అన్నైయాయ్ అత్తనాయ్ ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్” ఎన్ఱు అన్వయమ్. ఆక, కాఱ్ఱుడైక్కొణ్ణ భగవద్విషయత్తైయుమ్, సర్వప్రకారోపకారకరాన ఆழ్వారై యిట్టు ఉకవాదొழివానో? ఎన్ఱు కరుత్తు.**

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**నాల్గవ పాశురం – అవతారిక : “తేవు మఱ్ఱఱియేన్”** (కణ్ణినుణ్–2) అని అంటూ తాము చేయివిడచిన భగవద్విషయాన్ని, **“పెరుమాయన్ ఎన్ అప్పనిల్”** (కణ్ణినుణ్–1) అని, **“తిరువురు క్కాణ్బన్”** (కణ్ణినుణ్–3) అని– ఆழ్వార్లు అభిమానించారు– అనే కారణంచేత అభిలషించడానికి ఏమి కారణం? – అనే ప్రశ్న రాగా, దానికి సమాధానంగా “నా నైచ్యాన్ని ఏమీ గమనించకుండా, నన్ను దాసునిగా పరిగ్రహించిన ఆழ్వార్ల సౌలభ్యాన్ని భావిస్తే, ఆ ఆழ్వార్లు అభిమానించిన భగవద్విషయాన్ని నేను అభిమానించకుండా ఉండగలనా ?” అని మధురకవి ఆழ్వార్లు



అన్నారు. అపుడు, “మీకు ఏమి నైచ్యం ఉన్నది? దానిని చూడకుండా ఏ రీతిలో ఆழ్వార్లు మిమ్మలను పరిగ్రహించారు?” – అనే ప్రశ్నకు సమాధానాన్ని ఈ పాశురంలో మధురకవులు పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్ : (నన్మైయాల్ మిక్క నాన్మఱై యాళర్కళ్ పున్మైయాక క్కరుదువర్)–** “ఆత్మగుణాలతో నిండినవారై, సంసారులందఱికి ఆశ్రయభూతులై ఉండేవారిలో, ఆழ్వార్లు తప్ప మిగిలినవారందఱిచేత “ఇతడు నైచ్యమే మూర్తీభవించినవాడు; సత్తను కలవాడు కాడు” అని పరిత్యజించే రీతిలో కదా నా స్థితి ఉన్నది. నాల్గు వేదాలలో సమర్థులైనందున వారు సద్గుణాలతో నిండిన గొప్పతనాన్ని కలవారు. అందువల్ల అందఱికి వారు ఆశ్రయణీయులు. ఆழ్వార్లుకూడా ఈ గోష్ఠిలో చేరినవారైనా, ఈ పాశురంలోని ఉత్తరార్ధంలో వారు తమను పాలించినట్లుగా చెప్పబడడంచేత, ఇక్కడ, ఆழ్వార్లు తప్ప మిగిలిన చతుర్వేదవిదులనే అర్థాన్ని ఈ ప్రయోగం తెల్పుతున్నదని చెప్పాలి.

**(నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్కళ్) –** వీరికి గల **“నన్మై”** గొప్పతనం ఏమంటే– ఒకనివద్ద కొన్ని దోషాలు, గుణాలు ఉంటే, దోషాలను విడచి, గుణాలను మాత్రం గ్రహించడమే. **“నన్మై మిక్క”** అంటే– వాస్తవానికి గుణాలు ఏమీ లేనివాడై, గుణం అని అంటూ ఏదైనా ఒక విధంగా పేరు పెట్టదగినట్లుగా ఉండే ఏ మంచి స్వభావాన్ని కూడా కల్గి ఉండకుండా, దోషాలే ఒకనిలో నిండి ఉంటే, “అటువంటివానిని నేను రక్షించకపోతే, వేఱెవరు రక్షిస్తారు?” అని తలచి, అతని ఆ దోషాలే కారణంగా పరిగ్రహించడం. ఇటువంటి గొప్పతనంతో నిండిన చతుర్వేదవిదులు సైతం చేయి విడిచే రీతిలోని అవధిలో నేను గొప్ప నైచ్యాన్ని కల్గిఉన్నాను– అని అంటున్నారు (మధురకవులు).

**(నాన్మఱైయాళర్కళ్) –** “చాలా అధములను కూడా పరిగ్రహించి సంస్కరించాలి” అని హితాన్ని విధించే వేదాలలో అవగాహించినవారిని **“నాన్మఱైయై ఆళ్బవర్కళ్”** (నాల్గు వేదాలను పాలించేవారు) అని అంటున్నారు. అంటే– విభాగింపబడకుండా ఒకటిగా ఉండే వేదాన్ని **ఋక్, యజుస్, సామ, అథర్వణా**లనే నాల్గు వేదాలుగాను, వాటిలో, ఒక్కొక్క వేదంలో గల శాఖలు, కాండాలు మొదలైన విభాగాలుగాను విభాగించిన వేదవ్యాసుని యోగ్యతవంటి యోగ్యతను కలవారు–అని అర్థం. వీరికి ఉదాహరణం–**“న కశ్చిన్నాపరాధ్యతి”** (రామా–యుద్ధ–116–44)

(దోషాలను చేయని వారెవరూ లేరు) అని అంటూ రాక్షసస్త్రీలను సైతం కాపాడిన జానకీదేవి, **"నాన్ పెఱ్ఱ పేఱు నాలూరానుమ్ పెఱవేణుమ్"** (నేను పొందిన ఫలాన్ని నాలూరాన్ కూడా పొందాలి) అని పల్కిన కూరేశులవంటివారు. అంటే– ఇటువంటి నైచ్యాన్ని కలవారి పట్ల కరుణను చూపాలి– అనే వేదతాత్పర్యాన్ని గ్రహించినవారు, వీరు– అని భావం. అటువంటివారుకూడా నన్ను విడచిపెట్టారు – అని అంటున్నారు, ఇకపై.

**(పున్మైయాక క్కరుదువర్) –"పున్మై"** అనేది నైచ్యాన్ని తెలిపే ఒక స్వభావం. ఇటువంటి స్వభావానికి ఆశ్రయమైన ఒక మానవునిగా నన్ను భావించకుండా, **"పున్మై"** అనే నైచ్యమే రూపాన్ని పొందిన ఒక వస్తువు"– అని నన్ను భావిస్తారు. **"పున్మై"** అనే పదం– క్లేశాన్నిగాని, ఆ క్లేశానికి కారణమైన పాపాన్నిగాని, శబ్దాది లౌకిక విషయాలలోని అభినివేశాన్నిగాని, అహంకారమనబడే గర్వాన్ని కాని తెల్పుతుంది. ఈ విషయాన్ని తరువాత పాశురంలోని పూర్వార్థంలో ఆళ్వారే చాలా స్పష్టంగా పల్కుతున్నారు.

**(ఆదలిల్ అన్నైయాయ్ అత్తనాయ్ ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్)–** సద్గుణాలతో గొప్పతనాన్ని కల చతుర్వేదార్థపాలకులు **"నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్కళ్"** నన్ను చేయి విడువడానికి కారణమైన ఆ నైచ్యమే (**"పున్మై"**) కారణంగా, "ఇతనిని నేను కూడా విడచిపెడితే ఇతనిని కాపాడేవారెవరు?" అని నాకు తల్లి, తండ్రి మొదలైన అన్నివిధాలైన బంధువై రక్షించినవారు. **"స పితా చ పరిత్యక్తః సురైశ్చ స మహర్షిభిః, త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః"** (రామా–సుందర–38–33) (ఆ కాకాసురుడు, తన తండ్రిచే, తల్లిచే, మహర్షులతోపాటుగా దేవతలచే విడువబడినవాడై, ముల్లోకాలను చుట్టి తిరిగి, చివరకు ఆ శ్రీరామునే శరణు పొందాడు) అనే రీతిలోని కాకాసురునివలె వీరికికూడా వేఱు రక్షకులు ఎవరూ లేరు– అని తలచి, నా కారణం వల్ల అన్ని రీతులలో రక్షించారు.

**(అన్మైయాయ్ అత్తనాయ్ ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్)–** ప్రియాన్నే ఆచరించే తల్లి చేసే పనిని, హితాన్నే చేసే తండ్రి చేసే పనిని, స్వరూపానికి తగిన రీతిలో దాస్యాన్ని పరిగ్రహించే స్వామి చేసే పనిని చేసేవారు– అని అర్థం. **"తాయాయ్ తన్దైయాయ్"** (తల్లివై, తండ్రివై), **"అతియాదన అతివిత్త అత్తా ! నీ శెయ్దన"** (తిరువాయ్–2–3–2) (అజ్ఞాతజ్ఞానాన్ని చేసిన స్వామీ ! నీవు చేసినవి) అని



ఆళ్వార్లు, భగవానుడు తమకు అన్ని విధాలైన బంధువై, ఉపకారం చేశాడు– అని పల్కినట్లే, వీరు ఆళ్వార్ల విషయంలో పల్కుతున్నారు.

**(తన్మైయాన్)–** ఈవిధంగా అన్నివిధాలైన బంధువై ఉండే స్వభావం వీరికి (ఆళ్వార్లకు) సహజమైనది– అని అంటున్నారు. అగ్నికి దహించే స్వభావంవలె, నీటికి చల్లదనంవలె, ఈ స్వభావం వీరి స్వరూపాన్ని నిరూపించే సహజమైన గుణమని భావం. దీనివల్ల, "ఇతనికి సహాయపడ్డాను" అని సహాయపడేవాడు భావించడంలేదు; ఉపకారం పొందినవాడు ప్రత్యుపకారం చేయవలసిన అక్కరలేదు" అని తెలుపబడుతున్నది.

**(శడకోపన్)–** నాశఠత్వాన్ని (అజ్ఞుడనై ఉండే స్వభావాన్ని) పోగొట్టారు– అని శఠకోపనామతాత్పర్యం. తమ శఠాన్ని పోగొట్టారు– అని తెలుపడంకోసం ఇక్కడ మధురకవులు ఈశఠకోప తిరునామాన్ని ప్రయోగించారు. గడచిన మూడు పాశురాలలో **"తెన్‌కురుకూర్"** అని ఊరును పురస్కరించుకొని పల్కిన మధురకవులు, ఈ పాశురంలో **"శఠకోపన్"** అని ఏతన్నామపురస్సరంగా పల్కడం– తమ దోషాలను పోగొట్టినవారు –అనే భావంతోనే.

**(ఎన్ నమ్బియే)–** నా గుణపూర్ణులు– అని అర్థం. **"అన్నైయాయ్ అత్తనాయ్"** (తల్లియై, తండ్రియై) అని పల్కడంతో తృప్తిని పొందకుండా, వీరి పూర్తి చాలా గొప్పది– అని అంటున్నారు. అంటే –తల్లి చేసే ప్రియాన్ని, తండ్రి చేయడు. తండ్రి చేసేదానిని తల్లి చేయదు. ఆచార్యుడు చేసే మంచిని తల్లిదండ్రులు చేయరు. నాథుడు (స్వామి) చేసేదానిని దాసుడు చేయలేడు. వీరు అందఱు చేసేదానిని తాము ఒక్కరే చేయగల్గిన పూర్ణత్వాన్ని ఆళ్వార్లు కల్గినవారు– అని అంటున్నారు.

**(ఎన్‌నమ్బియే)–** నా నైచ్యమనే పాడుగోయి నిండే రీతిలోని కరుణాప్రవాహ పూర్తిని కలవారు– అని దీనికి అర్థాన్ని చెప్పాలి– **"అన్నైయాయ్ అత్తనాయ్"** అని ఆరంభించి పల్కిన ఉదాహరణాలకు వీరితో (ఆళ్వార్లతో) పూర్తి సామ్యం లేదు ఎందువల్ల? అంటే, ఈ సంబంధాలు అన్నీ కర్మమూలకంగా వచ్చినవి కనుక; గుణపూర్తిని కల్గినవి కానందువల్ల.

ఈవిధంగా ఆళ్వార్లు తమకు చేసిన ఉపకారాన్ని గమనించినపుడు, **"తేవు మఱ్ఱఱియేన్"** అని అంటూ నేను విడచిపెట్టిన భగవద్విషయాన్ని, అన్ని రీతులలో

ఉపకారకులైన ఆళ్వార్లను దృష్టిలోపెట్టుకొని ఆదరించి ఆనందించకుండా ఉండడం సాధ్యం కాదు– అని తాత్పర్యం.

**నఞ్జీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవతారిక :** మూడవ పాశురంలో పల్కిన రీతిలో "ఆళ్వార్లు మిమ్ములను దాసులుగా స్వీకరించడానికి, మీవద్ద ఉండే ఉపాయానుష్ఠానం ఏమి?" అని ప్రశ్న లేవగా, "సత్పురుషులు అందఱు నా చేయి విడచిపెట్టే విధంగా జ్ఞానశూన్యుడనై ఉండడమే నావద్ద ఉండే – **"కైమ్ముదల్"**– నా చేతిలో ఉండే మొదటి పెట్టుబడి" అని అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ : (నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్కళ్)** ఇతరుల దుఖాన్ని చూచి సహించలేనివారై, ఇతరులు ఉజ్జీవించడమే తమ ఉజ్జీవనంగా భావిస్తూ ఉండేవారు. **"పూర్వభాషీ ప్రసన్నాత్మా"** (ముందుగా పలుకరించేవాడు, స్వచ్ఛమైన మనస్సును కలవాడు) అని, **"విమలమతి రమత్సరః ప్రశాంతః శుచిచరితోఽఖిలసత్త్వమిత్ర భూతః, ప్రియహితవచనోఽస్తమానమాయో వసతి సదా హృది తస్య వాసుదేవః"** (విష్ణువు–3–7–24) (మాలిన్యం లేని బుద్ధిని కలవాడై, మాత్సర్యాన్ని లేనివాడై, మిక్కిలి శాంతగుణాన్ని, ఇంద్రియనిగ్రహాన్ని కలవాడై, పరిశుద్ధమైన వర్తనాన్ని కలవాడై, ఆత్మలన్నిటికి మిత్రమై, ప్రియంగా, హితంగా పలికేవాడై, ప్రకృతి సంబంధాన్ని లేకుండా చేసికొనేవాడైన మహాత్ముని హృదయంలో వాసుదేవుడు సదా నివసిస్తాడు) అని ఇతిహాస– పురాణాలలో చెప్పబడిన మహనీయుల లక్షణాలను అన్నిటిని కలవారు. దోషాన్ని కలవారిపట్ల కూడా కరుణను చూపే కూరేశులు, ఆణ్డాళ్, సీతాదేవివంటివారు (వీరు)

**(నాన్మఱైయాళర్కళ్)** – వేదాలు విధించినవానిని ఆచరించే వైలక్షణ్యాన్ని కలవారు.

**(శడకోపన్ ఎన్ నమ్బియే)–** తల్లిగర్భంలో ఉన్నపుడే జ్ఞానాన్ని ఆవరించే శఠమనే వాయువుపట్ల కోపించి, తఱిమి కొట్టినందున శఠకోపులనే పేరును పొందినవారు. ఈ విధంగా తమ దోషాన్ని పోగొట్టుకోవడమే కాకుండా, నా దోషాన్ని కూడా పోగొట్టిన గుణపూర్ణులు– అని (హార్ద) భావం.



**నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

అవ : **"తేవు మఱ్ఱఱియేన్", "పెరియవణ్ కురుకూర్ నకర్ నమ్బిక్కు ఆళ రియనాయ్ అడియేన్ పెఱ్ఱ నన్మైయే"** అని అంటూ మధురకవులు పల్కిన సూక్తులను ఆలకించినవారు **"సర్వేషామేవ లోకానాం పితా మాతా చ మాధవః, గచ్ఛధ్వమేనం శరణం శరణ్యం పురుషర్షభాః !"** (భారత– ఆరణ్య–192–58) (ఓ పురుషశ్రేష్ఠులారా! అన్ని లోకాలకు తండ్రి, తల్లి శ్రియఃపతియే. శరణు పొందదగిన ఇతనిని మీరు శరణువేడండి) అని, **"పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః, వేద్యం పవిత్ర మోంకార: ఋక్సామయజు రేవ చ"** (గీత–9–17) (ఈ లోకానికి తల్లి, తండ్రి, ధరించేవాడు, తాత, వేదంలో తెలియబడేది, పరిశుద్ధిని కల్గించేది, ప్రణవం, ఋగ్యజుస్సామరూపమైన వేదం– అన్నీ నేనే) అని, **"ఉలకుక్కోర్ మున్నై తాయ్ తన్దైయే"** (తిరువాయ్–5–7–7) (లోకానికి అద్వితీయుడైన తాత, తల్లి, తండ్రి) అని ఋషులు, ఆళ్వార్లు, స్వయంగా ఆ భగవానుడు ఏకకంఠంగా "సర్వేశ్వరుడే అన్నిలోకాలకు తల్లి, తండ్రి మొదలైన సర్వవిధబంధువు" అని పల్కుతున్నారు. అటువంటి భగవానుని ఆశ్రయించవచ్చు కదా ! లేక, **"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః"** (గీత–7–19) (పలు పుణ్యజన్మలను ఎత్తిన తరువాత జ్ఞాని అయినవాడు "వాసుదేవుడే నాకు సర్వస్వం" అని నన్ను ఉపాసిస్తాడు. అటువంటి మహాపురుషుడు చాలా దుర్లభుడు) అని **"కట్టుణ్ణ ప్పణ్ణియ ప్పెరుమాయన్"** (బంధింపబడేటట్లు చేసికొన్న ఆ గొప్ప ఆశ్చర్యకరచేష్టితుడు), **"పెరుమక్కళ్"** (గొప్పవ్యక్తులు) (తిరువాయ్–3–7–5) అని, **''శిఱుమామనిశర్''** (రూపంలో చిన్నవారై, మహిమలో గొప్పవారు) (తిరువాయ్–8–10–3) అని ఆళ్వార్లు సైతం పొగడే రీతిలోని మహాత్ములైన జ్ఞానులను ఆశ్రయించవచ్చుకదా ! వారిని విడచి, వీరిని (ఆళ్వార్లను) ఆశ్రయించడానికి కారణమేమి ? అనే ప్రశ్న రాగా, "వారుకూడా నా నైచ్యాన్ని చూచి నన్ను విడచిపెట్టిన సమయంలో, నా తక్కువదనాన్నే గమనించి, నన్ను పరిగ్రహించినవారైనందున వీరే (ఆళ్వార్లే) నాకు ఉద్దేశ్యభూతులు" అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్య : (నన్మైయాల్ మిక్క)–** "దీనికి మించి ఇంకొకటి లేదు"– అనే రీతిలో మంచితనంలో గొప్పవారు. భగవానుని దాసులను **"నలత్తాల్ మిక్కార్"** (తిరువాయ్–5–8–3) (మంచితనంలో గొప్పవారు) అని ఆళ్వార్లు పలుకగా

మధురకవులు విన్నారు. అందువల్ల వారిని **"నన్మైయాల్ మిక్క"** అని వీరు (మధురకవులు) కూడా అంటున్నారు. మంచితనం కలువని చెడ్డస్వభావం ఏమంటే– ఏకారణం లేకుండా భగవానుని విభూతి అయిన అన్యులకు హానిని చేయడం. మంచితనమంటే– అటువంటివారికి కూడా హానిని చేయకుండా ఉండడం. తన విషయంలో ఏ కారణం లేకుండా హానిని చేసేవారి విషయంలో కూడా వారు చేసే పనిని లెక్కించకుండా ఉండడం– మంచితనంలో అతిశయించి ఉండడం **"నన్మైయాల్ మిక్కిరుక్కై"** అంటే– **"అపకారిష్వపి సదా సాధుః సాధుః సాధ్వేవ వర్తతే"** (హానిని చేసేవారి విషయంలో కూడా సత్పురుషుడు ఎల్లప్పుడు మంచివాడుగానే ఉంటాడు) అనే రీతిలో ఆవిధంగా అపకారాన్ని చేసేవారికికూడా ఉపకారం చేసేవాడై ఉండడం. వీరు ఈవిధంగా ఉండడానికి గల కారణాన్ని తెల్పుతున్నది– **"నాన్మఱైయాళర్కళ్"** అనే ప్రయోగం. **"మాతాపితృసహస్రేభ్యో వత్సలతరం శాస్త్రమ్"** (వేలాది తల్లిదండ్రులకు గల వాత్సల్యం కంటె ఎక్కువ వాత్సల్యాన్ని కల్గినది, వేదమనబడే శాస్త్రం) అని, **"నలజ్ఞళాయ నఱ్కలైకళ్"** (తిరుచ్చంద–90) అని, అపరాధాలను చేసేవారి చేయి విడువకుండా, వారికి కూడా హితాన్ని ఉపదేశించే వేదంలో గల సంబంధమే వీరిని **"నన్మైయాల్ మిక్కవర్"**గా చేస్తున్నది. **"నన్మైయాల్మిక్క", "నాన్మఱైయాళర్కళ్"** అనే రెండు ప్రయోగాలు **"శ్రోత్రియం, బ్రహ్మనిష్ఠమ్"** (ముండక–1–2–12) (వేదాంతాన్ని తెలిసినవాడు, బ్రహ్మసాక్షాత్కారాన్ని పొందినవాడైన ఆచార్యునే ఆశ్రయించాలి) అని చెప్పబడిన రెండు ఆచార్యలక్షణాలను తెల్పుతున్నది. లేక, **"నన్మైయాల్ మిక్క"** అనే ప్రయోగాన్ని **"నాన్మఱై"**కు (నాల్గు వేదాలకు) విశేషణంగా గ్రహించి, నిత్యమై ఉండడం, దోషరహితమై ఉండడం– మొదలైన గుణాలను కల వేదాలు– అనే అర్థాన్ని గ్రహించవచ్చు. అటువంటి వేదంయొక్క అర్థాన్ని తెలిసినవారు– **"నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్కళ్"** అనబడుతున్నారు. రాక్షసస్త్రీలపట్ల కరుణను చూపిన సీతాదేవి, నాలూరాన్‌పట్ల కరుణను చూపిన కూరేశులు, తనకు హానిని చేసిన పురోహితుడు, తండ్రి మొదలైనవారి పట్ల కరుణతో మంచిని చేసిన ప్రహ్లాదుడు వంటివారు –వీరు.

**(పున్మైయాక క్కరుదువర్)** – నైచ్యమే మూర్తీభవించినవానినిగా నన్ను భావిస్తారు. **"ఎన్నతావి యెన్నుమ్ వల్‌వినై"** (తిరుచ్చంద–119) అనే రీతిలో నైచ్యంగానే నన్ను తలుస్తారు.



**(కరుదువర్)**– తమ నైచ్యంకూడా వీరిని (మధురకవులను) అంతగా బాధించలేదు. వారు తమను దూరం చేయడమే వీరిని ఎక్కువగా బాధించింది. (ఏవిధంగా ? అంటే)– **"హతోఽస్మి యది మామేవం భగవానపి మన్యతే"** (రామా– అయో–90–15) (ఓ భరద్వాజా ! నీవు కూడా నన్ను అటువంటివానినిగా తలిస్తే నేను వధింపబడినవాడనే కాగలను) అని భరద్వాజుని ఉద్దేశించి భరతుడు పల్కినట్లుగా.

**(అన్నైయాయ్ అత్తనాయ్)**– **"అత్తనాకి అన్నైయాకి"** (తిరుచ్చంద–115) (తండ్రియై, తల్లియై) అనే భగవానునివలె– మొదట హితాన్ని చేయడంకోసం తండ్రివలె, దండనను విధించి సంస్కరించి, తరువాత తల్లివలె తాము కోరినదానిని ఇచ్చేవానివలె కాకుండా, ముందుగానే తల్లివలె ప్రియాన్ని చేసేవారై, తరువాత హితాన్నికూడా చేస్తారు– అని భావం. మొదట భగవానుని గొప్పతనాన్ని గూర్చిపల్కి నన్ను సంస్కరించి, ఆ పిమ్మట నేను ప్రవర్తించదగిన రీతిని (ఆళ్వార్లు) ఉపదేశించారు.

**(ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్)**– (లోకంలోని) తల్లిదండ్రులు చేసేదానిని చేయడంతోపాటు, స్వామి చేసే దానిని కూడా చేశారు. **"అత్తనాకి అన్నైయాకి ఆళుమ్ ఎమ్బిరానుమాయ్"** (తిరుచ్చంద–115) (తండ్రియై, తల్లియై, రక్షించే స్వామియై) అని అంటూ తిరుమழிశై ఆళ్వార్ భగవానుని ఉద్దేశించి అనుసంధించినట్లుగానే, వీరు ఆళ్వార్ల విషయంలో అనుసంధిస్తున్నారు.

**(ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్)**– తాము (ఆళ్వార్లు) తిరువాయ్‌మొழிని అనుగ్రహించేటపుడు, నన్ను దానిని గ్రంథస్థం చేయమని పల్కి, నానుండి తగిన కైంకర్యాన్ని పరిగ్రహించారు.

**(ఎన్నై ఆణ్డిడుమ్)**– నేను **"పొలిన్దు నిన్ఱ పిరాన్"** ను(ఆళ్వార్ తిరునగరిలోని స్వామిని) లెక్కించకుండా ఉండడాన్ని చూచి, "ఆ స్వామిని సేవించడంకోసం ఒక పర్యాయం వెళ్ళిరండి" అని ఉపదేశించారు"– అని పిళ్ళై అన్నారు. (ఇక్కడ **"పిళ్ళై"** అనే పదం నాయనార్‌కు తండ్రిగారైన వడక్కు త్తిరువీది పిళ్ళైను నిర్దేశిస్తుంది).

**(నన్మైయాల్)**– ఆ రీతిలో భక్తులను (దాసులను) రక్షించడం ఆళ్వార్లకు సహజమై ఉన్నది. ఆళ్వార్ల సంబంధాన్ని చూచి, దాస్యాన్ని పరిగ్రహించడంవల్ల భగవానునకు ఇది సహజమై ఉన్నది.

**(ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్ శడకోపన్)– “అవనడియార్ శిఱు మామనిశరాయ్ ఎన్నై ఆణ్డార్”** (భగవానుని దాసులు రూపంలో చిన్నవారైనా, మహిమలో గొప్పవారై, నన్ను రక్షించారు) (తిరువాయ్–8–10–3) అని తమను రక్షించినవారని అన్నారు– నమ్మాళ్వార్లు. వీరు (మధుర కవులు)– తమను ఆళ్వార్లు రక్షించారని అంటున్నారు.

**(ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్ శడకోపన్)–** నా శార్యాన్ని పోగొట్టి రక్షించి, శఠకోపులనే బిరుదును పొందారు.

**(ఎన్ నమ్బియే)–** సాత్త్వికులందఱిచేత విడువబడిన నన్ను అంగీకరించి, అప్రియాలలోను, అహితాలలోను అలవాటు పడి వర్తించే నన్ను ప్రియాలలో, హితాలలో మాత్రమే ప్రవర్తించేటట్లుచేసి, ఏ ఉపకారాన్ని చేయని నానుండి (కరుణతో) కైంకర్యాన్ని పరిగ్రహించిన పూర్ణతను కల్గినవారు ఆళ్వార్లే కదా !– అనే తమ సిద్ధాంతాన్ని ద్రఢీకరిస్తున్నారు.

**నమ్బినేన్ పిఱర్ నన్ పొరుళ్ తన్నైయుమ్,**
**నమ్బినేన్ మడవారైయు మున్నెలామ్,**
**శెమ్ పొన్మాడ త్తిరుక్కురుగూర్ నమ్బిక్కు**
**అన్బనాయ్, అడియేన్ శదిర్త్తేన్ ఇన్ఱే.** 5

అడియేన్ = (ఈనాడు **“అడియేన్”** అని పలికేటట్లుగా ఉండే) నేను, మున్ ఎలామ్ = (ఆళ్వార్ల అనుగ్రహాన్ని పొందడానికి), పూర్వం అంతా, పిఱర్ = ఇతరుల, నన్ పొరుళ్ తన్నైయుమ్ = మంచివస్తువులను, నమ్బినేన్ = ఆశపడుతూ ఉన్నాను, (పిఱర్) మడవారైయుమ్ = ఇతరుల స్త్రీలను, నమ్బినేన్ = ఆశపడ్డాను, ఇన్ఱు = ఇపుడు, శెమ్ పొన్ మాడమ్ = స్పృహణీయమైన, బంగారంతో చేయబడిన మేడలను కల, తిరు క్కురుకూర్ నమ్బిక్కు = తిరుగనరికి నాథులైన ఆళ్వార్లకు, అన్బన్ ఆయ్ = భక్తుడనై, శదిర్త్తేన్ = చాతుర్యాన్ని కలవాడను అయ్యాను.

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్ :

**అవ-అఙ్ఞామ్బాట్టిల్ - ఉమ్మై ప్పున్మై యాకవుమ్, ఉమక్కు ఆళ్వార్ సర్వప్రకారత్తాలు ముపకారకరాకవుమ్ శొన్నీర్. ఉమ్ముడైయ పున్మైయైయుమ్, ఉమక్కు ఆళ్వార్ ఉపకరిత్త నన్మైయైయుమ్ శొల్లిక్కాణీర్ ఎన్న, చ్చొల్లుకిఱార్.**



**వ్యా- (నమ్బినేన్-ఇత్యాది) ఇతు ఎన్నుడైయ పున్మై యిరున్దపడి. (పిఱర్ నన్పొరుళ్ నమ్బినేన్) పిఱరెన్గిఱతు - సర్వేశ్వరనై. నన్పొరుళెన్గిఱతు - ఆత్మవస్తువై. త్రివిధాత్మవర్గత్తుక్కు మవ్వరుకాయ్, సజాతీయమాన వైలక్షణ్యత్తై యుడైయవనాకైయాలే - పిఱర్ ఎన్గిఱతు. “ఉత్తమః పురుష స్త్వన్యః” ఎన్నక్కడవతిఱే. పొరుళెన్ఱు- ద్రవ్యమ్. నన్పొరుళెన్ఱు - విలక్షణమాన ఆత్మ వస్తు. “ద్రవ్యాణి నవ తే విదుః” ఎన్ఱు - ద్రవ్యఙ్గళిల్ ప్రధానమాక ఆత్మవస్తువై నిశ్చయిత్తార్కళిఱే. అత్తైయిఱే మున్బు నాన్ అపహరిత్తతు. నమ్బుతల్ - ఆశైప్పడుతల్. పరద్రవ్యత్తై యాశైప్పడుకైయిఱే - అపహారమానతు. “వన్కళ్వన్” ఎన్ఱుమ్, “కళ్వనానేన్” ఎన్ఱుమ్ ఆళ్వార్కళ్అనుసన్ధిత్తతిఱే ఇవర్క్కు ముతల్. “కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా”- ముదల్ భగవచ్ఛేషత్వత్తళవిల్ నిల్లాతే, శేషత్వకాష్ఠైయిలే నిఱ్కిఱ ఆత్మవస్తువైక్కిడీర్ నాన్ అపహరిత్తతు. తదీయశేషమానవన్ఱిఱే ఇవ్వాత్మావుక్కు అనన్యార్హత్వముళ్ళతు.**

**అపహారత్తిల్ వన్దాల్ - ద్రవ్యత్తినుడైయ శ్లాఘ్యతైక్కుమ్, అభిమానిత్తవన్ శ్లాఘ్యతైక్కుమ్ తక్కపడి ప్రాయశ్చిత్తమ్ కనత్తిరుక్కుమిఱే. బ్రాహ్మణవస్తువై అపహరిత్తాప్పోలన్ఱే, చణ్డాళన్ వస్తువై అపహరిత్తాల్. ద్రవ్యఙ్గళిలుమ్ గురు లఘుభావత్తాలే ప్రాయశ్చిత్తవైషమ్యముణ్డిఱే. విఱకు, వైక్కోల్ కళవుకణ్డాప్పోలన్ఱిఱే, రత్నత్తై క్కళవుకణ్డాల్. ఆత్మవస్తు శ్రీకౌస్తుభస్థానీయమాయ్, ఉడైయవన్ సర్వేశ్వరనాయిఱేయిరుప్పతు.**

**(నమ్బినేన్ మడవారైయుమ్) ఈశ్వరనుక్కు అభిమతమాన వస్తువై అపహరిత్త నాన్. దేహాత్మాభిమానికళ్ “ఎన్నతు” ఎన్ఱు అభిమానిత్త వస్తువై అపహరిక్క చ్చొల్లవేణుమో? రాజరత్నాపహారమ్ పణ్ణ అఞ్జాత నాన్ కదర్యనుడైయ విఱకుమ్, వైక్కోలుమ్ అపహరిక్క అఞ్జువేనో?**

**ఇత్తాల్ - ఈశ్వరనుక్కు అభిమతమాన వస్తువైయు మపహరిత్తేన్; అన్యరుడైయ అభిమతవిషయత్తైయు మపహరిత్తేన్ - ఎన్ఱపడి. “మడవార్” ఎన్నైయాలే అజ్గుమ్ అనన్యార్హఙ్గళైయే అపహరిత్తేన్ - ఎన్ఱపడి.**

(మున్నెలామ్) ఇప్పడి దేహాత్మాభిమానియాయుమ్, విషయప్రవణనాయుమ్ పోన్ద కాలన్దాన్ సావధియాక ప్పెఱ్ఱతో? ఈశ్వరనోపాతి ఆత్మావుమ్ నిత్యన్, కాలము మనాది, అచిత్సమ్బన్ధము మనాది. ఆకైయాలే మున్బుళ్ళ కాలమెల్లా మితువే యాత్రై - ఎన్నై.

ఉమ్ముడైయ తణ్మై కుఱైవఱ్ఱిరున్దతు, ఆళ్వార్ ఉమక్కు నిర్హేతుకమాక ఉపకరిత్త వళవేతు? ఎన్న, అత్తై చ్చొల్లుకిఱార్ మేల్ (శెమ్ పొన్ మాడత్తిరుక్కురుమార్ నమ్బిక్కు) ఎన్నుడైయ పూర్వవృత్తత్తై యారా యుమత్తనై అపూర్ణరో ఆళ్వార్? "ఎన్నై ఉపేక్షిత్త కాలమివ్వళవు, పాపమివ్వ ళవు" ఎన్ఱు పార్క్కుమ్బడియన్ఱే ఆళ్వారుడైయ పూర్తి, "నాన్ ఆత్మాపహారమ్ పణ్ణినేన్, విషయప్రవణనానేన్" ఎన్ఱు కైవిడుమ్బడియన్ఱే).

ఆళ్వార్ తిరువడికళై నీర్ తామ్ కిట్టిన పడి ఎన్? ఎన్న, "విషయఙ్గళుక్కు అర్థమ్ తేడి, అర్థాపహారత్తుక్కిడమ్ పార్త్తు త్తిరియానిఱ్క, అచ్చెమ్బొన్ మాడత్తై క్కళవు కాణప్పుక్కేన్. అఙ్గే వైత్త మానిధియై క్కణ్డు అకప్పట్టేన్" ఎన్గిఱార్. ఇవర్క్కు "వైత్తమానిది" ఆళ్వారిఱే. ఆళ్వార్ తిరువడికళోపాతి తిరునగరియుమ్ ఇవర్క్కు స్పృహణీయమాయిరుక్కైయాలే తిరునగరియై క్కవిపాడుకిఱార్.

(ఇన్ఱు అన్బనాయ్) ఇతుక్కు మున్బు ఎనక్కొరు నినైవిన్ఱిక్కేయిరుక్క, అచిన్తితమాక ఆళ్వార్తిరువడికళిలే ప్రవణాకక్కణ్డేన్.

అనాదికాలమ్ ఆత్మాపహారమ్ పణ్ణియుమ్, విషయప్రవణనాయుమ్ పోన్ద ఇతు ఇళవుక్కుడలాకైయన్ఱిక్కే, శరణ్యప్రభావత్తాలే పేఱ్ఱుక్కులాడలాక కృషి పణ్ణినారైప్పోలే ఫలిత్తుక్కొడునిఱ్క క్కణ్డేన్. "నాన్, ఎన్నతు" ఎన్ఱిరుక్కై త్తవిర్న్దు, ఇతరవిషయఙ్గళిల్ విరక్తరాయ్, భగవచ్ఛేషత్వత్తళవిల్ నిల్లాతే అతినెల్లైయాన తదీయశేషత్వత్తళవిలే నిన్ఱార్, ఆళ్వార్. ఇన్ద క్రమాపేక్షైయిన్ఱిక్కే, ముతలడియిలే నాన్ ఆళ్వార్ తిరువడికళిలే ప్రవణనాక ప్పెఱ్ఱేన్.

(అడియేన్) ఆళ్వారుడైయ వైభవత్తై అనుసన్ధిత్తు, "గుణైర్దాస్యముపాగతః ఎన్గిఱపడియే అతుక్కు త్తోఱ్ఱు, "అడియేన్" ఎన్గిఱార్. ఆచార్యర్



కళై, "నమ్బి" ఎన్న క్కడవిత్తాప్పోలే, ఆచార్యర్కళ్ అళైత్తాల్ "అడియేన్" ఎన్గిఱతుమ్ - శ్రీమధురకవికళ్వాసనైయాలేయాయిఱ్ఱు.

(శతిర్త్తేన్) శతిరై యుడైయేనానేన్. ఈశ్వరశేషమాన ఆత్మవస్తువై "ఎన్నతు" ఎన్ఱిరుక్కైక్కుమ్, ఇతరవిషయప్రావణ్యత్తుక్కుమ్ మేఱ్పట్ట శతిర్ కేడిల్లైయిఱే. అవఱ్ఱై విట్టు భగవద్విషయత్తళవిలే నిల్లాతే, ఆళ్వారళవుమ్ వరుమ్బడియాన శతిరై యుడైయేనానేన్.

## అరుమ్బద విళక్కమ్

అఙ్గామ్ పాట్టు :- అవతారికై : "పున్మైయాక క్కరుతువర్" ఎన్ఱు పున్మైయుమ్, "అన్నైయాయ్" ఇత్యాదియాల్ ఆళ్వారుపకరిత్త పడికళుమ్ శొల్లియిరుక్క, ఇప్పాట్టిలుమ్ శొల్లువానెన్? ఎన్గిఱ శఙ్కైయై ప్పరిహరిక్క వేణుమెన్ఱు తిరువుళ్ళమ్బుఱ్ఱి విశేషప్రశ్నముఖేన అవతారికై అరుళిచ్చెయ్కిఱార్ (ఉమ్మై యిత్యాది) (శొల్లి క్కాణీర్) ఎన్గతు- విశేషిత్తు చ్చొల్లిక్కాణీర్- ఎన్ఱపడి.

వ్యాఖ్యానమ్ :- హార్దతాత్పర్యమరుళిచ్చెయ్తు అన్వయిత్తు త్తాత్పర్యమరుళిచ్చెయ్కిఱార్ (పిఱరిత్యాది). "పిఱర్" ఎన్ఱు- ఈశ్వరనై చ్చొల్లుమ్ ప్రకారత్తై ఉపపాదిక్కిఱార్ (త్రివిధాత్మేత్యాది). (అవ్వరుకు) ఉత్కర్షావధి; ఇతుక్కు హేతు (విసజాతీయేత్యాది). ఆత్మావై చ్చొల్లుమ్ ప్రకారత్తై క్కాట్టుకిఱార్ (పొరుళెన్ఱిత్యాది). వైశేషికమతరీత్యా నన్మైయై ఉపపాదిక్కిఱార్ (ద్రవ్యాణీత్యాది). "పృథివ్యప్తేజోవాయ్వాకాశకాలదిగాత్మమనాంసి నవైవ" ఎన్ఱు ఆత్మావైయుమ్ ద్రవ్యమాక చ్చొన్నాన్, వైశేషికన్. "నమ్బినేన్" ఎన్గతుక్కు త్తాత్పర్యమ్ (అత్తై-యిత్యాది). శబ్దార్థమ్ (నమ్బుతలిత్యాది) ఆశై అపహారమానపడి ఎన్? ఎన్న (పరద్రవ్యత్తై యిత్యాది) తమ్మై ఆత్మాపహారియాక అనుసన్ధిక్కైక్కడి ఎన్? ఎన్న (వన్కళ్వనిత్యాది). "వన్కళ్వన్" ఎన్గతు- తిరువాయ్మొళి. కళ్వనెన్గతు తిరుమొళి. నన్మై యేతు? ఎన్న. అరుళుకిఱార్ (ముతలిత్యాది). సింహావలోకనన్యాయేన నన్పొరుళ్- ఎన్నుతల్. 'తన్నై" ఎన్గతుక్కు త్తానాన తన్మైయాక త్తాత్పర్య మరుళిచ్చెయ్కిఱార్ (భగవదిత్యాది). "శేషత్వకాష్ఠైయిలే నిఱ్కిఱ ఆత్మవస్తు" ఎన్గత్తై ఉపపాదిక్కిఱార్ (తదీయేత్యాది). తచ్ఛేషత్వమ్ తదీయశేషత్వవ్యాప్తమాకైయాలే, తదీయశేషత్వ మిల్లాతపోతు తచ్ఛేషత్వమ్ కులైకైయాలే, అన్యార్హత్వమ్ ప్రసక్తమామ్, అత్తాలే- అనన్యార్హత్వమిల్లైయామెన్ఱు కరుత్తు.

"పెఱర్" ఎన్గు- స్వామివైలక్షణ్యమ్ శొన్నత్తాలుమ్, "నల్" ఎన్గు ద్రవ్యవైలక్షణ్యమ్ శొల్లుకైయాలుమ్ ఫలిత్తతు ఓర్థత్తై అరుళిచ్చెయ్‌కిఱార్ (అపహారత్తిల్ వన్దాలిత్యాది). "తృణకాష్ఠాపహారేణ యో దోషః పరికీర్తితః, స్వర్ణరత్నాపహారేఽపి తావానేవ భవేత్కథమ్? కథర్యస్వాపహరేణ యో దోషః పరికీర్తితః, శ్రోత్రియస్వాపహారేఽపి తావానేవ భవేత్కథమ్? ఆత్మవస్తు యతోఽనర్ఘ్య మాత్మేశస్తు పరః పుమాన్, తస్మాదస్యాపహరణే దోషస్యాన్తో న విద్యతే" ఎన్గిఱ ఇవ్వచనఙ్గళ్ ఇవ్విడత్తిల్ అనుసన్ధేయఙ్గళ్. కదర్యన్- క్షుద్రన్. "పెఱర్ నన్ పొరుళ్" ఎన్గత్తై కృటాక్షిత్తు తాత్పర్యమ్ (ఈశ్వరనుక్కు - ఇత్యాది).

స్త్రీకళ్ ఎన్నాతే, మడప్పత్తై యిట్టు విశేషిత్తతుక్కు ప్రయోజనమ్ (మడవారిత్యాది)- హార్దాభిప్రాయమ్ (ఇప్పడి - యిత్యాది). అనాదియాక ఆత్మాపహారమ్ వన్దతుక్కు హేతువై అరుళిచ్చెయ్‌కిఱార్ (ఈశ్వరనోపాతి యిత్యాది). మేలుక్కుతారికై (ఉమ్ముడైయ ఇత్యాది). నమ్బిపదతాత్పర్యమ్ (ఎన్నుడైయ ఇత్యాది). "మడవారైయుమ్" ఎన్గత్తై కృటాక్షిత్తు "శెమ్బొన్ మాడమ్" ఎన్గు వర్ణిత్తతుక్కు శఙ్కాపరిహారరూపేణ తాత్పర్యమ్ (ఆఴ్వారిత్యాది). వర్ణిత్తతుక్కు తాత్పర్యాన్తరమ్ (ఆఴ్వార్ తిరువడికళిత్యాది). ఆఴ్వార్ నిధియానాల్ తిరునగరియై వర్ణిప్పానేన్? ఎన్న (ఆఴ్వారిత్యాది).

"ఇన్ఱే" ఎన్గత్తై ఇఙ్గే అన్వయిత్తు ప్రతీకమ్ "ఇన్ఱన్బనాయ్-ఎన్గదు" (ఒరు నినైవిన్ఱిక్కే) ఎన్గతు- ఆత్మాప హారమ్ అతిక్రూరమెన్ఱుమ్, విషయప్రావణ్య మాకాతెన్ఱుమ్, భగవచ్చేషత్వ ముద్దేశ్యమెన్ఱుమ్, తదీయశేషత్వమ్ పరమోద్దేశ్యమెన్ఱుమ్- ఇప్పడి హితచిన్తై యిన్ఱిక్కే- ఎన్గపడి. ఇతు- "ఇన్ఱు" ఎన్గతుక్కు తాత్పర్యమ్.

"ఇన్ఱు" ఎన్గ పదత్తై యుట్కొణ్డు వివరిక్కిఱార్ (అనాదీత్యాది వాక్యత్రయత్తాలే) "నమ్బి" ఎన్గత్తై కృటాక్షిత్తు, నాన్ ఎన్నాతే "అడియేన్" ఎన్గతుక్కు తాత్పర్యమ్ (ఆఴ్వారుడైయ- ఇత్యాది). ఇత్తాల్ ఓర్థవిశేషమ్ సూచితమాయిఱ్ఱు- ఎన్గిఱార్ (ఆచార్యర్‌కళిత్యాది). శతిర్ ఇన్నతెన్గు వ్యావృత్తిపూర్వకమాక అరుళిచ్చెయ్‌కిఱార్ (ఈశ్వరేత్యాది).



## భావదీపిక (ఆంధ్రవివరణం)

**ఐదవ పాశురం - అవతారిక :** గడచిన పాశురంలో మధుర కవులు తమను నైచ్యమే మూర్తీభవించినవారని, అటువంటి తమకు ఆఴ్వార్లు అన్ని రీతులలో ఉపకరించారని అన్నారు. ఆ రెండిటిని ఈ పాశురంలో వివరిస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ :** ఈ పాశురంలోని పూర్వార్ధంలో-తమ నైచ్యాన్ని, ఉత్తరార్ధంలో- ఆఴ్వార్లు తమకు ఉపకరించిన రీతిని వివరిస్తున్నారు.

**(పెఱర్ నన్ పొరుళ్ తన్నైయుమ్ నమ్బినేన్)** - ఇక్కడ **"పెఱర్"** అనే పదం భగవానుని తెల్పుతుంది. **"నన్ పొరుళ్"** అంటే- ఆత్మవస్తువు. నిత్య-ముక్త- బద్ధులనే మూడు విధాలైన జీవులకంటే గొప్పవాడై, వారికి చెందని పలు వైలక్షణ్యాలను కలవాడైనందున సర్వేశ్వరుని **"పెఱర్"** అని అంటున్నారు. **"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ, క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే, ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః, యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః, అతోఽస్మి వేదే లోకే చ ప్రథితః పురుషోత్తమః"** (గీత-15,16,17,18) (లోకంలో పురుషులు క్షరుడని, అక్షరుడని రెండు విధాలు. భూతాలు అన్నీ క్షరమనబడుతున్నాయి. కూటస్థుడైన ముక్తాత్మ. అక్షరమనబడుతున్నాడు. ఎవడు, ముల్లోకాలలో వ్యాపించి, వాటిని ధరించేవాడై, ఏలోటు లేనివాడై, నియమించేవాడై, పరమాత్మ- అని చెప్పబడేవాడై ప్రకాశిస్తున్నాడో, ఆ పురుషోత్తముడు, ముందు చెప్పబడ్డ పురుషులకంటే విలక్షణుడు. నేను, జ్ఞానంలో హెచ్చు తగ్గులను కల సంసారి పురుషునికంటే విలక్షణుడనై ఉన్నందున, జ్ఞానంలో హెచ్చు తగ్గులు లేని ముక్తపురుషుని కంటే గొప్పవాడనై ఉన్నందున, శ్రుతులలోను, స్మృతులలోను పురుషోత్తముడననే ప్రసిద్ధిని పొందాను) అని గీతలో కూడా జీవులకంటే మిక్కిలి విలక్షణునిగా తనను శ్రీకృష్ణుడు నిర్దేశించుకొన్నాడుకదా. **"పొరుళ్"** అనే పదం గుణాలు, క్రియలు మొదలైనవానిని కల ఒక ద్రవ్యాన్ని తెల్పుతుంది. **"నన్‌పొరుళ్"**- అనే పదం గొప్ప వస్తువైన ఆత్మను తెల్పుతుంది. **"ద్రవ్యాణి నవ తే విదుః"** (ఆత్మమొదలు ద్రవ్యాలు తొమ్మిది- అని వైశేషికులు తలుస్తారు) అని తార్కికులలో ఒక తెగవారైన వైశేషికులు ఆత్మ మొదలైన తొమ్మిది వస్తువులను ద్రవ్యాలుగా పరిగ్రహించారు కదా! (**"తత్ర ద్రవ్యాణి- పృథివ్యప్తేజో వాయ్వాకాశ దిగాత్మమనాంసి నవైవ"** (తర్కసంగ్రహం) (ఈ పదార్థాలలో- పృథివి, జలం, తేజస్సు,

వాయువు, ఆకాశం, కాలం, దిక్కు, ఆత్మ, మనస్సు– అని తొమ్మిది ద్రవ్యాలు) అని అంటూ ఈ తొమ్మిది ద్రవ్యాలు తర్కసంగ్రహంలో నిర్దేశింపబడ్డాయి) ఈ ద్రవ్యాలలో ముఖ్యద్రవ్యమైన ఈ ఆత్మనే నేను అనాదికాలంగా అపహరించాను– అని అంటున్నారు.

**(నమ్బినేన్)–** ఆశపడ్డాను– అని అర్థం. ఇతరుల వస్తువులకోసం ఆశపడడమే అపహారం– దొంగతనం. **"వన్ కళ్వన్"** (తిరువాయ్–5–1–4), **"కళ్వనేన్ ఆనేన్"** (పెరియ తిరు–1–15) అని ఆళ్వార్లు కూడా ఆత్మాపహారాన్ని దొంగతనం– అని అనుసంధించడాన్ని అనుసరించి వీరు కూడా ఈవిధంగా పల్కుతున్నారు. **"యోఽన్యథా సంత మాత్మాన మన్యథా ప్రతిపద్యతే, కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా"** (భార–ఉద్యో–42–35) (భగవానుని సొత్తు అయిన ఆత్మను, ఎవడు తనకు స్వంతంగా తలుస్తున్నాడో, ఆత్మను అపహరించేవాడైన ఆ చోరునిచే ఇక చేయబడని దొంగతనం ఏమున్నది ?) అని భారతంలోను, ఆత్మాపహారమే– చాలా గొప్ప చౌర్యంగా చెప్పబడింది కదా ! "భగవానునకు శేషమై ఉండడం మాత్రమే కాకుండా, తత్పర్యంతసీమ అయిన తదీయులకు కూడా శేషమై ఉండేదైన ఆత్మను కదా నేను అపహరించాను" అని అంటున్నారు. అతనికి (భగవానునకు) శేషమై ఉండడం– శేషత్వం. అతని భక్తులకు కూడా శేషమై ఉన్నప్పుడే ఈ ఆత్మకు అనన్యార్హశేషత్వం సిద్ధిస్తుంది. అందువల్ల అదే ఆత్మయొక్క సహజమైన స్వభావం.

దొంగతనంవల్ల కలిగే పాపం– దొంగిలింపబడే వస్తువునుబట్టి, అది ఏ వ్యక్తి దగ్గరనుండి దొంగిలింపబడింది? అనే విషయాన్నిబట్టి హెచ్చుతగ్గులను కల్గి ఉంటుంది. అందువల్ల దానికి చేయవలసిన ప్రాయశ్చిత్తాలు కూడా వేఱు వేఱుగా ఉంటాయి. అల్పుని వస్తువును అపహరించడం కంటే, ఉన్నతుడైన బ్రాహ్మణుని వస్తువును దొంగిలించడంవల్ల కలిగే పాపం అధికం. వెల తక్కువగా ఉండే వస్తువును దొంగిలించినందువల్ల కలిగే పాపంకంటే, వెల అధికంగా ఉండే వస్తువును దొంగిలించినందువల్ల కలిగే పాపం అధికం. కట్టెలు, గడ్డి మొదలైన అల్పమైన వెలను కల వస్తువులను దొంగిలించడం కంటే, రత్నాన్ని దొంగిలిస్తే వచ్చే పాపం ఎక్కువ. ప్రకృతంలో, దొంగిలింపబడే ఆత్మవస్తువు భగవానుని శ్రీకౌస్తుభమణివంటిది. దానిని కల్గినవాడైన సర్వేశ్వరుడు అందటికంటే ఉన్నతుడు. అందువల్ల ఈ ఆత్మచౌర్యం కారణంగా కలిగే పాపం అంతు లేనిది. **"తృణకాష్ఠాపహారేణ యో దోష: పరికీర్తిత:, స్వర్ణరత్నాపహారేఽపి తావానేవ భవేత్ కథమ్?, కదర్యస్వాపహారేణ యో దోష: పరికీర్తిత:, శ్రోత్రియస్వాపహారేఽపి తావానేవ భవేత్ కథమ్?, ఆత్మవస్తు యతోఽనర్ఘ మాత్మేశస్తు పర: పుమాన్, తస్మాదస్యాపహారేణ దోషస్యాంతో న విద్యతే"** (తృణం, కాష్ఠం మొదలైన వానిని అపహరించినందున ఏదోషం కల్గుతుందని చెప్పబడుతున్నదో, దోషమే స్వర్ణం, రత్నం మొదలైనవానిని అపహరించినందున కల్గుతుందా ? నీచుని సొత్తును అపహరిస్తే ఏ దోషం చెప్పబడుతున్నదో, ఆ దోషమే వేదాలను తెలిసిన బ్రాహ్మణుని సొత్తును దొంగిలించినందువల్ల కూడా కల్గుతుందా ? ఆత్మవస్తువు వెల కట్టలేనిది, ఆ ఆత్మను కలవాడు పరమపురుషుడు. అందువల్ల దానిని అపహరించినపుడు కలిగే దోషానికి అంతులేదు) అనే ప్రమాణం ఇక్కడ అనుసంధేయం.



**(నమ్బినేన్ మడవారైయుమ్)–** భగవానుడు "తన వస్తువు" అని అభిమానించిన ఆత్మవస్తువును అపహరించిన నేను, **"దేహమే ఆత్మ"** అని తలచే సంసారులు తమకు చెందినవారుగా అభిమానించిన స్త్రీలను అపహరించడంలో ఆశ్చర్యం లేదు– అని అంటున్నారు. ప్రభువు రత్నాన్నే అపహరించిన నేను, నీచుల తృణ, కాష్ఠాదులను దొంగిలించడంలో భయడతానా?– అని భావం. ఇందువల్ల– "భగవానుడు అభిమానించిన ఆత్మవస్తువును అపహరించాను", సంసారులు; అభిమానించిన ఇతరుల స్త్రీలను కూడా అపహరించాను"– అని అంటున్నారు. **"మడవార్"** –అనేటపుడు **"పిఱర్ నన్ పొరుళ్"** అనే ప్రయోగంలో వలె **"పిఱర్ మడవార్"** అని **"పిఱర్"** అనే పదాన్ని కలిపి అన్వయించి అర్థాన్ని గ్రహించాలి. నాకు చెందినవారితో తృప్తిని పొందకుండా, పరుల స్త్రీలను కూడా అపహరించాను– అని భావం.

**(మున్ ఎలామ్)–** ఈ రీతిలో "దేహమే ఆత్మ" అని తలచి, శబ్దాదులైన ఇహలోక విషయాలలో అభినివేశాన్ని పొంది నేను గడపిన కాలానికి అంతు ఉన్నదా?– అని అంటే, ఈశ్వరునివలె ఆత్మకూడా నిత్యమైనది. కాలం కూడా అనాది ఆదిని చూడడానికి సాధ్యం కానట్లుగా అనాది. అచిత్తు అయిన దేహంతో కూడా ఆత్మకు గల సంబంధం అనాది. అందువల్ల దీనికి ముందున్న కాలం అంతా ఈ దోషాలను చేయడమే అలవాటుగా కల్గి ఉన్నాను– అని అంటున్నారు. ఈరీతిలో ఇంతవరకు తమ నైచ్యాన్ని వివరించారు.

ఇక, ఇటువంటి నైచ్యాన్ని కల్గిన తమకు ఆళ్వార్లు నిర్హేతుకంగా ఉపకారం చేసిన రీతినిగూర్చి పల్కుతున్నారు.

**(శెమ్బొన్ మాడ త్తిరు క్కురుకూర్ నమ్బిక్కు)–** ఈ ప్రయోగం ద్వారా ఆళ్వార్ల అంతులేని గొప్పతనం తెలుపబడింది. భగవానునివలె, నా నా ప్రాక్తన వర్తనాన్ని

గమనించి చూచి, ఫలాన్ని ఇచ్చే అపూర్ణులా, ఆళ్వార్లు ? ఆరీతిలో అనాదికాలంగా ఆత్మాపహారాన్ని చేయడం, ఇహలోక విషయాలలో ఆసక్తిని కల్గి ఉండడం వీరి (మధురకవుల) ప్రాప్యాన్ని పొందలేకుండా పోవడానికి కారణం కాకుండా, తాము శరణు పొందిన ఆళ్వార్ల మహిమవల్ల, ప్రాప్యానికి సాధనానుష్ఠానం చేసినవారికి ఫలించినట్లుగానే, ఫలించగా గమనించాను– అని అంటున్నారు. **"శెమ్బొన్ మాడ త్తిరుక్కురుకూర్ నమ్బి"** అని అంటూ మధురకవులు తిరుక్కురుకూర్‌ను వర్ణించడానికి ఈ విధంగా ఒక అర్థం చెప్పబడుతున్నది. నేను అనుభవించవలసిన విషయసుఖాలకు తగిన భోగ్యవస్తువులను అన్వేషించి, ఆ భోగ్యవస్తువులు ఉండే స్థానాలను అన్వేషించి పరిభ్రమించేటపుడు, ఆ **"శెమ్బొన్ మాడమ్"** లో దొంగతనం చేయాలని ప్రవేశించాను. అక్కడే **"వైత్తమానిది"** (దాచి పెట్టిన గొప్పనిధి) అయిన ఆళ్వార్లను చూచి, అందులో చిక్కుకొన్నాను– అని అంటున్నారు. **"వైత్త మానిదియామ్ మదుశూదనైయే"** (దాచి పెట్టిన గొప్ప నిధి అయిన మధుసూదనుని) (తిరువాయ్6-7-11) అని అంటూ ఆళ్వార్లు తిరుక్కోళూర్‌లోని అర్చామూర్తిని **"వైత్తమానిది"** అని అన్నారు. అక్కడ అవతరించిన ఈ మధురకవి ఆళ్వార్లకు నమ్మాళ్వార్లే **"వైత్తమానిది"**. ఆ రీతిలో కాకుండా, ఆళ్వార్ల శ్రీచరణాలవలె వారు అవతరించిన తిరునగరికూడా వీరికి అభిమానించ దగినది అయినందున **"శెమ్బొన్ మాడత్తిరుక్కురుకూర్"** అని తిరునగరిని కూడా మధురకవులు వర్ణిస్తున్నారు – అని కూడా చెప్పవచ్చు.

**(నమ్బిక్కు అన్బనాయ్)–** దీనికిముందు, ఆళ్వార్లను గూర్చిన జ్ఞానమే లేకుండా ఉండే నాకు, అనుకోకుండా ఆళ్వార్ల శ్రీచరణాలో ఒక అభినివేశం (ఆసక్తి) కల్గడం గమనించాను. అనాదికాలంగా నాది కాని ఆత్మను "నాది" అని తలచి, లౌకిక విషయాలో ఆసక్తిని పొందడం ప్రాప్యాన్ని కోల్పోవడానికి కారణం కావలసి ఉండగా, ఆళ్వార్ల మహిమవల్ల అది నేను, ఆళ్వార్లను పొందడానికి కారణమైనది. ఈ ఫలానికి నేను ఏప్రయత్నం చేయకపోయినా, దీనికోసం సాధనానుష్ఠానాన్ని చేసిన వారికివలె, నాకు ఫలం సిద్ధించడం గమనించాను. "నేను", "నాది" అనే అహంకార–మమకారాలు తీరి, అన్యవిషయాలలో సంబంధం (సంగం) లేనివారై, భగవానునకు శేషభూతులు కావడమేకాక, దాని చరమపర్వమైన తదీయులకు శేషభూతులై ఉండే స్థితిలో ఉన్నారు, ఆళ్వార్లు. ఈ విధంగా మెట్టుమెట్టుగా అధిరోహించడం కాకుండా, ఆళ్వార్లను దర్శించిన వెంటనే నేను చరమపర్వమైన వారి శ్రీచరణాలలో అభినివేశాన్ని కల్గినవాడను అయ్యాను.



**(అడియేన్)–** ఆళ్వార్ల గొప్పతనాన్ని చింతించి, **"అహమస్యావరో భ్రాతా గుణై ర్దాస్య ముపాగత:"** (రామా– కిష్కింధ-4-12) (నేను ఈ శ్రీరాముని అభిప్రాయానుసారం వీరికి తమ్ముడను. వాస్తవానికి, వీరి సద్గుణాలవల్ల దాసుడను) అనే రీతిలో లక్ష్మణుడు శ్రీరాముని పట్ల అభినివేశాన్ని (ఈడుపాడును) పొందినట్లుగా, వీరు (మధురకవులుకూడా) ఆళ్వార్ల గుణాలకు జితులై **"అడియేన్"** అని అంటున్నారు. వీరు **"తిరుక్కురుకూర్ నమ్బి"** అని నమ్మాళ్వార్లను సంబోధించడం అనుసరించి శ్రీవైష్ణవులు పూర్వాచార్యులను **"పెరియ నమ్బి"**, **"తిరుక్కోట్టియూర్ నమ్బి"** అని సంబోధించారు. వీరు, నమ్మాళ్వార్ల విషయంలో **"అడియేన్"** అని అనుసంధించడం అనుసరించి శ్రీవైష్ణవులు కూడా ఆచార్యులు తమను సంబోధించినపుడు **"అడియేన్"** అని బదులు పలికే సంప్రదాయం ఏర్పడింది.

**(శదిర్త్తేన్)– "శదిర్"** అంటే– గొప్పతనం. గొప్పవాడనయ్యాను– అని అర్థం. భగవానునకు శేషమై ఉండే ఆత్మను తనది అని భావించడం, అతనికంటే అన్యవిషయాలలో ఆసక్తిని కల్గి ఉండడం కంటే మించిన నైచ్యం ఇంకొకటి లేదుకదా. ఆ నైచ్యాలు అన్నీ తీరి, భగవానుని పట్ల అభినివేశాన్ని కల్గి ఉండడంతో పాటు, చరమపర్వం అయిన ఆళ్వార్లవరకు అభినివేశాన్ని పొందే రీతిలోని గొప్పతనాన్ని కలవాడనయ్యాను– అని భావం.

**నఞ్జీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**(పిఱర్ నన్ పొరుళ్)–** ఆత్మ, పరమాత్మ– ఒకటే అని పలికే అభేదశ్రుతులు, ఆత్మ, పరమాత్మ– వేఱు వేఱు –అని పలికే భేదశ్రుతులు ఉన్నప్పటికీ, శరీరాత్మభావాన్ని తెలిపే ఘటకశ్రుతులను పురస్కరించుకొని, భేదమే సిద్ధాంతం– అని చూపడంకోసం **"పిఱర్ నన్ పొరుళ్"** అని అంటున్నారు. **"పొరుళ్"** అనడం ద్వారా ఆత్మలో ఉండే దుర్గుణాలనే అవరోధాలను వేఱు చేయడంకోసం ఆ గుణాలను కల ద్రవ్యమే –ఆత్మ అని తెల్పుతున్నారు. **"నన్ పొరుళ్"** అని అనడం ద్వారా ఆత్మకు భగవానునకు శేషమై ఉండే స్వభావమున్నది– అని తెల్పుతున్నారు.

**(నమ్బినేన్ మడవారైయుమ్) "అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస పూర్వకమ్, తదేకోపాయతాయాచ్ఞా ప్రపత్తి: శరణాగతి:"** (భరతముని లక్షణమ్– విష్వక్సేన సంహిత) (తన అభీష్టం దేనివల్ల సిద్ధించనపుడు, మహావిశ్వాస పూర్వకంగా ఆ భగవానుడు ఒక్కడే ఉపాయమై ఉండాలి– అని యాచించడం ప్రపత్తి, అదే శరణాగతి) అనే

రీతిలో భగవానుని విషయంలో మహావిశ్వాసంతో అతనినే సర్వస్వంగా తలచి ఆశ్రయించవలసి ఉండగా, స్త్రీలవిషయంలో ఆ మహావిశ్వాసాన్ని పొందాను– అని అంటున్నారు.

**(అడియేన్ శదిర్త్తేన్ ఇన్టే)–** స్త్రీలను నమ్మి, సంపదను కోల్పోయిన నేను, ఆళ్వార్లను ఆశ్రయించి గొప్పతనాన్ని కలవాడనయ్యాను– అని భావం.

**నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవతారిక :** అర్థాన్ని (ధనాన్ని) అన్వేషించడం కోసం, విషయాలను అనుభవించడం కోసం ఊరంతా తిరిగేటపుడు, **"శెమ్బొన్ మాడ త్తిరుక్కురుకూర్"**ను చూచి, ఇక్కడ కూడా అవి లభిస్తాయి– అని అక్కడకు వెళ్ళాను. ఆ నగరికి నాథులైన ఆళ్వార్ శ్రీచరణాలలో భక్తినిపొంది, అర్థకామాలలో సంబంధం తీరినవాడ నయ్యాను– అని అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ : (పొరుళ్) సత్యం చానృతం చ సత్యమభవత్"** (తైత్తిరీయ–ఆనంద–63) (వికారరహితమైనది అయినందున **"సత్యమ్"** (ఉన్నది) అనబడే ఆత్మగాను, వికారాన్ని కల్గినది అయినందున **"అనృతమ్"** (లేనిది) అనబడే అచిత్తుగాను అయినా, వికారాన్ని లేనిదిగాను పరబ్రహ్మం ఉన్నది) అని ఉపనిషత్తులలోను **"ఉళ్ళదు"** (తిరువాయ్–1–2–4) అని ఆళ్వార్ల శ్రీసూక్తులలోను చెప్పబడిన రీతిలో వికారం లేని సత్ ద్రవ్యమైనందున ఆత్మను **"పొరుళ్"** అని అంటున్నారు. **"ఎణ్ పెరుక్కు అన్నలత్తు ఒణ్పొరుళ్"** (అసంఖ్యాకాలైన, జ్ఞానానందమయాలైన గొప్ప వస్తువులు –ఆత్మలు) (తిరువాయ్–1–2–10) అని అంటూ ఆళ్వార్లుకూడా దీనిని **"పొరుళ్"** అని అన్నారు కదా ! **"మెమ్బొరుళ్"** (తిరుమాలై–38) మొదలైన సందర్భాలలో అచేతనమైన దేహంకూడా సత్యమైనది అయినందున **"పొరుళ్"** అని చెప్పబడినా, దానివలె అనిత్యమై, ఎల్లప్పుడు వికారాన్ని కల్గినదై, మిక్కిలి అధమమై, జ్ఞానశూన్యమై, సుఖరహితమై, భోగ్యం కానిదై ఉండడం కాకుండా, నిత్యమై, వికారరహితమై, మిక్కిలి ఉన్నతమై, సహజమైన జ్ఞానానందాలను కల్గినదై, సహజంగానే భోగ్యమై ఉండడం వల్ల ఆత్మను **"నన్ పొరుళ్"** అని అంటున్నారు.

**"పొరుళ్"** అని అంటే– అది అచేతనాన్ని కూడా నిర్దేశిస్తుంది. దానిని వేఱు చేయడంకోసం **"నన్ పొరుళ్"–** అని అంటూ ఆత్మను నిర్దేశిస్తున్నారు. **"పిఱర్ నన్ పొరుళ్"** అని అంటూ భగవానుని సొత్తు అయినందువల్ల, ఈ ఆత్మ ఈశ్వరునికంటే వేఱయినది– అని తెల్పుతున్నారు. స్వయంప్రకాశకమైన జ్ఞానరూపమై ఉన్నందున ఆత్మ అచిత్తుకంటే భిన్నమై ఉన్నది. భగవానునకు శేషమై ఉన్నందున భగవానుని కంటే విలక్షణమై ఉన్నది. శరీరాన్ని కల్గిన ఆత్మయై ఉన్నందున శరీరమనే అచిత్తు కంటే వేఱుగా ఉంటుంది. తాను భగవానునకు శరీరమై ఉన్నందున భగవానుని కంటే వేఱుగా ఉంటుంది. అనుభవించే భోక్త యై ఉన్నందున అనుభవంలేని అచిత్తు కంటే వేఱుగా ఉంటుంది. తాను భగవానునకు భోగ్యమై ఉన్నందున భగవానుని కంటే వేఱుగా ఉంటుంది.

**(పిఱర్ నన్పొరుళ్)– "పిఱర్"** –అని అంటూ సొత్తుదారుడైన భగవానుని గొప్పతనాన్ని, **"నన్ పొరుళ్"–** అని సొత్తు యొక్క గొప్పతనాన్ని పల్కుతున్నారు. ఆత్మ– దేహం, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణం, బుద్ధిమొదలైనవానికంటే విలక్షణమై ఉన్నందున, **"నన్ పొరుళ్"** అని అంటున్నారు. భగవానుడు– ప్రధానం, అవ్యక్తం అనబడే త్రిగుణాలను కల మూలప్రకృతి కాలం అనబడే త్రిగుణరహితమైన అచేతనద్రవ్యం – పురుషుడనబడే ఆత్మశబ్దవాచ్యమైన చిత్తు– అనే ఈ మూడిటికంటే విలక్షణుడై ఉన్నందున, అతనిని **"పిఱర్"** అని అన్నారు.

**(పిఱర్ నన్పొరుళ్ తన్నైయుమ్ నమ్బినేన్)–** భగవానుని సొత్తు అయిన ఆత్మను తనది– అని అభిమానించే ఆత్మాపహారాన్నిగూర్చి ఇక్కడ పల్కినందున, "దేహమే ఆత్మ" – అనే దేహాత్మాభిమానాన్ని తెలిపినట్లయినది. అటువంటి దేహాత్మాభిమానాన్ని కలవాడు ఇతరుల ద్రవ్యాలను ఆశపడడం సహజం కనుక, ఇక్కడ **"పిఱర్ నన్ పొరుళ్ తన్నైయుమ్ నమ్బినేన్"** – అని ఇతరుల ద్రవ్యాలను అపహరించడాన్ని గూర్చి పలికారని కూడా చెప్పవచ్చు. దానిని **"నన్పొరుళ్"** అని అనవచ్చునా? అని అంటే, దానిని కల్గినవారు, దానిని గొప్ప ద్రవ్యంగా భావిస్తారు కనుక, వారి అభిప్రాయాను సారంగా ఈవిధంగా చెప్పవచ్చు. వారి ద్రవ్యాలలో, ఎక్కువ వెలలేని ద్రవ్యాలను అపహరించకుండా, మిక్కిలి వెలకల్గినదిగా వారు భావించిన ద్రవ్యాలను అపహరించాను– అని భావం.

**(నమ్బినేన్ మడవారైయుమ్)–** "దేహమే ఆత్మ" అని భావించినందున, ఆత్మ జ్ఞానం కల్గినవారికి పరమాత్మయే పురుషార్థంగా ఉండేటట్లే, దేహానికి దేహమే భోగ్యం కనుక, పరస్త్రీ శరీరాలను భోగ్యాలుగా భావించి, ఆశపడ్డాను– అని భావం.

**(మడవారైయుమ్)–** సద్గుణాలను కలవారై, పతివ్రతలై ఉండే స్త్రీలనే ఆశపడ్డాను– అని కూడా చెప్పవచ్చు.

**(మడవార్)**– తమ అణకువ– అనే అందాన్ని చూపి, పరమపురుషులను ఆకర్షించే సామాన్యస్త్రీలను ఆశపడ్డాను– అని కూడా చెప్పవచ్చు. **"మడవార్"** అనే బహుత్వంచేత ఒక స్త్రీమాత్రంతో తృప్తి పొందకుండా, పలువురను ఆశపడ్డాను– అని తెలుపబడింది. **"న జాతు కామ: కామానా ముపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే"** (విష్ణు–పురా–4–10–23) (కాముకుల కామం విషయానుభవంతో ఏనాడూ శాంతించదు, సరికదా, హవిస్సుతో వృద్ధి చెందే అగ్నివలె, మళ్ళీ మళ్ళీ వృద్ధి చెందుతుంది) అని చెప్పబడినట్లు స్త్రీచాపల్యం అనుభవించే కొద్దీ ఇంకా ఇంకా పెరుగుతుంది కనుక, పలువురను ఆశపడ్డాను– అని కూడా చెప్పవచ్చు. పాశురంలోని మొదటి రెండు పాదాలద్వారా స్వతంత్రం కాని ఆత్మను స్వతంత్రమని భావించడం, ఆత్మకాని దేహాన్ని ఆత్మ అని భావించడం, వ్యర్థమైన అర్థకామాలను పరమప్రాప్యాలు అని భావించడం– అనే దోషాలను కల్గించే అన్నిటిని కల్గినవాడనయ్యాను– అని అంటున్నారు.

**(శెమ్బొన్ మాడ త్తిరు క్కురుకూర్)**– **"శెమ్బొన్ మాడమ్"** అయినందున, "ఇక్కడకు పోయి ధనాన్ని అపహరించవచ్చు; **"నకర్"** అయినందున నాగరికులైన స్త్రీలను చౌర్యం చేయవచ్చు– అని తలచి ఆ ఊరిలోకి పోయాను. ఆ ఊరికి నాథులైన ఆళ్వార్ అష్టాక్షరిని చేజిక్కించుకొన్నవారైనందున, అక్కడ చోరులు సంచరించడం సాధ్యం కాదు కనుక, నాకు కూడా ఆళ్వార్లను దర్శించగానే దొంగతనం చేయాలనే బుద్ధి పోయి, వారి పూర్ణతను చూచి, వారికి దాసుడనయ్యాను.

**(నమ్బిక్కు అన్బనాయ్)**– ఆ అర్థకామాలలోని భోగ్యతను కూడా ఆళ్వార్లలోనే దర్శించినందున, వారికే నేను భక్తుడనయ్యాను.

**(నమ్బిక్కు అన్బనాయ్ అడియేన్)**– ఆళ్వార్లు అష్టాక్షరిని స్వాధీనం చేసికొన్నవారు కనుక, వారి కటాక్షమాత్రంతోనే, ఆ అష్టాక్షరిలో గల మూడు పదాలలోని అర్థాలలోను, వారికంటే ఎక్కువగా అభినివేశాన్ని పొందాను. మధ్యమపదమైన నమశ్శబ్దంలోని అర్థమైన భగవద్భక్తులకు శేషమై ఉండడమనే విషయంలో, వారు భగవానునకు శేషమై ఉండడంతోపాటుగా, దానిని (తదీయ శేషత్వాన్ని) కూడా పరిగ్రహించారు. నేను (ఆ రీతిలో కాకుండా) కేవలం ఆళ్వార్లకే శేషభూతుడనయ్యాను.

**(అన్బే)**– భగవానుని ఆశ్రయిస్తే, పర్వక్రమంలో (మెట్టుమెట్టుగా) అధిరోహించి, పరమపదాన్ని చేరిన తరువాతనే అనుభవాన్ని పొందవలసి ఉన్నది. నేను, ఆళ్వార్ల సంబంధంవల్ల ఇక్కడే ఈ విభూతిలోనే, అనుభవాన్ని పొందాను. అపుడు ఈశ్వర సంబంధం ఉన్నా, సంసారి అయ్యాను. ఇపుడు ఆళ్వార్ల సంబంధ మహిమవల్ల గొప్ప ఫలాన్ని పొందాను.



**ఇన్ఱు తొట్టుమ్ ఎழுమైయుమ్ ఎమ్బిరాన్,**
**నిన్ఱు తన్ పుగழ் ఏత్త అరుళినాన్,**
**కున్ఱమాడ త్తిరుక్కురుగూర్ నమ్బి,**
**ఎన్ఱుమ్ ఎన్నై ఇగழ్విలన్ కాణ్మినే. 6**

ఇన్ఱు తొట్టుమ్ = ఈనాటినుండి, ఎழுమైయుమ్ = ఇకపై గల కాలం అంతా, నిన్ఱు = స్థిరంగా, తన్ పుకழ் = తమ (ఆళ్వార్ల) కీర్తిని (కల్యాణగుణాలను), ఏత్త = (నేను) స్తుతించేరీతిలో, ఎమ్బిరాన్ అరుళినాన్ = మాస్వామి అయిన నమ్మాళ్వార్లు కృపజేశారు, కున్ఱమ్ మాడమ్ = పర్వతాలవంటి మేడలను కల, తిరు కురుకూర్ నమ్బి = తిరునగరికి నాథులైన ఆ ఆళ్వార్లు, ఎన్ఱుమ్ = (ఇక) ఏకాలంలోను, ఎన్నై = నా విషయంలో, ఇకழ்వు ఇలన్ = అనాదరాన్ని కల్గినవారు కాబోరు, కాణ్మిన్ =(దీనిని అనుభవంలో) గమనించండి.

పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యానమ్ :

**అవ - అఱామ్బాట్టిల్ - ఆళ్వార్ ఇప్పోతు ఇజ్జే విషయీకరిత్తాలుమ్, నీర్ తామ్ అనాదికాలమ్ వాసనై పణ్ణిప్పోన్ద విషయమాకైయాలే అతు మఱువలిడిలో? ఎన్న, "అజ్ఞన్ మఱువలిడుమ్బడియాయో ఆళ్వార్ ప్రసాదమ్ ఎన్బక్కల్ ఇరుప్పతు" ఎన్గిఱార్. "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే" ఎన్ఱుమ్, "సమాధిభఙ్గ స్తస్యాసీత్" ఎన్ఱుమ్ భ్రంశమ్ ప్రసజ్గిక్కుమ్ భగవత్కృపైయళవిలే నినైత్తిరుక్కిలామో, ఆళ్వార్కృపైయై.**

**వ్యా.- (ఇన్ఱు తొట్టుమ్ ) విషయీకరిత్త ఇన్ఱు ముతలాక. భగవత్సమాశ్రయ ణత్తిఱ్పోలే ఆశ్రయిప్పతొరు కాలముమ్, ఫలిప్ప తొరు కాలముమాయో ఆళ్వారుడైయ విషయీకారమిరుప్పతు. విషయీకరిత్త ఇన్ఱు తొడజ్గి అనుభవ కాలమాయన్ఱో ఇరుప్పతు. (ఎழுమైయుమ్) ఏழு జన్మ మెన్ఱు ఉపలక్షణమ్. మేలుళ్ళ కాలమెల్లా మెన్ఱపడి.**

(ఎమ్పిరాన్) "పిరాన్ పెరునిలమ్ కీణ్డవన్" ఎన్ఱు భగవద్విషయత్తిల్ ఆఴ్వార్ పేశుమ్బడియై, ఉపకారస్మృతియాలే ఆఴ్వార్విషయత్తిల్ పేశు కిఱార్. (ఎమ్పిరాన్) ఎన్ స్వామి.

(నిన్ఱు) ఒరుపడిప్పడ నిన్ఱు. ఉపకారస్మృతియాలే భగవల్లాభత్తళవుమ్ ఆఴ్వారై అనుభవిత్తు, పిన్బు అతు కిట్టినవాఱే అతిలే తోళ్మాఱుమ్బడి యన్ఱిక్కేయిరుక్కై. (తన్ పుగఴ్ఏత్త) ఆఴ్వారుడైయ అనుభవిత్తుక్కుళ్ళే భగవదనుభవమామ్బడియాయన్ఱో ఆఴ్వారుడైయ పెరుమై యిరుప్పతు.

(అరుళినాన్) నిర్హేతుకమాక కృపై పణ్ణినార్. "మయర్వఱ మతి నల మరుళినన్" ఎన్ఱు ఆఴ్వార్ భగవద్విషయత్తిల్ శొన్న వార్త్తైయై, ఆఴ్వార్ తిరువడికళిలే శొల్లుకిఱారిఱే ఇవర్. (కున్ఱమాడ త్తిరుక్కురుకూర్ నమ్బి) తమ్మైయు మేత్తి. ఇన్న మొరు విషయత్తైయు మేత్త వేణ్ణుమ్బడియో ఆఴ్వారుడైయ పూర్త్తి యిరుప్పతు. "కున్ఱమ్పోల్ మణిమాడనీడు త్తిరుక్కురు కూర్"ఎన్ఱు ఆఴ్వార్ అరుళిచ్చెయ్యుమతిఱే ఇవర్ నెఞ్జిలే వాసితమా యిరుప్పతు, అత్తై చ్చొల్లుకిఱార్.

(ఎన్ఱు మెన్నై ఇకఴ్విలన్) (ఎన్ఱుమ్ ఇకఴ్విలన్, ఎన్నై ఇకఴ్విలన్) యావదాత్మభావి పుఱమ్బే యొరు విషయత్తిలే పోకవిట్టుక్కొడార్. ఎన్ తణ్మై పారాతే విషయీకరిత్తవర్, ఎన్నై విషయాన్తరఙ్గళిలే పోకరు వొట్టువరో! తన్దిరు వడికళై యొఴియ ప్పుఱమ్బు పుకలగ్గొడిరుక్కిఱ ఎన్నై, "పుఱమ్బే పోక" ఎన్ఱాలుమ్ పోకలామ్బడి ఎన్ కైయిలే ఎన్నై క్కాట్టిత్తరువరో? (కాణ్మినే) ఇతు ప్రత్యక్షిక్క లావతొన్ఱాయిరుక్క, ఆఴ్వార్ పెరుమై నాన్ శొల్ల క్కేట్కై మికైయన్ఱో.

## అరుమ్బద విళక్కమ్

ఆఱామ్పాట్టు : అవతారికై :– "ఎన్ఱు మెన్నై ఇకఴ్విలన్ కాణ్మిన్" ఎన్గత్తై క్కటాక్షిత్తు స్వానుభవగర్భపరోపదేశమాతల్, పరోపదేశగర్భస్వానుభవమాతల్ శొల్లక్కూడామైయాలే, శఙ్కాపరిహారముఖేన అరుళిచ్చెయ్కిఱార్ (ఆఴ్వారిత్యాది).



"శతిర్త్తే నిన్ఱే" ఎన్ఱు నీర్ సన్తోషిత్తిరున్దీర్; ఇతు నిలైనిఱ్క ప్పుకుకిఱతో? విషయాన్తరఙ్గళై అనాదియాక అనుభవిత్తవాసనైయాలే నీర్తామ్ తిరుమ్బినాలో? ఎన్ఱు శఙ్కా హృదయమ్. భగవత్ప్రసాదమ్బోలే ఆఴ్వార్ప్రసాదమ్ మధ్యే నఴువినాలో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (శుచీనా మిత్యాది). ఇవ్వర్థత్తుక్కు పూర్వార్ధత్తిలే నోక్కాయ్, భగవద్విషయత్తిలుమ్ నాన్ పోకాతే యావదాత్మభావి తమ్మై ఏత్తుమ్బడి నిర్హేతుకమాక అరుళిన ఆఴ్వారుడైయ కృపైయై, భక్తినిష్ఠరై యోగభఙ్గాదికళై యిట్టు క్కైవిడుమవన్ కృపైయోడు సమమెన్నలామో? ఎన్ఱు కరుత్తు.

వ్యాఖ్యానమ్ : భగవత్ప్రసాదత్తిలు మతిశయితమాన ఆఴ్వారుడైయ ప్రసాదత్తుక్కు ఏఴు జన్మమ్ తన్ పుకఴ్ఏత్త ప్పణ్ణినాల్, ఎన్నాల్ ఏత్త ఆకామైయాలే అనన్తకాలత్తుక్కు ముపలక్షణమాక్కుకిఱార్ (ఏఴు జన్మ మెన్ఱిత్యాది).

అరుళిన ప్పిన్బన్ఱో "ఎమ్పిరాన్" ఎన్ఱు ఉపకారానుసన్ధానమ్ పణ్ణ ప్రాప్తమ్, మున్నే తానే "ఎమ్బిరాన్" ఎన్బానెన్? ఎన్గిఱ శఙ్కైయై ఉపకారస్మృత్యతిశయత్తాల్ శొన్నార్ –ఎన్ఱు సదృష్టాన్తమాక ప్పరిహరిక్కిఱార్ (పిరానిత్యాది). కీఴ్ వాక్యవివరణమ్ (ఉపకారస్మృతియాలే –ఇత్యాది)

"తన్పుకఴ్" ఎన్బానెన్? అవన్ పుకఴ్ ఎన్నవేణ్డావో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (ఆఴ్వారుడైయ–ఇత్యాది). అనవరతభగవదనుభవపరరాన ఆఴ్వారై త్తామ్ అనుభవిక్కుమ్బోతు అన్ద భగవదనుభవమ్ ఇతిలే లభిక్కుమెన్ఱు ఇవ్వాక్యత్తుక్కు త్తాత్పర్యమ్.

హేతువై చ్చొల్లామైయాలే ఫలితమ్ (నిర్హేతుకేత్యాది). ఎన్నై యరుళినాన్– ఎన్నాతే, కేవలమ్ "అరుళినాన్" – ఎన్గైయాలే ఆఴ్వార్ 'ఎనక్కరుళినాన్' ఎన్నాతవోపాతి అరుళిచ్చెయ్తార్– ఎన్గిఱార్ (మయర్వఱ ఇత్యాది). అరుళుక్కు మున్బు తమ్మైయు ముళరాక నినైత్తిరార్ – ఎన్ఱు కరుత్తు. నిన్ఱు తన్ పుకఴ్ఏత్తుకైక్కు హేతువాక నమ్బిపద తాత్పర్యమ్ (తమ్మైయు మిత్యాది). ప్రకారాన్తరేణ వర్ణియాతే ఇప్పడి వర్ణిప్పానెన్? ఎన్న; అతుక్కు హేతువై అరుళిచ్చెయ్కిఱార్ (కున్ఱమ్బోలిత్యాది).

"ఎన్ఱుమ్" ఎన్గత్తైయుమ్, "ఎన్నై" ఎన్గత్తైయుమ్ సమమాకక్రియైయిలే అన్వయ ఙ్గాట్టి, క్రమేణ వివరిక్కిఱార్ (ఎన్ఱు మిత్యాది వాక్యచతుష్టయత్తాలే). "ఎన్నై" ఎన్గతుక్కు

**అర్థాన్తరమ్ (తన్దిరువడికళిత్యాది). "కున్ఱ మాడ త్తిరుక్కురుకూర్ నమ్బియాన ఎమ్బిరాన్, ఇన్ఱు తొట్టుమ్ ఎழுமైయుమ్ నిన్ఱు తన్‌పుకழ்ఏత్త అరుళినానాకైయాలే ఎన్ఱు మెన్నై యికழ் విలన్ కాణ్‌మిన్" ఎన్ఱు అన్వయమ్.**

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**ఆఱవ పాశురం - అవతారిక : "కురుకూర్ నమ్బిక్కు న్బనాయ్ అడియేన్ శదిర్‌త్తేన్ ఇన్ఱే"**(5) అని అంటూ ఆழ்వార్లు ఇక్కడే మిమ్ములను కటాక్షించినట్లు పలికారు. అయినా, మీరు అనాదికాలంగా శబ్దాదిలౌకికవిషయాలలో అలవాటు పడినవారైనందున, ఆ శబ్దాది లౌకిక విషయాలు మిమ్ములను మళ్ళీ వశం చేసికొంటే ఏం చేస్తారు?" అనే ప్రశ్న లేవగా, "ఆ రీతిలో తిరిగి అవి వచ్చి నన్ను వశం చేసికొనే అవధిలో ఆழ்వార్లు నాకు దయ చూపలేదు. సదా నేను వాటిని జయించగలిగేటట్లుగానే ఆழ்వార్లు నన్ను అనుగ్రహించారు- అని అంటున్నారు మధురకవులు, ఈ పాశురంలో. భగవానుని దయ అయితే, **"ప్రాప్య పుణ్యకృతాన్ లోకాన్ ఉషిత్వా శాశ్వతీః సమాః, శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే"** (గీత-6-14) (యోగాన్ని ఆరంభించిన తరువాత, ఆయోగ నుండి భ్రంశం పొందినవాడు, ఆ యోగమాహాత్మ్యంవల్ల పుణ్యం చేసినవారి లోకాలను పొంది, చిరకాలం అక్కడ సుఖంగా ఉండి, పరిశుద్ధిని పొందినవారు, గుణసంపత్తిని కలవారైన మహాత్ముల ఇంటిలో జన్మిస్తాడు) అని గీతలో, **"సమాధిభంగః తస్యాసీత్ తన్మయత్వాదృతాన్మనః, సంత్యక్త రాజ్యభోగార్థీ స్వజనస్యాపి భూపతేః"** (విష్ణు-పు-2-13-29) (జింకనుగూర్చే భావించే మనస్సును కల ఆ రాజుకు రాజ్యం, గొప్ప సంపద, బంధువులు- మొదలైనవారిని అందఱిని విడచిపెట్టినా, సమాధిభంగం కల్గింది) అని శ్రీవిష్ణుపురాణంలోను చెప్పబడిన రీతిలో ఆ కృప భ్రంశం పొందే అవకాశం ఉన్నది. ఆழ்వార్ల కృప అటువంటిది కాదు- అని ఆழ்వార్ల కృపకు కల వైలక్షణ్యాన్ని గూర్చి పల్కుతున్నారు.

**వ్యాఖ్య : (ఇన్ఱు తొట్టుమ్)-** ఆழ்వార్లు నన్ను కటాక్షించిన ఈనాటినుండి- అని అర్థం. భగవానుని ఆశ్రయిస్తే, అతనిని ఆశ్రయించిన వెంటనే ఫలం లభిస్తుంది- అని నిశ్చయంగా చెప్పడానికి వీలులేదు. ఆశ్రయించిన చాలాకాలం గడచిన పిమ్మటనే ఫలం సిద్ధిస్తుంది. ఆழ்వార్ల విషయంలో ఆవిధంగా కాదు. ఆழ்వార్లు కటాక్షించిన



ఈ నాటినుండే వారిని అనుభవించే (దర్శించి ఆనందించే) ఫలానుభవకాలంగా కదా ఉన్నది.

**(ఎழுమైయుమ్)-** ఏడు జన్మాలలోను- అని అర్థం. ఇది, ఇకపైగల కాలానికి అంతటికీ ఉపలక్షణం.

**(ఎమ్బిరాన్)-** నాకు ఉపకారం చేసినవారని అర్థం. లేక, నా స్వామి- అని కూడా చెప్పవచ్చు. **"పిరాన్ పెరునిలమ్ కీణ్డవన్"** (తిరువాయ్-1-7-6) (ఉపకారకుడు, గొప్పదైన భూమిని ఉద్ధరించినవాడు) అని భగవానుని విషయంలో ఆழ்వార్లు పలికే సూక్తిని, ఆ భగవానునకు ఉపకారం చేసినవారైనందున ఆழ்వార్ల విషయంలో పల్కుతున్నారు (మధురకవులు).

**(నిన్ఱు)-** ఒకేవిధంగా స్థిరంగా నిలచి- అని అర్థం. భగవానుని, "ఉపకారం చేసినవాడు" అనే కారణంచేత ఆ భగవానుని పొందే వరకు ఆழ்వార్లను అనుభవించి, ఆழ்వార్లను విడచిపెట్టడం కాకుండా తరువాత భగవానుని పొందగానే, ఆ భగవానుని అనుభవించి, ఎల్లప్పుడు ఆழ்వార్లనే అనుభవించేటట్లుగా స్థిరంగా నిలచి- అని భావం.

**(తన్‌పుకழ் ఏత్త)-** తమ (కీర్తిని) కల్యాణగుణాలను స్తుతించేటట్లుగా- అని అర్థం. **"పెరుమాయన్"** అని భగవానుని గుణాలను స్తుతిస్తున్నారు కదా, వీరు- అని అంటే, ఆழ்వార్ల గుణాల (కీర్తి) అనుభవంలోనే భగవానుని కీర్తికూడా అంతర్భవించి ఉండడంచేత **"తన్ పుకழ்"** అని అనడంలో లోటులేదు.

**(అరుళినాన్)-** నా దగ్గర ఏవిధమైన **"కైమ్ముదల్"** ను (ఉపాయానుష్ఠానాన్ని - పెట్టుబడిని) ఎదురు చూడకుండా, తానే స్వయంగా అనుగ్రహించారు. **"మయర్వఱ మదినలమ్ అరుళినన్"** (భ్రమవిప్రలంభాది దోషరహితమైన, భక్తిరూపంగా పరిణమించిన జ్ఞానాన్ని అనుగ్రహించాడు) (తిరువాయ్-1-1-1) అని ఆழ்వార్లు భగవానుని విషయంలో పల్కిన మాటను ఆழ்వార్ల విషయంలో మధురకవులు పల్కుతున్నారు.

**(కున్ఱ మాడ త్తిరుక్కురుకూర్ నమ్బి)-** పర్వతంవంటి మేడలను కల తిరుక్కురుకూర్‌కు నాథులైన గుణపూర్ణులు - అని అర్థం. తమను స్తుతించి, మఱి ఒకరిని (భగవానుని) కూడా స్తుతించేటట్లుగా ఆழ்వార్ల పూర్తి ఉండదు. **'కున్ఱమ్ పోల్ మణిమాడ నీదు తిరుక్కురుకూర్"** (తిరువాయ్-4-10-1) (కొండలవంటి

మణిమయహర్మ్యాలను కల విశాలమైన తిరుక్కురుకూర్) అని ఆళ్వార్లు అనుగ్రహించడం వీరి మనస్సులో స్థిరంగా నిలచి ఉన్నందున, దానినే ఇక్కడ పల్కుతున్నారు.

**(ఎన్టుమ్ ఎన్నై ఇకళ్‌విలన్) "ఎన్టుమ్ ఇకళ్‌విలన్, ఎన్నై ఇకళ్‌విలన్"** అని రెండు పదాలతోను **"ఇకళ్ విలన్'** అనే పదాన్ని అన్వయించి అర్థాన్ని చెప్పాలి. అంటే- నా ఆత్మ ఉండే అన్ని కాలాలలోను నేను మళ్ళీ ఇంకొక విషయంలో అభిరుచిని పొందేటట్లుగా నన్ను విడచిపెట్టరు. నా నైచ్యాన్ని గమనించకుండా, నన్ను అనుగ్రహించినవారు, నేను, తమను వీడి ఇంకొక విషయాన్ని అన్వేషించి పోయేటట్లుగా నన్ను విడచిపెడతారా ? తమ శ్రీచరణాలను తప్ప వేఱు ధ్యాసలేకుండా ఉండే నన్ను, నేనే తమకు దూరంగా తొలగిపోవాలని చూచినా నన్ను విడచిపెడతారా?

**(కాణ్‌మినే)-** ఇది సాక్షాత్తుగా దర్శించి తెలియవలసిన విషయమై ఉన్నప్పుడు, ఆళ్వార్ల గొప్పతనాన్ని నేను చెప్పి వినవలసిన ఆవశ్యకత లేదుకదా- అని అంటున్నారు.

### నఞ్జీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

**అవతారిక : "అడియేన్ శదిర్త్తేన్ ఇన్టే"** అని అంటూ ఫలాన్ని (ప్రాప్యాన్ని) పొందినట్లుగా పల్కుతున్నారే ! అది ఏవిధంగా ? అనే ప్రశ్న రాగా, **"వీవిల్ కాలమ్ ఇశైమాలైకళ్ ఏత్తి మేవ పెఱ్ఱేన్"** (తిరువాయ్- 4-5-3) (అవిచ్ఛిన్నంగా సంగీతాత్మకాలైన పాశురమాలికలతో స్తుతించి భగవానుని ఆశ్రయించగలిగాను) అని ఆళ్వార్లు భగవానుని విషయంలో పల్కినట్లుగా, కాలం ఉన్నంతవరకు ఎల్లప్పుడు తమనే స్తుతించేటట్లుగా నన్ను ఆళ్వార్లు అనుగ్రహించారు- అని ఈ పాశురంలో మధురకవులు పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్ : (ఇన్టు తొట్టుమ్)-** భగవానునికంటే ఆళ్వార్లు ప్రాప్యులు - (ఉద్దేశ్యభూతులు) అనే రుచిని కల్గిన ఈ నాటినుండి - అని భావం.

**(ఎళుమైయుమ్ ఎమ్బిరాన్)-** ఇకపై గల కాలంలో అంతా అంతరాయం లేకుండా సదా నాకు ఉపకరించిన ఆళ్వార్లు- అని అర్థం. గడచిన కాలాన్నికూడా, నాకు రుచి లేనందున, కోల్పోయాను (వారిలో లోటు లేదు) .

**(నిన్టు) -** మొదటి పర్వమైన భగవానుడైతే, అందులో స్థిరంగా నిలచి ఉండకుండా పోవలసివస్తుంది. చరమపర్వంలో ప్రవేశించిన నేను అక్కడే స్థిరంగా నిలచి ఉన్నాను- అని భావం. **"మానిడమ్ పాడ వన్ద కవియే నల్లేన్"** (తిరువాయ్-3-9-9) (మానవులను పాడవచ్చిన కవిని కాను) అని ఆళ్వార్లు స్తుతించేటపుడు మానవులను కాదన్నారు. వీరు సాక్షాత్తు భగవానునే కాదంటున్నారు.



**(కున్టమాడ త్తిరుక్కురుకూర్ నమ్బి)** -ఆళ్వార్ల పూర్తి అంతు లేనిది అయినట్లే, మేడల ఔన్నత్యం కూడా అంతు లేనిదిగా ఉన్నది.

**(ఎన్టుమ్ ఎన్నై ఇకళ్‌విలన్)-** తాము, ఆళ్వార్లను స్తుతించడానికి గల కారణాన్ని పల్కుతున్నారు. ఆళ్వార్ల సాన్నిధ్యమే వీరిని పల్కిస్తున్నది.

**(కాణ్‌మినే)-** మీవలె భగవద్విషయంలో కవిని కాకుండా, నేను ఆళ్వార్ల విషయంలో కవిని అయిన రీతిని మీరు గమనించలేదా! – అని అంటూ మిగిలిన ఆళ్వార్లను ఉద్దేశించి పల్కుతున్నారు (మధురకవులు).

### నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

**అవతారిక :** గడచిన పాశురంలో, ఆళ్వార్ల శ్రీచరణాలపట్ల తమకు ఉండే జ్ఞానభక్తులనుగూర్చి పలికారు. ఇందులో, వారి విషయంగా తమకు గల నిశ్చయాన్ని గూర్చి పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్ : (ఇన్టు తొట్టుమ్)-** నా దోషమే ఆలంబనంగా (**"కైమ్ముదల్"**గా- పెట్టుబడిగా) నన్ను పరిగ్రహించిన ఈనాటినుండి.

**(ఎళుమైయుమ్)-** పరమపదాన్ని కూడా లెక్కించకుండా ఆళ్వార్ల సాన్నిధ్యంలోనే ఒదిగి ఉండే వారు, వీరు. మేనమామ ఇంటికి వెళ్ళిన భరతుని వెంటపోయిన శత్రుఘ్నాళ్వాన్ వలె ఉండే వారు, వీరు (మధురకవులు)

**(ఎమ్బిరాన్)-** నాకు స్వామి- అని అర్థం. **"పిరాన్"** -స్వామి. సొత్తుదారుడు సొత్తులోని దోషాన్ని చూచి విడచి దానిని పెడతాడా ?

**(ఎళుమైయుమ్ ఎమ్బిరాన్)-** తమను, ఒక సమయంలో భగవానుని సొత్తుగాను, ఇంకొక సమయంలో ఆళ్వార్ల సొత్తుగాను ఉండకుండా, ఎల్లప్పుడూ ఆళ్వార్ల సొత్తుగా వీరు తమను భావిస్తున్నారు.

**(ఎమ్బిరాన్)-** భగవానునివద్ద నన్ను సమర్పించకుండా, తామే నన్ను పరిగ్రహించిన మహోపకారకులు. **"పిరాన్"** -ఉపకారకులు. ఆ ఉపకారాన్ని వివరిస్తున్నారు, ఇకపై- **"ఇన్టు తన్ పుకళ్ ఏత్త అరుళినాన్"** అని అంటూ

**(ఏత్త)– “నఱ్పావై పూవీన్ఱ వణ్ణన్ పుకళ్ ఇయఱ్ఱువాయ్”** (పెరియ తిరువన్దాది–1) (మనసా ! నాభిలో పద్మాన్ని జనింపజేసిన స్వామి కల్యాణగుణాలను స్తుతించు) అని ఆరంభించి, **“మొయ్ కళలే ఏత్త ముయల్”** (ఓ మనసా! ధ్వనించే కడియాలను కల భగవానుని శ్రీచరణాలనే స్తుతించడానికి ప్రయత్నించు) (పెరియ తిరువన్దాది–87) అని చివరి పాశురంవరకు స్తుతించడానికి ప్రయత్నించి విరమించిన ఆళ్వార్ల వలె కాకుండా, దశకరూపంలోని ఈప్రబంధంలో పది పాశురాలు పూర్తిగా తాము ఆళ్వార్లను స్తుతించిన రీతిని గూర్చి ఈ విధంగా పల్కుతున్నారు.

**(తన్పుకళ్ళేత్త)** –భగవానుని గుణాలవలె, జీవుల దోషాలను చూచి, చూచిన దోషాలకు తగిన దండనను ఇచ్చే రీతిలోనా, ఆళ్వార్ల గుణాలున్నాయి ? **“అన్నైయాయ్ అత్తనాయ్ ఎన్నై ఆణ్డిడుమ్ తన్మైయాన్”** (4) (తల్లియై, తండ్రియై, నన్ను పాలించే స్వభావాన్ని కలవాడై) అనే రీతిలో నాదోషాన్నే గుణంగా గ్రహించేవారు కదా, ఆళ్వార్లు– అని అంటున్నారు.

**(తన్ పుకళ్ళేత్త అరుళినాన్)–** ఆళ్వార్ల విషయంలో తాము చేసిన కవిత్వాన్ని పల్కడమనే కైంకర్యానికి సాధనం ఆళ్వార్ల కృపయే– అని నిశ్చయించుకొంటున్నారు.

**(నిన్ఱు తన్పుకళ్ ఏత్త అరుళినాన్)–** ఆళ్వార్ల గుణాలను కీర్తించడమే ప్రయోజనం; అది సిద్ధించడంకూడా వారి కృపవల్లనే – అనే నిశ్చయాన్ని కలవారై స్తుతించేటట్లు చేశారు, ఆళ్వార్లు. **“బహవో దుర్లభా శ్చైవ యే త్వయా కీర్తితా గుణా:, మునే! వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్త: శ్రూయతాం నర:”** (రామా–బాల–1–7) (ఓ మునివరా! నీచే కీర్తింపబడిన గుణాలు చాలా దుర్లభాలు, అనేకాలు. నేను తేటపడి ఆ గుణాలను కల్గిన మానవునిగూర్చి పల్కుతున్నాను. విను) అని శ్రీరామునిగుణాలను గూర్చి ఆలకించిన నారదునకువలె, వీరికికూడా ఆళ్వార్ల గుణాలను అనుసంధిస్తే **“కాల్ ఆళుమ్ నెఞ్జళియుమ్ కణ్ శుళలుమ్”** (పెరియ తిరువన్దాది–34) (కాళ్ళు తడబడతాయి. మనస్సు ద్రవిస్తుంది. కళ్ళు సుడులు తిరుగుతాయి) అనే స్థితి కల్గుతుంది కనుక, మనస్సును దిటవు చేసికొని స్తుతించేటట్లుగా పల్కుతున్నారు– అని కూడా చెప్పవచ్చు.

**(ఎన్ఱుమ్ ఎన్నై ఇకళ్విలన్)** నాకు దోషాలు మెండుగా ఉన్నపుడు, గుణాలు మెండుగా ఉన్నపుడు, తేడాలేకుండా, భేదం చూపకుండా, నన్ను అనాదరించకుండా ఆళ్వార్లు ఉన్నారు.



**(కున్ఱమాడ... ఎన్నై ఇకళ్విలన్)–** పర్వతంవలె చలించని ఆ మేడలకు చలనం కల్గినా, ఆళ్వార్ల మనస్సు నా విషయంలో చలించదు.

**(కాణ్మినే)– “ఆరభ్యతే న ఖలు విఘ్నభయేన నీచై:, ఆరభ్య విఘ్ననిహతా: విరమంతి మధ్యా:, విఘ్నై: పున: పునరపి ప్రతిహన్యమానా ఆరబ్ధముత్తమగుణా న పరిత్యజంతి”** (భర్తృహరి నీతిశతకమ్–72) (నీచ గుణాలను కలవారు అంతరాయాలకు భయపడి కార్యాలను ఆరంభించరు. మధ్యములు వారంభించిన తరువాత అడ్డంకులు వస్తే ఆ కార్యం నుండి విరమిస్తారు. ఉత్తములు ఎన్ని అడ్డంకులు మాటి మాటికి ఎదురైనా ఆరంభించిన కార్యాన్ని ఉత్తములు ఏనాటికి విడువరు) అని, **“పణ్ణార్ తిణ్ణ మిరుక్క ఇని ఇవళ్ నాణుమో ?”** (పెరియతిరుమొళి–8–2–2) అని గల ప్రమాణాలు తెల్పిన రీతిలో, ఆళ్వార్లు, ఈనాడు ఉండే రీతిలోనే ఏనాడూ నన్ను విడచిపెట్టరు– అనే విషయాన్ని మీరే గమనించి తెలియవచ్చు.

**కణ్డు కొణ్డు ఎన్నై క్కారిమాఱప్పిరాన్,**
**పణ్డై వల్వినై పాఱ్ఱి యరుళినాన్,**
**ఎణ్ తిశైయుమ్ అఱియ వియమ్బుగేన్,**
**ఒణ్తమిళ్ శడకోప నరుళైయే.** 7

పిరాన్ = పరమోపకారకులై, కారి మాఱన్ = “పొఱ్కారియార్”కు కుమారులైన నమాళ్వార్లు, ఎన్నై = (తమ గొప్పతనాన్ని తెలియని) నన్ను, కణ్డు= కటాక్షించి, కొణ్డు = పరిగ్రహించి, పణ్డై వల్ వినై = అనాది కాలంగా (నేను చేసిన) మిక్కిలి బలమైన పాపాలను, పాఱ్ఱి అరుళినాన్ = నశించి పోయేటట్లుగా చేసి అనుగ్రహించారు, (అందువల్ల), ఒణ్ తమిళ్ శడకోపన్ అరుళైయే = అందమైన ద్రావిడ పాశురాలకు స్థానమైన ఆళ్వార్ల కృపనే, ఎణ్ తిశైయుమ్ = ఎనిమిది దిక్కులలో ఉండేవారు సైతం, అఱియ = తెలిసేటట్లుగా, ఇయమ్బుకేన్= పల్కుతాను. (ప్రకటిస్తాను)

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్ :

**అవ - ఏళామ్పాట్టిల్, ఆళ్వార్ తమ్బక్కల్ పణ్ణిన నిర్హేతుకవిషయీకారత్తై క్కణ్డు. “ఇవ్విషయీకారత్తుక్కు యోగ్యతై యుణ్డాయిరుక్క, నాట్టార్ ఇళక్కైక్కడి ఎన్?” ఎన్ఱనుసన్ధిత్తు, “ఇవరుడైయ పెరుమైయై యఱియామైయాలే ఇళక్కిఱార్కళ్” ఎన్ఱు ఎల్లారుమఱియుమ్బడి శొల్లక్కడవేన్–ఎన్గిఱార్.**

వ్యా - (కణ్డు కొణ్డు) నాన్ కిట్టినవళవిల్ ఆழ்వార్ తిరువుళ్ళమ్ నిధి ఎడుత్తాప్పోలే ఇరున్దతు-ఎన్గిఱార్. తమ్మై పెఱుకైక్కు ఎతిర్ శూழ்ల్ పుక్కు త్తిరిన్దార్, ఇవర్" ఎన్ఱు తోற்ఱుమ్బడి ఇరున్దతు - ఎన్గిఱార్

అవరుడైయ కృపైక్కు అనుత్తమమాన పాత్రమిఱే, నాన్. (ఎన్నై) నాట్టారిఴ్కాట్టిల్ ఆழ்వారుక్కుణ్డాన వాశి అఱియాద ఎన్నై. తమ్ముడైయ నిర్హేతుకవిషయీకారత్తై ప్రతిపత్తిపణ్ణవుఴ్గాడ మాట్టాత ఎన్నై - ఎన్ఱుమామ్.

(కారిమాఱ ప్పిరాన్) ఆழ்వార్ తమ్ పక్కలిలే పణ్ణిన ఉపకారత్తై నినైత్తు "పిరాన్" ఎన్గిఱార్. "కారిమాఱ ప్పిరాన్" ఎన్గిఱ విశేషణత్తాలే, ఆழ்వారుక్కు ఉపకారకనాన ఈశ్వరన్ పక్కల్ పోకామైక్కాక విశేషిక్కిఱార్. "సుహృదం సర్వభూతానామ్" ఎన్గిఱపడియే అవనుడైయ ఉపకారకత్వమ్ సర్వసాధారణ మాయాయ్త్తిరుప్పతు. అన్ద సామాన్యత్తిల్ పుకామైక్కాక త్తమ్ముడైయ సుహృత్త్వత్తై విశేషిక్కిఱార్.

(పణ్డై నల్ వినై) అనాదికాలమ్ సఞ్చితమాయ్ విషయాన్తరప్రావణ్య హేతువాన పాపమ్, శూర్పణఖైయైప్పోలే, వకుత్త విషయత్తై ప్పుఱ్ఱుకైక్కు వழி యల్లా వழிయే యిழி కికైక్కడియాన పాపమ్, "ప్రథమావధియాన భగవద్విషయమే పురుషార్థమ్" ఎన్గిఱ బుద్ధిక్కు అడియాన పాపమ్, ఇవై యాయ్త్తు- పణ్డై నల్ వినైయావతు. వల్ వినై - ప్రాయశ్చిత్త సాధ్యమమన్ఱిక్కే, అనుభవవినాశ్యము మన్ఱిక్కేయిరుక్కై.

(పాఱ్ఱి యరుళినాన్) "ద్విషన్తః పాపకృత్యామ్" ఎన్ఱుమ్, "శుమ్మెనా తే కైవిట్టోడి త్తూఱుకళ్ పాయ్న్దనవే" ఎన్ఱుమ్ శొల్లుకిఱ ప్రకారఙ్గళన్ఱిక్కే, ఉరు మాయ్న్దు పోమ్బడి పణ్ణినార్. "తన్ పుకழ்ేత్త అరుళినాన్" ఎన్గిఱపడియే తమ్మైయే వాయ్ పులత్తుమ్బడి పణ్ణినార్.

(ఎణ్డిశైయు మఱియ వియమ్బుకేన్) విశేషజ్ఞరోడు, అవిశేషజ్ఞరోడు వాశియఱ ఎల్లారు మఱియుమ్బడి శొల్లుకిఱేన్. "తొణ్డీర్ ఎల్లీరుమ్ వారీర్"



ఎన్నుమ్ ఆழ்వారోట్టై వాసనైయాలే శొల్లుకిఱార్, అవర్, భగవద్విషయత్తిల్ రుచియాలే "అవ్విషయత్తిల్ రుచియుడైయర్ ఎల్లారుమ్ వారుఙ్గోళ్" ఎన్షార్. ఇవర్ "ఆழ்వార్ పక్కల్ రుచియుడైయార్ ఎల్లారుమ్ వారుఙ్గోళ్" ఎన్గిఱార్, ఆழ்వార్ పక్కల్ భావబన్ధత్తాలే.

(ఒణ్డమిழ் శడకోపనరుళైయే) "మయర్వఱ మతినల మరుళిన" వనుడైయ అరుళ్పోలల్ల, ఆழ்వారుడైయ అరుళ్. అవ్వరుకుక్కుమ్ అయలాన వళవిలే వరప్పణ్ణి అరుళిన అరుళిఱే. ఒణ్డమిழ் - ఒళ్ళియ తమిழ். అழకియ తమిழ் ఎన్నపడి. "పాలేయ్ తమిழர் ఇశై కారర్ పత్తర్" పరవుమ్బడి తిరువాయ్ మొழி పాడిన అరుళుక్కు మేలేయిఱే ఎన్నై విషయీకరిత్త అరుళ్.

## అరుమ్బద విళక్కమ్

ఏழாమ్పాట్టు : కీழ் ప్పాట్టిల్ "నిన్ఱు తన్పుకழ்ేత్త అరుళినాన్" ఎన్ఱు ఆழ்వారుడైయ నిర్హేతుకకటాక్షత్తై అనుసన్ధిత్తవర్ ఎల్లార్క్కుముణ్డాక వేణ్డుమెన్ఱు "ఎణ్డిశైయు మఱియ వియమ్బుకేన్" ఎన్గైయాలే తదనుగుణమాక సఙ్గతి అరుళిచ్చెయ్ కిఱార్ (ఆழ்వార్తమ్ పక్కలిత్యాది).

"కణ్డు కొణ్డు" ఎన్ఱతుక్కు- కాణాతతై క్కణ్డేన్ఱుమ్, తేడినతై క్కణ్డేన్ఱుమ్, ఇరణ్డు తాత్పర్యమ్; ఇవ్విరణ్డైయు మదైవే అరుళిచ్చెయ్కిఱార్ (నాన్కిట్టిన ఇత్యాది వాక్యద్వయత్తాలే).

ఇప్పడి తమ్మిడత్తిల్ ఇరుక్కైక్కుడి ఎన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (అవరుడైయ ఇత్యాది). (అనుత్తమమ్) యస్మాదుత్తమమ్ నాస్తి తదనుత్తమ మెన్ఱు బహువ్రీహి. దోషభూయిష్ఠతైయాలే తామే కృపైక్కు ఉత్తమమాన పాత్ర మెన్నపడి. "అఱియ వియమ్బుకేన్" ఎన్న ఉత్తమనాలే "ఎన్నై" ఎన్నతు సిద్ధమన్నో, "ఎన్నై" ఎన్ఱు శొల్లవేణ్డుమో? ఎన్న; ఇతుక్కు ఇరణ్డు తాత్పర్య మరుళిచ్చెయ్కిఱార్ (నాట్టారిత్యాది వాక్యద్వయత్తాలే).

"కారిమాఱన్" ఎన్నాల్ పోరాతో, "పిరాన్" ఎన్న వేణ్డుమో? ఎన్న; అరుళిచ్చెయ్ కిఱార్ (ఆழ்వారిత్యాది). "పిరాన్" ఎన్నాల్ పోరాతో, "కారిమాఱ"పదన్దాన్ ఎన్? ఎన్న

అరుళిచ్చెయ్‌కిఱార్ (కారి యిత్యాది). "కారి" ఎన్ఱు- ఆళ్వార్ తిరుత్తమప్పనార్, "మాఱన్" ఎన్ఱు- ఆళ్వార్ తిరునామమ్.

శ్రీమధురకవికళ్ నిష్ఠానుగుణమాక ప్రసిద్ధపాతకమాత్రమాక చ్చొల్లాతే పిన్నైయుమ్ ఉళ్ళ వఱ్ఱైయెల్లామ్ కూట్టి అరుళిచ్చెయ్‌కిఱార్ (అనాదీత్యాది వాక్యచతుష్ట యత్తాలే).

"పాఱ్ఱి" ఎన్ఱతు- నశిప్పిత్తు -ఎన్ఱు అర్థమాయ్, అత్తై వ్యావర్త్యపూర్వకమాక అరుళిచ్చెయ్‌కిఱార్ (ద్విషన్త- ఇత్యాది). పాపకృత్యామ్-పాపక్రియైయై. "కృత్యా క్రియాదేవతయోః" ఎన్ఱితే నిఘణ్టు. "అరుళినాన్" ఎన్ఱతుక్కు అర్థమ్ (తన్ పుకళ్త్యాది). ఎణ్డిశై యెన్ఱతు- ఎట్టు దిక్కుకళెన్ఱాయ్, అతు- "మఞ్చాః క్రోశన్తి"పోలే తత్రత్యరై చ్చొల్లుకిఱతు - ఎన్గిఱార్ (విశేషేత్యాది). ఆళ్వారై అనుభవిక్కిఱ ఇవర్. పరోపదేశ ప్రవృత్తరాయ్, ఎల్లారైయు మఱ్ఱైక్కిఱతెన్? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (తొణ్డీరిత్యాది వాక్యత్రయత్తాలే).

"శడకోపనరుళ్" ఎన్ఱతుక్కు వ్యావర్త్యపూర్వకమాక త్తాత్పర్యమ్ (మయర్వఱ ఇత్యాది) వ్యావృత్తిత్తన్నై ఉపపాదిక్కిఱార్ (అవ్వరుళుక్కు మిత్యాది) (అయలాన) అశలాన. "ఒణ్డమిళ్" ఎన్ఱు విశేషిక్కైయాలే తిరువాయ్‌మొళ్ అరుళిచ్చెయ్‌త అరుళ్ తోన్ఱుకైయాలుమ్, "శడకోపనరుళ్" ఎన్నైయాలే- పణ్డై వల్వినై పాఱ్ఱి అరుళిన అరుళై చ్చొల్లుకైయాలుమ్, ఇవ్విరణ్డుక్కుమ్ విశేషత్తై దర్శిప్పిక్కిఱార్ (పాలేయిత్యాది). "కారిమాఱప్పిరాన్ ఎన్నై క్కణ్డుకొణ్డు, పణ్డైవల్వినై పాఱ్ఱి యరుళినాన్; ఇన్ద ఒణ్డమిళ్ చ్చడకోపనరుళై, ఎణ్డిశైయు మఱియ వియమ్బుకేన్" ఎన్ఱు అన్వయమ్.

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**ఏడవ పాశురం - అవతారిక :** గడచిన పాశురంలో, ఆళ్వార్లు తమను నిర్హేతుకంగా దాసునిగా పరిగ్రహించిన విషయాన్ని అనుసంధించారు. మిగిలినవారుకూడా ఈవిధంగా ఆళ్వార్ల కరుణకు పాత్రం అయే యోగ్యత ఉన్నప్పటికీ, వారు కోల్పోవడానికి కారణం, ఆళ్వార్ల గొప్పతనాన్ని వారు తెలియకపోవడమే- అనే విషయాన్ని తెలిసికొని, వారి (ఆళ్వార్ల) మహిమను అందఱు తెలిసేటట్లుగా పలుకగలను- అని ఈ పాశురంలో అంటున్నారు.



**వ్యాఖ్యానమ్ : (కణ్డు కొణ్డు)** నేను ఆళ్వార్లను చేరిన వెంటనే వారి మనస్సు నిధిని పొందినట్లుగా అయినది- అని అంటున్నారు. ఆ రీతిలో కాకుండా, తమను పొందడానికి **"ఎదిర్ శూళ్ల్"** (ఎదురు ఉపాయాలను) చేస్తూ సంచరించారు, వీరు (ఆళ్వార్లు)- అని తోచేరీతిలో ఉన్నది- అని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. **"నిమజ్జతోఽనంతభవార్ణవాంతః చిరాయ మే కూల మివాసి లబ్ధః, త్వయాపి లబ్ధం భగవన్! ఇదానీ మనుత్తమం పాత్ర మిదం దయాయాః"** (స్తోత్రరత్నం-24) (దేశాన్ని బట్టి, కాలాన్నిబట్టి, వస్తువునుబట్టి పరిచ్ఛేదాన్ని లేని స్వామీ ! సంసారమనే సముద్రంలో చిరకాలం మునిగి ఉండే నాకు తీరంవలె నీవు దొరికావు. భగవన్ ! నీ చేత కూడా ఇపుడు నీ కరుణకు తగిన గొప్ప పాత్రమైన ఈ వస్తువు (దాసుడనైన నేను) లభించింది) అని శ్రీయామునులు భగవానుని కృపకు తమను సాటిలేని పాత్రంగా పల్కినట్లుగానే, వీరు ఆళ్వార్ల కృపకు సాటి లేని పాత్రంగా తమను పల్కుతున్నారు. తమకు దోషాలు నిండి ఉన్నందున తామే ఆళ్వార్ల కృపకు ఉత్తమమైన పాత్రం- అని భావం.

**(ఎన్నై)- "అఱియ ఇయమ్బుకేన్"** అని పల్కినపుడే **"ఎన్నై"** అనే అర్థతః సిద్ధిస్తుంది కదా ! ప్రత్యేకంగా **"ఎన్నై"** అని పలకాలా ? అని అంటే, రెండు విధాలైన నైచ్యాలు తమకు ఉన్నాయని తెలుపడం కోసం పల్కుతున్నారని చెప్పవచ్చు. ఆ రెండు నైచ్యాలు ఏవి ? అంటే -(1) ఆళ్వార్లను ఆశ్రయించినపుడు సంసారులకంటే వారికి గల గొప్పతనాన్ని తెలియకుండా ఉండే నన్ను, (2) ఆళ్వార్ల నిర్హేతుకమైన కటాక్షాన్ని "ఇటువంటిది" అని తెలియలేని నన్ను. (అనేవి ఈరెండు నైచ్యాలు)

**(కారిమాఱ ప్పిరాన్)- "కారి మాఱన్"-** అని అంటేనే చాలి ఉండగా, ఆళ్వార్లు తమ విషయంలో చేసిన ఉపకారాన్ని తలచి, **"పిరాన్"** అని అంటున్నారు. **"పిరాన్"** అని సామాన్యంగా పల్కితే ఆ పదం ఆళ్వార్లకు ఉపకరించిన భగవానుని కూడా తెలుపుతుంది కనుక, దానిని లేకుండా చేయడం కోసం **"కారి మాఱప్పిరాన్"** అని అంటున్నారు. **"భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్, సుహృదం సర్వ భూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి"** (గీత-5-29) (యజ్ఞాలను, తపస్సులను, వాటి ఫలాలను పొందేవాడను, అన్ని లోకాలకు మహేశ్వరుడను, అన్ని జీవరాసులకు సుహృత్తును - మంచిని ఆశించి చేసేవాడనైన నన్ను తెలిసికొని శాంతిని పొందుతున్నాడు) అనే రీతిలో భగవానుడు ఉపకరించడం అందఱికి సాధారణంగా కదా ఉంటుంది. ఆ విధంగా సాధారణంగా కాకుండా, వీరు (ఆళ్వార్లు) ఉపకరించడం తమకే- అని సూచించడం కోసం **"కారిమాఱన్"** అని విశేషిస్తున్నారు.

**(పణ్డై వల్వినై)–** అనాది కాలంగా తాముచేసి చేర్చి, పేర్చిపెట్టుకొన్నది, శబ్దాది విషయాలలో అభినివేశాన్ని కల్గించే పాపం, శూర్పణఖనువలె, ప్రాప్తవిషయాన్ని (దివ్యదంపతులను) ఆశ్రయించేటపుడు, సీతాదేవిని వేఱుచేసి శ్రీరామునిమాత్రం ఆశ్రయించడానికి కారణమైన పాపం, ప్రథమపర్వమైన భగవానుని పురుషార్థమని భావించడానికి కారణమైన పాపం– మొదలైన పాపాలను ఉద్దేశించి **"పణ్డై వల్వినై"** అని అంటున్నారు. ఈ పాపాలను ప్రాయశ్చిత్తంద్వారా కూడా పోగొట్టుకోవడం వీలు కాదు. ఎన్ని కల్పాలు అనుభవించినా, అనుభవించి తీర్చుకోవడం వీలుకాదు. అందువల్ల **"వల్వినై"** అని అంటున్నారు.

**(పాఱ్ఱి యరుళినాన్) – "తస్య పుత్రా దాయ ముపయాంతి, సుహృద స్సాధుకృత్యాం, ద్విషంత: పాపకృత్యామ్"** (శాట్యాయనశాఖ) (మోక్షాన్ని పొందే మానవుని సొత్తును అతని పుత్రులు పొందుతున్నారు. పుణ్యాన్ని అతనికి అనుకూలురు పొందుతున్నారు. పాపాన్ని శత్రువులు పొందుతున్నారు) అని, **"శుమ్మెనాదే కైవిట్టోడి త్తూఱుకళ్ పాయ్న్దనవే"** (పెరియాழ్వార్ తిరు–5–43) (పాపాలు మాఱు మాట్లాడకుండా విడచిపెట్టి పరుగెత్తి పోయి పొదలలోకి దూరిపోయాయి) అని పల్కిన రీతిలో భగవానుడు పాపాలను పోగొట్టేటపుడు అవి నశించిపోకుండా, బంధువులు మొదలైనవారి దగ్గరకు చేరుతాయి. ఆ రీతిలో కాకుండా, ఆழ్వార్లు, నా పాపాలను రూపు మాపి అవి నశించేటట్లు చేశారు– అని భావం. **"పాఱ్ఱి"** –అని అంటూ అనిష్టమైన పాపాలు నశించిపోవడం తెలుపబడింది. **"అరుళినాన్"** అని, **"తన్పుకழ் ఏత్త అరుళినాన్"** (6) అనే రీతిలో నిరంతరంగా తమ గొప్పతనాన్నే పలికేటట్లు చేసిన ఇష్టప్రాప్తిని గూర్చి పల్కుతున్నారు.

**(ఎణ్డిశైయుమ్ అఱియ వియమ్బుకేన్)– "ఎణ్డిశైయుమ్"–** అని అంటూ ఎనిమిది దిక్కులను తెల్పినా, **"అఱియ"** అని తరువాత ప్రయోగించినందువల్ల, ఆ దిక్కులలో ఉండే జ్ఞానాన్ని కల్గిన చేతనులను ఈప్రయోగం లక్షణయా తెల్పుతుంది. ఎనిమిది దిక్కులలో ఉండే జీవులు– విశేషజ్ఞులు, అల్పజ్ఞులనే భేదం లేకుండా– అందఱు తెలిసేటట్లుగా పల్కుతాను– అని అంటున్నారు. **"తొణ్డీర్ ! ఎల్లీరుమ్ వారీర్"** (దాసులారా! అందఱు రండి) (తిరువాయ్–5–2–8) అని అందఱు వచ్చేటట్లుగా ఆழ్వార్లు ఆహ్వానించడం మధురకవులు విన్నందున ఈవిధంగా పల్కుతున్నారు. వారు, భగవానునిపట్ల గల అభిరుచివల్ల "ఆవిషయంలో రుచిని కలవారు అందఱు రండి"



అని అన్నారు. వీరు, ఆழ్వార్ల పట్ల అభినివేశాన్ని కలవారైనందున "ఆழ్వార్ల విషయంలో రుచిని కలవారు అందఱు రండి" అని అంటున్నారు.

**(ఒణ్ తమిழ் శడకోపనరుళైయే)–** ఆழ్వార్లకు **"మయర్వఱ మదినలమ్"** (భ్రమ విప్రలంభాది దోషాలు లేని భక్తి రూపాపన్న జ్ఞానాన్ని) (తిరువాయ్–1–1–1) అనుగ్రహించిన భగవానుని కృపవంటిది కాదు, ఆழ్వార్ల కృప. ఆ కృపకు (భగవత్కృపకు) తప్పిన వీరినిసైతం తమవద్దకు వచ్చేటట్లు చేసినది కదా, ఆழ్వార్ల కృప.

**(ఒణ్ తమిழ్)–** ప్రకాశాన్ని కల్గిన ద్రావిడం– అందమైన ద్రావిడపాశురాలు – అని అర్థం. తిరువాయ్మొழி మొదలైన నాల్గు దివ్యప్రబంధాలను ఆழ్వార్లు అనుగ్రహించిన విషయాన్ని దీనిద్వారా తెల్పుతున్నారు. **"ఒణ్ తమిழ్"** అని విశేషించినందున, **"పాలేయ్ తమిழர் ఇశైకారర్ పత్తర్ పరవుమ్ ఆయిరమ్"** (తిరువాయ్–1–5–11) (పాలవలె భోగ్యమైన ద్రావిడభాషను తెలిసినవారు, గానాన్ని తెలిసినవారు, భక్తులు కీర్తించే సహస్రం) అనే తిరువాయ్మొழிని పాడిన కృపను తెలిపి, **"శడకోపన్ అరుళ్"** అని అన్నందున ఆ కృపకంటే గొప్పది– తమను కటాక్షించిన కృప– అనే విషయాన్నికూడా తెల్పుతున్నారు.

**"కారిమాఱప్పిరాన్ ఎన్నై క్కణ్డు కొణ్డు పణ్డై వల్వినై పాఱ్ఱి యరుళినాన్, ఒణ్డమిழ் శడకోపన్అరుళై ఎణ్డిశైయుమ్ అఱియ వియమ్బుకేన్"** అని అన్వయం.

## నఞ్జీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

**(కణ్డుకొణ్డు ఎన్నై) – "ఇరున్దాన్ కణ్డుకొణ్డు"** (తిరువాయ్మొழி–8–7–2) అని అంటూ ఆழ్వార్లు, భగవానుడు తమను అలభ్యలాభంగా తలచి అనుగ్రహించిన విషయాన్ని తెలిపారు. ఇక్కడ, వీరు, (మధురకవులు) ఆழ్వార్లు తమను అలభ్య లాభంగా తలచి అనుగ్రహించిన విషయాన్ని తెల్పుతున్నారు. తమను అనుగ్రహించడం పరస్పర లాభంగా కాకుండా, కేవలం తమ ప్రయోజనంగానే తలచి ఆழ్వార్లు అనుగ్రహించారు.

**(కారిమాఱప్పిరాన్)–** ఆழ్వార్లు, **"పిరాన్ పెరునిలమ్ కీణ్డవన్"** (తిరువాయ్–1–7–6) (ఉపకారకుడు, విశాలమైన భూమిని ఉద్ధరించినవాడు) అని భగవానుని పల్కిన రీతిలో, వీరు కూడా **"కారి మాఱప్పిరాన్"** అని ఆழ్వార్లను ఉద్దేశించి

అంటున్నారు. ఆఴ్వార్లు భగవానుని **"పిరాన్"** అని కీర్తించినట్లుగా, వీరు ఆఴ్వార్లను **"పిరాన్"** అని కీర్తిస్తున్నారు.

**(పణ్డై వల్ వినై పాఱ్ఱి అరుళినాన్) – "పణ్డై"** అనేది –సంసారం ప్రవాహం వలె అనాది, ఆ ప్రబలకర్మయొక్క ఆదిని తెలిసిన వారు లేరు– అనే విషయాన్ని తెల్పుతున్నది.

**(ఒణ్డమిఴ్)**– స్వచ్ఛమైన నీటిలో బాగా లోతులో ఉండే వస్తువులు పైన స్ఫుటంగా కన్పిస్తాయి. అదే రీతిలో, వేదాలు సైతం "తెలియలేదు" అని వెనుకంజ వేసిన విషయాన్ని అందఱు తెలిసేటట్లు చేసినందున ఆఴ్వార్ల ప్రబంధం **"ఒణ్ తమిఴ్"** అని పలుకబడింది.

## నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

**అవతారిక : "గురుం ప్రకాశయేన్నిత్యమ్"** (గురువును ఎల్లప్పుడు ప్రకాశింపజేయాలి) అనే రీతిలో ఆచార్యుని అందఱు తెలిసేటట్లుగా వ్యక్తం చేయాలి– అనే విధిని అనుసరించి, నమ్మాఴ్వార్ల కీర్తిని ఎనిమిది దిక్కులలోను తెలిసేటట్లు పల్కుతాను– అని అంటున్నారు.

ఆఴ్వార్లకు పలు గొప్పతనాలు ఉన్నప్పటికీ, వాటిలో, సంసారి చేతనుని దుర్గతిని చూచి సహించలేక, వారికి ఉపదేశించడానికి కారణమైన కృపయొక్క గొప్పతనమే చాలా విలక్షణమైనది కనుక, దానిని లోకం అంతా తెలిసేటట్లుగా వ్యక్తం చేస్తాను– అని అంటున్నారు. భగవానుడు సాటిలేని కృపను కలవాడైనా, స్వాతంత్ర్యాన్ని కలవాడైనందున, జీవుని దోషాలను చూచి ఉపేక్షించే గుణం ఉన్నది. ఆఴ్వార్లు, ఆ రీతిలో కాకుండా, అందఱిపట్ల కృపాప్రవాహాన్ని వర్షించేవారైనందున, లోకం అంతా తెలిసే రీతిలో ఆ కృపను వ్యాపింపజేస్తాను– అని అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ : "కణ్ణు కొణ్డెన్నై"** – అని అంటూ తమ దుర్గతిని (మధురకవులు) పల్కుతున్నారు. సత్పురుషులచే కటాక్షింపబడరానివారై ఉండే తమను ఆఴ్వార్లు ఏమాత్రం సంకోచించకుండా కటాక్షించడాన్నిగూర్చి పల్కుతున్నారు. **(కొణ్డు)** అని తమ దోషాన్ని చూచి కాలదన్నకుండా (విడచిపెట్టకుండా), తమను పరిగ్రహించిన విషయాన్ని తెల్పుతున్నారు.



**(ఎన్నై క్కణ్డు, ఎన్నై క్కొణ్డు)** –కటాక్షించదగని నన్ను కటాక్షించారు. అందరిచే విడువబడిన నన్ను పరిగ్రహించారు. వీరు (ఆఴ్వార్లు) స్వీకరించిన తరువాత, ఇక భగవానునిచే విడచిపెట్టడం సాధ్యం కాదు.

**(కారిమాఱప్పిరాన్)**– అతనివలె (భగవానుని వలె) స్వయం వ్యక్తమైన **"పిరాన్"** కాదు. ఆఴ్వార్లు సత్కులంలో అవతరించినవారు. సత్కులంలో జన్మించి, నాకు ఉపకరించినవారు. తాము జన్మించి, నా జన్మను ఛేదించినవారు.

**(వల్‌వినై)**– అందఱికి సుహృత్తు అయిన భగవానుడు **"క్షిపామి"** (గీత–16–19) (ఆసురజన్మలలో ఎల్లప్పుడు తోసివేస్తాను) అనే రీతిలో నిగ్రహించే పాపం– అని. ఆఴ్వార్ల కటాక్షంతోనే నశించే పాపం– అని అర్థం.

**(ఎన్నైక్కొణ్డు– పణ్డైవల్ వినై పాఱ్ఱి అరుళినాన్)**– భగవానుడు చరమశ్లోకంలో **"మామేకం శరణం వ్రజ, మోక్షయిష్యామి",** "నన్నే శరణు పొందు. నీ పాపాలను అన్నిటిని నశింపజేస్తాను" అని పల్కిన రీతిలో అనకుండా, తామే నన్ను తమ దగ్గరకు తీసికొని ఆదరించి, నా పాపాలను పోగొట్టారు.

**(ఎణ్డిశైయుమ్)**– దిక్కులు నాల్గు, విదిశలు నాల్గు– అని అంటూ ఎనిమిది దిక్కులను నిర్దేశించడం – ఊర్ధ్వ, అధో దిశలను రెండిటిని కలుపుకొని. ఈ విధంగా పది దిక్కులకు ఈ పదం ఉపలక్షణమని గ్రహించవచ్చు. లేక, పైకి పోలేక, కిందకి పోలేక **"ఎణ్డిశైయుమ్"** అని ఎనిమిది దిక్కులలోను మాత్రమే తెలిపారని చెప్పవచ్చు. ఆఴ్వార్ల కృప కల్గినందున వీరు కిందికి పోరు. ఆఴ్వార్లు పైలోకానికి వేంచేస్తే తప్ప అక్కడకు పోరు. కనుక, ఊర్ధ్వదిశలో పోలేరు.

**(అఱియ వియమ్బుకేన్) – "నాడుమ్ నకరుమ్ నన్గఱియ"** (పల్లెలలో, పట్టణాలలో బాగా తెలిసేటట్లు) (తిరుప్పల్లాణ్డు–4) అని పల్కినట్లుగా అందఱు తెలిసేటట్లుగా– అని అర్థం.

**(ఇయమ్బుకేన్)**– "ఆఴ్వార్ల కరుణయొక్క గొప్పతనాన్ని, అది నా వరకు ఫలించని రీతిని, నా పాపం నశించిన రీతిని, నేను ప్రాప్యాన్ని పొందిన రీతిని అందఱు తెలిసేటట్లుగా పల్కుతాను– అని అంటున్నారు.

**(ఒణ్డమిఴ్ చ్చడకోపన్)**– కరుణతో ఆఴ్వార్లు నన్ను సంస్కరించిన రీతినిగూర్చి, పాశురాలను పాడిలోకాన్ని సంస్కరించిన రీతిని గూర్చి పల్కుతాను.

**(ఎణ్తిశైయుమ్ అఱియ వియమ్బుకేన్)– "దేవాః స్వస్థాన మాయాంతి దైత్యాః సర్వే హతా గతాః, న భయం విద్యతే కించిత్ జితం భగవతా జగత్"** (దేవతలు తమ నివాసాలను చేరుతున్నారు. అసురులందఱు హతులై నశించారు. ఇక భయం ఏమీ లేదు. భగవానునిచే జగత్తు జయింపబడినది) అనే రీతిలో భగవానుడు లోకాలను (త్రివిక్రమవతారాన్ని ఎత్తి) కొలిచినపుడు, జాంబవంతుడు ఆ విజయాన్ని డప్పును వాయిస్తూ కీర్తించి లోకం అంతా తిరిగినట్లుగా, నేను కూడా వాద్యాన్ని మోగిస్తూ ఆఴ్వార్ల కృపను ప్రకటిస్తూ లోకంలో అంతటా తిరుగుతాను– అని వీరు (మధురకవులు) అంటున్నారు. జాంబవంతుడు వాద్యాన్ని మోగించడం– భగవానుని శక్తియొక్క గొప్పతనం. వీరిపుడు వాద్యాన్ని మోగించడం– ఆఴ్వార్ల కరుణయొక్క గొప్పతనం. అక్కడ– ప్రయోజనాంతరాలను కోరే ఇంద్రాదులు ఉజ్జీవించారు. ఇక్కడ –వేఱు ప్రయోజనాన్ని భావించని సత్పురుషులు ఉజ్జీవించారు. అక్కడ –భగవానుడు వంచనతో లోకాలను కొలిచాడు. ఇక్కడ –ఆఴ్వార్లు వంచన లేశమాత్రమైనా లేని **"పొయ్యిల్ పాడల్"** అయిన తిరువాయ్మొఴితో ఉజ్జీవింపజేశారు. దానికి, దీనికి మధ్య ఒకే ఒక సామ్యాన్ని చెప్పవచ్చు. అక్కడ పదత్రయంతో (మూడడుగులను పెట్టడంద్వారా) అందఱిని భగవానుడు సంస్కరించాడు. ఇక్కడ పదక్రమంతో (తిరువాయ్మొఴియొక్క పదాల వరుసతో) ఆఴ్వార్లు సంస్కరించారు. ఆఴ్వార్లు కూడా, నా శిరస్సుపై తమ శ్రీచరణాలను పెట్టినందున, పదక్రమంతో (శ్రీపాదాలను పెట్టడం ద్వారా) సంస్కరించిన గొప్పతనంకూడా వారికి కూడా ఉన్నది. **"మేవినేన్ అవన్ పొన్నడి"** (2) (బంగారువలె ఆశపడదగిన ఆ ఆఴ్వార్ల శ్రీచరణాలను ఆశ్రయించాను) అని అంటూ వీరుకూడా (మధురకవులు కూడా) పలికారు. **"మత్తకత్తిల్ తన్తాళ్ అరుళాలే వైత్తవర్"** (జ్ఞానసారమ్–36) (నా తలపై తమ శ్రీచరణాలను కృపతో పెట్టినవారు) అని **అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్** కూడా ఆచార్యుల విషయంలో పలికారుకదా!

**అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్ ఇన్బుఱ,**
**అరుళినాన్ అవ్వరుమఱైయిన్ పొరుళ్,**
**అరుళ్ కొణ్డు ఆయిరమ్ ఇన్దమిఴ్ పాడినాన్,**
**అరుళ్ కణ్డీర్ ఇవ్వులగినిల్ మిక్కదే. 8**



అరుళ్ కొణ్డాడుమ్ = భగవత్కృపను కీర్తించే, అడియవర్ = భక్తులు, ఇన్బుఱ= ఆనందించేటట్లు, అరు మఱైయిన్ పొరుళ్ = ఆ అరుదైన వేదాల అంతరార్థాన్ని, అరుళినాన్ = అనుగ్రహించినవారు, అరుళ్ కొణ్డు = పరమకృపతో, ఇన్ తమిఴ్ = మధురమై ద్రావిడభాషలో కూర్పబడిన, ఆయిరమ్ = తిరువాయ్మొఴి ప్రబంధం వేయి పాశురాలను, పాడినాన్ = పాడినవారైన ఆఴ్వార్ల, అరుళ్ కణ్డీర్ = కృపమాత్రమే కదా!; ఇ ఉలకినిల్ = ఈ లోకంలో, మిక్కదు = గొప్పది.

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్ :

**అవతారికై - ఎట్టామ్పాట్టిల్, "ఎణ్డిశైయు మఱియ వియమ్బుకేన్ " ఎన్నైక్కు హేతువెన్? ఎన్నిల్, ఆఴ్వారుడైయ అరుళ్ చిదచిదీశ్వరతత్త్వ త్రయఙ్గళై యుమ్ కబళీకరిత్తిరుక్కైయాలే - ఎన్గిఱార్.**

**వ్యా. - (అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్) ఇవ్వాఴ్వార్ తమ్మైప్పోలే ఇరుక్కుమవర్కళ్. "అతువుమ్ అవనతు ఇన్నరుళ్" ఎన్నుమ్, "అరుళ్ పెఱువార్ అడియార్ తమ్మడియన్" ఎన్నుమిరుక్కుమవర్తమ్మైప్పోలే. "ఆనైక్కు అన్ఱరుళై యీన్ద" ఎన్నుమ్. "నిన్నోడుమొక్క వఴిపడ అరుళినాయ్" ఎన్నుమ్, "అరుళ్ పురిన్ద శిన్దై" ఎన్నుమ్, "నిన్నరుళే పురిన్దిరున్దేన్" ఎన్నుమ్ - "అరుళా తొఴియుమే" ఎన్నుమ్ - ఇప్పడికళాల్ అవనరుళై క్కొణ్డాడుమవర్కళ్. ఇప్పడి భగవత్ప్రసా దత్తైయే కొణ్డాడిప్పోరుమవర్కళ్.**

**భగవత్ప్రసాదహేతువాక స్వగతమాన కర్మజ్ఞానభక్తికళై ఉపాయమాక ఆదరిక్కుమవర్కళన్ఱిక్కే, "కేవలభగవత్ప్రసాదమే ఉజ్జీవనహేతు" ఎన్ఱిరుక్కుమవర్కళ్, తన్దామ్ పక్కలుళ్ళ ఆనుకూల్యఙ్గళై భగవత్ప్రసాదఫలమాక నినై త్తిరుక్కుమతొఴియ, ప్రసాదకమాక నినైత్తిరాతవర్కళ్. ఇవర్ ఇప్పడి నినైత్తిరుక్కిఱతు మఱ్ఱై ఆఴ్వార్కళైయిఱే. "ఆఴియానరుళే" ఎన్నుమ్, "నిన్నరుళే పురిన్దిరున్దేన్" ఎన్నుమతిఱే అవర్కళ్ పాశురఙ్గళ్.**

**(ఇన్బుఱ) ఆనన్దనిర్భరరాక. "ఎణ్ణాతనకళెణ్ణుమ్ నన్మునివర్ ఇన్బమ్ తలైచ్చిఱప్ప" ఎన్గిఱపడియే సాధనత్తిల్ అన్వయమిన్ఱిక్కే భగవదనుభవమే యాత్త్రై యాయిరుక్కుమ్బడియాక. (అరుళినాన్ అవ్వరుమఱైయిన్ పొరుళ్)**

(అవ్వరుమఱై) ప్రసిద్ధమాయ్,ప్పెఱుతఱ్కు అరితాయిరుక్కిఱ మఱై. అతా కిఱతు- వేదరహస్యమాన ఉపనిషత్తిఱే.

(అవ్వరుమఱైయిన్ పొరుళై అరుళినాన్) నిత్యసత్త్వస్థర్క్కల్లతు తో*ఱ్ఱ*ాత ఉపనిషదర్థత్తై అరుళిచ్చెయ్తార్. పరమసాత్వికర్క్కు నిత్యమాన ఐశ్వర్యమ్ ఉపనిషద్రహస్యమిఱే. "సా హి శ్రీ రమృతా సతామ్" ఎన్నక్కడవతిఱే. అతావతు - "సర్వరసః" ఎన్నుమ్, "రసో వై సః" ఎన్నుమ్ శొల్లుకిఱ విషయత్తై తత్ప్రసాదత్తాలే లభిక్కై. "ఏష హ్యేవానందయాతి" ఎన్నుమ్, "తద్ధేతు వ్యప దేశాచ్చ" ఎన్నుమ్ శొల్లక్కడవతిఱే.

(అరుళ్ కొణ్డు) ఇవర్ తామ్ స్వబుద్ధియాలే అరుళిచ్చెయ్తారన్ఱు, "మయర్వఱ మతినల మరుళినన్" ఎన్గిఱపడియే- ప్రసాదలబ్ధ జ్ఞానత్తై ముతలా కక్కొణ్డు, తత్ప్రేరితరాయ్కొణ్డాయ్త్తు అరుళిచ్చెయ్తతు. "ఎన్నాకియే తప్పుతలిన్ఱి త్తనై క్కవి తాన్ శొల్లి" ఎన్గిఱపడియే - పిఱరోపాతి, కవిపాడుకిఱ తాముమ్ విస్మితరామ్బడి నిరపవద్యమాకవిఱే కవిపాడువిత్తుక్కొణ్డతు.

(ఆయిరమిన్తమి*ఴ్* పాడినాన్) "చతుర్వింశత్సహస్రాణి శ్లోకానా ముక్త వాన్ ఋషిః" ఎన్నాప్పోలే ఆయిరమాకవాయ్త్తు ప్పాడి*ఱ్ఱు*.

ఓరాత్మావుక్కు హితాంశత్తుక్కు ఒరు పాట్టే అమైయుమ్బడియిఱే, ఇవర్ పాడి*ఱ్ఱు*. (ఇన్తమి*ఴ్* పాడినాన్) దురవగాహమాన అర్థత్తై "పాఠ్యే గేయే చ మధురమ్" ఎన్గిఱపడియే రసఘనమాకవుమ్, సర్వాధికారమామ్బడియాకవుమ్ పాడినార్.

(పాడినాన్ అరుళ్ కణ్డీర్) "మయర్వఱ మతినల మరుళినన్" ఎన్నుమ్బడి అరుళవల్ల అరుళ్ తన్నైయుమ్ విళాక్కులై కొణ్డిరుక్కు మరుళిఱే ఆ*ఴ్వా*ర్ అరుళ్. ఈశ్వరన్ కైవిట్ట ఆత్మాక్కళైయుమ్, అవర్కళుడైయ దుర్గతియై క్కణ్డు తిరుత్త వొరుప్పట్టపడియాలే ఇవరరుళ్ ప్రత్యక్షమన్ఱో-ఎన్నై.

(ఇవ్వులకినిల్ మిక్కతే) చిదచిదీశ్వరతత్త్వత్రయత్తైయుమ్ కబళీకరి త్తిరుక్కై. "అతనిల్ పెరియ ఎన్నవా" ఎన్ఱు - భగవద్విషయత్తిల్ తమక్కుణ్డాన అభినివేశత్తళవుమ్ పోరుమాయ్త్తు, ఎన్నళవిల్ కృపైయుమ్.



## అరుమ్బద విళక్కమ్

ఎట్టామ్పాట్టు : అవతారికై :– (అరుళిత్యాది) (హేతువెన్? ఎన్నిల్) ఎన్తతు– ఎల్లారుమతిన్దు ఉజ్జీవిక్కుమ్బడి శొల్లుకైక్కు హేతువాన అరుళుడైయ అతిశయమెన్? ఎన్నిల్ – ఎన్తపడి. (కబళీకరిత్తిరుక్కైయాలే) ఎన్త అనన్తరమ్ "ఇయమ్బుకేన్" ఎన్ఱు శేషమ్. అరుళ్ కబళీకరిత్తిరుక్కైయావతు– తన్నతిశయత్తాలే తత్త్వత్రయత్తైయుమ్ విఴ్ఙియిరుక్కై.

ఇవ్వా*ఴ్వా*రుమ్, మ*ఱ్ఱ*వర్కళుమ్ అరుళై క్కొణ్డాడినార్కళో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (అవుతు మవనతిత్యాది). అరుళై క్కొణ్డాడుకైక్కు హేతు వేతు? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (ఇప్పడి – యిత్యాది).

ఇవర్కళ్ పక్కల్ అనుకూల్యాదికళిరుక్క, భగవత్ప్రసాదమే ఉజ్జీవనకరమాక క్కూడుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (తన్దామిత్యాది). అరుళ్కొణ్డాడు మడియవర్ ఆ*ఴ్వా*ర్కళేయాక వేణుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (ఇవరిత్యాది). ఇతుక్కు నియామకమేతు? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (ఆ*ఴ్*రియానిత్యాది).

పదార్థ మరుళిచ్చెయ్తు, తాత్పర్యార్థమరుళిచ్చెయ్కిఱార్ (ఎణ్ణాతనకళిత్యాది). ఎణ్ణాతనకళ్ – అసఙ్ఖ్యేయకల్యాణగుణఙ్గళ్. సాధనాన్తరనిషేధమ్ పణ్ణుకిఱ ఇప్రబన్ధత్తై అనుసన్ధిక్కవే అవర్కళుక్కుణ్డాన అధ్యవసాయమ్ సుస్థిరమా మెన్ఱు ఇవ్వాక్యత్తుక్కు త్తాత్పర్యమ్.

"మఱైయిన్ పొరుళ్" ఎన్తతుక్కు తాత్పర్యార్థమ్ (నిత్యేత్యాది). "అరుళినాన్" ఎన్గైక్కు అతినుడైయ శీర్మై యేతు? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (పరమేత్యాది). ఉపనిషద్రహస్యమ్ శీరియతెన్ను మతుక్కు ప్రమాణమ్ కాట్టుకిఱార్ (సా హీత్యాది). "సా" ఎన్ఱు స్త్రీయై చ్చొన్నాలుమ్, అతుక్కు, స్త్రీత్వమ్ తదర్థద్వారా– ఎన్ఱు కరుత్తు. సత్వనిష్ఠర్క్కు త్తో*ఱ్ఱు*కిఱ అర్థమేతు? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (అతావతిత్యాది). ఉక్తార్థే ప్రమాణమ్ (ఏష–ఇత్యాది). భగవత: ఆనన్దహేతుత్వేన ఆనన్దయతీతి వ్యపదేశాచ్చేతి సూత్రార్థః.

ఆరుమఱ్ఱైయిన్ పొరుళై అరుళినప్రకారమేతు? ఎన్ను మాకాంక్షైయిలే; "అరుళ్ కొణ్డు" ఎన్ఱరుళిచ్చెయ్‌తారెన్ఱు తిరువుళ్ళమ్బఴి, వ్యావర్త్యపూర్వకమాక భగవత్కృపై మూలమెన్ఱు తాత్పర్యమరుళిచ్చెయ్‌కిఱార్ (ఇవరిత్యాది). అవనో ప్రేరిత్తాన్? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (ఎన్నాకియే– యిత్యాది).

అనన్తమాన వేదార్థత్తై సఙ్గ్రహిత్తు, సహస్రసంఖ్యైయాక ప్రబన్ధీకరిత్తారుణ్డో? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (చతుర్వింశదిత్యాది). శ్రీరామాయణత్తోడు సమమాక ఇరుపత్తు నాలాయిరమాక ప్పాడాతే, ఆయిరమాక ప్పాడువానెన్? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (ఓరాత్మావుక్కిత్యాది).

"శడకోపనరుళ్" ఎన్నాప్పోలే "పాడినానరుళ్" ఎన్ఱతుక్కు హార్దతాత్పర్యమ్ (మయర్వఱ –ఇత్యాది) 'కణ్డీర్" ఎన్ఱతుక్కు త్తాత్పర్య మరుళిచ్చెయ్‌కిఱార్ (ఈశ్వర నిత్యాది).

"లోక్యత ఇతి లోక:" ఎన్గిఱ వ్యుత్పత్తియై ఉట్కొణ్డు అరుళిచ్చెయ్‌కిఱార్ (చిదచిదీశ్వరేత్యాది). తమ్ముడైయ పక్కల్ పణ్ణిన కృపైయై దృష్టాన్తముఖేన వివరిక్కిఱార్ (అతనిలిత్యాది). "అరుళ్ కొణ్డాడుమ్బడి అవర్ ఇన్బుఱ – అవ్వరుమఱ్ఱైయినుడైయ పొరుళై అరుళినాన్; అరుళ్‌కొణ్డు ఆయిర మిన్తమిఴ్ పాడినానుడైయ అరుళ్ – ఇవ్వులకినిల్ మిక్కతే, కణ్డీర్" ఎన్ఱన్వయమ్.

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**ఎనిమిదవ పాశురం – అవతారిక :** గడచిన పాశురంలో **"శడకోపన్ అరుళై ఎణ్డిశైయుమ్ అఱియ వియమ్బుకేన్"** (శఠకోపుల కృపను ఎనిమిది దిక్కులలోనివారు తెలిసేటట్లు ప్రకటిస్తాను) అని పల్కినందులకు కారణమేమి ? అనే ప్రశ్నరాగా, "ఆఴ్వార్ల కృప –చిత్, అచిత్, ఈశ్వరుడు– అనే మూడు తత్త్వాలను అంతర్భవించుకొన్నందున (కబళీకరించినందున) ఆ విధంగా పలికాను" అని అంటున్నారు– ఈపాశురంలో.

**వ్యాఖ్య : (అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్)** భగవానుని కృపను కీర్తించే భక్తులు– అని అర్థం. నమ్మాఴ్వార్లవలె ఉండేవారని భావం. **"అదువుమ్ అవనదు ఇన్నరుళే"**



(భగవానుని ఆశ్రయించడానికికూడా అతని కరుణే కారణం) (తిరువాయ్–8–8–3) అని, **"అరుళ్ పెఱువార్ అడియార్‌తమ్ అడియన్"** (భగవత్కృపను పొందదగిన భాగవతులకు దాసుడను) (తిరువాయ్–10–6–1) అని పల్కిన ఈ నమ్మాఴ్వార్లవలె ఉండేవారు– అని భావం. అంటే – **"ఆనైక్కు అన్ఱు అరుళై ఈన్ద"** (తిరుమాలై–46) (గజేంద్రునకు ఆనాడు కృపజేసిన) అని, **"నిన్నోడుమ్ ఒక్క ఒఴిపడ అరుళినాయ్"** (నీతో సమానంగా వారిని ఆరాధించేటట్లు కృపజేశారు.) (తిరుమాలై–42) (అని పల్కిన తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లు, **"అరుళ్ పురిన్ద శిన్దై"** (కరుణను కల మనస్సును) అని పల్కిన పూదత్తాఴ్వార్లు, **"నిన్నరుళే పురిన్దిరున్దేన్"** (నీకృపనే ఆశ్రయించాను) (పెరియాఴ్వార్ తిరు 5–4–1) అని పల్కిన పెరియాఴ్వార్లు, **"అరుళాదొఴియుమే"** (అనుగ్రహించకుండా ఉంటాడా?) (మూన్ఱామ్ తిరు–16) అని పల్కిన పేయాఴ్వార్లవలె భగవానుని కృపను కీర్తించే ఆఴ్వార్లను **"అరుళ్‌కొణ్డాడుమ్ అడియవర్"** అని అంటున్నారు.

**"అరుళ్ కొణ్డాడుమ్ అడివయర్"** అని పల్కినందున భగవానుని కృపయే మోక్షోపాయం తప్ప, తమవద్ద ఉన్నది ఏదీ మోక్షోపాయం కాదు– అని తెలిసినవారు– అని తెలుపబడింది. అంటే– భగవానుని కృపకు కారణమైన, తమవద్ద ఉండే కర్మ–జ్ఞాన–భక్తి మొదలైనవానిని ఉపాయంగా భావించకుండా, భగవానుని కృపను ఒక్కటినే ఉజ్జీవనోపాయంగా భావించేవారు– అని భావం. తమవద్ద ఉండే హితాలైన (నన్మై) వీటిని భగవానుని కృపచేత, దానివల్ల అతడు చేసిన సృష్టి– అవతారం మొదలైన అతిమానుషచేష్టితాలద్వారా వ్యక్తమయే యోగ్యతను తెలిపే అధికారివిశేషణంగా భావిస్తారే తప్ప, ఉపాయాలైన వీటివల్ల అతడు మోక్షాన్ని అనుగ్రహిస్తాడు"– అని భావించరు– అని భావం.

వీరు, ఈవిధంగా భగవత్కృపను కీర్తించే భక్తులుగా భావించడం మిగిలిన ఆఴ్వార్లను ఉద్దేశించియే, **"ఆఴియాన్ అరుళే, అన్ఱు నానుయ్య నాన్ కణ్డు కొణ్డేన్ నారాయణా ! ఎన్నుమ్ నామమ్"** (పెరియతిరుమొఴి–1–1–4) (చక్రధారి కరుణయే అపుడు నన్ను ఉజ్జీవింపజేయగా నారాయణా ! అనే నామాన్ని నేను తెలిసికొన్నాను) అని, **"నిన్నరుళే పురిన్దిరున్దేన్"** (నీ కృపనే ఆశ్రయించాను) (పెరియాఴ్వార్ తిరు–5–4–1) అని భగవానుని కృపనే ఉజ్జీవనోపాయంగా తెల్పుతున్నాయికదా, ఆఴ్వార్ల పాశురాలు.

**(ఇన్బుఱ)–** ఆనందం నిండేటట్లు– అని అర్థం. **"ఎణ్ణాదనకళ్ ఎణ్ణుమ్ నన్ మునివర్ ఇన్బమ్ తలై చ్చిఱప్ప"** (తిరువాయ్–10–7–5) (ఇతరులు భావించని సంపదలను ఆశించే, భక్తిని కల ఋషులు ఆనందభరితులయేటట్లు) అని నమ్మా*ళ్వా*ర్లు పల్కిన రీతిలో వారి దివ్యప్రబంధాలు, వాటిని అభ్యసించేవారిని ఏవిధమైన మోక్షసాధనాన్ని అనుష్ఠింపజేయకుండా, భగవానుని అనుభవించడమే ఉజ్జీవనంగా కల్గినవారుగా అయేటట్లు చేస్తారు– అని భావం.

**(అరుళినాన్ అవ్వఱు మఱైయిన్ పొరుళ్)– (అవ్వఱుమఱై)– "ఆన్ద"** (అ) అనే విశేషణం సంస్కృతవేదంయొక్క ప్రసిద్ధిని తెల్పుతున్నది. **"అఱు మఱై"** అనేది పొందడానికి దుర్లభమైనది, ఈ వేదం– అని తెల్పుతున్నది. **"మఱై"** అని ఇక్కడ చెప్పబడేవి– వేదంలో భగవానుని స్వరూపరూపగుణవిభూతులను విస్తృతంగా తెలిపే ఉత్తరభాగమైన, రహస్యరూపమైన ఉపనిషత్తులే.

**(అవ్వఱు మఱైయిన్ పొరుళ్ అరుళినాన్)–** ఎల్లప్పుడు సత్త్వగుణంలో నిష్ఠను కలవారికి తప్ప, మిగిలినవారికి ఎవరికీ స్ఫురించని ఉపనిషత్తుల అర్థాలను అనుగ్రహించారు. **"పొరుళ్"** అనే దానికి – అర్థం (పదార్థం) అని, ఐశ్వర్యమని రెండర్థాలున్నాయి. ఈరెండు ఇక్కడ పొసగుతాయి. పరమసాత్త్వికులకు ఎల్లప్పుడు స్థిరంగా నిలచి ఉండే ఐశ్వర్యం ఉపనిషద్రహస్యమే కదా ! **"సా హి శ్రీ రమృతా సతామ్"** (యజు.అష్ట–3–7) (సత్పురుషులకు వేదమే నశించని సంపద) అని యజుర్వేదంలో కూడా వేదం సత్పురుషుల ధనంగా చెప్పబడింది కదా ! ఈవిధంగా వేదం సత్పురుషులకు సంపద కావడానికి కారణం– అన్ని సంపదలలోను గొప్ప సంపద అయిన భగవానుని తనలో కల్గి ఉండడమే. **"సర్వగంధ: సర్వరస:"** (ఛాందోగ్య–3–14–2) (భగవానుడు అన్ని సుగంధాలను కలవాడు, అన్ని రసాలను కలవాడు) అనే రీతిలో సర్వేశ్వరుడే అన్నీ సుగంధాలను, మంచి రసాలను కలవాడని చెప్పబడినందున అతడే గొప్ప సంపద. **"రసో వై స: రసగ్ం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి, కో హ్యేవాన్యాత్ క: ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందో న స్యాత్, ఏష హ్యేవానందయాతి"** (తైత్తి.ఆనంద–7) (రసస్వరూపుడు కదా ఆ పరమపురుషుడు. అతనిని పొంది ఈ జీవుడు ఆనందాన్ని కల్గినవాడవుతున్నాడు. ప్రకాశించేవాడు, ఆనంద స్వరూపుడైన ఈ పరమపురుషుడు లేకపోతే ఎవడు ఈలోకంలోని సుఖాన్ని కాని, మోక్షాన్నిగాని పొందగలడు? అందువల్ల ఇతడే జీవుని ఆనందింపజేస్తున్నాడు)



అనే ఉపనిషద్వాక్యంలోను, **"తద్ధేతు వ్యపదేశాచ్చ"** (బ్రహ్మసూత్రాలు–1–1–15) (జీవుని ఆనందానికి కారణంగా పరమాత్ముడు చెప్పబడినందున, (పరమాత్మ జీవునికంటే విలక్షణుడే) అని బ్రహ్మసూత్రంలోను, భగవానుననే ఆనందస్వరూపునిగాను, జీవుని ఆనందానికి కారణంగాను చెప్పబడినందున, అతడే గొప్పధనమైన ఉపనిషదర్థస్వరూపుడు.

**(అరుళినాన్ అవ్వఱు మఱైయిన్ పొరుళ్)** ఉపనిషత్తుల అర్థాన్ని ఆభగవానుని కృపవల్ల తమ ప్రబంధాలలో నమ్మా*ళ్వా*ర్లు– వివరించారు అని భావం.

**(అరుళ్ కొణ్డు ఆయిరమ్ ఇన్ తమి*ళ్* పాడినాన్)** –నమ్మా*ళ్వా*ర్లు, తమ బుద్ధితో భావించి అర్థాలను అనుగ్రహించకుండా, **"మయర్వఱ మదినలమ్"** (భ్రమవిప్రలంభాది దోషాలు లేని, భక్తిగా రూపొందిన జ్ఞానాన్ని) (తిరువాయ్–1–1–1) అనే రీతిలో భగవానుని కృపతో లభించిన జ్ఞానంతో అతనిచే ప్రేరేపింపబడినవారై, వేయి పాశురాలను కల తిరువాయ్మొ*ళి*ని అనుగ్రహించారు. **"ఎన్నాకియే తప్పుదలిన్ఱి త్తన్నై క్కవి తాన్ శొల్లి"** (నన్ను సాధనంగా చేసికొని, ఏదోషం లేని రీతిలో తన విషయంలో కవిత్వాన్ని తానే పల్కి) (తిరువాయ్–7–9–4) అనే రీతిలో, తిరువాయ్మొ*ళి*ని అభ్యసించే అన్యులవలె, కవిత్వాన్ని పాడే ఆ*ళ్వా*ర్ తామే ఆశ్చర్యపడే రీతిలో, భగవానుడు వారిని పురస్కరించుకొని, ఏ దోషం, లోపం లేని రీతిలో పాశురాలను పాడించాడు.

**(ఆయిరమ్ ఇన్ తమి*ళ్* పాడినాన్)– "చతుర్వింశత్ సహస్రాణి శ్లోకానా ముక్తవాన్ ఋషి:, తథా సర్గశతాన్ పంచ షట్కాండాని తథోత్తరమ్"** (రామా–బాల.4–2) (వాల్మీకి మహర్షి ఇరవై నాల్గువేల శ్లోకాల రూపంలోను, అయిదు వందల సర్గలతో కూడినదిగాను, ఉత్తరకాండతోపాటుగా ఆఱుకాండలను కల్గినదిగాను, శ్రీరామాయణాన్ని పలికాడు) అని వాల్మీకి మహర్షి ఇరవై నాల్గువేల శ్లోకాలను పల్కినట్లుగానే, వీరు కూడా వేయి పాశురాలను పాడారు. ఈవిధంగా పాడిన పాశురాలు సంఖ్యలో వాల్మీకి పల్కిన శ్లోకాలకంటె తక్కువగా ఉన్నా, ఒక జీవునకు హితాన్ని తెలిసికోవడానికి ఒక్క పాశురమే చాలు –అనే రీతిలోకదా వీరు పాడారు. అందువల్ల కొఱత లేదు.

**(ఇన్తమి*ళ్* పాడినాన్)–** గ్రహించడానికి కష్టమైన వేదాలను అర్థాన్ని **'పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితమ్"** (రామా– బాల– 4–8) (శ్రీరామాయణ

కావ్యం మూడు విధాలైన ప్రమాణాలను కల్గినది, పఠించేటపుడు, పాడేటపుడు కూడా తీయనిది) అని పల్కినట్లుగా మిక్కిలి మధురంగాను, అందఱు అభ్యసించదగినదిగాను ఉండే తీయని ద్రావిడ భాషలో పాడారు.

**(పాడినాన్ అరుళ్ కణ్డీర్) –"మయర్వఱ మదినలమ్ అరుళినన్"** (తిరువాయ్-1-1-1) అనే రీతిలో ఆళ్వార్లకు నిర్హేతుకంగా అనుగ్రహించిన భగవానుని కృపకు మించినది– అతనిని కీర్తించిన ఆళ్వార్ల కృప. భగవానునిచే విడువబడిన ఆత్మలను, విచారించదగిన వారి స్థితిని చూచి, వారిని సంస్కరించాలని ప్రయత్నించినందున, వీరి (ఆళ్వార్ల) కృప గొప్పదై, మనచే సాక్షాత్తుగా దర్శించదగినదై ఉన్నది– అని భావం.

**(ఇవ్వులకినిల్ మిక్కదే)**– ఆళ్వార్ల కృప చిదచిదీశ్వరులు– అనే మూడు తత్త్వాలను మించి ఉన్నది. ఆళ్వార్లు తిరువాయ్‌మొళిలోని పదవ శతకం– పదవ దశకంలోని– పదవ పాశురంలో **"శూళ్న్దు అకన్ఱు ఆళ్న్దు ఉయర్న్ద ముడివిల్ పెరుమ్ పాళేయో!"** (అంతటా వ్యాపించిన, నాశంలేని గొప్ప మూలప్రకృతిని అంతర్యామీ!) అని అంటూ మొదటి పాదంలో అచిత్ తత్త్వాన్ని పల్కి, తరువాత పాదంలో, **"శూళ్న్దు అదనిల్ పెరియ పర నన్మలర్చ్చోదీ ! ఓ!"** (అంతటా వ్యాపించిన, ఆ ప్రకృతి కంటే గొప్పదైన వికాస స్వభావాన్ని కల ఆత్మతత్త్వానికి అంతర్యామీ!) అని చిత్తత్త్వాన్నిగూర్చి పల్కి, ఆ తరువాత మూడవ పాదంలో **"శూళ్న్దు అదనిల్ పెరియ శుడర్ ఞాన ఇన్బమేయో?"** (దానకంటే గొప్పదైన, ప్రకాశించే గుణాత్మకమైన జ్ఞానస్వరూపా!) అని ఈశ్వరతత్త్వాన్నిగూర్చి పల్కి, చివరి పాశురంలో **"శూళ్న్ద అదనిల్ పెరియ ఎన్ అవా"** (అంతటా వ్యాపించిన భగవతత్త్వం కంటే మించినది నా అభినివేశం) అని అంటూ తమ భగవదభినివేశం ఆమూడు తత్త్వాల కంటే గొప్పది– అని పలికారు. ఇక్కడ మధురకవి ఆళ్వార్లు అదే రీతిలో ఆళ్వార్లు తమపట్ల చూపిన కృప ఆ మూడు తత్త్వాలకంటే గొప్పది– అని అంటున్నారు. **"అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్ ఇన్బుఱ అవ్వఱు మఱైయిన్ పొరుళ్ అరుళినాన్, అరుళ్ కొణ్డు ఆయిరమ్ ఇన్ తమిళ్ పాడినానుడైయ అరుళ్ ఇవ్వులకినిల్ మిక్కదే, కణ్డీర్"** అని అన్వయమ్.



## నఞ్జీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

నంజీయర్ వ్యాఖ్యానంలో– **"అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్ ఇన్బుఱ–అరుళినాన్ అవ్వఱు మఱైయిన్ పొరుళ్"** అనే మొదటి రెండు పాదాలు, భగవద్భక్తులు ఆనందించేటట్లు వేదరహస్యాన్ని గీతద్వారా వ్యక్తం చేసిన శ్రీకృష్ణుని తెల్పుతున్నవి, తరువాత రెండు పాదాలు, ఆ శ్రీకృష్ణుని కరుణను మూలంగా చేసికొని వేయి పాశురాలను కల తిరువాయ్‌మొళిని పాడిన ఆళ్వార్ల కృప లోకంలో చాలా గొప్పది– తెల్పుతున్నవి– అనే రీతిలో అన్వయక్రమం, అర్థం భిన్నంగా ఉన్నవి.

**వ్యాఖ్యానమ్ : (అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్ ఇన్బుఱ)** ఇక్కడ **"అడియవర్"** అనే పదం శ్రీకృష్ణునకు శేషభూతులై ఉండేవారిని తెల్పుతున్నది. **"అడియవర్ ఇన్బుఱ"** అని పల్కినందున శేషభూతులకు ఆనందించడమే స్వరూపం– అంటే– శేషభూతులై ఉండడం, శేషి మెచ్చిన కైంకర్యాన్ని చేసి ఆనందించడం తప్ప వేఱేమీ లేదు– అని తెలుపబడింది. **"ముక్తానాం లక్షణం హ్యేతత్ యచ్ఛ్వేతద్వీపవాసినామ్, నిత్యాంజలిపుటా హృష్టా నమ ఇత్యేవవాదిన:"** (భారత శాంతి-344-45) (శ్వేతద్వీపవాసులకు ఏది లక్షణమో, అదే ముక్తులకు కూడా లక్షణం. అది ఏమంటే– వారు ఎల్లప్పుడు అంజలిని చేస్తూ ఉంటారు. తద్వారా ఆనందిస్తూ ఉంటారు. నోటితో సదా **"నమ:"** అనే పదాన్ని పలికే స్వభావాన్ని కల్గినవారై ఉంటారు) అనే రీతిలో మొదటి పాదం ద్వారా శ్రీకృష్ణుని కృపను అనుసంధించి, అతని భక్తులు ఆనందాన్ని పొందుతున్నారు– అని చెప్పబడింది.

ఆ విధంగా అతడు చూపిన కృప ఏమంటే –అరుదైన వేదార్థాల రూపంలోని గీతను వ్యక్తం చేయడమే– అని అనంతర పాదంతో తెలుపబడుతున్నది.

**(అరుళినాన్ అవ్వఱుమఱైయిన్ పొరుళ్)**– పరమరహస్యమైన వేదంలోని అర్థాన్ని ఎవరూ అడుగకుండానే, నిర్హేతుకంగా, తమపట్ల కొంచెం ప్రేమ కల్గినవారు సైతం ఉజ్జీవించేటట్లుగా గీతోపనిషదాచార్యుడై వ్యక్తం చేశాడు. వేదాలు మఱుగు పఱచిన అర్థాన్ని, కరుణాపూర్ణుడు, ధీరోదాత్తనాయకుడైనందున శ్రీకృష్ణుడు వ్యక్తం చేశాడు.

**(అరుళ్ కొణ్డు ఆయిరమ్ ఇన్ తమిళ్ పాడినాన్)**– ఈ శ్రీకృష్ణుని కరుణను మూలంగా గొని వేయి పాశురాలను కల తిరువాయ్‌మొళిని నమ్మాళ్వార్లు పాడారు– అని అంటున్నారు. ఆళ్వార్ల తిరువాయ్‌మొళికి మూలమై శ్రీకృష్ణుని గీత అమరింది–

అని భావం. అంటే- శ్రీకృష్ణుడు గీతలో సంగ్రహంగా పల్కినదానిని ఆழ்వార్లు తిరువాయ్‌మొழிలో వివరంగా పలికారు- అని భావం. వేదాలను అధ్యయనం చేయగల్గినవారికే ఉజ్జీవనం కలిగేటట్లుగా వేదంలో విస్తృతంగా చెప్పబడిన కర్మ-జ్ఞాన-భక్తియోగాలను శ్రీకృష్ణుడు విస్తృతంగా పలికాడు. వేదంలో సంగ్రహంగా చెప్పబడిన శరణాగతిని శ్రీకృష్ణుడుకూడా గీతలో చివరలో సంగ్రహంగాను, శ్రుతిముఖంగాను, గోప్యంగాను పలికాడు. అందువల్ల, వేదంలో అధికారాన్ని కల్గినవారే ఉజ్జీవించేటట్లుగా గీత ఉన్నది. అందులో అధికారాన్ని లేనివారుకూడా ఉజ్జీవించి, ప్రాప్యాన్ని పొందేటట్లుగా, తిరువాయ్‌మొழிలో శరణాగతిని వేయి పాశురాలతో విస్తృతంగా ఆழ்వార్లు పాడారు. ఆ కారణం వల్ల, శ్రీకృష్ణుని కృపకంటే, ఆழ்వార్ల కృపే లోకంలో చాలా గొప్పది- అని చివరి పాదంలో పల్కుతున్నారు.

**(అరుళ్ కణ్డీర్ ఇవ్వులకినిల్ మిక్కదే)** భగవానుడు కృపజేసిన గీత- వేదాన్ని,సంస్కృతభాషను తెలిసిన కొందఱికి మాత్రమే ఉపకరిస్తుంది. ఆழ்వార్లు అనుగ్రహించిన తిరువాయ్‌మొழிలోని వేయి పాశురాలు - తీయని భాషలో ఉన్నందున, వేదాన్ని, సంస్కృతభాషను తెలిసినవారికే కాక, వాటిని తెలియని వారికి కూడా ఉపయోగపడుతుంది. **“పాలేయ్ తమిழர் ఇశైకారర్ పత్తర్ పరవు మాయిరమ్”** (తిరువాయ్-1-5-11) (పాలవలె భోగ్యమైన ద్రావిడభాషను, గానాన్ని తెలిసినవారు, భక్తులు ఆదరించే వేయి) అని, **“తొణ్డర్‌క్కు అముదుణ్ణ చ్చొన్‌మాలైకళ్ శొన్నేన్”** (తిరువాయ్-9-4-9) (భక్తులకు అమృతం వంటి సూక్తి మాలికలను పలికాను) అని కదా ఆழ்వార్లు కూడా పలికారు.

### నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :

**అవతారిక :** “భగవత్కృపను లోకంలో ఉండేవారంతా కీర్తిస్తూ ఉండగా, మీరుమాత్రం ఆழ்వార్ల కృపను శ్లాఘిస్తున్నారే ? ఎందుకు ? అని కొందఱు ప్రశ్నించగా, భగవత్కృప మోక్షాన్ని అనుగ్రహించేటపుడే ఆవశ్యకం. ఆ మోక్షం జ్ఞానంవల్ల కల్గుతుంది. ఆజ్ఞానం ఆழ்వార్ల వల్ల కల్గుతుంది. అందువల్ల ఆழ்వార్ల కృపయే లోకంలో అన్నిటికంటే మించి ఉన్నది” అని అంటున్నారు. (మధురకవులు).

**వ్యాఖ్యానమ్ : (అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్ ఇన్బుఱ)** తిరువాయ్‌మొழி ప్రబంధాన్ని పాడడంకూడా భగవానుని ఆనందింజేయడంకోసం కాకుండా, భగవానుని కృపాగుణాన్ని కీర్తించే సత్త్వగుణాన్ని కల్గిన సత్పురుషుల ముఖోల్లాసం కోసమే పాడారు.



**(అడియవర్)**- “భగవత్కైంకర్యమే పురుషార్థం” అనే రీతిలోని స్వరూపజ్ఞానాన్ని కలవారు

**(అరుళ్ కొణ్డాడుమ్)**- ఆ పురుషార్థానికి సాధనంకూడా అతని కృపయే- అని నమ్మేవారు, భగవానుని, అతని గుణాలను కీర్తించడం (ఎందువల్ల అంటే)- భగవానుని కృపాగుణాన్ని బట్టికదా. ఆ కృపాగుణమే లేకపోతే, మిగిలిన గుణాలు కూడా వ్యర్థాలే కదా! అందువల్ల దీనిని (కృపాగుణాన్ని) కీర్తిస్తారు. దేవతాంతరాలకంటే భగవానుడు కీర్తించదగినవాడై ఉన్నాడు. భగవానుని మిగిలిన గుణాలకంటే కృప అనే గుణం కీర్తించదగినదిగా ఉన్నది.

భక్తి మొదలైనవానిని అనుష్ఠించడంలో శక్తిని కలవానికి ఆ ఉపాయాలు సాధనం - అని చెప్పబడినా, “నన్ను పొందడానికి ఈవిధంగా శ్రమపడి సాధనానుష్ఠానాన్ని చేస్తున్నాడుకదా !” అని భగవానుని ఆనృశంస్యమే ఆ ఉపాయాలకు ఫలాన్ని ఇచ్చే సాధనమవుతున్నది. వాటిలో శక్తి లేనివానికి అతని (ప్రపన్నుని) ఆకించన్యాన్ని చూచి కలిగే భగవానుని కృపయే సాధనమవుతున్నది.

**(అరు మఱైయిన్ పొరుళ్ అరుళినాన్)** వేదంలోని ఆ అరుదైన అర్థాలను అనుగ్రహించాడు. “(భగవానుని) కరుణ సాధనం, కైంకర్యం పురుషార్థం” అనే అరుదైన అర్థాన్ని **‘వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్”** (తిరువాయ్-3-3-1) (విచ్ఛేదం లేని కైంకర్యాన్ని చేయాలి) అని, **“అడియై అడైన్దు అరుళ్ శూడి ఉయ్‌న్దవన్”** (తిరువాయ్-7-2-11) (శ్రీచరణాలను ఆశ్రయించి, భగవత్కృపతో ఉజ్జీవించిన ఆழ்వార్లు) అని ఆழ்వార్లు ఉపదేశించారు.

**(పొరుళై అరుళినాన్)**- ఆழ்వార్లు, తాము చతుర్థవర్ణంలో జన్మించినవారైనందున, వేదవాక్యాలను సాక్షాత్తుగా పలుకకుండా, వాని అర్థాలను మాత్రం అనుగ్రహించారు.

**(అరు మఱైయిన్ పొరుళ్)**- రజస్తమోగుణాలు ఎక్కువగా ఉండేవారికి తెలియని రీతిలో తన అర్థాన్ని దాచి, సత్త్వగుణాన్ని మెండుగా కలవారికే తన అర్థాన్ని వ్యక్తం చేస్తున్నందున **“మఱైయాయ్ నాల్ వేదమ్”** (**“మఱై”** అనబడే చతుర్వేదాలు) (తిరువాయ్-3-1-10) అనే రీతిలో **“మఱై”** అని, **“వేదమ్”** అని పేరును కల ఈ వేదంలోని అరుదైన అర్థాన్ని వ్యక్తం చేశారు.

**(అరుళ్ కొణ్డు ఆయిరమ్ ఇన్ తమిழ్ పాడినాన్)** –వేయి శాఖలను కల్గిన సామవేదంలో చెప్పబడిన అర్థాన్ని వేయి పాశురాలతో కూడిన తిరువాయ్మొழிతో కృపతో వ్యక్తంచేశారు.

**(తమిழ్ పాడినాన్)–** అర్థాన్ని గ్రహించడానికి దుర్లభమైన వేదశబ్దాలవలె కాకుండా, సులభమైన ద్రావిడభాషతో వ్యక్తం చేశారు.

**(ఆయిరమ్ ఇన్ తమిழ్పాడినాన్)** – ప్రణవంవలె చాలా సంగ్రహంగా గాని, లక్షశ్లోకాలకు మించిన మహాభారతంవలె చాలా విస్తృతంగా గాని పాడకుండా, వేయి తీయని పాశురాలతో పాడారు.

**(పాడినాన్)– "వేట్కైయాల్ శొన్న పాడల్"** (తిరువాయ్–4–10–11) (భక్తివల్ల పల్కిన పాశురాలు) అనే రీతిలో తమ అనుభవమనే ఆనందసముద్రానికి పరీవాహమైన మంగళవచనాలను పలికారు.

**(అరుళ్ కొణ్డు పాడినాన్)** – "ఒక పురుషుడు పల్కినది అయినందున, ఇందులో అజ్ఞాన– విస్మృతి– భ్రాంత్యాదులకు అవకాశం ఉన్నది. మఱి, ఇది ఏవిధంగా ప్రమాణం?" అనే ప్రశ్న రాగా, "తాము స్వయంగా పల్కినపుడు కదా, ఆవిధంగా భావించడానికి అవకాశం ఉన్నది. పరమపురుషుని కరుణను మూలంగా పురస్కరించుకొని ఆழ்వార్లు పల్కినందున ఆ దోషాలు వారి ప్రబంధంలో లేవని భావం. **"ఆమ్ ముదల్వన్ ఇవన్ ఎన్ఱు తற்றேற்றி ఎన్ నాముదల్ వన్దు పుకున్దు నల్లిన్ కవి, తూముదల్ పత్తర్క్కు త్తాన్ తన్నై చ్చొన్న ఎన్ వాయ్ ముదలప్పనై"** (తిరువాయ్–7–9–3) (ఇతడే జగత్కారణభూతుడని తన విషయంలో జ్ఞానాన్ని కల్గించి, నా జిహ్వపై ప్రవేశించి వేంచేసి ఉండి, చక్కని, తీయని కృతిని పరిశుద్ధులైన, గొప్పవారైన భక్తులకోసం తానే స్వయంగా పల్కినవాడు, నా ప్రబంధానికి మూలభూతుడైన స్వామి) అని ఆழ்వార్లు ఈ విషయాన్ని స్వయంగా పలికారు.

**(పాడినాన్ అరుళ్ కణ్డీర్ ఇవ్వులకినిల్ మిక్కదే)–** పాశురాలు కాదు; పాడినవారైన ఆழ்వార్లు కూడా కాదు; పాశురాలకు కారణమైన భగవత్కృప సైతం కాదు; పాడిన ఆழ்వార్ల కరుణయే మిక్కిలి గొప్పది.

**(ఇన్ తమిழ్ పాడినాన్ అరుళ్)–** ముఱిగిపోయిన భక్షణాలవలె కఠినమైన శ్రీగీతను పల్కినవాని కృపకూడా గొప్పది కాదు. **"నెఱి యెల్లా మెడుత్తురైత్త నిఱై ఞాన త్తొరు మూర్త్తి"** (తిరువాయ్–4–8–6) (శాస్త్రార్థాలను అన్నిటిని గీతద్వారా ప్రస్తావించి వివరించిన, గొప్ప ప్రకాశాన్ని కల్గిన అద్వితీయ జ్ఞానస్వరూపుడు) అనే రీతిలో అన్ని ఉపాయాలను గీతలో ప్రస్తావించి వివరించినా, అందులో లగ్నమైనవారు కొందఱే, లగ్నం కానివారు పలువురు. వీరి (ఆழ்వార్ల) కృప అటువంటిది కాకుండా, **"ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తన్నైప్పోల్ అవనుడైయ పేరుమ్ తాళ్కళు మే పిదற்றி"** (తిరువాయ్–6–7–2) (పల్లెలు, నగరాలు, లోకం అంతా నావలె అతని నామాలను, శ్రీచరణాలను కీర్తించి) అనే రీతిలో లోకాలను అన్నిటిని ఆழ்వార్లవలె మార్చగల్గినది. **"నెఱి యుళ్ళి ఉరైత్త అమ్బకవన్"** (తిరువాయ్–13–5) (ముక్తిమార్గాన్ని గమనించి ఉపదేశించిన భగవానుడు) అని స్వయంవక్తమైన తన జ్ఞానాన్ని పురస్కరించుకొని పల్కిన గీతవంటిది కాదు, ఆழ்వార్ల ప్రబంధం. అతని (శ్రీకృష్ణుని కరుణతో పాడిన వైలక్షణ్యం ఉన్నది– తిరువాయ్మొழிకి, దానికి కారణమైన వీరి (ఆழ்వార్ల) కృపకు.

**(ఇవ్వులకినిల్ మిక్కదు)** అతని కృపను పురస్కరించుకొని ఉజ్జీవించిన భక్తులు కొందఱే. వీరి (ఆழ்వార్ల) కృప అయితే, లోకం అంతా కీర్తించే రీతిలోని గొప్ప వైలక్షణ్యాన్ని కల్గినది.

**(ఆయిరమ్... మిక్కదు)** గీతను పల్కిన శ్రీకృష్ణుడంటే చేతులెత్తి నమస్కరించేవారు ఎవరూ లేరు. **"కురుకూర్ చ్చడగోపన్ శొన్న"** అని ఆழ்వార్ల ఊరిని, పేరును వినినంతనే వైష్ణవలోకం చేతులెత్తి నమస్కరిస్తున్నది. **(కణ్డీర్)** అతని కృప శాస్త్రంవల్ల తెలియదగినది. (ఇది ప్రత్యక్షసిద్ధమైనది.)

**(ఇవ్వులకినిల్ మిక్కదు)–** ఆழ்వార్ల కృప ఈ లోకంకంటే గొప్పది – అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"కడల్ మణ్ణెల్లామ్ విలైయో! ఎన మిళిరుమ్ కణ్ ఇవళ్ పరమే!"** (సముద్రాలు, భూమి అంతా గొప్పగా ప్రకాశించే ఈమె కంటికి సాటివస్తాయా?) (తిరువిరుత్తమ్–60) అనే రీతిలో లోకం అంతా వీరి నేత్రాలతో మెఱిసే కరుణకు సాటి రాదుకదా!

**మిక్క వేదియర్ వేదత్తినుట్పొరుళ్,**
**నిఱ్కప్పాడి ఎన్ నెఞ్జుళ్ నిఱుత్తినాన్,**
**తక్కశీర్ శడకోపన్ ఎన్నమ్బిక్కు, ఆళ్**
**పుక్కకాదల్ అడిమై ప్పయనన్ఱే.** **9**

మిక్క వేదియర్ వేదత్తిన్ = గొప్పవారైన వైదికులచే అధ్యయనం చేయబడే వేదం యొక్క, ఉళ్ పొరుళ్ = అంతరార్థం, నిఱ్క = స్థిరంగా నిలచి ఉండేటట్లు (సుప్రతిష్ఠితం అయేటట్లు), పాడి = తిరువాయ్‌మొழிని పాడి, ఎన్ నెఞ్జుళ్ = నా హృదయంలో, నిఱుత్తినాన్ = (ఆ వేదాంతాలను, లేక, తిరువాయ్‌మొழிని) సుప్రతిష్ఠితం చేశారు (ఆழ்వార్లు). తక్క శీర్ = తగిన గుణాలను కలవారై, శడకోపన్ = శఠకోపులనే తిరునామాన్ని కలవారైన, ఎన్ నమ్బిక్కు = ఆ సౌలభ్యాదిగుణపూర్ణులైన నా ఆழ்వార్ల విషయంలో, ఆళ్ పుక్క = కైంకర్యం చేయడానికి తగిన, కాదల్ = ప్రేమ (భక్తి), అన్టే = ఆ క్షణంలోనే, అడిమై ప్పయన్ = (ఆழ்వార్ల శ్రీచరణాలలో) కైంకర్యం చేయడమే ప్రయోజనంగా కల్గినది అయినది.

పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానమ్ :

**అవ. - ఒన్పతామ్పాట్టు - "ఆழ்వారుడైయ అరుళ్ ఇవ్వులకినిల్ మిక్కతు" ఎన్నైక్కు అడి ఎన్? ఎన్నిల్, ఎన్నుడైయ తణ్మై పారాతే సకల వేదఙ్గళినుడైయ రహస్యార్థత్తై ప్పాడి, అత్తై ఎనక్కు ఉపకరిత్తార్-ఎన్గిఱార్. "నీశనేన్ నిఱై వొన్ఱు మిలేన్, ఎన్‌కణ్ పాశమ్ వైత్త పరఞ్జుడర్‌చ్చోతి" ఎన్ఱు అవ్విషయత్తిల్ ఆழ்వార్ అరుళిచ్చెయ్‌తత్తై, ఆழ்వార్ తిరువడికళిలే ఇవర్ అరుళిచ్చెయ్‌కిఱార్.**

**వ్యా.- (మిక్క వేతియర్) ప్రమాణశ్రేష్ఠమాన వేదత్తైయే నిరూపకమాక ఉడైయవర్‌కళ్. "ఉళన్ శుడర్ మికు శురుతియుళ్" ఎన్ఱు ఆழ்వార్ అరుళి చ్చెయ్య క్కేట్టిరుక్కైయాలే, ప్రమాణశ్రేష్ఠన్-ఎన్గిఱార్. అనేకశాఖాధ్యయనమ్ పణ్ణినవర్‌కళ్ - ఎన్ఱుమామ్.**

**(వేతత్తినుట్పొరుళ్) సకలవేదఙ్గళినుడైయ రహస్యార్థత్తై. "వేదాన్త రహస్యమ్-తదీయశేషత్వపర్యంతమాన భగవచ్ఛేషత్వమ్" ఎన్నిఱే వైదికశాస్త్రమ్ నిర్ణయిత్తతు.**

**(నిఱ్క ప్పాడి) దుర్గ్రహమాన ఇన్ద రహస్యార్థత్తై క్కేట్టార్‌క్కు ప్రతిపత్తి విషయమామ్పడి పాడి. "పరమనై ప్పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్" ఎన్ఱుమ్, "ఎమ్మై యాళుమ్ పరమర్" ఎన్ఱుమ్ అరుళిచ్చెయ్‌తారిఱే. (ఎన్నెఞ్జుళ్ నిఱుత్తినాన్) భగవచ్ఛేషత్వత్తుక్కుమ్ కూడ మేట్టుమడైయాన ఎన్నెఞ్జిలే ఇత్తై స్థిరమాక్కినార్. కల్లై త్తుళైత్తు, అతిలే నీరై నిఱుత్తువారైప్పోలే, నిర్వివరమాన ఎన్నెఞ్జుక్కు ఇతువే విషయమామ్పడి పణ్ణినార్. ఇతిఱే - ఎన్ తణ్మై పారాతే ఎన్ తిఱత్తిల్ పణ్ణిన ఉపకారమ్.**

**(తక్క శీర్ చ్చడకోపన్) ఇతు తొడఙ్గి ఉపకారస్మృతియాలే తమక్కు ప్పిఱన్ద అభినివేశత్తై ప్పేశుకిఱార్. (తక్కశీర్ చ్చడకోపన్) "సర్వేశ్వరన్‌కవికళ్" ఎన్నాల్ తకుతియాన కల్యాణగుణఙ్గళైయుడైయ ఆழ்వార్. "అయర్వఱు మమరర్‌కళ్ అతిపతి" ఎన్నాల్ సర్వేశ్వరత్వత్తుక్కు ప్పోరుమ్పడి యిరుక్కు మాపోలే, "సర్వేశ్వరన్‌కవికళ్" ఎన్నాల్ పోరుమ్పడియాయాయ్‌త్తు, ఆழ்వార్ ఇరుక్కుమ్పడి. "ఏఱ్కుమ్‌పెరుమ్పుకழ் వానవరీశన్ కణ్ణన్తనక్కు ఏఱ్కుమ్ పెరుమ్ పుకழ் వణ్ కురుకూర్ శడకోపన్" ఎన్ఱు తామే అరుళిచ్చెయ్‌తారిఱే. (ఎన్నమ్బిక్కు) అతక్కుమేలే ఒరు పౌష్కల్యమిఱే - యితు. ఎన్నై విషయీకరిక్కైక్కు తకుతియాన శీలాదిగుణపౌష్కల్యత్తై యుడైయరానవర్‌క్కు.**

**(ఆళ్ పుక్క కాతల్) అనన్యార్హశేషమాక్కిన రుచి. (అడిమై ప్పయనన్టే) ఇన్ద రుచియన్టే, అప్పోతే దాస్యమాన ప్రయోజనత్తోడే వ్యాప్తమాయిరుప్పతు. భగవద్విషయత్తిల్ రుచి యడియాక ప్పిఱన్ద దాస్యమ్, శరీరవిశ్లేషమ్ పిఱన్ఱు అర్చిరాదిమార్గత్తాలే, ఒరు దేశవిశేషత్తిలే శెన్నాల్ పెఱక్కడవతాయిఱే యిరుప్పతు. అఙ్గనన్టిక్కే, ఆழ்వార్ పక్కల్ పిఱన్ద రుచి, ఇశ్శరీరత్తోడే ఇఙ్గే ఆழ்వార్ తిరువడికళిలే ఎల్లా అడిమైయుమ్ శెయ్యలామ్పడి పణ్ణుమ్. "తుయరఱు శుడరడి తొழுతెழு" ఎన్ఱు ముతలిలే అభినివేశిత్త ఆழ்వారుక్కు "మునియే నాన్ముకను" క్కవ్వరుకేయిఱే పేఱాయ్‌త్తు. ఇవ్విషయత్తిల్ రుచి పిఱన్దాల్ అత్తనై విళమ్బియాతు-ఎన్గిఱతు. "అన్టే" ఎన్ఱతు-"ఆమ్" ఎన్ఱుమామ్.**

## అరుమ్బద విళక్కమ్

ఒన్బదామ్ పాట్టు – అవతారికై :– (మిక్కవేదియర్) ఎన్నతు–మిక్కతు ఎన్నతిటైక్కు– ఎన్నపడి. శ్రీమధురకవికళ్ గఙ్గాతీరత్తినిన్ఱుమ్ ఆழ்వారుడైయ దివ్యతేజస్సై సాక్షాత్కరిత్తు వన్ద మహాయోగికళాకైయాలే ఇవరుక్కొరు తణ్మైయుముణ్డో? ఎన్న; వ్యాఖ్యాతా దృష్టాన్తముఖేన నైచ్య మెన్ఱు అరుళిచ్చెయ్కిఱార్ (నీశనేనిత్యాది).

వ్యాఖ్యానమ్ :– "మిక్క" ఎన్నదుక్కు శ్రేష్ఠత్వముమ్, బహుత్వముమ్ – ఎన్ఱు ఇరణ్డర్థమ్. మున్దినదై అరుళిచ్చెయ్కిఱార్ (ప్రమాణేత్యాది). ప్రమాణశ్రేష్ఠమ్ – అపౌరుషేయత్వాదికళాలే. ఇప్పడి విశేషణమిట్టుచ్చొల్ల వేణ్డుమో? ఎన్న, ఆழ்వార్ విశేషణ మిట్టాప్పోలే అరుళిచ్చెయ్దార్ – ఎన్గిఱార్ (ఉళ్ళిత్యాది). ఇరణ్డామర్థమ్ (అనే కేత్యాది)

వేదార్థమ్ భగవచ్ఛేషత్వమన్ఱో, ఉట్పొరుళై త్తిన్నెజ్జిల్ నిఱుత్తుకై యావతు ఎన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (వేదాన్తరహస్యమెన్ఱు తొడఙ్గి– స్థిరమాక్కినార్ ఎన్నుమళవుమ్) ఆழ்వార్ ఏవిక్కొళ్ళ త్తామ్ ఇఙ్గే అడిమైశెయ్కైయాలే తమక్కు ఇఙ్గే సిద్ధిత్త అడిమై, ఆழ்వార్క్కు అర్చావతారమ్ ఏవిక్కొళ్ళమాట్టామైయాలే పరమపదత్తిలే సిద్ధిత్తతు– ఎన్నపడి. వేదాన్తరహస్యమ్– ప్రణవత్తిల్ చతుర్థ్యర్థమ్.

ఉకార్థత్తై దృష్టాన్తాన్తరముఖేన వివరిక్కిఱార్ (కల్లై త్తుళైత్తిత్యాది). (నిర్వివరమాన) భగవచ్ఛేషత్వమ్ కూడ ప్పుకురాత పడియాన. కీழ்ోడే ఇవ్వర్థత్తుక్కు చ్చేర్త్తియాకైయాలే ప్రకృతార్థోపసంహారమ్ పణ్ణుకిఱార్ (ఇతితే –యిత్యాది).

(ఇతు తొడఙ్గి) ఎన్నతు– ఇన్ద అర్థముమ్, మేల్పాట్టుమ్ "తక్క" ఎన్నతుక్కు ఒన్ఱు శొల్లవేణ్డుకైయాలే, "సర్వేశ్వరన్ కవి" ఎన్ఱు శొల్లుకైక్కు త్తక్కవర్– ఎన్నర్థమ్ అరుళిచ్చెయ్కిఱార్ (సర్వేశ్వరన్ కవికళిత్యాది).

"కణ్ణన్ తనక్కు క్కవి– ఎన్నాల్ ఏఱ్ఱుమ్ పెరుమ్పుకழ்" ఎన్ఱు కరుతి ప్రమాణ మరుళిచ్చెయ్కిఱార్ (ఏఱ్ఱు మిత్యాది). "తక్క శీర్" ఎన్నపోతే– కల్యాణగుణఙ్గళై చ్చొల్లి యిరుక్క "నమ్బి" ఎన్బానెన్? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (అతుక్కు మేలే –యిత్యాది వాక్యద్వయత్తాలే). ఆళ్పుక్కకాతల్ – ఆళ్పుకప్పణ్ణిన కాతల్. ఇత్తై అరుళిచ్చెయ్కిఱార్ (అనన్యార్హేత్యాది).



అడిమైయై, పయనాక– ఫలమాక వుడైత్తానతు– ఎన్ఱు అర్థమరుళిచ్చెయ్కిఱార్ (అప్పోతే – ఇత్యాది). వ్యావర్త్యపూర్వకమ్ వివరణమ్ పణ్ణుకిఱార్ (భగవదిత్యాది). ఇత్తై మూతలిక్కిఱార్ (తుయరఱు శుడరిత్యాది). మున్దిన అర్థత్తిల్ "అన్దే అడిమై ప్పయన్" ఎన్నన్వయమ్; ఇరణ్డా మర్థతుక్కు యథాక్రమ మన్వయమ్.

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**తొమ్మిదవ పాశురం – అవతారిక :** "ఆழ்వార్ల అనుగ్రహం ఈ లోకంకంటే పెద్దది" అని గడచిన పాశురంలో పల్కినందులకు కారణమేమి ? అంటే, "నా నైచ్యాన్ని గమనించకుండా, వేదాలన్నిటిలో ఉండే రహస్యార్థాలను పాడి, నాకు మహోపకారం చేశారు, ఆழ்వార్లు. అనేదే కారణం– అని అంటున్నారు, ఇందులో. **"నీశనేన్ నిఱై ఒన్ఱుమిలేన్ ఎన్కణ్పాశమ్ వైత్త పరమ్ శుడర్ శోదిక్కే"** (తిరువాయ్–3–3–4) (నీచుడను, ఏ గుణాలు లేనివాడనైన నా పట్ల వాత్సల్యాన్ని కల్గిన పరంజ్యోతికి) అని భగవద్విషయంలో ఆழ்వార్లు పల్కినసూక్తిని ఆழ்వార్ల శ్రీచరణాలపట్ల వీరు (మధురకవులు) పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్ : (మిక్క వేదియర్)** ప్రమాణాలలో చాలా గొప్పది అయిన వేదాన్ని పురస్కరించుకొని **"వేదియర్"** అనే పేరును **"ఉళన్ శుడర్ మికు శురుదియుళ్"** (తిరువాయ్–1–1–7) (ప్రకాశించే వేదాలలో ప్రతిపాద్యుడై ఉన్నాడు) అని అంటూ ఆழ்వార్లు తిరువాయ్మొழி ఆరంభంలోనే వేదాన్ని **"శుదర్ మికు శురుది"** అని అనుగ్రహించడం వినినందున, వీరు కూడా **"మిక్క వేదియర్"** అని వేదాన్ని ప్రమాణాలలో చాలా గొప్పది – అనే అర్థాన్ని గ్రహించి, దానిని **"వేదియర్"** అనే ప్రయోగంలోని **"వేదమ్"** అనే పదానికి విశేషణంగా గ్రహించి, ఈవిధమైన అర్థం చెప్పబడింది. ఈ రీతిలో కాకుండా, **"మిక్క వేదియర్"** అనే దానికి "పలు శాఖలను కల వేదం" అనే అర్థాన్ని గ్రహించి, **"మిక్క వేదియర్"** అనే ప్రయోగం– పలు శాఖలను అధ్యయనం చేసినవారు– అని తెల్పుతున్నట్లుగా కూడా అర్థాన్ని గ్రహించవచ్చు.

**(వేదత్తిన్ ఉట్పొరుళ్)**– అన్ని వేదాలయొక్క రహస్యార్థాన్ని– అని అర్థం. "ఆత్మ భగవానునకే శేషమై ఉన్నది" అనేది వేదంలోని అర్థం. "ఆ భగవచ్ఛేషత్వం అతని భక్తులకు శేషమై ఉండే పర్యంతం కొనసాగాలి" అనేది వేదంలోని అంతరార్థమైన

రహస్యం. వేదం ఆరంభంలోను, అంతంలోను అనుసంధింపబడే ప్రణవంలోని అకారంపై వచ్చి లోపించిన చతుర్థీవిభక్తియొక్క అర్థం ఇదే- అని కదా వేదాంతరహస్యం.

**(నిఱ్క ప్పాడి)-** గ్రహించడానికి దుర్లభమైన ఆ రహస్యార్థాన్ని వినేవారు అందఱు తెలిసేటట్లు ఆళ్వార్లు పాడారు. **"పయిలుమ్ తిరువుడైయార్ ఎవరేలుమ్, అవర్ కణ్డీర్ పయిలుమ్ పిఱప్పిడైతోఱు ఎమ్మై యాళుమ్ పరమరే"** (తిరువాయ్-3-7-1) (అనుసంధించే సంపద కలవారెవరైనా, వారే కలిగే జన్మలన్నిటిలోను మమ్ములను పాలించే మహనీయులు) అని ఆళ్వార్లు అనుగ్రహించారు కదా.

**(ఎణ్ నెఞ్జుళ్ తిరుత్తినాన్)-** "భగవానునకు శేషభూతం-అనేది, ఈ ఆత్మయొక్క స్వరూపం" అనే అర్థం కూడా ప్రవహించని రీతిలో మిట్టగా ఉండే నా మనస్సులో "ఈ ఆత్మస్వరూపం భగవద్భక్తులకు శేషమైనది" అనే వేదాంతరహస్యాన్ని స్థిరంగా నిలచి ఉండేటట్లు చేశారు. రాతిని తొలిచి అందులో నీటిని నింపేవారివలె, తొలువడానికి సాధ్యం కాని నా మనస్సులో తెలియడానికి చాలా అరుదైన ఈ అర్థమే జ్ఞాతవ్యమని నిలిచేటట్లు చేశారు. నా నైచ్యాన్ని చూడకుండా ఆళ్వార్లు నా పట్ల చేసిన ఉపకారం ఇదేకదా **(తక్కశీర్ చ్చడకోపన్)-** అని ఆరంభించి, కృతజ్ఞతవల్ల తమకు కల్గిన స్థైర్యాన్నిగూర్చి పల్కుతున్నారు.

**(తక్కశీర్ చ్చడకోపన్)- "తిరుమాలవన్ కవి"** (శ్రియ:పతియొక్క కవి) (తిరువిరు-48) అని పల్కడానికి తగిన కల్యాణగుణాలను కల్గినవారు, ఆళ్వార్లు. **"అయర్వఱుమ్ అమరర్కళ్ అదిపతి"** (తిరువాయ్-1-1-1) (స్మృతిలేని నిత్యసూరులకు ప్రభువు) అనే ప్రయోగం భగవానుని సర్వేశ్వరత్వానికి తగినట్లుగా ఉండే రీతిలో, **"తిరుమాలవన్ కవి"** అనేది ఆళ్వార్ల గొప్పతనం పొసగేటట్లుగా ఉంటుంది. **"ఏఱ్కుమ్ పెరుమ్ పుకళ్ వానవర్ ఈశన్ కణ్ణన్ తనక్కు ఏఱ్కుమ్ పెరుమ్ పుకళ్ వణ్కురుకూర్ చ్చడకోపన్"** (తగిన గొప్ప కల్యాణగుణాలను కల నిత్యసూరినాథుడైన శ్రీకృష్ణునితో సాటివచ్చే గొప్ప కీర్తిని కల ఉదారులైన, కురుకాపురిలోని శఠకోపులు) (తిరువాయ్-3-9-11) అని తామే పలికారు కదా! **"తక్క శీర్ చ్చడగోపన్"** అని అంటూ ఆళ్వార్ల కల్యాణగుణాలను గూర్చి పల్కడంతో మాత్రమేకాక, అంతకు మించిన ఒక గొప్పతనాన్ని పల్కుతున్నారు.

**(ఎన్ నమ్బిక్కు)-** మిక్కిలి గొప్పదైన, నన్ను కూడా కటాక్షించడానికి తగిన సౌశీల్యం. మొదలైన సౌలభ్యగుణాల పూర్తిని కల్గినవారికి- అని అర్థం.



**(ఆళ్పుక్క కాదల్)-** వారికే తగి ఉండేటట్లుగా చేయబడిన **(శేషభూతునిగా చేయబడిన)** నాప్రేమ- అని అర్థం.

**(అడిమై ప్పయనన్రే)-** ఈ ప్రేమ (భక్తి) కదా, అది కల్గిన క్షణంలోనే ఆళ్వార్లకు శేషభూతుడు (దాసుడు) కావడమనే ఫలాన్ని కలుగజేసినది. భగవానుని విషయంలోని ప్రేమవల్ల (భక్తివల్ల) కల్గిన శేషత్వం ఈ ప్రాకృతశరీరం తొలగిన తరువాత అర్చిరాది మార్గంలో పరమపదాన్ని చేరిన పిదప పొందదగినదిగా ఉన్నది. ఆ రీతిలో కాకుండా, ఆళ్వార్ల విషయంలో కల్గిన ప్రేమ(భక్తి) ఈ శరీరంతోటే, ఈలోకంలోనే ఆళ్వార్ల శ్రీచరణాలలో అన్ని కైంకర్యాలను చేసేటట్లుగా చేసింది.

**"తుయరఱు శుదరడి తొ ళుదెళు"** (తిరువాయ్-1-1-1) (దు:ఖాన్ని తీర్చే స్వభావాన్ని కల, ప్రకాశించే శ్రీచరణాలను ఆశ్రయించి ఉజ్జీవించు) అని తిరువాయ్‌మొళిని ప్రారంభించేటపుడే కైంకర్యం చేయాలని ఆశపడిన ఆళ్వార్లకు **"మునియే నాన్ముకనే"** (తిరువాయ్-10-10) అనే తిరువాయ్‌మొళి చివరి దశకం పూర్తి చేసిన తరువాతకదా ఆ కైంకర్యం లభించింది. ఆళ్వార్ల విషయంలో భక్తి (ప్రేమ) కల్గితే, వారి కైంకర్యం అంత ఆలస్యం కాదు- అని చెప్పబడుతున్నది. **"అన్రే"** అనే పదానికి "అపుడే" -అని అర్థం. లేక, **"పయనన్రే"** అనేది **"పయనన్రో"** అనే అర్థాన్ని ఇచ్చేదై, **"పయన్-ఆమ్"** (ఫలం కల్గుతుంది) అనే అర్థాన్ని చెప్పవచ్చు.

**నఞ్జీయర్ వ్యాఖ్యానంలో విశేషాలు :**

**అవ :** తిరువాయ్‌మొళి ప్రబంధంలోని **"పయిలుమ్ శుడరొళి"** (తిరువాయ్-3-7), **"నెడుమాఱ్కడిమై"** (తిరువాయ్-8-10) అనే రెండు దశకాలలోను అన్ని వేదాలకు సారార్థమైన భాగవత శేషత్వాన్ని అనుగ్రహించి, నా మనస్సులో స్థిరంగా ఉండేటట్లు ఆళ్వార్లు చేశారు- అని అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ : (మిక్క వేదియర్)** జ్ఞానభక్తులను పరిపూర్ణంగా కల్గిన వైదికులు- అని అర్థం. **"మిక్క"** అనే పదం వారి జ్ఞాన భక్తుల గొప్పతనాన్ని తెల్పుతుంది.

**(వేదత్తినుట్పొరుళ్)-** వేదానికి ప్రాణంవంటి అంతరార్థం- తిరువాయ్ మొళి. ఆ తిరువాయ్‌మొళికి అంతరార్థం- **"పయిలుమ్ శుడరొళి"** (3-7), **"నెడుమాఱ్కడిమై"** (8-10) అనే దశకాలు.

**(నిఱ్క ప్పాడి)** –రాగతాళాలతో పాడడంవల్ల నా మనస్సులో నిలిచేటట్లుగా పాడారు– అని భావం.

**(ఆళ్పుక్క కాదల్ అడిమై ప్పయనన్ఱే)–** ఆఴ్వార్ల శ్రీచరణాలలో కల్గిన భక్తి– వారికి దాసుడనైనందున నాకు కల్గిన ఫలం.

**నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవ :** నాల్గవ పాశురంలో ఆచార్యవిశ్వాసాన్ని గూర్చి పలికారు. అయిదవ, ఆఱవ పాశురాలలో ఆచార్యుల గొప్పతనాన్ని, వారు చేసిన ఉపకారంయొక్క గొప్పతనాన్ని తెలిపారు. ఈ పాశురంలో ఉపకారం యొక్క గొప్పతనాన్ని వివరిస్తూ, తమ కృతజ్ఞతను తెల్పుతున్నారు. ఆచార్యునకు శిష్యునిపై కృపయే స్వరూపం. శిష్యునకు ఆచార్యుని పట్ల కృతజ్ఞతయే స్వరూపం.

**వ్యాఖ్యానమ్ : (వేదియర్)– "వేదియర్"** అంటే– వేదానికి విరుద్ధమైన శాస్త్రాలను **"కాణ్బరో కేట్పరోదాన్"** (తిరుమాలై–7) అని కంటితో చూడకుండా, చెవితో వినకుండా, ఎల్లప్పుడు దోషరహితమైన వేదప్రమాణంలోనే ఊనికను (ఆదరాన్ని) కలవారు– అని అర్థం.

**(మిక్క వేదియర్)–** ఆ వేదంలోకూడా, అల్పమైన, అస్థిరమైన స్వర్గాదిపురుషార్థాలను, వాటి సాధనాలను ఆశ్రయించి, అంతటితో నిలువకుండా చాలా గొప్పదైన భగవత్ప్రాప్తియే పురుషార్థమని, దానికి సాధనాలు భక్తి, ప్రపత్తులే అని తైత్తిరీయ నారాయణవల్లిలో చెప్పబడిన వేదాంతవిజ్ఞానంలో సునిశ్చితార్థులై ఉండేవారు.

**(మిక్క వేదియర్)– "మిక్కార్ వేదవిమలర్"** (తిరువాయ్–2–9–8) అని ఆఴ్వార్ల వద్ద విన్నందువల్ల **"మిక్క వేదియర్"** అని మధురకవులు అంటున్నారు.

**(వేదియర్ వేదమ్)– "అన్దణర్ మాడు"** (తిరునెడు–4) (భగవానుని ధనం) అనే రీతిలో ఆ వైదికులకు గొప్ప సంపదయైన వేదం–అని అర్థం.

**(వేదత్తినుట్పొరుళ్ నిఱ్క ప్పాడి)** అది (సంస్కృత వేదం) **"నిఱ్కుమ్ నాన్మఱై"** (తిరువాయ్–6–5–4) అయినట్లుగా, దాని అర్థమై ఉండే ఇది కూడా (ఆఴ్వార్ల ప్రబంధం కూడా) అన్ని కాలాలలోను నాశం లేకుండా నిలచేటట్లుగా పాడి –అని అర్థం.



**(ఎన్ నెఞ్జుళ్ నిఱ్క ప్పాడి నిఱుత్తినాన్)–** పాడేటపుడే నా మనస్సులో స్థిరంగా ఉండేటట్లుగా భావ–రాగ– తాళాలతో సంగీతాత్మకంగా పాడారు. అందులోను, పైపైన చెప్పడం కాకుండా, అంతరంగంగా ఉపదేశించారు.

**(వేదత్తినుట్పొరుళ్ నిఱ్క ప్పాడి ఎన్ నెఞ్జుళ్ నిఱుత్తినాన్)–** వేదార్థాలను తిరువాయ్మొఴిలో చేర్చి పాడడం అరుదైన కృత్యం కాదు. తిరువాయ్మొఴిలోని అర్థాలను నామనస్సులో నిలచి ఉండేటట్లు చేయడమే అరుదైన కృత్యం. (పని)

**(తక్క శీర్ చ్చడకోపన్ ఎన్ నమ్బిక్కు)–** ఈ రీతిలో ఉపదేశించగల్గిన తమ జ్ఞానం మొదలైన గుణాలలోని పూర్తిని ప్రదర్శించి, శఠాన్ని కోపించి, తఱిమికొట్టేవారు" అని పేరు పొందినవారు. నా శాఠ్యాన్ని పోగొట్టి, తమ పూర్ణతో స్థిరంగా నిలచి ఉన్నారు. కొఱత కల్గినవారి కొఱతను తీర్చడమేకదా పూర్తియొక్క పరమావధి.

**(ఎన్ నమ్బి)–** ఆఴ్వార్లు ఉపదేశించిన అర్థాలకంటే వారి గుణపూర్తికి వీరు (ఆఴ్వార్లు) జితులయ్యారు.

**(తక్క శీర్ చ్చడకోపన్ ఎన్నమ్బి)– తక్కకీర్త్తి త్తిరుక్కుఱుఙ్గుడి నమ్బి"** (తిరువాయ్–5–5–5) (తగిన కీర్తిని కల తిరుక్కుఱుఙ్గుడిలోని గుణపూర్ణుడు) అనబడిన వారి (ఆఴ్వార్ల) నమ్బికాదు, వీరినమ్బి. ఆ నమ్బి పూర్తి నావరకు రాలేదు కదా ! అని అంటున్నారు.

**(ఆట్పుక్క కాదల్ అడిమైప్పయనన్ఱే)–** వారు, (ఆఴ్వార్లు) భగవానునకు శేషమై ఉండడాన్నిగూర్చి అతనిపట్ల భక్తిని కల్గి ఉండడాన్నిగూర్చి. అతనికి కైంకర్యం చేయడాన్నిగూర్చి ఉపదేశించారు. వీరు (మధురకవులు) ఆఴ్వార్లకు శేషమై, వారి విషయంలోనే భక్తిని కల్గిఉండి, వారికే కైంకర్యం చేయాలని ఆశపడుతున్నారు. వారు బాహ్యపదార్థాలను (శబ్దాది విషయాలను) విడచి, ఆంతరమైన పదార్థాలను ఇచ్చారు. వీరు, ఆంతర విషయమైన భగవద్విషయాన్ని కూడా బాహ్యపదార్థంగా తలచి, దానికంటే ఆంతరమైన– ముఖ్యమైన– ఆఴ్వార్ల శ్రీచరణాలలో శేషమై, వారిపట్ల భక్తిని కల్గి, వారి కైంకర్యంలో ఆసక్తిని కల్గినవారయ్యారు.

**(అడిమై ప్పయనన్ఱే)–** "కైంకర్యమే ప్రయోజనం" అనే విషయాన్ని ఆఴ్వార్ల దగ్గర గ్రహించారు. అయితే, వారివలె, భగవానునిపట్ల **"వఴువిలా అడిమై"** (తిరువాయ్–3–3–1) చేయడం కంటే, ఆఴ్వార్లకు కైంకర్యం చేయడమే తగినది– అని అంటున్నారు, వీరు. (మధురకవులు)

**పయనన్రాగిలుమ్ పాఙ్గల్లరాగిలుమ్,**
**శెయల్ నన్రాగ త్తిరుత్తి ప్పణికొళ్వాన్,**
**కుయిల్ నిన్రార్ పొ*ఴి*ల్ శూ*ఴ్* కురుగూర్ నమ్బి,**
**ముయల్గిన్రేన్ ఉన్ఱన్ మొయ్క్క*ఴ*ఱ్కన్బైయే** 10

పయన్ అన్రు ఆకిలుమ్ = (ఇతరులను సంస్కరించినందున) తమకు ఏవిధమైన ప్రయోజనం లేకపోయినా, పాఙ్గు అలర్ ఆకిలుమ్ = (వారు సంస్కరింపబడడానికి) తగిర యోగ్యతను లేనివారైనా, శెయల్ = తమ కృత్యంతో, నన్రాక తిరుత్తి = చక్కగా శిక్షించి, పణి కొళ్వాన్ = (వారిని) శేషభూతులుగా గ్రహించేవారై, కుయిల్ నిన్రు ఆర్ పొ*ఴి*ల్ శూ*ఴ్* కురుకూర్ = కోయిలలు స్థిరంగా నిలచి కూసే తోటలతో చుట్టబడి ఉండే తిరునగరిలో (వేంచేసి ఉండే), నమ్బి = ఆ*ఴ్వా*ర్లూ!, ఉన్రన్ = తమ, మొయ్ క*ఴ*ఱ్కు = గొప్ప శ్రీచరణాలలో, అన్బైయే = భక్తిని పొందడంకోసమే, ముయల్కిన్రేన్ = నేను ప్రయత్నిస్తున్నాను.

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్ :

**అవ. - పత్తామ్పాట్టిల్, ఆ*ఴ్వా*ర్ తమక్కు ఉపకరిత్త ఉపకారత్తై అనుసన్ధిత్తవాఱే, తామ్ ఇతుక్కు మున్బు ఆ*ఴ్వా*ర్ విషయత్తిల్ నిన్ర నిలై యడఙ్గ ముతలడి ఇట్టిలరాక త్తో*ఱ్ఱు*కైయాలే, అవర్ పణ్ణిన ఉపకారత్తై ప్పేశుకిఱార్.**

**ఆచార్యన్ పణ్ణిన ఉపకారత్తుక్కు ప్రత్యుపకారమిల్లైయో? ఎన్నిల్. "కృత్స్నాం వా పృథివీం దద్యాత్ న తత్తుల్యం కథఞ్చన" ఎన్రు - పఞ్చాశత్కోటి విస్తీర్ణైయాన భూమియుమ్ సదృశమన్రు - ఎన్రతిఱే శాస్త్రమ్.**

**అవన్ ఇవనుక్కు ఉపకరిత్తతు సర్వాధికమాయిరుప్పతొరు మిథునత్తై యానాల్, ఇప్పడియే ఇరుప్పతొరు మిథునత్తై ఉపకరిత్తాలిఱే, ఇవన్ ప్రత్యుపకారమ్ పణ్ణినానావతు. ఆకైయాలే ఆచార్యవిషయత్తిల్ ఎల్లామ్ శెయ్తాలుమ్ అవన్ పణ్ణిన ఉపకారత్తై పార్త్తాల్ ఒన్రుమ్ శెయ్తిలనాయ్, ఎన్రు మొక్క క్కుఱైవాళనాయ్ ప్పోరుమిత్తనై.**



**వ్యా. - (పయనన్రాకిలుమ్) నాట్టిల్ ఒరువనుక్కు ఒరువన్ ఉపకరిప్పతు ఒరు ప్రయోజనత్తై ప*ఱ్ఱ*విఱే. అఙ్గన్ ఒరు ప్రయోజన మిల్లాతిరుక్కచ్చెయ్తేయుమ్. (పాఙ్గల రాకిలుమ్) ప్రయోజనమిల్లావిట్టాల్, శొల్లుకిఱ హితమ్ కేట్కైక్కు ప్పాఙ్గా యిరుక్కలామిఱే. అఙ్గన్ పాఙ్గిన్రిక్కే యిరున్దార్కళేయాకిలుమ్.**

**ఇప్పడి యిరుక్కుమవర్కళుక్కు హితమ్ శొల్లుకైక్కు హేతు ఎన్? ఎన్నిల్. ఇవర్కళనర్థమ్ పొఱుక్కమాట్టామైయిఱే. ఇప్పడి ఉపదేశిత్తారుణ్డో? ఎన్నిల్, రావణనుడైయ దుర్గతియై క్కణ్డు, "మిత్ర మౌపయికం కర్తుమ్" ఎన్రు - అవనుక్కు హితమ్ శొన్నాళిరే, పిరాట్టి.**

**ఒరువన్, తలైక్కడైయైయుమ్, పుఱక్కడైయైయుమ్ అడైత్తుక్కొణ్డు, అకత్తుక్కుళ్ళే కిడక్క, అకమ్ నెరుప్పు ప్పట్టు వేవానిన్రాల్, కణ్డునిన్రార్ అవిక్కుమ్బోతు, తఙ్గళుక్కొరు ప్రయోజనత్తై ప్పార్త్తాతల్, ఉళ్ళే కిడన్దవన్ అపేక్షిత్తతుక్కాక వాతలన్రే, అవిప్పతు. ఇప్పడియాయ్త్తు ఆ*ఴ్వా*ర్పడియుమ్.**

**(శెయల్ నన్రాక ) తనక్కొరు ప్రయోజనమిల్లై యానాలుమ్, ఎతిర్త్తలై పాఙ్గిన్రియే యొ*ఴి*న్దాలుమ్ అవనుజ్జీవిక్కుమ్బడి ఎన్? ఎన్నిల్, తమ్ముడైయ శెయలాలే ఎల్లామ్ నన్రామ్బడి పణ్ణి. ఇవన్ శెయల్ తాన్ నన్రాకుమ్బడి పణ్ణి ఎన్రాకవుమామ్.**

**(తిరుత్తి ప్పణి కొళ్వాన్) "తీర్న్ద అడియవర్తమ్మై త్తిరుత్తి ప్పణి కొళ్ళవల్ల" ఎన్రు- "ప్రాప్యముమ్ ప్రాపకమున్దానే" ఎన్రు అధ్యవసిత్తిరుక్కుమవర్కళుడైయ విరోధియై ప్పోక్కి అడిమైకొళ్ళుమవన్ - ఎన్రతిఱే, సర్వేశ్వరనై. అఙ్గనన్రిక్కే, ఇవై యొన్రుమిన్రిక్కే యిరుక్కుమవర్కళైయుమ్ "తిరుత్తి ప్పణికొళ్ళు" మవరిఱే, ఆ*ఴ్వా*ర్. "పణి కొళ్వాన్ - కురుకూర్నమ్బి" ఎన్రన్వయిమ్.**

**"కుయిల్ నిన్రార్ పొ*ఴి*ల్ శూ*ఴ్*" ఎన్ర విడమ్ - తిరుత్తి పణికొళ్ళుమ్ పడిక్కు దృష్టాన్తమ్. ఇవర్ ఒరు కాలత్తిలే ఆ*ఱ్ఱా*మైయాలే, "కాణ వారాయ్" ఎన్రు కూప్పిడువతు మొరు పాశుర ముణ్డు, "యావర్ నికర్ నల్ వానత్తే"**

ఎన్ఱు కళిత్తు చ్చొల్లువతు మొరుపాశుర ముణ్డు. ఇవర్ పాశురత్తై క్కేట్ట కుయిల్ కళుమ్ శెవియే*ఱ్ఱా*లే ఇప్పాశురత్తైయే శొల్లుమ్. ఆక, ఇరణ్డు పాశురత్తుక్కుమ్ కుయిల్కళాయ్త్తు ప్పయి*ఱ్ఱు*వన.

(కురుకూర్నమ్బి) "ఊరుమ్ నాడు ములకమున్దన్నైప్పోల్" ఎన్ఱు చేతన రళవన్ఱిక్కే, తిర్యక్కుక్కళళవుమ్ ఏఱుమ్బుడియాయాయ్త్తు, ఆళ్వారుడైయ పూర్తి యిరుప్పతు.

(ముయల్కిన్ఱేన్ ఉన్ఱన్ మెయ్కళ్ఱ్కన్బైయే ) ఉన్నుడైయ శ్లాఘ్యమాన. తిరువడికళుక్కన్బైయే, ముయల్కిన్ఱేన్-అర్థియానిన్ఱేన్. శెయ్కిఱ అడిమైయిల్ పర్యాప్తి పిఱవామైయాలే, "తిరువడికళిలే ఎనక్కు అభినివేశమ్ వేణుమ్" ఎన్ఱు అర్థిక్కిఱార్. "ఎన్నై త్తీమనమ్ కెడుత్తాయ్ ఉక్కెన్ శెయ్కేన్?" ఎన్ఱు ఆళ్వార్ తామ్ అవ్విషయత్తిలే తడుమాఱినాప్పోలే, ఆళ్వార్ పణ్ణిన ఉపకారత్తుక్కు ప్రత్యుపకారమ్ కాణామైయాలే తడుమాఱుకిఱార్.

## అరుమ్బద విళక్కమ్

పత్తామ్పాట్టు - అవతారికై :- "ఆట్పుక్కకాతల్ అడిమైప్పయనన్ఱే" ఎన్ఱు- తామ్ అనుకూలరాయ్ కైజ్కర్యజ్గళై ప్పణ్ణికొణ్డిరుక్క, "పయినన్ఱాకిలుమ్ పాజ్గల్ రాకిలుమ్" ఎన్ఱు అనుసన్ధిక్కక్కూడుమో? ఎన్గిఱ శజ్కైయిలే, అతు తమ్ నెజ్జిల్ పడామైయాలే అరుళిచ్చెయ్కిఱార్ - ఎన్ఱు అవతారికై అరుళిచ్చెయ్కిఱార్ (ఆళ్వారిత్యాది). (తమక్కు) మధురకవికళుక్కు. (ఉపకారత్తై) ఎన్ఱతు- "ఎన్ నెఞ్జుళ్ నిఱుత్తినాన్- ఎన్ఱత్తై క్కటాక్షిత్తు. (ఇతుక్కు మున్బు) ఎన్ఱతు. "పయినన్ఱా కిలుమ్" ఇత్యాద్యనుసన్ధానత్తుక్కు మున్బు- ఎన్ఱపడి. (అవర్ పణ్ణిన ఉపకారమ్) ఎన్ఱతు- తన్పక్కల్ ఒన్ఱుమిన్ఱిక్కే యిరుక్క అవర్పణ్ణిన ఉపకారమెన్ఱపడి. ముతలడి యిట్టిలరాక త్తో*ఱ్ఱా*మైక్కు హేతు - తామ్పణ్ణిన అనుకూలాచరణమ్ సదృశమల్లా మైయాలే, అత్తై ప్పణ్ణక్కూడాతెన్ఱు కరుత్తు. (ప్రత్యుపకారమ్) సదృశోపకారమ్.

ప్రత్యుపకార మిల్లామైక్కు శాస్త్రమ్ కాట్టిన అనన్తరమ్ ఉపపత్తియుమ్ కాట్టుకిఱార్ (అవనివనుక్కిత్యాది).



వ్యాఖ్యానమ్ :- దుర్గతి కణ్డు ఉపదేశిక్కైక్కు ఉపపత్తియుజ్గాట్టుకిఱార్ (ఒరువనిత్యాది). (ఆకమ్) గృహమ్.

శజ్కాసమాధానపూర్వకమ్ ఎడుత్త ప్రతీకత్తుక్కు త్తాత్పర్యమ్ (తనక్కిత్యాది). స్వప్రయోజనమిల్లాతే పోనాలుమ్ అవన్ప్రయోజనమానాలుమ్ సిద్ధిక్కవేణ్డువతు ఒన్ఱుణ్డే- ఎన్ఱు శజ్కైక్కు క్కరుత్తు. "శెయల్ నన్ఱాక" ఎన్ఱతు- సామాన్యమాక ఇరుక్కైయాలే, ఆళ్వారుడైయ శెయలాలే- ఎన్ఱు కీళ్రుళిచ్చెయ్తు, ఇవన్ శెయలై నన్ఱాక ప్పణ్ణి- ఎన్ఱు అర్థాన్తరమరుళిచ్చెయ్కిఱార్ (ఇవన్ శెయల్తానిత్యాది).

"తిరుత్తి" ఎన్ఱతుక్కు- తిరున్దాతవరైయుమ్ తిరుత్తి-ఎన్ఱాయ్, వ్యావర్త్యపూర్వకమాక త్తాత్పర్య మరుళిచ్చెయ్కిఱార్ (తీర్న్ద -ఇత్యాది వాక్యద్వయత్తాలే). (ఇవై యొన్ఱుమిన్ఱిక్కే) ఎన్ఱతు- "ప్రాప్యమవనే" ఎన్ఱుమ్, "ప్రాపకమవనే" ఎన్ఱుమ్ శొల్లుకిఱ అధ్యవసాయజ్గళిన్ఱిక్కే- ఎన్ఱపడి. "కొళ్వాన్" ఎన్ఱతు- కొళ్ళుకైక్కాక -ఎన్ఱు పోరామైక్కాక అన్వయజ్గాట్టుకిఱార్ (పణికొళ్వానిత్యాది). శెవియే*ఱ్ఱా*లే -శెవియిన్ వళియాలే. (పయి*ఱ్ఱు*కై) అభ్యసిత్తు చ్చొల్లుకై.

నమ్బిపదతాత్పర్యమ్ (ఊరు మిత్యాది) మొయ్-శ్లాఘ్యత్తై. "కళ్ఱ్కు" ఎన్ఱతు- సమ్బన్ధసామాన్యషష్ఠియాయ్, విషయ-విషయీభావనై యిట్టు త్తాత్పర్య మరుళిచ్చెయ్ కిఱార్ (శెయ్కిఱ- ఇత్యాది). మున్బే అభినివేశ ముణ్డాయిరుక్క ఇవర్ పునః అత్తై ప్రార్థిప్పానెన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (ఎన్నై త్తీమనజ్గెడుత్తాయ్- ఇత్యాది).

## భావదీపిక (ఆంధ్రవివరణం)

**పదవ పాశురం - అవతారిక :** ఆళ్వార్, తమకు చేసిన హితాన్నిగూర్చి భావించగానే తాము ఇంతవరకు ఆళ్వార్ల విషయంలో చేసిన ఆనుకూల్యం అంతా చాలా తక్కువగానే తోచినందున, ఆళ్వార్ చేసిన ఉపకారాన్నిగూర్చి ఇందులో మధురకవులు పల్కుతున్నారు. ఆచార్యుడు చేసిన ఉపకారానికి ప్రత్యుకారం ఏమీ లేదా ? అని అంటే **"యో దద్యాత్ భగవద్జ్ఞానం కుర్యాద్ధర్మోపసేవనమ్, కృత్స్నాం వా పృథివీం దద్యాన్న తత్ తుల్యం కథంచన"** (విష్ణు ధర్మమ్-70-78) (భగవానునిగూర్చిన జ్ఞానాన్ని ఎవడు కల్గిస్తున్నాడో, భగవానుని పొందే ఉపాయాన్నిగూర్చి ఎవడు తెల్పుతున్నాడో, భూమి అంతా ఆ ఆచార్యునకు కానుకగా సమర్పించాలి. అయినా,

అదికూడా, అతడు చేసిన ఉపకారానికి ఏ రీతిలోను సాటిరాదు) అని యాభైకోట్ల విస్తీర్ణాన్ని కల భూమినే ఇచ్చినా ఆచార్యుడు చేసిన ఉపకారానికి అది తగిన ప్రత్యుపకారం కాబోదు- అని శాస్త్రం తెల్పుతున్నది.

ఆచార్యుడు, శిష్యునకు ఉపకరించినది ఏది? అంటే, అందటికంటే గొప్పవారైన దివ్యదంపతులనే కదా! ఈవిధంగా మఱి ఇంకొక దివ్యదంపతులు ఉండి ఉంటే, అపుడు వీరిని శిష్యుడు ఆచార్యునకు ప్రత్యుపకృతిగా సమర్పించడానికి అవకాశం ఉన్నది. ఆవిధంగా లేనందువల్ల ఆచార్యుని విషయంలో ఎంత ప్రత్యుపకారం చేసినా, అతడు (ఆచార్యుడు) చేసిన ఉపకారాన్ని చూచినపుడు, ఇతడు (శిష్యుడు) చేసినది ఏమీ లేదు- అని చెప్పే రీతిలో ఉంటుంది. ఎల్లప్పుడూ శిష్యుడు ఆచార్యునకు "ఏమి ప్రత్యుపకారం చేయగలను?" అనే కోరికను కలవాడుగానే ఉండవలసి ఉన్నది.

**వ్యాఖ్యానమ్ : (పయనన్ఱాకిలుమ్)** లోకంలో ఒకడు, ఇంకొకనికి ఉపకారం చేయడం- ఒక ప్రయోజనాన్ని ఆశించి కదా చేస్తాడు. ఆవిధంగా ఏ ప్రయోజనం లేకపోయినా, నమ్మాళ్వార్లు నావంటివారిని సంస్కరించారు- అని భావం.

**(పాఙ్గలరాకిలుమ్)**- శిష్యుడు ఏ ఉపకారాన్ని కూడా చేయకపోయినా, ఆచార్యుడు పలికేదానిని విని, తదనుసారంగా వర్తించే యోగ్యతను కలవాడై ఉండాలికదా ! ఆవిధంగా సరిగా లేకుండా (యోగ్యతను కల్గి ఉండకుండా) శిష్యులు ఉన్నప్పటికీ, అటువంటివారికి ఆళ్వార్లు హితాన్ని ఉపదేశించడానికి కారణం ఏమి? అంటే, శిష్యులు పడే తాపత్రయమనే క్లేశాన్ని చూచి సహించలేకపోవడమే.

ఈవిధంగా హితాన్ని ఉపదేశించేవారు ఎవరైనా ఉన్నారా ? అని అంటే, రావణుని అధమస్థితిని చూచి, **"మిత్ర మౌపయికం కర్తుం రామ: స్థానం పరీప్సతా, వధం చానిచ్ఛతా ఘోరం త్వయాఽసౌ పురుషర్షభః"** (రామా-సుందర-21-19) (రావణా! నీవు నీ స్థానాన్ని పొందగోరితే, ఘోరమైన వధను కోరకుండా ఉంటే, ఈ పురుషశ్రేష్ఠుడైన శ్రీరాముని మిత్రునిగా చేసికోవడం నీకు తగినది) అని అతనికి హితాన్ని ఉపదేశించింది కదా!- సీతాదేవి. ఒకడు, వాకిటి తలుపులను, పెరటి తలుపులను మూసి వేసి, తన ఇంటిలో నిద్రించేటపుడు, ఆ ఇంటికి నిప్పు అంటుకొన్నట్లయితే, ఆవిషయాన్ని చూచిన బయట ఉండేవారు, తమకు ఒక ప్రయోజనాన్ని కాని, ఇంటిలోపల ఉండేవారు కోరడం కాని ఆశించి ఆ నిప్పును ఆర్పరు కదా ! కరుణ వల్ల కదా ఆర్పుతారు. ఆళ్వార్ల స్వభావం కూడా ఇటువంటిదే.



**(శెయల్ నన్ఱాక)** – ఆచార్యుడు తనకు ఏ ప్రయోజనం లేకపోయినా, శిష్యుడు ఏ యోగ్యతను లేనివాడై ఉన్నా, శిష్యుని ఉజ్జీవింపజేయడం ఏవిధంగా ? అంటే, ఆచార్యుడు తన కృత్యాలతో శిష్యుని లోపాలను పోగొట్టి తీర్చిదిద్ది, హితం కలిగేటట్లుగా చేసి, ఉజ్జీవింపచేస్తాడు. **"శెయల్"** -అనేది ఆచార్యుడు శిష్యునకు ఉపదేశించడం, శిక్షించడం మొదలైన ఆచార్యుని కృత్యాలను తెల్పుతుంది. ఆవిధంగా కాకుండా, **"శెయల్'** అంటే -శిష్యుని కృత్యాలను అవి మంచివి అయేటట్లుగా ఆచార్యుడు సంస్కరిస్తున్నాడు- అని భావం.

**(తిరుత్తి ప్పణి కొళ్వాన్)**- ఎవరివల్ల సంస్కరిచడానికి సాధ్యం కానివారిని సైతం సంస్కరించి, వారిని తమకు శేషభూతులుగా చేసికొంటారు. **"తీర్న్ద అడియవర్ తమ్మై త్తిరుత్తి ప్పణికొళ్ళవల్ల ఆర్న్ద పుకళ్ అచ్చుతనై"** (తిరువాయ్-3-5-11) (దృఢమైన విశ్వాసాన్ని కల భక్తులను సంస్కరించి వారినుండి సేవలను గ్రహించేవాడు, నిండైన కీర్తిని కలవాడైన అచ్యుతుడు) అని ఆళ్వార్లు పల్కిన రీతిలో, పొందదగినది అయిన ప్రాప్యం, పొందేదారి అయిన ప్రాపకం- రెండూ భగవానుడే- అనే నిశ్చయాన్ని కల్గి ఉండే **"తీర్న్ద అడియవర్కళ్"** (దృఢవిశ్వాసాన్ని కల దాసుల) విరోధులను పోగొట్టి, వారినుండి కైంకర్యాన్ని గ్రహిస్తాడు- భగవానుడు. ఆ రీతిలో కాకుండా, ఏవిధమైన యోగ్యతను లేనివారై, భగవానునిచేకూడా సంస్కరింపబడడానికి సాధ్యం కానివారినిసైతం సంస్కరించి, వారినుండి కైంకర్యాన్ని చేస్తారు- ఆళ్వార్లు. **"పణికొళ్వాన్... కురుకూర్నమ్బి"** అని అన్వయించి, అర్థాన్ని చెప్పాలి.

**"కుయిల్ నిన్ఱార్ పొళ్ళిల్ శూళ్"** అనే పదసందర్భంద్వారా ఈ రీతిలో సంస్కరించి, కైంకర్యాన్ని స్వీకరించడంలో ఒక ఉదాహరణాన్ని చూపుతున్నారు. ఆళ్వార్లు- (తమ మనస్సులో) భగవానుని అనుభవం పొందని కాలంలో భగవద్ విశ్లేషాన్ని సహించలేనందున **"కాణవారాయ్"** (నేను దర్శించేటట్లు నీవు రావాలి) (తిరువాయ్-8-5-2)అని ఆక్రందించిన పాశురాలున్నాయి. ఆ అనుభవాన్ని పొందినపుడు, **"యావర్ నికర్ అకల్ వానత్తే ?"** (ఈవిశాలమైన భూమిలో ఎవరు నాకు సాటి?) (తిరువాయ్-4-5-8) అని ఆనందంతో పలికే పాశురాలు కూడా ఉన్నాయి. వీరి ఈ పాశురాలను మాటిమాటికి ఆలకించిన కోయిలలు కూడా, వీటిని విన్న అలవాటుచేత, వీటినే (పాశురాలనే) పల్కుతాయి. అందువల్ల, ఈవిధమైన రెండు రీతులలోని పాశురాలను అనుసంధించి, వాటినే పల్కడానికి కోయిలలు

ఉదాహరణం– అని భావం. ఇక్కడ **"కుయిల్కళ్"** అనేది స్వాపదేశంలో శిష్యులను తెల్పుతుంది.

**(కురుకూర్ నమ్బి) –"ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తన్నైపోల్"** (తిరువాయ్–6–7–2) (పల్లెలు, నగరాలు, లోకం అంతా తనవలె) అని ఆఴ్వార్లు పల్కిన రీతిలోనే, వివేకాన్ని కల మానవులు మాత్రమేకాక, తిర్యక్కులైన పక్షులు మొదలైనవి కూడా ఆఴ్వార్ల పాశురాలను అధ్యయనం చేసేటట్లుగా కదా, ఆఴ్వార్ల గొప్పతనం (పూర్ణత) ఉన్నది.

**(ముయల్కిన్టేన్ ఉన్టన్ మొయ్కఴల్కన్బైయే)–** మీ గొప్ప శ్రీచరణాల విషయంలో భక్తినే (ప్రేమనే) కోరి ఉన్నాను– అని భావం. **"మొయ్"** –అనే విశేషణం వైలక్షణ్యాన్ని (గొప్పతనాన్ని) తెల్పుతుంది. ఆఴ్వార్లకు చేసే కైంకర్యంలో "చాలు" అనే భావన కల్గనందున, ఆఴ్వార్ల శ్రీచరణాలలో అతిశయించిన భక్తివల్ల ఏర్పడే అభినివేశం నాకు కలగాలి– అని ప్రార్థిస్తున్నారు. **"ఎన్నై త్తీ మనమ్ కెడుత్తాయ్, ఉనక్కెన్ శెయ్కేన్ ? ఎన్ శిరీదరనే !"** (నా చెడ్డ మనస్సును పోగొట్టావు. ఓ శ్రీధరా ! నీకేమి ప్రత్యుపకృతిని చేయగలను?) (తిరువాయ్–2–7–8) అని ఆఴ్వార్లు భగవానుని విషయంలో చేయదగిన ప్రత్యుపకృతిని దేనినీ చూడలేక తడబడేటట్లుగా, ఆఴ్వార్ల విషయంలో చేయగల్గిన ప్రత్యుపకారాన్ని చూడలేక మధురకవులు తడబడుతున్నారు.

**నఞ్జీయర్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవ :** మధురకవులు ఆఴ్వార్లు తమకు చేసిన ఉపకారాన్నిగూర్చి భావించేటపుడు, తాము వారిపట్ల కల్గి ఉండే భక్తి (ప్రేమ) అసత్కల్పంగా (ఏమీ లేనిదిగా) తోచి, ఆఴ్వార్లను ఉద్దేశించి, "దేవరవారి శ్రీచరణాలలో దాసుడు భక్తిని కల్గి ఉండడం ఆరంభించిన స్థితియే, ఇది" అని అంటున్నారు. పైరు, మొదట లేతపైరుగా ఉన్నా, తరువాత క్రమంగా ముదిరిన పైరుగా మాఱుతుంది. అదే రీతిలో, నా భక్తి అనే పైరు ఇపుడు లేత పైరుగా ఉన్నది. అది ముదిరిన స్థితిని పొందడానికి ఇంకా పలు దశలు దాటాలి– అని అంటున్నారు, ఈ పాశురంలో.

**వ్యాఖ్యానమ్ : (పయనన్టాకిలుమ్ పాఙ్గలరాకిలుమ్)** తమను ఆశ్రయించనివారై ఉన్నా, **"కీఴ్ప్పడిదల్"** (భవ్యతను–విధేయతను) లేనివారై ఉన్నా– అని అర్థం. భగవానుడైతే, తనను ఆశ్రయించనివారిని విడచిపెడతాడు. విధేయత లేనివారిని కూడా నిరసిస్తాడు. ఆ రీతిలో కాకుండా, ఆఴ్వార్లు వారినికూడా పరిగ్రహిస్తారని భావం.



**(శెయల్ నన్టాక)–** ఆఴ్వార్లు వేంచేసి ఉండే సన్నివేశాన్ని దర్శించగానే దుష్ప్రవర్తన కలవారుకూడా, సత్ప్రవర్తన కలవారుగా కాగలరుకదా! భగవద్విషయంలో తమ యోగ్యతను గమనించి ఆశ్రయించాలి. ఆ రీతిలో కాకుండా, యోగ్యత లేనివారుకూడా తాము ఏ యోగ్యతను సంపాదించనక్కఱ లేకుండా ఆశ్రయించే టట్లుగా కదా, ఆఴ్వార్ల సౌలభ్యం ఉన్నది.

**(కుయిల్ నిన్టార్ పొఴిల్ శూఴ్)–** ఈవిధంగా ఎవరైనా ఆఴ్వార్ల దరి చేరవచ్చు–అనేదానికి ఇది దృష్టాంతం వీరిని ఆశ్రయించిన తిర్యక్కులు కూడా ఆనందించే రీతిలో వీరిని ఆశ్రయించినవారంతా ఆనందాన్ని పొందుతారు. సామగానం చేసే నిత్యముక్తులే భగవానుని చేరవచ్చు; మోక్షాన్ని పొందాలనే అభిలాషను కల అందఱు ఆఴ్వార్ల దరిచేరవచ్చు– అనేది ఇక్కడ వైలక్షణ్యం.

**(కురుకూర్నమ్బి) –**భగవానునితో, నిత్యులతో, ముక్తులతో భేదం లేకుండా అందఱు ఆనందం పొందేటట్లుగా కదా, ఆఴ్వార్ల పూర్తి ఉన్నది. **"పణి కొళ్వాన్ కురుకూర్నమ్బి"** అని అన్వయించికూడా అర్థాన్ని చెప్పవచ్చు. **'పణి కొళ్వదఱ్కాక ముయల్కిన్టేన్"** అని అవతారికలో అన్వయించిన రీతిలో అర్థాన్ని చెప్పవచ్చు.

**నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవ :** గడచిన పాశురంలో ప్రాప్యత్వం, ప్రాపకత్వం, జ్ఞానాన్ని ప్రసాదించే స్వభావం, దోషాలకు ప్రతిభటమై ఉండడం– మొదలైన ఆఴ్వార్ల వైలక్షణ్యాలను అన్నిటినీ పల్కిన మధురకవులు అటువంటి ఆఴ్వార్లు తమ విషయంలో చేసిన ఉపకారాలను గూర్చి ఇందులో వివరిస్తున్నారు. తమ దోషాలకు ప్రతిభటమైన ఆఴ్వార్ల గొప్పతనం, తమ కొఱతలకు (లోపాలకు) ప్రతిభటమైన ఆఴ్వార్ల ఉపకారత్వ స్వభావం– మొదలైనవానిని ఇంతవరకు తెలియజేశారు.

ఈ పాశురంలో, ఆఴ్వార్లు చేసిన ఆ ఉపకారానికి ప్రత్యుపకారాన్ని అన్వేషించినా, కన్పించనందున తడబడుతున్నారు. **"వేదత్తిన్ ఉట్పొరుళ్ నిఱ్క ప్పాడి ఎన్ నెఞ్జుళ్ నిఱుత్తినాన్"** (9) (వేదంలోని అంతరార్థాన్ని నా మనస్సులో నించి ఉండేటట్లు పాడి నా మనస్సులో సంస్కరించారు) అని, **"యో మా దదాతి స ఇదేవ మావాః"** (తైత్తి.భృగు–10–6) (ఎవడు నాకు పరమాత్మను అనుగ్రహిస్తున్నాడో, అతడే నాకు రక్షకుడు) అనే ముముక్షుదశతో పాటు, ముక్తిని పొందిన వాని దశతో పాటు తేడా లేకుండా, ఆచార్యుని విషయంలో అతడు చేసిన హితాన్ని కృతజ్ఞతాపూర్వకంగా

అనుసంధించవచ్చునే తప్ప, ప్రత్యుపకారం చేసి పూర్తి చేయడం వీలు కాదు. ప్రత్యుపకారాన్ని ఎదురు చూడకుండా ఉండడం - ఆచార్యుని లక్షణం. సదా ప్రత్యుప కారాన్ని చేయాలని ఆశపడడం- శిష్యులని లక్షణం. ఈ శిష్యలక్షణం నెఱవేరే దారిని ఎంత వెదకినా కన్పించనందున దిగ్భ్రమను పొందుతున్నారు, మధురకవులు. ఆచార్యుడు చేసిన ఉపకారం-శిష్యుడు ప్రత్యుపకారం చేయడంలోని ఆశను కల్గిస్తుంది. (పురి కొల్పుతుంది). ఆచార్యుడు చేసిన ఉపకారంయొక్క గొప్పతనం- శిష్యునకు ప్రత్యుపకారం చేయడానికి సాధ్యం కానట్లుగా చేస్తుంది. "ఏమి ప్రత్యుపకృతిని చేస్తాము?" అనే తడబాటుతో శిష్యుడు కాలాన్ని గడిపేటట్లుగా ఉంటుంది. భగవద్విషయంలో అయినా అతని ఆత్మను అతనికి సమర్పించడం అనేది ఉన్నది. ఆచార్యుడు తానే సంస్కరించిన తన ఆత్మను శిష్యుడు ఆచార్యునకు సమర్పించడం సాధ్యం కాదు.

**వ్యాఖ్యానమ్ : (పయనన్టాకిలుమ్ పాఙ్గలరాకిలుమ్) "ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషా వా తథావిధా, తత్ర విద్యా న వప్తవ్యా శుభం బీజ మివోషరే"** (మనుస్మృతి-2-112) (ధర్మం, అర్థం ఏ శిష్యుని వద్ద లేవో, అదేవిధంగా, శుశ్రూష కూడా ఎవనివద్ద లేదో, మంచి విత్తనాన్ని ఊషరక్షేత్రంలో (ఉప్పునేలలో) విత్తకూడని రీతిలో, అతని వద్ద విద్యను విత్తకూడదు- నాటకూడదు) అనే విధంగా శిష్యునివద్ద ధర్మం, అర్థం- అనేవి రెండు ఉంటే, ఆచార్యునకు ఆచార్యునకు,అవి ఉపకరిస్తాయి. శుశ్రూష, దానివల్ల కలిగే కైంకర్యం శిష్యునివద్ద ఉంటే, అవి శిష్యునకు యోగ్యతను కల్గిస్తాయి. ఆ రెండు నావద్ద లేకపోయినా, ఆళ్వార్లు నాకు ఉపదేశించారు- అని భావం. **"శ్రూయతాం పరమార్థో వై దైతేయా దనుజాత్మజాః, న చాన్యదైతన్మంతవ్యం నాత్ర వోపాధికారణమ్"** (విష్ణుపురాణ-1-17-55) (అసురపుత్రులారా! మావద్దనుండి ఈ వాస్తవాన్ని వినండి. దీనిని అన్యథా భావించరాదు. ఈవిషయంలో ఆశ మొదలైనవి కారణం కాదు.) అనే రీతిలో ప్రహ్లాదునివంటి సత్పురుషులు తమకు ఏ ప్రయోజనాన్ని కోరకుండా, అడిగేవారి దుర్గతిని చూచి ఉపదేశించారు. ఆళ్వార్లు కూడా అటువంటివారు. ఇక్కడ **"పయన్"** అనే పదానికి -ఆచార్యునకు లభించే ఫలమని అర్థం. ఆ రీతిలో కాకుండా, శిష్యునకు లభించే ఫలాన్ని తెల్పుతున్నదని కూడా గ్రహించవచ్చు. అంటే- ఈ శిష్యునకు ఉపదేశించడం ప్రయోజనం లేనిదే అయినా, ఆళ్వార్లవంటి కృపామాత్రప్రసన్నాచార్యులు ఉపదేశించకుండా ఉండలేరు- అని భావం.



**(శెయల్ నన్టాక తిరుత్తి)-** జ్ఞానాన్ని ఉపదేశించడంతో పాటు నిలువకుండా, అనుష్ఠానంవరకు నాకు కలిగేటట్లుగా ఉపదేశించి సంస్కరించారు. క్షత్రబంధువునకు, అతని దుర్గతిని చూచి ఒక వైష్ణవుడు గోవిందనామాన్ని ఉపదేశించినపుడు, అతనికి అది చిరకాలం గడచిన తరువాతే ఫలించింది. వీరు **"ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తన్నైప్పోల్"** (ఊరు, నాడు (పట్టణం, పల్లె) లోకం తనవలె) చేసినవారైనందున, నాప్రవర్తనను సరి చేసి సంస్కరించారు.

**(శెయల్ నన్టాక తిరుత్తి)-** ఆచార్యుడు శిష్యుని సంస్కరించేటపుడు, మొదట అతడు చక్కని అర్థాలను వినేటట్లుగా చేయాలి. తరువాత, అటువంటి అర్థాలను నిరంతరం అనుసంధానం చేసేటట్లుగా చేయాలి. ఆవిధంగా శ్రవణ -మననాలు కల్గిన తరువాత, శిష్యునకు మహావిశ్వాసాన్ని కల్గించాలి. ఆ పిమ్మట జ్ఞానానికి తగిన అనుష్ఠానం అతనికి కలిగేటట్లుగా చేయాలి. ఆ అనుష్ఠానం కూడా తగని అనుష్ఠానంతో కూడినదిగా కాకుండా, సదనుష్ఠానాన్నే గ్రహించేటట్లు చేయాలి. అదే **"శెయల్ నన్టాక తిరుత్తుకై". (తిరుత్తి)** ఈవిధంగా సంస్కరించేటపుడు, ఏ స్థితిలోను నా పట్ల సహనం (క్షమ) కోల్పోకుండా, తామే మొత్తం బాధ్యతను స్వీకరించి ఆళ్వార్లు సంస్కరించారు.

**(పణికొళ్వాన్)-** భగవద్భాగవతవిషయాలలో కైంకర్యం చేసేటట్లుగా నన్ను అసక్తుని చేశారు. భగవత్కైంకర్యం చేయాలి, ఆచార్యకైంకర్యం కూడా చేయాలి, వైష్ణవకైంకర్యం చేయాలి. భగవద్భాగవత కైంకర్యాలను చేయడం ఆచార్యునకు తృప్తిని కల్గిస్తుంది. ఆచార్యునకు కైంకర్యం చేయడం భగవానునకు, భాగవతులకు తృప్తిని కల్గిస్తుంది.

భగవానుడు, భాగవతులు, ఆచార్యులు- అనే ముగ్గురి విషయాలలోను కైంకర్యం ఇతనికి (శిష్యునకు) అవశ్యకం. భగవానునిపట్ల ప్రపన్నుడు అనన్యార్హశేషమైన స్వరూపాన్ని కల్గినవాడైనందున భగవత్కైంకర్యం సహజంగానే సంభవిస్తుంది. భగవానుడు ఆనందిస్తాడు కనుక, భాగవత కైంకర్యం, అందువల్ల కలిగే భాగవతుల తృప్తికూడా శిష్యునకు కల్గుతుంది. ఆచార్యుడు, భగవద్భాగ వతుల గొప్పతనాన్ని గూర్చి ఉపదేశించినందున, శిష్యునకు కల్గిన కృతజ్ఞతకూడా ఆచార్యకైంకర్యాన్ని చేయిస్తుంది. ఆ విధంగా, ఒకదానివల్ల ఇంకొకటి కలిగేటట్లుగా ఈ మూడు కైంకర్యాలు ఉన్నాయి. అందులో, భగవత్కైంకర్యం సహజంగానే

చేతనస్వరూపంవల్ల కల్గుతుంది. "ఆ భగవానునకు శేషభూతులైనందున మనకు కూడా ఉద్దేశ్యభూతులే" అనే కారణం చేత భాగవతకైంకర్యం సంభవిస్తుంది. ఆచార్యుడు తన ఉపదేశంతో జ్ఞానాన్ని కల్గించి, ఆజ్ఞానానికి తగిన అనుష్ఠానాన్ని తాను స్వయంగా అనుష్ఠించి చూపి, తనకంటే మించిన అనుష్ఠానం శిష్యునిలో కలిగేటట్లు చేసిన తరువాతనే, ఆచార్యుడు శిష్యుని భగవద్భాగవతకైంకర్యాన్ని చేయడానికి యోగ్యతను కలవాడు- అని నిశ్చయించుకొంటాడు.

**(పణికొళ్వాన్ కుయిల్ నిన్దార్ పొழிల్ శూழ் కురుకూర్ నమ్బి)**- వివేకం లేని పక్షులు కూడా ఆழ்వార్ల సంబంధంవల్ల సంస్కరింపబడి, తిరువాయ్‌మొழி పాశురాలను అభ్యసించి పాడేటపుడు, వివేకాన్ని కల్గిన మనం సంస్కరింపబడాలనే విషయాన్ని చెప్పాలా ? కోయిలలు, శాఖలతో సంబంధాన్ని కల్గినవి కనుక, సహస్ర శాఖలను కల సామవేదసారమైన తిరువాయ్‌మొழிని గానం చేశాయి. అవి, **"పాడుమ్ కుయిల్‌కళ్"** (నాచ్చియార్ తిరు-10-5) అయినందువల్ల తమ్బిరాన్‌మార్లు అయిన అరైయర్ల వలె, ఆழ்వార్ల తిరువాయ్‌మొழிని పాడుతున్నవి. **"శెవ్వాయ్‌క్కిళి నాన్మఱై పాడుమ్ తిల్లైత్తిరుచిత్తిరకూడమ్"** (పెరియతిరు-3-2-6) (ఎఱ్ఱని నోటిని కల చిలుక నాల్గు వేదాలను పాడే తిరుచ్చిత్ర కూటక్షేత్రం) అనే రీతిలో, ఒక దివ్యదేశసంబంధం వల్ల చిలుకలు ద్రావిడవేదాన్ని పాడితే, ఇక్కడ ఉండే కోయిలలు తిరువాయ్‌మొழிని పాడడంలో ఆశ్చర్యం లేదు కదా ! తాము మధురకవి అయినందువల్ల, అందుకు తగినట్లు తీయని కంఠధ్వనిని కల కోయిలను పురస్కరించుకొని పూతోటల గొప్పతనాన్ని విశేషిస్తున్నారు.

**(కురుకూర్‌నమ్బి)**- ప్రత్యుపకారాన్ని ఎదురు చూడని పూర్తిని కల స్వామీ!- అని అంటూ ఆழ்వార్లను సంబోధిస్తున్నారు. భగవానుడు అన్ని మనోరథాలు నిండినవాడైనందున అతనికి కైంకర్యం చేసే అవకాశం లేదు. అయినా, అర్చావతారంలో అతడు అర్చకపరాధీనుడై ఉన్నందున కైంకర్యం చేసే అవకాశం ఉన్నది. ఆచార్యుడు, ఈ లోకంలోని హితాలు (లౌకికఫలాలు) కర్మవల్ల కల్గుతాయని, పరమపదాన్ని చేరిన తరువాత కలిగే హితాలు భగవానునివల్ల కల్గుతాయని తలచేవాడైనందున, ఎవరి సహాయం కోసం ఎదురుచూడని వాడైనందున, అతనికి కైంకర్యం చేసే అవకాశం కల్గడం చాలా అరుదు. అందువల్ల, భగవానుని పూర్ణతకంటే ఆచార్యుని పూర్తి చాలా గొప్పది.



**(ఉన్తన్ మొయ్‌కழల్కన్బైయే ముయల్‌కిన్డేన్)**- నీ గొప్పదైన, మధురమైన శ్రీచరణాలలో కల్గిన భక్తిచే నీకు ప్రత్యుపకృతిని చేయాలి- అనే నామనోరథం ప్రయత్నదశలోనే నిలచిపోయింది. ఈ విధమైన ప్రయత్నం తప్ప ఆచార్యవిషయంలో ప్రత్యుపకృతిని చేసే దారి ఏదీ లేదుకదా! ఆழ்వార్లు, **"ఉనక్కేన్ శెయ్‌కేన్"** (తిరువాయ్-2-7-8) (నీకేమి ప్రత్యుపకృతిని చేయగలను?) అని, **"అప్పనుక్కు ఎదువు మొన్డు మిల్లై శెయ్‌వదిఙ్గు మజ్జే"** (స్వామికి చేసే ప్రత్యుపకారం ఈలోకంలో, పైలోకంలో ఎక్కడా లేదు) (తిరువాయ్-7-9-10) అని భగవానుని విషయంలో చేయదగిన ప్రత్యుపకృతిని దేనినీ చూడలేక తడబడినట్లుగా, వీరు ఆழ்వార్ల విషయంలో తగిన ప్రత్యుపకృతిని దేనినీ చూడలేక తడబడుతున్నారు.

**(మొయ్ కழల్)- "మొయ్ కழలే ఏత్త ముయల్"** (పెరియతిరు-87) (గొప్ప అందమైన పాదాలను స్తుతించడానికి ప్రయత్నించు) అని అంటూ ఆழ்వార్లు భగవానుని శ్రీచరణాలను **"మొయ్‌కழల్"** అని పల్కగా వినినవారైనందున, ఇక్కడ కూడా ఆழ்వార్ల శ్రీచరణాలను **"మొయ్‌కழల్"** అని మధురకవులు అంటున్నారు. **"మేవినేన్ అవన్ పొన్నడి"** (2) అనేచోట - తాను ప్రకాశించేదై, తనతో సంబంధాన్ని కల్గిన మణులను కూడా కాంతిని కల్గినవానినిగా చేసే బంగారంవలె, ఆழ்వార్ల శ్రీచరణాలుకూడా, తాము పరిశుద్ధమైనవై, తమతో సంబంధాన్ని కల్గినవారిని కూడా పరిశుద్ధులను చేసేవి - అని ఆழ்వార్ల శ్రీచరణాల పావనత్వాన్ని గూర్చి పలికారు. ఇక్కడ **"మొయ్‌కழల్"** అని వాటి భోగ్యతను గూర్చి పల్కుతున్నారు.

**(మొయ్‌కழల్కన్బైయే)**- ఈ శ్రీచరణాల భోగ్యత భక్తిని (ప్రేమను) కల్గించింది. ఆ భక్తి ప్రత్యుపకృతి చేయడంలో ఆసక్తుని చేసింది. దానికి అవకాశం లేనందువల్ల, తడబాటును పొందుతున్నది- అని అంటున్నారు. ఈ తడబాటు, జ్ఞానం తాను ఉన్నంతవరకు ఎల్లప్పుడూ అనువర్తిస్తుంది కదా !

**అన్బన్ తన్నై అడైన్దవర్‌గట్కెల్లామ్**
**అన్బన్, తెన్ కురుగూర్‌నగర్ నమ్బిక్కు,**
**అన్బనాయ్ మధురకవి శొన్నశొల్**
**నమ్బువార్ పది, వైగున్దమ్ కాణ్మినే.** 11

అన్బన్ తన్నై = ఆశ్రితపక్షపాతి అయిన భగవానుని, అడైన్దవర్కట్కు ఎల్లామ్= ఆశ్రయించిన సకలభాగవతులపట్ల, అన్బన్ = భక్తిని కలవారైన, తెన్ కురుకూర్ నకర్ నమ్బిక్కు = కురుకూర్‌లోని నమ్మాళ్వార్ల విషయంలో, అన్బన్ ఆయ్ = భక్తుడై, మధురకవి శొన్న శొల్ = మధురకవులు అనుగ్రహించిన ఈ దివ్యప్రబంధాన్ని, నమ్బువార్ = (తమకు రక్షకంగా) విశ్వసించేవారికి, పది = వాసస్థానం, వైకున్దమ్ కాణ్మిన్ = పరమపదమే, గమనించండి.

పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానమ్ :

**అవ. :- నిగమత్తిల్, ఇప్రబన్దత్తైయే తఞ్జమాక నినైత్తిరుక్కుమవర్కళుక్కు ఆవాసభూమి పరమపదమ్ - ఎన్గిఱార్.**

**వ్యా. - (అన్బన్) వాత్సల్యత్తైయే నిరూపకమాక ఉడైయవనాయ్త్తు, ఈశ్వరన్. "ఇన్నానుక్కన్బన్" ఎన్ఱు విశేషియామైయాలే, "రిపూణా మపి వత్సలః" ఎన్గిఱపడియే సర్వవిషయమాయాయ్త్తు, అవనుడైయ వాత్సల్య మిరుప్పతు.**

**అతుక్కు హేతు ఎన్? ఎన్నిల్, "సర్వేషా మేవ లోకానాం పితా మాతా చ మాధవః" ఎన్ఱుమ్, "దేవానాం దానవానాఞ్చ సామాన్య మధిదైవతమ్" ఎన్ఱుమ్ జనకత్వప్రయుక్తమాన సమ్బన్ధమ్ సర్వసాధారణమాకైయాలే వాత్సల్యముమ్ పొతువాయిరుక్కుమ్.**

**(తన్నై అడైన్దవర్కట్కెల్లా మన్బన్ తెన్‌కురుకూర్ నకర్ నమ్బి) ఆళ్వారుడైయ అన్బు అజ్గన్ పొతువాయన్ఱే యిరుప్పతు. "పరమనై ప్పయిలుమ్ తిరువుడైయార్ యవర్ ఎమ్మై యాళుమ్ పరమర్" ఎన్గిఱపడియే భగవత్స మ్బన్ధ నిబన్ధమాయిత్తే యిరుప్పతు. తమ్మైప్పోలే "అడిక్కీళ్ అమర్న్దు పుకున్దేన్" ఎన్బార్ ఎల్లారైయుమ్ తమక్కు నాథరాకవాయ్త్తు నినైత్తిరుప్పతు.**

**(తెన్ కురుకూర్ - నమ్బి) "అడియారడియార్ తమ్మడియారడియార్" ఎన్ఱు తత్సమ్బన్ధికళళవుమ్ పణ్ణిన ప్రేమత్తాలే పూర్ణరాయిర్ప్పర్.**

**(నమ్బిక్కన్బనాయ్) భగవద్విషయత్తళవుమన్ఱిక్కే, తదీయరళవుమన్ఱిక్కే, ఆచార్యవిషయత్తిలే సక్తరాయ్. తనక్కు ప్పురుషార్థమ్ వేణ్డి యిరుక్కిల్,**



**భగవద్విషయత్తై ప్పఱ్ఱ అమైయుమ్. అజ్గన్ తానుకన్దతన్ఱిక్కే, "ఈశ్వరను కప్పే పురుషార్థమ్" ఎన్ఱిరుక్కిల్, భాగవతర్కళై ప్పఱ్ఱ అమైయుమ్. "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" "మమ ప్రాణా హి పాణ్డవాః" ఎన్ఱు పాణ్డవర్కళై త్తనక్కు ధారకరాకవిత్తే నినైత్తిరుప్పతు. ఈశ్వరనోడు, శ్రీవైష్ణవర్ కళోడు వాశి యఱ ఎల్లారుడైయ ఉకప్పుమ్ పురుషార్థమ్ ఎన్ఱిరుక్కిల్, ఆచార్యనై ప్పఱ్ఱ వడుక్కుమ్. "ఆచార్యవాన్" ఎన్ఱాయ్త్తు శ్రీవైష్ణవర్కళుకప్పతు.**

**ప్రథమత్తిలే ఆచార్యన్ తనక్కు ఆజ్ఞాతజ్ఞాపనముఖత్తాలే స్వరూపజ్ఞానత్తై ప్పిఱప్పిత్తు, భగవత్సమాశ్రయణవేళైయిలే పురుషకారభూతనాయ్, తన్నుడైయ అనుష్ఠానత్తాలే ఇవనై నల్వళియే కొణ్డుపోయ్, ప్రాప్తిదశైయిలుమ్ సాధ్య వివృద్ధియై ప్పణ్ణిక్కొడుక్కక్కడవనాయ్ - ఇప్పడి బహుముఖత్తాలే ఉద్దేశ్య నాయిత్తే యిరుప్పతు.**

**(మతురకవి శొన్న శొల్) ఆళ్వారై త్తామ్ శొన్న పాశరమ్ తమక్కినితా యిరుక్కైయాలే - "మతురకవి" ఎన్గిఱార్. (శొన్న శొల్ నమ్బువార్ పతి వైకున్దజ్గాణ్మిన్) ఇనితాయిరున్దతిల్లైయాకిలుమ్, ఇప్రబన్ధత్తై త్తఞ్జమాక నినైత్తిరుక్కుమవర్కళుక్కు వస్తవ్యదేశమ్ పరమపదమ్.**

**ఆళ్వార్ ఉద్దేశ్యరానాల్, తిరునగరియన్ఱో ప్రాప్యమావతు? ఎన్నిల్, తిరునగరియిల్ పొలిన్దు నిన్ఱపిరానాణైయుమ్, ఆళ్వారాణైయుమాయ్ ఇరుపురియాయ్ చ్చెల్లుమ్. అజ్గనన్ఱిక్కే, ఆళ్వారాణైయేయాయ్ చ్చెల్లుమ్ పరమపదమ్. "అడియార్ నిలాకిన్ఱ వైకున్దమో" ఎన్ఱుమ్, "వానవర్‌నాడు" ఎన్ఱుమ్ శొల్లక్కడవతిత్తే, నమ్బి తిరువళుతి వళనాడు దాసర్, "నమ్బువార్ పతి వైకున్దమ్" ఎన్ఱు - "అవర్కళిరున్ద దేశజ్గాణ్ పరమపదమ్" ఎన్ఱు శొల్లువర్. "ఉరైక్కవల్లార్క్కు వైకున్దమాకుమ్ తమ్మూరెల్లామ్" ఎన్నక్కడవతిత్తే. "కూరత్తాళ్వాన్ మకన్ పిఱన్ద పిన్బు సంసారముమ్ః పరమపదము**

మిడైచ్చువర్ తళ్ళి ఒరు పోకియాయ్‌త్తుక్కాణ్' ఎన్ఱుపెఱ్ఱి పణిత్తార్" - ఎన్ఱు పిళ్ళై అరుళిచ్చెయ్‌వర్.

పెరియవాచ్చాన్‌పిళ్ళై తిరువడికళే శరణమ్.
పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు.

## అరుమ్బద విళక్కమ్

నిగమత్తిల్, "నమ్బువార్ పతి వైకున్దమ్ కాణ్‌మిన్" ఎన్ఱతై క్కటాక్షిత్తు అవతారికై అరుళిచ్చెయ్‌కిఱార్ (నిగమత్తిలిత్యాది).

వ్యాఖ్యానమ్ :- "అన్బన్" ఎన్ఱ విడత్తిల్ ప్రీతియై విషయానురూపమాక వాత్సల్యపరమాక్కి అరుళిచ్చెయ్‌కిఱార్ (వాత్సల్యత్తైయే –యిత్యాది). ఇఙ్గు "అన్బన్" ఎన్ఱతు– భక్తన్– ఎన్ఱపడి. "అన్బన్ఱన్నై" ఎన్ఱు– ముఱ్ఱచ్చొల్లు. అన్బన్ఱన్నై యడైన్దవర్‌కళ్– శ్రీమహాభాగవతర్‌కళ్.

నమ్బిపదతాత్పర్యమ్ (అడియారిత్యాది). భగవానైయుమ్, భాగవతర్ కళైయుమ్ పఱ్ఱామల్ ఆழ్వార్‌విషయత్తిల్ అన్బరావానెన్? ఎన్న "అన్బన్ఱన్నై యడైన్దవర్‌కట్కెల్లామ్ అన్బన్, నమ్బిక్కన్బన్" ఎన్గిఱ పదఙ్గళై క్కటాక్షిత్తు, ఇవర్‌కళు క్కుణ్డాన ఫలతారతమ్యఙ్గళై అరుళిచ్చెయ్‌కిఱార్ (తనక్కు ఎన్ఱు తొడఙ్గి అఙ్గు వాక్యత్తాలే). అవర్‌కళుక్కు కప్పాకవన్దిక్కే అవన్ పణ్ణిన ఉపకారత్తాలుమ్ పఱ్ఱవేణుమెన్గిఱార్ (ప్రథమత్తిలే – యిత్యాది). "శొల్ నమ్బువార్" ఎన్నాతే "శొన్న" ఎన్గైయాలే ఫలితమ్ (ఇనితాయిత్యాది).

ఇరు పురియావతు– ఒరువన్ ముఖుక్కు ఎతిర్‌ముఖుక్కుక్కు విపరీతమా యిరుక్కై. ఇఙ్గేతానే పరమపదమెన్ఱతుక్కు సంవాదమాక ఓర్‌ఐతిహ్య మరుళిచ్చెయ్ కిఱార్ (కూరత్తాழ్వానిత్యాది) (పెఱ్ఱి పణిత్తారెన్ఱతు). ఇఙ్గే యిరుక్కచ్చెయ్‌తే తానే అన్ద విభూతియిల్ అనుభవత్తై ప్పెఱ్ఱి పణిత్తార్; అఙ్గుత్తై యిల్ అనుభవమ్ ఇఙ్గే కిట్టుకైయాలే ఒరుపోకియాయిఱ్ఱు– ఎన్ఱపడి.

పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యాన అరుమ్బదవిళక్కమ్ ముఱ్ఱిఱ్ఱు



## భావదీపిక (ఆంధ్రవివరణం)

**పదకొండవ పాశురం : అవతారిక :–** ఈ ప్రబంధంలోని చివరిదైన ఈ పాశురంలో, "ఈప్రబంధాన్ని రక్షకంగా భావించేవారికి వారుండే చోటు వైకుంఠమే– అని మధురకవులు అంటున్నారు.

**వ్యాఖ్యానమ్ : (అన్బన్)–** భక్తుల దోషాలను గుణాలుగా గ్రహించే వాత్సల్యగుణాన్ని పురస్కరించుకొని నిరూపించవలసినట్లుగా ఉండే సర్వేశ్వరుడు– అని భావం. ఇటువంటివారిపట్ల వాత్సల్యాన్ని కలవాడు– అని విశేషించి పల్కనందున, ఈ అర్థం స్ఫురిస్తుంది. **"సఖే ! రాఘవ ! ధర్మజ్ఞ ! రిపూణామపి వత్సల !, అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి గమిష్యామి యథాసుఖమ్"** (మిత్రమా ! రఘుకులంలో జన్మించినవాడా! ధర్మాన్ని తెలిసినవాడా! శత్రువుల పట్లకూడా వాత్సల్యాన్ని కలవాడా ! నీ దగ్గరనుండి అనుమతిని పొందగోరుతున్నాను. వచ్చిన దారినే వెళ్ళివస్తాను) అని శ్రీరామాయణంలో గరుడుడు పల్కిన మాటనుబట్టి, అందఱిపట్ల ప్రేమను చూపే వాత్సల్యగుణాన్ని కల్గిన భగవానుని నిర్దేశిస్తున్నది– ఈ పదం. ఏవిధంగా ? అంటే, **"సర్వేషా మేవ లోకానాం పితా మాతా చ మాధవః, గచ్ఛధ్వ మేనం శరణం శరణ్యం పురుషర్షభాః !"** (భారత –ఆరణ్య–192–56) (ఓ పురుషశ్రేష్ఠులారా ! లోకాలన్నిటికి తండ్రి, తల్లి శ్రియ:పతియే. శరణు పొందదగిన ఇతనిని శరణు వేడండి) అనే రీతిలో అతడు లోకం అంతటికి తల్లియై, తండ్రియై ఉన్నాడు. **"దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతమ్, సర్వదా చరణద్వంద్వం వ్రజామి శరణం తవ"** (జితంతే–2) (భక్తిని కల దేవతలకు, భక్తిని లేని అసురులకు, ఎల్లప్పుడు సాధారణంగా ఆశ్రయించదగిన దైవమై ఉండే నీ శ్రీచరణద్వయిని నేను ఉపాయంగా నిశ్చయించుకొంటున్నాను) అనే రీతిలో ఈ విధంగా అందఱిని జన్మింపజేసినవాడై ఉండే సంబంధం, మంచివారితో చెడ్డవారితో భేదం లేకుండా, అందఱికి ఇతడు సాధారణుడై ఉంటాడు. అందువల్ల ఈవిధంగా ఇతడు సమస్త లోకంపట్ల వాత్సల్యాన్ని కలవాడైనందున, **"అన్బన్"** అని భగవానుని ఏ విశేషణంలేకుండా సాధారణంగా నిర్దేశిస్తున్నారు.

**(తన్నై అడైన్దవర్‌కట్కెల్లామ్ అన్బన్ తెన్‌కురుకూర్ నమ్బి)–** నమ్మాழ్వార్ల ప్రేమ (భక్తి) ఆ విధంగా సాధారణమైనది కాదు. **"పరమనై ప్పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్ అవర్ కణ్డీర్, పయిలుమ్ పిఱప్పొడుతోఱు ఎమ్మై ఆళుమ్ పరమరే"**

(తిరువాయ్-3-7-1) (స్వామిని కీర్తించే సంపదను కలవారు ఎవరైనా, వారే సుమా, అన్ని జన్మలలో మమ్ములను ఏలే మహనీయులు) అనే రీతిలో భగవానునకు దాసులై ఉండేవారిపట్లనే ఎల్లప్పుడు ప్రేమను కలవారై ఉంటారు, వీరు. మనవలె **"అడిక్కీழ் అమర్న్దు పుకున్దేనే"** (తిరువాయ్-6-10-10) అని భగవానునే ప్రాప్యంగాను, ప్రాపకంగాను ఆశ్రయించేవారు ఎవరైనా, వారే తమకు ఎల్లప్పుడు స్వాములు- అని భావించేవారు కదా, ఆழ్వార్లు.

**(తెన్కురుకూర్ నమ్బి)- "అడియార్ అడియార్తమ్ అడియారడియార్ తమక్కు అడియార్ అడియార్తమ్ అడియార్ అడియోఙ్గళే"** (తిరువాయ్-3-7-10) అనే విధంగా ఏడు దశలలో (సప్త పర్వాత్మకంగా) భగవద్భక్తుల విషయంలో (ప్రేమను) భక్తిని కలవారైనందున, భక్తిలో పూర్ణులై ఉండేవారు ఆழ్వార్లే కాగలరు.

**(నమ్బిక్కన్బనాయ్)-** 'భగవానుని పట్ల భక్తిని కలవారై ఉండడంతో మాత్రమేకాక, అతని భక్తులవిషయంలో కూడా భక్తిని కల్గి ఉండడంతో మాత్రమేకాక, ఆచార్యుడైన నమ్మాழ్వార్ విషయంలోను భక్తిని కలవారై ఉండేవారు- మధురకవులు- అనే తాము- అని భావం. తనకోసం ఒక ప్రయోజనాన్ని ఆశించినవాడైతే భగవానుని ఆశ్రయిస్తే సరిపోతుంది. ఈవిధంగా తాను అభిమానించిన (అభిలషించిన) ఫలాన్ని పరిగ్రహించకుండా, భగవానుని ఆనందమే పరమ ప్రయోజనమని ఎవరైనా భావిస్తే, భగవద్భక్తులనుకూడా అతడు ప్రాప్యప్రాపకాలుగా గ్రహించాలి. **"ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్"** (గీత-7-18) (నన్ను ప్రార్థించే వీరు అందఱు ఉదారులే. జ్ఞాని అయితే, నాకు ఆత్మ (ధారకుడు) అని నా సిద్ధాంతం) అని, **"ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్, పాండవాన్ ద్విషసే రాజన్ ! మమ ప్రాణా హి పాండవా:"** (భారత-ఉద్యో-74-27) (ద్వేషించేవారి అన్నం భుజించదగినది కాదు. ద్వేషించేవానికి భోజనం పెట్టకూడదు. రాజా ! నీవు పాండవులను ద్వేషిస్తున్నావు. పాండవులు నాకు ప్రాణాలు సుమా!) అనే రీతిలో తనను ఆశ్రయించిన పాండవులను జ్ఞానులే తనను ప్రాణధారణను చేసేటట్లు చేస్తున్నారని భావించేవాడుకదా, భగవానుడు. అందువల్ల భాగవతులను ప్రయోజనభూతులుగా గ్రహించినపుడే భగవానునకు తృప్తి కల్గుతుంది. భగవానుడు, శ్రీవైష్ణవులు అనే అందఱి తృప్తిని ఒకడు ప్రయోజనంగా భావిస్తే, నమ్మాழ్వార్లవంటి ఆచార్యలక్షణపూర్తి కల ఒక ఆచార్యునే అతడు ఆశ్రయించాలి. **"ఆచార్యవాన్ పురుషో వేద"** (ఆచార్యుని కల పురుషుడే వాస్తవాన్ని తెలిసికొంటున్నాడు) అనే రీతిలో అటువంటి ఆచార్యుని ఆశ్రయించినవారిని చూచికదా శ్రీవైష్ణవులు ఆనందిస్తారు. ఆచార్యుడు అనేవాడు మొదట శిష్యునకు అజ్ఞాతజ్ఞాపనాన్ని చేసి (తెలియనివానిని బోధించి), అతనికి స్వరూపజ్ఞానాన్ని కల్గిస్తాడు. భగవానుని ఆ శిష్యుడు ఆశ్రయించేటపుడు ఆచార్యుడు పురుషకారమై ఉంటాడు. తన అనుష్ఠానంతో తాను ఈలోకంలో ఉండేంతవరకు అతనిని (శిష్యుని) సన్మార్గంలో ప్రవర్తించేటట్లు చేస్తాడు. పరమపదాన్ని చేరిన తరువాత కూడా అతని కైంకర్యాన్ని వృద్ధి పొందిస్తాడు. (అధికం అయేటట్లు చేస్తాడు) ఈవిధంగా పలు రీతులలో ఆచార్యుడే శిష్యునకు పరమ ప్రాప్యుడు. **"నమ్బిక్కన్బన్"** అనే ప్రయోగం ద్వారా మధురకవులు ఈవిషయాన్ని తెల్పుతున్నారు.



**(మధురకవి శొన్న శొల్) -'మదురకవి శొల్"** - అని అంటేనే, చాలి ఉండగా, **"శొన్న శొల్"** అని అన్నందున, ఆழ్వార్లను గూర్చి తాము పల్కిన ఈ ప్రబంధం తమకు భోగ్యమై ఉండే విషయాన్నిగూర్చి తెల్పుతున్నారు. అందువల్లనే, మధురకవి- అనే పేరును తాము పొందినట్లుగా కూడా నిశ్చయిస్తున్నారు.

**(శొన్న శొల్ నమ్బువార్ పది వైకున్దమ్ కాణ్మినే)-** భోగ్యంగా ఉండకపోయినా, ఈప్రబంధాన్ని రక్షకంగా భావించేవారికి పరమపదమే వాసస్థానం- అని అంటూ ఫలాన్ని నిర్దేశిస్తున్నారు.

ఆழ్వార్లే పరమప్రాప్యులైతే (పరప్రయోజనభూతులైతే) ఆழ్వార్ తిరునగరికదా పరమప్రాప్య భూమి కావలసి ఉన్నది. వైకుంఠమని చెప్పవచ్చునా? అని అంటే, ఆழ్వార్ తిరునగరిలో అర్చామూర్తి అయిన పొలిన్దు నిన్ఱపిరాన్‌యొక్క ఆజ్ఞ, ఆழ్వార్ల ఆజ్ఞ- అని ద్వైరాజ్యంగా ఉంటుంది. అంటే- ఇద్దఱి ఆజ్ఞలు కలసిన పాలన నడుస్తుంది. ఆ రీతిలో కాకుండా, పరమపదం ఆழ్వార్ల శాసనం ప్రకారం నడుస్తున్నందున, ఉజ్జీవించే చోటు పరమపదమని అంటున్నారు. **"అడియార్ నిలాకిన్ఱ వైకున్దమ్"** (దాసులు ఏలే పరమపదం) (తిరువిరుత్తమ్-75) అని, **"వానవర్నాడు"** (తిరువాయ్ 3-9-9) (నిత్యసూరుల దేశం) అని పరమపదాన్ని భగవద్భక్తుల దేశమని కదా ఆழ్వార్లు అన్నారు. **"నమ్బువార్ పది వైకున్దమ్"** అనే ప్రయోగానికి "భగవద్భక్తులు ఉండే దేశమే పరమపదమై ఉంటుంది" అని నమ్బితిరువழుది వళనాడు దాసర్- అనే మహనీయులు అర్థాన్ని చెప్పారు- అని

నంజీయర్, నమ్బిళ్ళై, పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానాలు మూడింటిలో తెలుపబడింది. **"ఉరైక్కవల్లార్క్కు వైకున్దమాకుమ్ తమ్మూరెల్లామ్"** (తిరువాయ్-5-3-9) అని ఆళ్వార్లు ఇటువంటి ఈ అర్థాన్నిగూర్చి పలికారుకదా !

ఈ దివ్యప్రబంధాన్ని విశ్వసించేవారుండే దేశమే పరమపదం- అని తిరువళుది వళనాడు దాసర్ వార్తను బలపఱచే వేఱొక ఐతిహ్యాన్ని నమ్బిళ్ళై అనుగ్రహించారని పెరియవాచ్చాన్‌పిళ్ళై పలికారు. అది ఏమంటే- "కూరేశపుత్రులైన భట్టర్ అవతరించిన తరువాత సంసారానికి, పరమపదానికి మధ్య ఉండే అడ్డు గోడ కూలగొట్టబడి, పరమపదానుభవమే ఇక్కడ కూడా ప్రవర్తించడం ప్రత్యక్షంగా మనం ఈనాటికీ చూస్తున్నాముకదా" అని నంజీయర్ శిష్యులలో ఒకరైన **"పెఱ్ఱి"** అనే మహనీయులు అనేవారు- అని నమ్బిళ్ళై అనేవారట.

**నంజీయర్ వ్యాఖ్యాన విశేషాలు :**

**వ్యాఖ్యానమ్ : (అన్బన్)-** భగవానునకు ప్రధానమైన స్వరూపం (స్వరూపనిరూపకం) ఈశ్వరత్వం కాదు; శత్రువుల పట్లకూడా వాత్సల్యాన్ని చూపడమనే వాత్సల్యగుణమే ప్రధానమైన స్వరూపనిరూపకం.

**(అన్బన్... అన్బన్)-** "తమ తమ సత్తపట్ల అందఱు స్నేహాన్ని కల్గి ఉంటారు"- అనేది ఇచటి నఞ్జీయర్ వ్యాఖ్యానం. శత్రువుల విషయంలో కూడా ప్రేమను చూడడమనే వాత్సల్యం భగవానునకు స్వరూపనిరూపకం. ఆ భగవానునకు భక్తులే ధారకులైనందున, వారిపట్ల ప్రేమను కల్గినవారై ఉండడం ఆళ్వార్లకు స్వరూపనిరూపకం- అనేది ఈ వాక్యంయొక్క అర్థం.

**(తెన్‌కురుకూర్‌నకర్ నమ్బిక్కు అన్బన్)-** ఆళ్వార్లకే భక్తులై ఉండడం శ్రీమధురకవులకు స్వరూపనిరూపకం.

**(అన్బనాయ్ మదురకవి శొన్న శొల్)-** ఆళ్వార్లపట్ల గల ప్రేమ (భక్తి) ప్రేరేపించినందున వీరు ఈ ప్రబంధాన్ని రచించారు. **'తన్ శొల్లాల్ తాన్ తన్నై క్కీర్‌త్తిత్త మాయన్ ఎన్‌మున్ శొల్లుమ్"** (తిరువాయ్-7-9-2) (తన సూక్తితో తానే తనను కీర్తించిన ఆశ్చర్యచేష్టితుడు నాముందర సంత చెప్పించుకొనేవాడు) అని అంటూ ఆళ్వార్లు భగవానుడు నేర్పించగా, తాము తిరువాయ్‌మొళిని పల్కినట్లుగా



తెలిపారు. వీరు, ఆళ్వార్ల పట్ల తమకు గల భక్తి (ప్రేమ) ప్రేరేపించగా తాము కణ్ణినుణ్‌శిఱుత్తాంబును రచించినట్లుగా పల్కుతున్నారు. **"నామ్ కాణ వన్ద శోళ్రోపాది ప్రీతి కాణుమ్ శొల్లువిత్తదు"** అనేది ఇక్కడ నంజీయర్ వ్యాఖ్యానం. **"కాణ వన్ద శోళర్‌పోలే"** - అనే ఈ వృత్తాంతం పూర్వాచార్యుల వ్యాఖ్యానాలలో పలు చోట్ల కన్పిస్తుంది. ఆ కాలంలో నాటకాలవంటివి ప్రదర్శించేటపుడు వానిని చూచి ఆనందించాలని ప్రభువులు వచ్చేవారు. అదే రీతిలో, తమకు ఆళ్వార్లపట్ల ఉండే భక్తి (ప్రేమ) పల్కించగా పల్కిన ఈ దివ్యప్రబంధాన్ని ఆనందించేవారిలో ఒకరుగానే తాము (మధురకవులు) అన్వయించారని దీని తాత్పర్యం.

**నాయనార్ వ్యాఖ్యానంలోని విశేషాలు :**

**అవతారిక :** ఈ ప్రబంధంలో ఆదరాన్ని కలవారికి ఆళ్వార్ తిరుగనరియే ప్రాప్యస్థలంగా ఉన్నా, నిత్యసూరులు పరమపదంలో ఒక చోటు లభించేటట్లు చేస్తారు.

**వ్యాఖ్యానమ్ : (అన్బన్ తన్నై అడైన్దవర్‌కట్కెల్లామ్ అన్బన్) "అన్బన్"** అనే పదానికి మిగిలిన వ్యాఖ్యానాలలో వలె, "సలకచేతనుల పట్ల ప్రేమను కలవాడైన సర్వేశ్వరుడు" అనే అర్థం, భగవానునిపట్ల ప్రేమను (భక్తిని) కల ఆళ్వార్లు -అనే అర్థం- ఈ రీతిలో రెండు అర్థాలు నాయనార్ వ్యాఖ్యలో గ్రహింపబడ్డాయి. **"మద్భక్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనమ్, స్వయ మభ్యర్చనం చైవ మదర్థే దంభవర్జనమ్, మత్కథాశ్రవణే భక్తి: స్వరనేత్రాంగవిక్రియా, మమానుస్మరణం నిత్యం యచ్చ మాం నోపజీవతి, భక్తిరష్ట విధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే, స విప్రేంద్రో ముని: శ్రీమాన్ స యతి: స చ పండిత:, తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథా హ్యహమ్"** (1. నా భక్తులపట్ల వాత్సల్యం, 2. నన్ను ఆరాధనం చేయడంలో అనుమోదనం (అంగీకారం), 3. స్వయంగా నన్ను పూజించడం, 4. నా విషయంలో ఆడంబరం లేకుండా ఉండడం, 5. నా కథలను వినడంలో ఆసక్తి, 6. నా కథలను వినేటపుడు కంఠం గద్గదం కావడం, కన్నీళ్ళు నిండడం, శరీరం గగుర్పాటును పొందడం, 7. ఎల్లప్పుడు నన్ను భావించడం, 8. నావద్ద వేఱు ఏ ప్రయోజనాన్ని అర్థించకుండా ఉండడం, -అనే ఈ ఎనిమిది విధాలైన భక్తి ఏ మ్లేచ్ఛులవద్ద కన్పిస్తున్నదో, అతడే బ్రాహ్మణశ్రేష్ఠుడు. అతడే ముని, అతడే దయ కలవాడు, అతడే పండితుడు, అతనికి జ్ఞానాన్ని ఉపదేశించవచ్చు. అతని వద్దనుండి జ్ఞానోపదేశాన్ని పొందవచ్చు. అతడు నావలె పూజించదగినవాడు) అనే ప్రమాణంలో

భగవానుని భక్తులపట్ల భక్తిని కల్గి ఉండడం భగవద్భక్తులకు ప్రథమలక్షణంగా పల్కడం మొదటి అర్థానుసారంగా ఆళ్వార్లకు పొసగి ఉండే రీతిని చూపుతున్నారు.

**(అడైన్దవర్కట్కెల్లామ్ అన్బన్)–** "ఈ రీతిలో ప్రేమను కల్గినవాడు" – అని విశేషించి పలుకకుండా, ఆశ్రయించిన వారందఱిపట్ల అన్ని రీతులలో సహజంగానే ప్రేమను కలవాడై ఉంటారు, ఆళ్వార్లు– అని తెలుపబడింది.

**(అన్బన్)–** ఇతరులపట్ల ప్రేమను కలవాడు, ఇతరుల ప్రేమకు లక్ష్యభూతుడై ఉండేవాడు– అనే రెండు రీతులలో దీనికి అర్థాన్ని గ్రహించవచ్చు. అది ఏమంటే– తాను ప్రేమను చూపేటపుడు లోకం అంతటిపట్ల ప్రేమను చూపేవారు, తనపట్ల ప్రేమను కల్గినవారికి తాము ఒక్కరే లక్ష్యభూతులై ఉండేవారు–అనిభావం. సముద్రంలోపల మాణిక్యాలు అన్నీ మఱగుపడి ఉండేటట్లుగా, **"అన్బు"** –అనే వాత్సల్యగుణంలో మిగిలిన గుణాలు అన్నీ అంతర్భవించి ఉంటాయి. అందువల్లనే భగవద్రామానుజులు శ్రీరంగగద్యలో– **"వాత్సల్యైకమహోదధే!"** (భక్తులపట్ల గల వాత్సల్యానికి అద్వితీయమైన మహాసముద్రం వంటివాడా!) అనిఅంటూ భగవానుని "వాత్సల్యానికి అద్వితీయమహాసముద్రంగా ఉండేవాడు"– అని నిర్దేశించారు. ఇటువంటి, సముద్రంవంటి అంతులేని వాత్సల్యం ఆళ్వార్లకు కూడా ఉన్నది– అని భావం.

**(అన్బన్)–** తనను ఆశ్రయించి, తనకంటే వేఱుకొన్ని విషయాలను ఆశపడిన వారినికూడా **"ఉదారా:"** (గీత–7–18) అని పలికే భగవానునివలె, ఆళ్వార్లు కూడా అందఱి పట్ల ప్రేమను కలవారు.

**(అన్బన్)–** ఈ ప్రబంధం ఆరంభంలో **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్ కట్టుణ్ణ పృణ్ణియ పెరుమాయన్ ఎన్నప్పనిల్"** అని ఆరంభించి శీలం, సౌలభ్యం, స్వామిత్వం– అనే గుణాలు ఆళ్వార్లకు ఉన్నవని ప్రస్తావించారు. ఇక్కడ, చివరి పాశురంలో **"అన్బన్"** అని ఆళ్వార్ల వాత్సల్యగుణాన్నే ప్రస్తావించారు. దీనివల్ల ఈ గుణాలు ఈ గుణాలు అన్నీ ఒక ఎత్తు అంటే, ఈ వాత్సల్యగుణం ఒక ఎత్తు– అని తెలుపబడింది. **"శీలాదిగుణసంపన్న: సర్వలోకైకవత్సల:"** (శీలం మొదలైన గుణాలతో కూడినవాడు. అన్ని లోకాలపట్ల వాత్సల్యాన్ని కలవారిలో అద్వితీయుడు) అని ఋషులు కూడా దీనినే (వాత్సల్యాన్నే) ప్రధానంగా పలికారు.



**(అన్బన్)– "తనిమా ద్దెయ్వ త్తళిర్ అడిక్కీழ் ప్పుకుదలిన్ఱి అవనడియార్ నని మాక్కలవి యిన్బమే నాళుమ్ వాయ్క్క నజ్గట్కే"** (తిరువాయ్–8–10–7) (అద్వితీయ పరదైవమైన శ్రియ:పతియొక్క చిగురువంటి శ్రీపాదాలపై చేరడం కాకుండా, ఆస్వామి దాసుల సంశ్లేష సుఖమే మనకు నిత్యం లభించాలి) అనే రీతిలో భగవానుని అనుభవించే ఆనందాన్ని కూడా విడచిపెట్టి, అతని భక్తుల సమూహంంఎ అనుభవించే ఆనందంలో అభినివేశాన్ని కలవారై ఉంటారు, ఆళ్వార్లు– అని తెల్పుతున్నారు.

**(అడైన్దవర్కట్కెల్లామ్ అన్బన్)–** ఆళ్వార్లు, తమను స్వామిగానో, బంధువుగానో, ఉపాయంగానో, ఉపేయంగానో –ఆశ్రయించే అందఱిపట్ల ప్రేమను చూపుతారు– అని భావం. వీరు, (ఆళ్వార్లు) ఆదరించడానికి తమతో (ఆళ్వార్లతో) ఏదో ఒక సంబంధం కల్గి ఉండడమే కావలసినది.

**(తెన్కురుకూర్నకర్ నమ్బిక్కు అన్బనాయ్)** నీటిరేవుయొక్క వైలక్షణ్యం వల్ల పైరు చక్కగా పెరిగేటట్లే, ఆళ్వార్ తిరునగరిలో జన్మించినందువల్లనే ఆళ్వార్లకు ఈ విధంగా భగవద్భాగవతవిషయంలో ప్రేమ కల్గింది. వారి ప్రేమ సముద్రంవలె ఇంకా ఇంకా వృద్ధి చెందడానికి కారణం ఆ దేశస్వభావమే.

**(నకర్)–** ఆ నగరవాసంవల్లనే వారు (నమ్మాళ్వార్లు) సారసారవివేకాన్ని కల్గినవారయ్యారు.

**(అన్బనాయ్) –** నమ్మాళ్వార్లకు కల భగవానునిగూర్చిన జ్ఞానం, భక్తిమొదలైన గొప్పతనాలను పురస్కరించుకొనే మధురకవి ఆళ్వార్లు వారిపట్ల భక్తిని కల్గినవారయ్యారు.

**(అన్బనాయ్ మదురకవి)– "ఆరాద కాదల్ కురుకూర్ చ్చడకోపన్"** (తిరువాయ్–2–1–11) (అంతులేని భగవద్భక్తిని తమకు నిరూపకంగా కల, కురుకూర్లోని శఠకోపులు) అని నమ్మాళ్వార్లకు భగవానునిపట్ల గల స్వభావసిద్ధమైన భక్తి స్వరూపనిరూపకమైనట్లే, వీరికికూడా **"నమ్బిక్కు, అన్బర్"** అని ఆళ్వార్లపట్ల ప్రేమను కలవారు– అనేది స్వరూపనిరూపకం. ఆళ్వార్లు– ప్రణవంలో చెప్పబడిన భగవద్భక్తి, నమశ్శబ్దంలో చెప్పడిన భాగవత భక్తి –అనే రెండిటిలో ఊనికను కల్గినవారు. వీరు– మధ్యపదమైన నమశ్శబ్దంలో విశేషంగా చెప్పబడిన ఆచార్యభక్తిలో ఊనికను కల్గిఉండేవారు (మదురకవి). వారు (ఆళ్వార్లు)–భగవానుని కీర్తించినందున **"ఎన్నావిల్ ఇన్కవి"** (తిరువాయ్–3–9–1) (నాజిహ్వాలో తీయని పాశురాలు) అని

తమ కవితను కీర్తిస్తూ పలికారు. వీరుకూడా, ఆళ్వార్లను గూర్చి కవిత్వాన్ని పాడినందున, తమ కవితను ఉద్దేశించి **"మదురకవి"** అని కీర్తిస్తూ పలికారు.

**(నమ్బిక్కు అన్బనాయ్ మదురకవి శొన్న శొల్) –** వీరి మనస్సుకు వ్యాపారం– ఆళ్వార్లపట్ల ప్రేమను ప్రదర్శించడం, జిహ్వకు వ్యాపారం– ఆళ్వార్ల గుణాలను కీర్తించడమే.

**(శొన్నశొల్)–** అని అంటూ ఆచార్యవైభవాన్నిగూర్చి పలికే ప్రబంధాన్ని చూచి ఆశ్చర్యపడి పల్కుతున్నారు.

**(నమ్బువార్)–** దీనిని ఆశపడేవారని– అర్థం. ఈప్రబంధంలోని అర్థాన్ని తెలియడం మాత్రమే కాకుండా, ఇందులో ఆశను కలవారై, దీనిని సదా అనుసంధించడం, ఇందులో చెప్పబడిన ఆళ్వార్ల వైభవాలను చూచి ఆశ్చర్యపడడం, ఈ గొప్పతనాలను ఏ కాలంలో అయినా ఒకరు పల్కగా విని ఆశపడడం– అనే వీటిని అన్నిటిని చేసేవారు **"నమ్బువార్"** అనబడతారు.

**(నమ్బువార్)–** భగవానుని వైభవాలకంటే ఆళ్వార్ల వైభవాలను మిక్కిలిగా ఆశపడేవారు.

**(పది వైకున్దమ్ కాణ్మినే)– "వానవర్నాడు"** (తిరువాయ్–3–9–9) అనే రీతిలో వైకుంఠం నిత్యసూరులకు వశమైన దేశం కనుక, వీరు ఆళ్వార్ తిరునగరిని, ఆళ్వార్ల వైభవాలను ఆశపడి ఆదరించేవారైనా, నిత్యసూరులు వీరికి పరమపదంలో చోటు ఇస్తారు. ఈ అర్థం అవతారికలో ప్రస్తావింపబడింది.

**కణ్ణినుణ్ శిఱుత్తామ్బు పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానానికి**
**భావదీపిక (ఆంధ్రవివరణం) సంపూర్ణం**

